# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 16 సంచిక : 3 హైదరాబాద్ 200 మార్చ్ 2018 పేజీలు : 68 రు. 25

- కేంద్ర బడ్జెట్‌పై నాలుగు వ్యాసాలు
- ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక రైల్వే జోన్
- చెలరేగుతున్న ఫాసిజం
- జాతీయ వైద్య కమిషన్ బిల్లు
- కార్పొరేట్ల దావోస్ సమావేశాలు
- డార్విన్‌పై ఆర్‌ఎస్‌ఎస్
- ఇరాన్‌లో ప్రజా ప్రదర్శనలు

విజ్ఞప్తి

# మత రహిత, కుల రహిత అస్తిత్వం కోసం.. !

మిత్రులారా !

నమస్కారం ..

మాది కులాంతర, మతాంతర వివాహం .. వేరు వేరు సామాజిక నేపథ్యాలు ఉన్న మాలో ఒకరు మతాన్ని నమ్మినా, మరొకరు ఏ మతాన్ని నమ్ముకున్నా మా పిల్లల విషయంలో మేము ఎటువంటి కుల, మత విశ్వాసాలను అనుసరిచడం లేదు..

అయితే స్కూల్ అప్లికేషన్‌లో తప్పనిసరిగా మతం, కులం రాయాలని అన్నప్పుడు మా పోరాటం మొదలయింది..

మతేతరంగా, కులయేతరంగా అంటే కులమతాలకు వెలుపల మనుషుల అస్తిత్వ ప్రకటనకు ప్రస్తుతం అవకాశం లేదు..

అలాంటి అవకాశం ఉండాలని మేము ఏప్రిల్ 2010లో హైకోర్టును ఆశ్రయించాం .. "మతం నమ్మడానికి హక్కు ఉందంటే నమ్మకుండా ఉండడానికీ హక్కున్నట్లే" అని హైకోర్టు న్యాయమూర్తి మధ్యంతర ఉత్తర్వులు ఇచ్చారు.

మా చిన్న అమ్మాయి సహజ స్కూల్ ప్రవేశమప్పుడు మొదలయిన ఈ సమస్య, మళ్లీ మా పెద్ద అమ్మాయి స్పందన 10వ తరగతి ఆన్‌లైన్ అప్లికేషన్‌లోనూ ఎదురయింది .. అప్పుడు మార్చి, 2017లో ఏదీ పాటించని మాలాంటివారికి మత రహితం, కుల రహితం అని ప్రకటించుకునే అవకాశం ఉండాలని హైదరాబాద్‌లోని ఉమ్మడి హైకోర్టులో ప్రజా ప్రయోజన వ్యాజ్యం వేశాం.. హైకోర్టు మా ప్రజా ప్రయోజన వ్యాజ్యంను స్వీకరించి – దీనిపై స్పందించమని, రెండు వారాల్లో జవాబు ఇవ్వమని కోరుతూ తెలంగాణ ప్రభుత్వానికి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి, కేంద్ర ప్రభుత్వానికి నోటీసులు పంపింది.. ఇంతవరకు ప్రభుత్వాల నుంచి ఏ జవాబూ లేదు.. మా ప్రజా ప్రయోజన వ్యాజ్యంలో డెమొక్రాటిక్ టీచర్స్ ఫెడరేషన్ (డి.టి.ఎఫ్) మాకు మద్దతుగా ఇంప్లీడ్ అయింది.

ప్రజా మద్దతు కూడగట్టడంలో భాగంగా మేము ఆన్‌లైన్ సంతకాల సేకరణ చేపట్టాం. సంతకాల కోసం చేంజ్ డాట్ ఆర్గ్‌లో మేము పెట్టిన పిటిషన్‌పై మన రెండు తెలుగు రాష్ట్రాల నుంచి, దేశంలో వివిధ రాష్ట్రాల నుంచి, అనేక దేశాల నుంచి అనేకమంది సంతకాలు చేశారు.

ఈ ప్రకటన పంపే సమయానికి మొత్తంగా 5008 మంది సంతకాలు చేశారు.. ఇంకా చేస్తూనే ఉన్నారు ..

మేము ప్రజా ప్రయోజన వ్యాజ్యం వేసి సంవత్సరం కావస్తున్నా ప్రభుత్వాల నుంచి ఎటువంటి స్పందనా లేదు..

మతరహిత – కులరహిత అస్తిత్వ ప్రకటనకూ అవకాశం ఇవ్వమని ప్రభుత్వాలపై మనమే ఒత్తిడి తేవాలి.

ఎప్పటి నుంచో మనుషులకు మత స్వేచ్ఛ ఉంది.. ఇప్పుడిక ఏ మతం నమ్మని వాళ్ల స్వేచ్ఛకు ప్రతి ఒక్కరూ మద్దతు ఇవ్వాల్సిన అవసరం ఉంది.

మా పిటిషన్ చదివి మీరు సంతకం చేస్తారని ఆశిస్తున్నాం..

మా పిటిషన్‌లోకి మీరు ఇలా వెళ్లొచ్చు –

గూగుల్ సెర్చ్‌లో **"No Religion No Caste Change.org petition"** అని టైప్ చేస్తే మా పిటిషన్ లింక్ కనబడుతుంది

ఆ లింక్‌ను క్లిక్ చేసి మా విజ్ఞప్తిని చదవొచ్చు.. చదివి సంతకం చేస్తారని ఆశిస్తున్నాం.

అలాగే మా చేంజ్ డాట్ ఆర్గ్ పిటిషన్ లింక్‌ను కాపీ చేసి మీ మెయిల్స్, వాట్సాప్, ఫేస్‌బుక్ మాధ్యమాలలో సంతకాల కోసం మీ మిత్రులతో విస్తృతంగా పంచుకుంటారని ఆశిస్తున్నాం..

ఈ ప్రజాస్వామిక ఆకాంక్షకు మీ వంతు సహకారాన్ని అందిస్తారని ఆశిస్తున్నాం...

మరింత సమాచారం కోసం – 9989189250 మొబైల్‌కు గాని, **raamki70@gmail.com** మెయిల్ రాసిగాని పూర్తి వివరాలు పొందవచ్చు.

థాంక్ యూ ...

**స్పందన, సహజ తల్లిదండ్రులు**

**– డి.వి.రామకృష్ణారావు, ఎస్. క్లారెన్స్ కృపాలిని**

హైదరాబాద్

200 ISSN 2231-6892

# వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మార్చ్ 2018
సంపుటి : 16
సంచిక : 3







**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓ.లు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2018 జనవరి నెలలో వచ్చిన విరాళాలు - నరహరి, హైదరాబాద్ - రు. 5,000; ఎం.పి. నాగిరెడ్డి, ప్రిన్సిపల్ సాహితీ జూనియర్ కళాశాల, ఇల్లెందు - రు. 10,000; కె. శంకర్ నాయక్, హైదరాబాద్ - రు. 2.000; ఎం. హేమలత, జనగామ - రు. 2000. మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

వీక్షణం జనవరి సంచికలో వచ్చిన ఒక చర్చా వ్యాసం, పాఠకుల వీక్షణంలో ఐదు ఉత్తరాలు చూసి పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుకుని నా ఆనందాన్ని ఇతర పాఠకులకు కూడ పంచుదామనుకున్నాను. కాని వేరే పనుల్లో పడి వెంటనే ఉత్తరం రాయలేకపోయాను. ఈలోగా ఫిబ్రవరి సంచిక కూడా వచ్చేసింది. ఇక ఇప్పుడైనా రాయాలని కూచున్నాను. ఆ చర్చా వ్యాసం రచయిత జెయుబివి ప్రసాద్ గారు. ఉత్తర రచయితలు ఎం. నిర్మల్ కుమార్, జి. హరిప్రసాద్, ఎన్. లెనిన్ బాబు, పి. వర్మ, పి బాలాజీ వరప్రసాద్, యు. ఎచ్. ప్రీతమ్ గార్లు. వీరిలో అసలు చర్చే ఎం. నిర్మల్ కుమార్ గారి వ్యాసం మీద గనుక వారు తమ వైఖరి ఏమిటో రాసుకోవడంలో ఆశ్చర్యం లేదు. పైగా అది వారి బాధ్యత కూడా. ఆ ఉత్తరం మీద నేనేమీ అనదలచుకోలేదు. ఆ మాటకొస్తే మిగిలినవాళ్ల ఉత్తరాలలోని విషయం మీద రాయి విసిరి నా మీద బురద చిందించుకోదలచుకోలేదు. నాకు నవ్వు పుట్టించినదీ, పాఠక మిత్రులతో పంచుకోదలచినదీ ఆ ఉత్తరాలలోని విషయం కాదు, ఆ ఉత్తర రచయితల స్పందన. ఏమంటే ఈ నాలుగైదు పేర్లు ఒకసారి జాగ్రత్తగా గుర్తించండి. నేను దాదాపు పది సంవత్సరాలుగా ఈ పేర్లు వీక్షణంలో, ఇతర పత్రికల్లో, సోషల్ మీడియాలో చూస్తున్నాను. వారేదో సున్నితమైన స్పందనాపరులని, సామాజిక ఘటనలకు ఎప్పటికప్పుడు స్పందిస్తుంటారని అనుకుంటే మీరు పప్పులో కాలు వేసినట్టే. వారికి ఇహలోక విషయాలేవీ పట్టవు. తమ ఊరిలో, తమ ప్రాంతంలో, దేశంలో, ప్రపంచంలో ఎక్కడ ఎంత ఘోరం జరిగినా వీరు దాని ఊసే పట్టించుకోరు. పల్లెత్తు మాట అనరు. ప్రభుత్వ అక్రమాలను పట్టించుకోరు. పోలీసు హింసను పట్టించుకోరు. మగవారి దౌష్ట్యాలను పట్టించుకోరు. హిందూత్వ పేరుతో చెలరేగుతున్న హంతకుల గురించి మాట్లాడనే మాట్లాడరు. దళితుల మీద, ఆదివాసుల మీద హింస జరుగుతుందంటే స్పందించరు. కాని ఒకానొక పరమ పూజనీయ సిద్ధాంతకర్త మీద ఎక్కడన్నా చిన్న విమర్శ, భిన్నాభిప్రాయం వచ్చిందంటే చాలు, 'వాస్తవం అది కాదు ఇది' అనే మాట వచ్చిందంటే చాలు, వీరు ఒంటికాలిమీద లేస్తారు. ఆ భిన్నాభిప్రాయం ప్రకటించినవారిని తూర్పార పడతారు. మా భక్తిప్రపత్తులతో నిత్య ఆరాధనలు అందుకుంటున్న ఆ మహావ్యక్తి మీద ఈగలూ దోమలూ వాలడమా, అశ్శరభ శరభ అని విజృంభిస్తారు. వారందరి ఉత్తరాలూ ఒక్కచోట వేసి నాకు ఎంతో హాస్యం కలిగించిన వీక్షణం సంపాదకులకు కృతజ్ఞతలు. ఆహా, వీరభక్తి వర్ధిల్లు గాక. వీరభక్తిని గుడ్డిగా అచ్చువేసే పత్రికలు వర్ధిల్లు గాక. ఒకవేళ పత్రికలు అచ్చువేయకపోతే భక్తశిఖామణులే తెరిచిన సోషల్ మీడియా దుకాణాలు ఉన్నాయి గనుక అవి భజనగీతాలతో దినదినాభివృద్ధి చెందుగాక!

**- ఎం. పతంజలి**
హైదరాబాద్


Statement about ownership and other particulars of periodical **Veekshanam** as required to be published in the first issue of every year after the last day of February

Form IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | Hyderabad |
| 2. Periodicity of its publication | : | Monthly |
| 3. Printer's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 4. Publisher's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 5. Editor's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 6. Name and addresses of individuals who own the newspaper | : | N. Venugopal Rao |

I, N. Venugopal Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*
*(N. Venugopal Rao)*

Date : 1st March, 2018 Signature of the Publisher


*మార్చ్ 23న, భగత్‌సింగ్ వర్ధంతి సందర్భంగా*
**శ్రీ పి. పోలేశ్వర్ రావు** *రచించిన*

**"ఆలోచించండి...! ఆలోచించండి...!! ఆలోచించండి...!!!"**

*పాట పాడినవారికి బహుమతి ఇవ్వబడును.*

*ఉదయం 10 గంటల నుండి సాయంత్రం 8 గంటల వరకు, కవిరాజు పార్కు, జివికె భవన్, సీనియర్ సిటిజన్స్ వెల్ఫేర్ అసోసియేషన్ హాల్‌లో ఈ పోటీ నిర్వహించబడుతుంది. గేయాన్ని ఒకరుగా లేదా బృందంగా పాడవచ్చు. వాయిద్యాలు ఉపయోగించి లేదా లేకుండా అయినా పాడవచ్చు. మొదటి బహుమతి రు. 5000, రెండవ బహుమతి రు. 3000, మూడవ బహుమతి రు. 2000. ప్రోత్సాహక బహుమతులుగా ఇద్దరికి రు. 1000 చొప్పున ఇవ్వబడుతుంది. ఈ కార్యక్రమానికి నలుగురు జడ్జీలు న్యాయ నిర్ణేతలుగా ఉంటారు. గేయ ప్రతిని రచయిత వద్ద నుండి పొందవచ్చును.*

*రచయిత చిరునామా:*
**పి. పోలేశ్వర్ రావు,** *రిటైర్డ్ అసిస్టెంట్ పోస్ట్ మాస్టర్, నందులపేట, తెనాలి. సెల్ 9492664530*

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# దొంగల రాజ్యాధిపతులందరూ ఒకటే

వీక్షణం

రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ అనుసరించే విద్వేష రాజకీయాలతో, మనుధర్మ సంస్కృతితో విభేదించేవారిలో కూడ చాలమందికి ఆ సంస్థ నీతికి, నిజాయితీకి, క్రమశిక్షణకు మారుపేరని ఒక అపోహ ఉంటుండేది. ఆ అమాయకమైన అపోహ ఇప్పటికీ కొందరిలోనైనా కొనసాగుతున్నది. తనను తాను సాంస్కృతిక సంస్థనని చెప్పుకుంటూ నిత్యం హింసా సాధనాల శిక్షణ ఇస్తున్నా, దేశంలో జరిగిన అన్ని ఊచకోతల్లోనూ ప్రధాన పాత్రధారిగా ఘనకీర్తి పొందినా, ఆ పచ్చి అబద్ధాలకోరు సంస్థ నీతిమంతమైన సంస్థ అనే మేలి ముసుగును కాపాడుకుంటూ ఉండేది. పుట్టి బుద్దెరిగినప్పటినుంచీ సంఘ పరివారంలోనే పెరిగి, హంతక ప్రవృత్తిలో అన్ని డిగ్రీలూ తీసుకున్న నరేంద్ర మోడీ ప్రధానమంత్రి పగ్గాలు చేపట్టడం మొత్తంగా సంఘ పరివారానికి తన కార్యక్రమాలను విచ్చలవిడిగా కొనసాగించడానికి అవకాశం ఇచ్చింది. ఆ అవకాశమే దాని స్వచ్ఛ ప్రతిష్ఠ మేలి ముసుగును బదాబదలు చేస్తున్నది.

తనకంటె ముందు కాంగ్రెస్ నాయకత్వంలోని యుపిఎ ప్రభుత్వం అత్యంత అవినీతిమయమైన, కుంభకోణాల పాలనను ఇచ్చిందని, తాను నీతివంతమైన, ఒక్క కుంభకోణమూ లేని పాలనను ఇస్తున్నానని మొదటి మూడు సంవత్సరాలూ గప్పాలు కొట్టుకున్న నరేంద్ర మోడీ బీరువాలోంచి ఒక్కొక్క కంకాళమూ ఇప్పుడు బైటపడుతున్నాయి. హింసా దౌర్జన్యాలలో మాత్రమే కాదు, అవినీతిలో, కుంభకోణాలలో, ఆశ్రిత పక్షపాతంలో, అక్రమాలను దాచిపెట్టడంలో కూడ సంఘ పరివార్ ఎంత గుండెలు తీసిన బంటో రోజుకొక కొత్త భయానక వాస్తవం బైటపడుతున్నది. అటు కాంగ్రెస్ నాయకత్వంలోని యుపిఎ పాలనకూ ఇటు భారతీయ జనతా పార్టీ నాయకత్వంలోని ఎన్‌డిఎ పాలనకూ మధ్య తేడా ఏమీ లేదని, దోపిడీ పీడనల మీద రూపొందిన ఈ రాజ్యంలో పాలకవర్గ ముఠాలలో ఏది మారినా, ఏ సమీకరణాలు వేసుకున్నా అన్ని ముఠాల పనీ ప్రజల సంపదను కొల్లగొట్టే బందిపోటు వ్యవహారమేనని ప్రతిక్షణం రుజువు అవుతున్నది.

పంజాబ్ నేషనల్ బ్యాంక్ నుంచి వజ్రాల వ్యాపారి నీరవ్ మోడీ రు. 11,400 కోట్ల రుణాలు (వాస్తవంగా విదేశీ బ్యాంకుల దగ్గర నీరవ్ మోడీ తీసుకున్న రుణాలను తీరుస్తానని పంజాబ్ నేషనల్ బ్యాంక్ ఇచ్చిన హామీ పత్రాలు) తీసుకుని ఎగ్గొట్టి, దేశం వదిలి వెళ్లిపోయిన ఉదంతం యాదృచ్ఛికంగా బైటపడింది గాని దేశవ్యాప్తంగా బ్యాంకింగ్ అక్రమాలు, సంపన్నుల దుర్మార్గాలు, బందిపోటు దొంగలకు పాలకవర్గ మద్దతు మొదలైన వివరాల కథనాలు ఒక్కసారిగా వెలికి వచ్చాయి. నీరవ్ మోడీతో పాటే కుటుంబ సభ్యుడు మెహుల్ చోక్సీ అక్రమాలూ బైటపడ్డాయి. ఇక్కడ వేల కోట్ల రూపాయల కుంభకోణం నుంచి తప్పించుకుని దేశం వదిలి పారిపోయిన ఈ అక్రమార్జనా పరులు డావోస్‌లో ప్రపంచ దొంగల మహాసభలో తేలారని, తేలడం మాత్రమే కాదు, స్వయంగా భారత ప్రధానమంత్రి నరేంద్ర మోడీతో కలిసి ఫోటోలకు పోజులు కూడ ఇచ్చారని ఒక్కొక్క వివరమూ బైటపడి ఈ దేశ పాలకవర్గాల దుర్మార్గాన్ని మరింతగా బైటపెట్టాయి.

అయితే నీరవ్ మోడీ – మెహుల్ చోక్సీ ఉదంతం కొత్తదీ కాదు, మొదటిదీ కాదు, చివరిదీ కాబోదు. నరేంద్ర మోడీ ప్రభుత్వం తన స్వచ్ఛత గురించి ప్రగల్భాలు పలుకుతుండగానే 2016 మార్చ్‌లో అప్పటికే తమ దగ్గర రు. 9000 కోట్ల రుణాలు తీసుకుని ఎగ్గొట్టిన, ఎగ్గొట్టడానికి ప్రయత్నిస్తున్న మద్యం వ్యాపారి విజయ్ మాల్యా దేశం వదిలి పారిపోయేలా ఉన్నాడని, వెంటనే ఆయన పాస్‌పోర్టు రద్దు చేసి, పారిపోకుండా ఆపాలని బ్యాంకులు న్యాయస్థానాన్ని అభ్యర్థించాయి. కాని మహాఘనత వహించిన న్యాయస్థానాలు గాని, అధికార యంత్రాంగం గాని, ప్రభుత్వ నాయకులు గాని ఆ హెచ్చరిక తర్వాత కూడ ఆ బందిపోటు దొంగను ఆపడానికి ప్రయత్నించలేదు. వేలకోట్ల రూపాయల ప్రజాధనాన్ని కైంకర్యం చేసి అపారమైన విలాసాలు అనుభవించి, సొంత ఆస్తులు కూడబెట్టుకున్న ఆ ప్రజాద్రోహిని కాపాడడమే తమ లక్ష్యంగా పనిచేశారు. ఆకలి దొంగతనానికి, చిన్న చిన్న నేరాలకు సాధారణ ప్రజలు దారుణమైన శిక్షలు అనుభవిస్తున్న ఈ దేశంలో, ఈ భారీ మోసగాడు, బందిపోటు దొంగ సకల ప్రభుత్వ మర్యాదలతో దేశం వదిలి పారిపోయాడు. తర్వాత గడిచిన రెండు సంవత్సరాలలో కూడ విజయ్ మాల్యాను దేశంలోకి తిరిగి రప్పించడానికి, దేశంలోని ఆస్తులను స్వాధీనం చేసుకోవడానికి ఎటువంటి ప్రయత్నమూ చేయకుండా ప్రభుత్వం తాను విజయ్ మాల్యాను కాపాడడానికే ఉన్నట్టు సందేశం ఇచ్చింది. అంతకన్న పెద్ద ఎత్తున అక్రమ వ్యాపారులతో భాజపా ప్రభుత్వం, నాయకులు అంటకాగుతున్నారని చూపిన ఉదంతం లలిత్ మోడీది. ఇండియన్ ప్రీమియర్ లీగ్ అధిపతిగా భారీ అవినీతికి, అక్రమాలకు పాల్పడి, దేశం వదిలి పారిపోయి, బ్రిటన్ లో తలదాచుకున్న లలిత్ మోడీని వెనక్కి రప్పించడానికి, విచారణ జరపడానికి 2014 దాకా యుపిఎ ప్రభుత్వం, ఆ తర్వాత ఎన్‌డిఎ ప్రభుత్వం ఏ చర్యలూ చేపట్టలేదు. లలిత్ మోడీని బ్రిటన్ నుంచి పంపించమనే అభ్యర్థనను కూడ భారత ప్రభుత్వం పంపలేదని 2017 మేలో బైటపడింది. అందుకు కారణం అటువంటి అభ్యర్థన చేయాలంటే ఆ నిందితుడి మీద అప్పటికే స్థానిక న్యాయస్థానంలో కేసు నమోదై ఉండాలని, కాని ఇక్కడ కేసు కూడ నమోదు కాలేదని తేలింది. అది అలా ఉండగానే లలిత్ మోడీ పాస్ పోర్టు రద్దయినప్పటికీ, విదేశీ వ్యవహారాల మంత్రిగా ఉండిన సుష్మా స్వరాజ్ సహకారంతోనే లలిత్ మోడీ విదేశీ విలాసవాసం కొనసాగుతున్నదని 2015 జూన్ లో బైటపడింది. తాను లలిత్ మోడీకి "మానవతా కారణాల రీత్యా" సహకరించానని సుష్మా స్వరాజ్ ఒప్పుకున్నారు. ఆయుధ వ్యాపారి సంజయ్ భండారీ, కార్పొరేట్ దళారీ దీపక్ తల్వార్ ల మీద తీవ్రమైన నేరారోపణలు, అవినీతి ఆరోపణలు ఉండగా దేశం వదిలి వెళ్లడానికి, కేసులను తాత్సారం చేయడానికి ప్రభుత్వం సహకరించింది. నీరవ్ మోడీ కుంభకోణం బైటపడుతున్న సందర్భంలోనే రొటొమాక్ పెన్ యజమాని విక్రమ్ కొఠారి ఐదు ప్రభుత్వ రంగ బ్యాంకుల నుంచి రు. 800 కోట్లు రుణం తీసుకుని ఎగ్గొట్టాడని వెలికి వచ్చింది.

గత కొద్ది వారాలుగా ప్రచార సాధనాలన్నీ ఈ బందిపోటు దొంగల వివరాలను సంచలనాత్మకంగా, ఆకర్షణీయంగా వండి వడ్డిస్తున్నాయి గనుక ఆ వివరాల్లోకి ఎక్కువగా వెళ్లనక్కరలేదు గాని స్థూలంగా ఈ పరిణామాలన్నీ ఈ దేశ పాలన ఎంత ప్రజావ్యతిరేకంగా, రాజకీయ, ఆర్థిక బందిపోట్లకు అనుకూలంగా జరుగుతున్నదో, ఈ పాలకవర్గాలు ఎంతగా ప్రజావ్యతిరేక మైనవో అర్థం చేసుకోవలసి ఉంది. ఈ పాలకవర్గ ముఠాలలో ఏది దిగిపోయి ఏది అధికారంలోకి వచ్చినా జరగబోయే మార్పేమీ లేదని, అన్ని పాలకవర్గాలనూ కూలదోసే వ్యవస్థా పరివర్తన ఒక్కటే ఈ దేశానికి ఇవాళ అవసరమైన ఔషధమని ఇప్పటికైనా గుర్తించక తప్పని ఈ వ్యాధి లక్షణాలన్నీ తేటతెల్లం చేస్తున్నాయి. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# రైతులకు ఆత్మహత్య, రైతు సమితికి పెత్తనం

తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం ఏక కాలంలో రెండు అంశాలు రుజువు చేయదలచుకున్నట్టున్నది. తాను కాలం చెల్లిన భూస్వామ్య రాచరికానికి కొనసాగింపుననీ, రెండో రాకడననీ చూపడానికి ప్రయత్నిస్తున్నది. మరొకవైపు అధినేతకు రాజకీయార్థిక, పాలనా శిక్షణ ఇచ్చిన తెలుగు దేశం పార్టీ ఆలోచనా ఆచరణా సరళిని పునరుద్ధరించి, దాని పునరుత్థానాన్ని సాధిస్తానని చూపదలచుకున్నది. తెలంగాణ గ్రామాల్లో ప్రజా చైతన్యాన్ని, ప్రజా ఆకాంక్షలను నిర్దాక్షిణ్యంగా తొక్కివేసి వందల సంవత్సరాల పాటు అధికారం చలాయించిన భూస్వామ్య రాచరికపు శవానికి ఈసారి ప్రజాస్వామిక ముసుగుతో పునరుజ్జీవనం కల్పించదలచుకున్నది. ఎన్ని అణచివేతలనైనా ధిక్కరించి లేచినిలిచిన, పోరాడిన తెలంగాణ గ్రామాల్లో ప్రజల మధ్య వైరుధ్యాలను పెంచి పోషించి, దళారీ వ్యవస్థను ప్రవేశపెట్టి తన నియోజకవర్గాన్ని తయారు చేసుకున్న తెలుగు దేశం పార్టీ సంప్రదాయాలను మరొకసారి ప్రవేశపెట్టడం ద్వారా గ్రామాలను విభజించి పోషించదలచుకున్నది తెలంగాణ రాష్ట్ర సమితి. ఇవాళ తెరాస ప్రభుత్వం ఈ రెండు విష రసాయనాలనూ కలగలిపి తెలంగాణ గ్రామాల చేత మింగిస్తున్నది. గ్రామాల్లో, ముఖ్యంగా రైతాంగంలో చైతన్యం ఉండడానికి వీలులేదు, ప్రజా ఆకాంక్షల ప్రకటనకు అవకాశం లేదు. గ్రామంలో చీమ చిటుక్కుమన్నా దొరలకూ పోలీసు దొరలకూ ప్రభుత్వ దొరలకూ క్షణాల మీద తెలిసిపోవలసిందే. ఈ వేగుల వ్యవస్థ సజావుగా సాగాలంటే వేగులకు ప్రజాధనం నుంచి వాటా అందుతుందనే ఆకర్షణ ఉండాలి. కాంట్రాక్టుల నిధులు మాత్రమే కాదు కొత్త కొత్త ప్రభుత్వ పథకాలు ప్రకటించి ఆ ప్రజాధనాన్నంతా ఈ దళారులకు అందించాలి. గ్రామీణ పార్టీ నిర్మాణాలు, కొందరిని ఎంపిక చేసి నాయకత్వం ఇస్తున్నామనే భ్రమలు కల్పించడం, వారి జేబులు నింపడానికి ప్రభుత్వ పథకాలు ప్రవేశపెట్టడం వంటి గతంలో తెలుగుదేశం పార్టీ ప్రవేశపెట్టిన కనికట్టు విద్యలను ఆ పార్టీ శిక్షణలో నేర్చుకున్న చంద్రశేఖర రావు ఇవాళ ముఖ్యమంత్రిగా సంపూర్ణంగా వినియోగించుకుంటున్నారు. ఎన్ టి రామారావు, చంద్రబాబు నాయుడు ప్రారంభించిన కర్షక పరిషత్ ప్రయోగాన్ని మరింత ముందుకు తీసుకువెళ్లి రైతు సమన్వయ సమితి అనే అధికార పార్టీ అనుబంధ సంస్థను తయారు చేసి గ్రామంలోని రైతాంగ జీవితం మీద సకలాధికారాలు సమకూర్చి రాజ్యాంగేతర శక్తిగా మారుస్తున్నారు. నాలుగు సంవత్సరాలు నిండకుండా నాలుగు వేల మంది రైతులు ఆత్మహత్య చేసుకున్న, అంటే సగటున రోజుకు ముగ్గురు రైతులు పిట్టల్లా రాలిపోతున్న దౌర్భాగ్య రాష్టంలో ఆ సమస్యను పరిష్కరించడానికి ఎటువంటి ప్రయత్నాలూ చేయకుండా, రైతులకు పంట పెట్టుబడి ఇవ్వడానికనే పేరుతో ఒక భారీ కార్యక్రమాన్ని చేపట్టి, ఆ కార్యక్రమాన్ని నిర్వహించడానికి, అంటే ప్రజాధన పంపిణీ అధికారాన్ని ఒక పార్టీ సంస్థకు కట్టబెట్టడానికి అత్యంత అప్రజాస్వామిక, దుర్మార్గ చర్య చేపట్టారు. రైతు సమన్వయ సమితులు ప్రజా ప్రాతినిధ్య సంస్థలు కావు, ప్రజలు ఎన్నుకున్న సంస్థలు కావు, మంత్రులు, శాసనసభ్యులు నియమించిన, వారి జేబులోని వ్యక్తుల పెత్తందారీ సమితులకు ప్రభుత్వ పథకం మీద పెత్తనం నడపడానికి హక్కు లేదు. అది కేవలం గ్రామాల్లో పిడికెడు మంది పాలకపక్ష దళారీ గుంపును తయారు చేసి, ఆ గుంపు చేతికి గ్రామం మొత్తం మీద అధికారం ఇవ్వడంగా మారుతుంది. ఇది పాలకపక్ష వోట్ల రాజకీయాల తక్షణ అవసరాలకు పనికి వస్తుందేమో గాని సమాజాన్ని అప్రజాస్వామిక, అనైతిక పరిణామాలకు లోను చేస్తుంది. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# అబ్బబ్బ, ఆంధ్రప్రదేశ్ లోకి ఎన్ని కోట్ల వరద!

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుకు భారీ అంకెల మీద, భారీ అబద్ధాల మీద చాల మోజు. అవిభక్త ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా, ప్రపంచ బ్యాంకు మెచ్చుకున్న సిఇవో గా గతంలో తొమ్మిది సంవత్సరాలు ఆయన చేసిన పని అదే. ఇప్పుడు విభక్త ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా నాలుగు సంవత్సరాలుగా ఆ అలవాటునే కొనసాగిస్తున్నారని కాన్ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీ (భారత పారిశ్రామికవేత్తల సమాఖ్య) సహకారంతో తాజాగా విశాఖపట్నంలో నిర్వహించిన భాగస్వామ్య సదస్సు చూపుతున్నది. దాదాపు ఇరవై ఏళ్ల కింద ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో ప్రారంభించిన ఈ పారిశ్రామిక, వ్యాపార వేత్తల మహామేళా చేసిన వాగ్దానాలలో పదో వంతు కూడ వాస్తవం కాలేదని డజన్ల కొద్దీ ఉదాహరణలు ఉన్నప్పటికీ, ఎప్పటికప్పుడు ప్రజలను మోసగించడానికి, ఆంధ్రప్రదేశ్ వనరులను దేశదేశాల సంపన్నులకు అమ్మజూపడానికి చంద్రబాబు నాయుడు ఈ వేదికను వాడుకుంటున్నారు. ఈసారి మూడు రోజుల సదస్సుకు ముందు చేసిన ప్రకటనల్లో రెండు మూడు లక్షల కోట్ల రూపాయల పెట్టుబడులు తీసుకువచ్చే మూడు వందల ఒప్పందాలు కుదురుతాయని ప్రభుత్వ ప్రకటనలు వెలువడ్డాయి. తీరా మూడు రోజుల సదస్సు తర్వాత చూస్తే రు. 4.39 లక్షల కోట్ల పెట్టుబడులతో 734 ఒప్పందాలు కుదిరాయని ప్రకటిస్తున్నారు. ఈ పెట్టుబడులు పదకొండు లక్షల ఉద్యోగాలను కల్పిస్తాయని నమ్మబలుకు తున్నారు. వాస్తవంగా ఇటువంటి భారీ అంకెలూ, వాగ్దానాలూ అన్నీ బూటకమని కొన్నినెలల్లో, సంవత్సరాల్లో తేలిపోయిందని గతంలో రుజువైనా పాలకులు మళ్లీ మళ్లీ అవే అవే అబద్ధాలు ఆడడానికి వెనుకాడడం లేదు. ఉద్యోగాలు, పరిశ్రమలు, ఆర్థికాభివృద్ధి వంటి ప్రజలకు ఎంతో కొంత మేలు జరిగే వాగ్దానాలు అమలు కావడం అరకొరగా జరుగుతుంది. పరిశ్రమో వ్యాపారమో పెడతానని చెప్పిప్రభుత్వం దగ్గర భూమి, నీరు, విద్యుత్తు, రాయితీలు, పన్ను మినహాయింపులు దండుకునే సంపన్నులకు ఇచ్చే వాగ్దానాలు మాత్రం అన్నీ చెప్పినదాని కన్న ఎక్కువ అమలవుతాయి. ఈసారి పెట్టుబడుల వాగ్దానాలలో అక్రమ వ్యాపారాల దిగ్గజాలుగా పేరు తెచ్చుకున్న రిలయన్స్, అదానీ గ్రూప్ లది అగ్రాసనం. నరేంద్ర మోడీ స్నేహితుడిగా గుజరాత్‌లో, దేశంలో ఎన్నో ఆర్థిక అక్రమాలకు పాల్పడి, ఆస్ట్రేలియా వంటి చోట్ల అక్రమాల మీద విచారణ ఎదుర్కొంటున్న అదానీకి ఇప్పుడు చంద్రబాబు నాయుడు ఎర్రతివాచీ ఆహ్వానం పలుకు తున్నారు. అదానీ గ్రూప్ భావనపాడు దగ్గర రు. 9,000 కోట్లతో ఓడరేవు నిర్మిస్తుందట. రిలయన్స్ గ్రూప్ రు. 55,000 కోట్లతో విద్యుత్తు, ఎలక్ట్రానిక్స్ రంగాల్లో ప్రవేశిస్తుందట. ఇటువంటి అబద్ధాలనే ప్రతి సంవత్సరం ఇటువంటి సదస్సులలో ఆడుతున్నానని, ఎవరైనా ఒకరు ఎప్పుడో ఒకప్పుడు ఇవి నిజమ య్యాయా లేదా అని నిర్ధారిస్తారని కనీస అనుమానం కూడ లేకుండా అబద్ధాలు ఆడగలుగుతున్న రాజకీయ నాయకుల ధైర్యం ఆశ్చర్యకరం. ఈ నాటకాన్ని పరిసమాప్తి చేయవలసిన ప్రజలు ఇంకా అందుకు సిద్ధంకాకపోవడం, వారికి అవసరమైన సమాచారం అందకపోవడమే ఇవాళ్టి విషాదం. వీ

# జాకబ్ జుమా రాజకీయ పతనానికి అవినీతే కారణం

- ఎ. నర్సింహారెడ్డి

అవినీతి ఆరోపణలకు గురైన దక్షిణాఫ్రికా అధ్యక్షుడు జాకబ్ జుమా ఫిబ్రవరి 15న రాజీనామా చేయడంతో ఒక ఘట్టం ముగిసింది తప్ప అవినీతి సమస్య పరిష్కారం కాలేదు. జాత్యహంకారానికి వ్యతిరేకంగా ఆయుధాలు పట్టి పోరాడిన జుమా అనేక దేశాల నేతలలాగానే అవినీతి కూపంలో మునిగిపోయారు. జుమా రాజీనామా వార్త విన్న దక్షిణాఫ్రికా ప్రజలు వీధుల్లోకి వచ్చి వేడుకలు చేసుకున్నారు. ఆయనను పదవినుంచి తప్పించాలని ప్రజలు చాలాకాలంగా ఆందోళన చేస్తున్నారు. అవినీతి చర్యల ద్వారా అనేక బిలియన్ డాలర్లను సమీకరించారన్న ఆరోపణలు జుమాపై ఉన్నాయి. ఫ్రీడం చార్టర్ అమలు చేయటంలో వైఫల్యం, అధిక ధరలు, ఆశ్రిత పక్షపాతం, నిరుద్యోగం ప్రభుత్వ ప్రతిష్ఠను దెబ్బతీశాయి. జుమా అవినీతిపై ప్రతిపక్ష డెమోక్రటిక్ అలయన్స్ డిసెంబర్ 13న 18 కేసులు సుప్రీంకోర్టులో దాఖలు చేయగా కోర్టు జుమా అవినీతి ఆరోపణల విచారణకు జనవరి 13న ఒక కమిషన్‌ను నియమించింది. మైనింగ్, మీడియా, టెక్నాలజీ, ఇంజనీరింగ్ రంగాల్లో స్థిరపడ్డ భారత సంతతికి చెందిన గుప్తా కుటుంబానికి అండదండలందించి జుమా అవినీతికి పాల్పడట్టు ఆరోపణలున్నాయి. 106 సంవత్సరాల ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ శ్వేతజాత్యహంకార, వర్ణ వివక్ష పాలనకు వ్యతిరేకంగా నెల్సన్ మండేలా నాయకత్వంలో దీర్ఘకాలం పోరాటం సాగించి వర్ణ వివక్ష అంతాన్ని సాధించింది. 1994లో అన్ని జాతులు పాల్గొన్న తొలి సార్వత్రిక ఎన్నికల్లో ఎఎన్‌సి 'నల్లసూరీడు' నెల్సన్ మండేలా అధ్యక్షునిగా ఎన్నికైనారు. ఎఎన్‌సి కేవలం ఒక పక్షానికి చెందిన రాజకీయపార్టీ కాదు. వర్ణ వివక్షకు వ్యతిరేకంగా పోరాటం చేసిన దక్షిణాఫ్రికా కమ్యూనిస్టు పార్టీ సహా వివిధ స్రవంతుల వేదిక.

1990లో ప్రజాస్వామ్య పరివర్తనకు నాయకత్వం వహించిన టాస్క్‌ఫోర్స్‌లో రాంఫోసా కీలకమైన వ్యక్తి. మండేలా అనంతరం అధ్యక్ష పదవి లభించకపోవడంతో అసంతృప్తి చెంది రాజకీయాలు విడిచిపెట్టి వ్యాపార, పారిశ్రామికవేత్తగా ఎదిగారు. రాంఫోసా ఆఫ్రికాలో సంపన్నుల జాబితాలో 42వ స్థానంలో ఉన్నట్లు 2015లో ఫోర్బ్స్ ప్రకటించింది. 2012లో రాంఫోసా రాజకీయాల్లోకి తిరిగి వచ్చి 2014లో పార్టీ ఉపాధ్యక్షులయ్యారు. జుమా రాజీనామా తర్వాత సిరిల్ రాంఫోసా అధ్యక్ష బాధ్యతలు స్వీకరించారు. గత దశాబ్ద కాలంలో ఎఎన్‌సి ఇద్దరు అధ్యక్షులను రాజీనామా చేయాలని కోరింది. 2008లో తాబో ఎంబెకీ, 2009లో జాకబ్ జుమా అధ్యక్షులయ్యారు. ఈ ఇద్దరూ తమ రాజకీయ జీవితాన్ని కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలుగా ప్రారంభించి ఎఎన్‌సి నేతలుగా ఎదిగారు. చివరకు అవినీతి ఆరోపణలతో పార్టీ క్రమశిక్షణా చర్యలకు గురయ్యారు. జుమా తొమ్మిదేళ్ల పాలనలో ఆర్థికాభివృద్ధి స్తంభించింది. కరెన్సీ ర్యాండ్ మారక విలువ పడిపోయింది. జుమా పాలనలో అవినీతి ఆరోపణలు, ఆశ్రిత పక్షపాతం వంటి ఆరోపణలతో పాటు అనేక రంగాలలో వైఫల్యం కారణంగా 2016లో జరిగిన స్థానిక సంస్థల ఎన్నికలలో ఎఎన్‌సి అనేక పరాజయాలు చవిచూసింది.

నల్లజాతి పాలన ఆరంభమైనా ఇప్పటికీ ఆర్థిక వ్యవస్థపై పట్టు శ్వేతజాతి బహుళజాతి కంపెనీల చేతిలోనే ఉంది. ఇప్పటికీ 90 శాతం సంపద వారి చేతిలోనే ఉంది. వాటిని స్వాధీనం చేసుకోవడానికి సరైన చట్టాలు రూపొందించలేదు. భూసంస్కరణల అమలు అసంపూర్ణంగానే మిగిలింది. ఒక పోరాట పార్టీ అధికారానికి వచ్చాక ఏ జాగ్రత్తలు తీసుకోవాలో దక్షిణాఫ్రికా పాఠాలు చెపుతున్నది. వీ






❖ **ఎస్సీ రిజర్వేషన్ వర్గీకరణ సామాజిక న్యాయం** – సి. కాశీం – స్టూడెంట్ మార్చ్ ప్రచురణలు – 72 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 50, స్టూడెంట్ మార్చ్, ప్రతులకు: కె. జగన్, ఇ.నెం. 12-13-598, నాగార్జుననగర్, తార్నాక, హైదరాబాద్ – 500017 ఫోన్: 9912402011; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో




❖ **రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనలు అగ్రకులతత్వం** – సి. కాశీం –స్నేహ ప్రచురణలు– 32 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 20, ప్రతులకు: ఆర్:9, యూనివర్సిటీ స్టాఫ్ క్వార్టర్స్, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్ – 500 007. ఫోన్: 9290745490
అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో




❖ **ఛంఘిజ్‌ఖాన్** – నవల – తెన్నేటి సూరి – విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ – 328 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 175, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్), జిఎస్ఐ (పోస్ట్), హైదరాబాద్–068. ఫోన్: 24224458/24224459
అన్ని విశాలాంధ్ర బ్రాంచీలలో




❖ **కందిలి** – నాయిని గోవర్ధన్‌రెడ్డి – 78 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 50, ప్రతులకు: నాయిని గోవర్ధన్‌రెడ్డి, కొత్తపేట (గ్రా), శివంపేట (మం), మెదక్ జిల్లా. ఫోన్: 9866504089
అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో




❖ **అంతం వరకు అనంతం** – కె. లలిత – లిఖిత ప్రెస్ – 220 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 200, ప్రతులకు: వి. రమేష్‌బాబు, 1-3-183/40/70/501, చంద్ర అపార్ట్‌మెంట్స్, స్ట్రీట్ నం. 9, ఎస్‌బిఐ కాలనీ, గాంధీనగర్, బాకారం, హైదరాబాద్ – 500 080. ఫోన్:9505518441; email:likhitapress@gmail.com



❖ **ఎనిమిదో రంగు** – కవిత్వం – అనిల్ డ్యాని – సాహితీ మిత్రులు – 80 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: సాహితీమిత్రులు, 28-10-16, మస్జిద్‌స్ట్రీట్, అరుండల్‌పేట, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ – 2. ఫోన్: 0866-2433359, 9392971359




❖ **చదువులా..? చావులా...?!** – పిడిఎస్‌యు ప్రచురణ – 96 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60, ప్రతులకు: పిడిఎస్‌యు కార్యాలయం, సి.పి. భవన్, విద్యానగర్ రైల్వే స్టేషన్ రోడ్డు, విద్యానగర్, హైదరాబాద్ – 044




❖ **సమూహం** – బి.సి అస్తిత్వవాద యువ కవిత్వం – బి.సి. రైటర్స్ వింగ్ – 128 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: ఫూలే ఘర్, 16-10-236, శివనగర్, వరంగల్ – 506 002;
ఫోన్: 9346886143




❖ **అల్లూరి సీతారామరాజు** – జీవిత చరిత్ర – పదాల రామారావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 194 పేజీలు, 1/8 డెమీ, వెల రు.70




❖ **మక్సీమ్ గోర్కీ** – సాహిత్య వ్యాసాలు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 286 పేజీలు, 1/8 డెమీ, వెల రు.190




❖ **తెన్నేటి సూరి రచనలు** – మూడవ సంపుటం – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 222 పేజీలు, 1/8 డెమీ, వెల రు.150
పై మూడు పుస్తక ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్), జి.ఎస్.ఐ. (పోస్ట్), హైదరాబాద్ – 068.ఫోన్: 24224453/ 54
email:navachethanaph@gmail.com,




❖ **అరుగు మీది ముచ్చట్లు** – లఘు నాటికలు – డా. ఉదారి నారాయణ – 120 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60 – ప్రతులకు: ఉదారి నారాయణ, ఇ.నెం. 4-112/7/2, రోడ్ నెం. 3, కెసిబి గార్డెన్స్ ఎదురుగా, రాంనగర్, మవల, ఆదిలాబాద్ – 504 001.




❖ **సూర్యశిల (సన్‌స్టోన్)** – మెక్సికన్ కవిత్వం – నోబెల్ బహుమతి గ్రహీత ఆక్టేవియో పాజ్, అనువాదం: నాగరాజు రామస్వామి, పాలపిట్ట బుక్స్ – 148 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100




❖ **నాన్న కావాలి** – దీర్ఘ కవిత – ఎస్. సుమిత్రా దేవి – పాలపిట్ట బుక్స్ – 48 పేజీలు, 1/8 డెమీ, వెల రు.50



❖ **రాత్రి నదిలో ఒంటరిగా...** – కవిత్వం – ముకుంద రామారావు – పాలపిట్ట బుక్స్ – 112 పేజీలు, 1/8 డెమీ, వెల రు.80




❖ **శతాబ్దాల సూఫీ కవిత్వం** – ముకుంద రామారావు – పాలపిట్ట బుక్స్ – 112 పేజీలు, 1/8 డెమీ, వెల రు.60

పై నాలుగు పుస్తక ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036

# కేంద్ర బడ్జెట్ అంకెల గారడీ

***బడ్జెట్‌లో ఆయా రంగాలకు కేటాయింపుల అంకెలు వాస్తవికతకు దూరంగా ఉన్నాయని, పాలకులు బడ్జెట్‌ను ప్రాధాన్యత లేని అంశంగా మార్చివేస్తున్నారని అంటున్నారు డా. ఎ. పున్నయ్య***

బడ్జెట్ అనేది కేవలం అకెంల సేకరణ, కూర్పు మాత్రమే కారాదు. అది మనం పాటిస్తున్న విలువలు యావత్ దేశ ప్రజల ఆకాంక్షల వ్యక్తీకరణగా ఉండాలి. కాని దార్శనికత కొరవడిన ప్రభుత్వాల అవినీతి కారణంగా దశాబ్దాల తరబడి ఇండియా ధనిక దేశమే భారతీయులే నిరుపేదలు అన్నది యదార్థం. పేదల జీవన ప్రమాణాల మెరుగుదలకు కట్టుబడి ఉన్నట్లు ఇటీవలి దావోస్ అంతర్జాతీయ సదస్సులో పడికట్టు పదాలతో ప్రధాని స్వయంగా ప్రకటించినట్లుగానే ఈ బడ్జెట్‌కు సంక్షేమ శృతి కూర్చి గ్రామీణాభివృద్ధి గానం చేసిన జైట్లీ తన ఓటు ఎటో ఈ బడ్జెట్ పాఠం తొలి పంక్తుల్లో విశదీకరించారు.

2017-18 ఆర్థిక సంవత్సరం కంటే 10.1 శాతం పెంపుతో ఈ సంవత్సరానికి రు. 24,42,213 లక్షల కోట్ల మేర బడ్జెట్ ప్రతిపాదనలు క్రోడీకరించారు. ప్రభుత్వం ప్రకటించినట్లు జిఎస్‌టి అమల్లోకి వచ్చిన అనంతరం పరోక్ష పన్ను ఆదాయంలో గణనీయంగా 17.4 శాతంతో రు. 2,21,195 కోట్ల ఆదాయ పెరుగుదలను ప్రభుత్వమే ప్రకటించినప్పటికీ రు. 6,24,276 లక్షల కోట్ల ద్రవ్యలోటుతో ఈ బడ్జెట్ ఉండడం విచారకరం.

ఈ బడ్జెట్‌లో వ్యవసాయ గ్రామీణాభివృద్ధి రంగాలకు పెద్దపీట వేస్తూ 'శాస్త్రీయత లేని మద్దతు ధరతో" రైతు ఆదాయాన్ని రెట్టింపు చేస్తామన్న ప్రకటన నేల విడిచి సాముచేసినట్లే ఉంది. ప్రపంచంలోనే అతిపెద్ద ఆరోగ్య యోజనగా 10 కోట్ల పేద కుటుంబాలకు రు. 5 లక్షల ఆరోగ్య భీమా పథకాన్ని అమలు పరుస్తామంటూ మాటల గారడీ చేస్తున్నారు. సుమారు 50 కోట్ల మందికి ప్రయోజనం కల్పించే ఆయుష్మాన్ భారత్‌ను పట్టాలెక్కించడానికి తగిన నిధుల జాడ ఈ బడ్జెట్‌లో కనుచూపు మేరలో కన్పించలేదు. ఎనిమిది కోట్ల మంది పేద మహిళలకు ఉచిత ఎల్‌పిజి, నిరుపేదలకు ఉచిత విద్యుత్ కనెక్షన్‌లు రాబోయే రాజకీయ అవసరాలకు ఒక అస్త్రంగా ప్రతిబింబిస్తుంది.

స్థూలంగా ఈ బడ్జెట్ కేటాయింపులను తులనాత్మకంగా ఈ కింది రంగాలను సమీక్షించుకుందాం!

### వ్యవసాయ గ్రామీణాభివృద్ధి రంగం

కొన్ని దశబ్దాల ప్రభుత్వ అనాలోచిత విధానాల పర్యవసానంగా వ్యవసాయ రంగం సంక్లిష్టంగా మారింది. ప్రస్తుత బడ్జెట్‌లో వ్యవసాయ, గ్రామీణాభివృద్ధి రంగాలకు ప్రత్యేక ప్రాధాన్యత ఇస్తున్నట్లు ప్రకటించారే గాని, రోజు రోజుకు పెరుగుతున్న రైతుల ఆత్మహత్యల నివారణకు గాని, వ్యవసాయ రంగ తీవ్ర సంక్షోభానికి తగిన రీతిలో పరిష్కారాలు సూచించలేకపోయారు. వ్యవసాయ రంగాన్ని మెరుగు పరచడానికి గ్రామీణ ప్రాంత అభ్యున్నతికి వీలుగా 14.34 లక్షల కోట్లు కేటాయించారు. ఈ కేటాయింపులతో ఉపాధి కల్పన వ్యవసాయ అనుబంధ కార్యకలాపాలు గ్రామీణ మౌలిక సదుపాయాలను పెంచాలని నిర్ణయించారు.

దేశవ్యాప్తంగా ఉన్న 22 వేల సంతలను ఆధునీకరించడానికి రెండు వేల కోట్లు కేటాయిస్తున్నట్లు ప్రకటించారు. సగటున ఒక్కొక్క మార్కెట్‌కు కేవలం రు. 90 వేలు మాత్రమే. ఈ నిధులతో మార్కెట్‌లో ఎన్ని ఆధునీకరణ వసతుల ఏర్పాటు జరుగుతుందో ప్రభుత్వానికే అర్థం కావాలి. వ్యవసాయ రుణాల కోసం 11 లక్షల కోట్లు కేటాయిస్తున్నట్లుగా గొప్పగా చెప్పారు. రుణాలు బ్యాంకులిస్తాయి. బ్యాంకులిచ్చే రుణాలకు ఈ ప్రభుత్వం కేటాయించే కేటాయింపులకు సంబంధంలేదు.

కాని ఈ కేటాయింపులు తామే కేటాయిస్తున్నట్లు ప్రభుత్వ ఖాతా నుండి ప్రజలకు రుణాలను అందిస్తున్నట్లు రైతులతో పాటు మధ్యతరగతి ఆర్థిక రంగ నిపుణులను కూడా మాయచేసింది. 96 జిల్లాల్లో నీటి పారుదల కొరత తీర్చుటకు రు. 2,600 కోట్లు కేటాయించింది. ఈ కేటాయింపులతో తీవ్ర స్థాయిలో ఉన్న వ్యవసాయ రంగ నీటి పారుదల సంక్షోభాన్ని పరిష్కరించే సమగ్ర చర్యలేమో కాని, కనీస చర్యలు కూడా కల్పించవు.

2022 నాటి దేశానికి స్వాతంత్రం వచ్చి 75 సంవత్సరాలు పూర్తి అవుతున్న దశలో రైతుల ఆదాయాన్ని రెట్టింపు చేస్తామన్న ప్రభుత్వ పిలుపు లక్ష్యాన్ని సాధించడానికి సమీప దూరంలో కూడా లేదు. 86 శాతం పేద రైతులున్నారని, వారి అభివృద్ధే ప్రభుత్వ తక్షణ కర్తవ్యం అని చెపుతున్నటికీ అందుకు అనుసరిస్తున్న అభివృద్ధి నమూనాను స్పష్టం చేయడం లేదు. గత బడ్జెట్ మాదిరే ఈ సారి ప్రకటించిన ఖరీఫ్ పంటలకు కొత్త మద్దతు ధర రైతులకు మేలు చేస్తుందన్న ప్రకటన కపటమే. ప్రభుత్వ గణాంకాల ప్రకారమే ఈ మద్దతు ధర కోసం కేటాయింపులు కేవలం ఆరు శాతం రైతాంగానికే సరిపోతాయి.

దేశంలోని 180 కార్మిక సంఘాలు కలిసి ఐక్య కిసాన్ సంఘంగా ఏర్పడి ప్రధాన పంటలు ఏడింటిని (వరి, గోధుమ, మిర్చి, పత్తి లాంటి) గుర్తించి వాటి ఉత్పాదక వ్యయాలను లెక్కగట్టి సగటున ఈ ప్రభుత్వానికి అందించారు. శాస్త్రీయంగా లెక్కించిన ఈ ఉత్పాదక వ్యయాన్ని పరిగణలోకి తీసుకోకుండానే ప్రభుత్వమే నిర్ధారిస్తున్న మద్దతు ధరకు ఒకటిన్నర రెట్లు ముట్టజెపుతామన్న ప్రభుత్వ గారడీ మాటలను రైతు సంఘాలతో పాటు యావత్ రైతాంగం అర్థం చేసుకుంటున్నారు.

నిజంగానే రైతులకు పంటల నిర్వాహణ ఖర్చులకు ఒకట్నిర రెట్లు ధర అధికంగా వస్తే దేశ వ్యాప్తంగా టమాటా, ఉల్లి, పత్తి, మిర్చి రైతులు తమ పంటలను పది పైసలకో, పావలాకో అమ్ముకోలేక పొలాల్లో, కల్లాల్లోనే తగలబెట్టుకొని, పురుగు మందులు తాగి ఆత్మహత్యలు చేసుకుంటారా అనేది ఈ ప్రభుత్వాన్ని సామాన్యుడు అడిగే ప్రశ్న.

ఇప్పటికైనా సామినాథన్ కమిటీ సూచనలను దీటైన కార్యచరణతో ఉరకలెత్తిస్తేనే రైతులకు, వ్యవసాయ రంగానికి ప్రయోజనం ఉంటుంది. పై కమిటీ అభిప్రాయ పడినట్లుగా 2022 నాటికి రైతు రాబడిని రెండింతలు చేసేందుకు ప్రభుత్వ కేటాయింపుల్లో 14.5 శాతం మేర వ్యవసాయ రంగ అభివృద్ధికి కేటాయింపులుండాలి కాని, 2.2 శాతం నామ మాత్రం కేటాయింపులతో మరో దశాబ్దానికి కూడా లక్ష్యాన్ని చేరుకోవడం అసాధ్యమవుతుంది. ఖచ్చితమైన దిద్దుబాటు ఆవశ్యకతను ప్రభుత్వం అర్థం చేసుకున్నప్పుడే వ్యవసాయ రంగం అభివృద్ధి పథంలో ముందు పడుతుంది.

నేటికి పంట నూనెల్ని పెద్ద ఎత్తున విదేశాల నుంచి దిగుమతి చేసుకుంటున్నాం. దీనిని గుర్తించి సరికొత్త వ్యవసాయ పరిశోధనలకు సృజనాత్మక ఆవిష్కరణలను ప్రారంభించాల్సిన అవసరముంది. నిల్వ వసతులు పెంచాలి. ప్రపంచంలో భౌగోళికంగా చాలా చిన్న దేశాలు వియాత్నాం థాయిలాండ్, మయన్మార్ లాంటి దేశాల వ్యవసాయ ఉత్పత్తుల ఎగుమతులు మనదేశం కన్నా మిన్నగా ఉన్నాయి. ప్రతికూల పరిస్థితుల్లో పొలాల్లో అద్భుతాలు సృష్టిస్తున్న ఇజ్రాయెల్ వ్యవసాయ విజయగాథ ప్రపంచంలో ఏ దేశానికైనా ఆదర్శమే. ప్రభుత్వ పెద్దలు పదే పదే ప్రకటించినట్లు మన రైతుల రాబడి రెండింతలు కావాలంటే 32 బిలియన్ డాలర్లకు పరిమితమైన దేశీయ సేద్య ఎగుమతులు 2022 నాటికి 120 బిలియన్ డాలర్లకు విస్తరించాలని భారత ప్రభుత్వ సస్య రక్షణ సమాఖ్యే స్పష్టం చేసింది. కావున నిజ ఆర్థిక వ్యవస్థలోని వ్యవసాయ రంగ సమస్యలను నేటికైనా గుర్తించి దీర్ఘకాలిక ప్రాతిపదికపై విరుగుడు చర్యలను సిద్ధం చేయాలి. గతంతో పోలిస్తే ఈ రంగంలో ఒకింత మెరుగుదల కనిపిస్తున్నా రైతు జీవన భద్రతతో పాటు యావత్ జాతికి ఆహార భద్రత కల్పించే దిశగా ఈ ప్రభుత్వాలు మరిన్ని ప్రగతిశీల అడుగులు వేయాల్సిందే.

### ప్రాథమిక ఆరోగ్య రంగం

ఆర్థిక మంత్రి బడ్జెట్ ప్రసంగంలో ఆరోగ్య రంగానికి పెద్ద పీట వేస్తున్నట్లు ప్రకటించారు. ప్రపంచంలో ఎక్కడాలేని విధంగా భారీ కేటాయింపులు ప్రజారోగ్యానికి కేటాయిస్తున్నట్లు పేర్కొన్నారు. ఈ కేటాయింపులు ప్రజల అనారోగ్య సమస్యకు తగిన చికిత్స కాదని గత బడ్జెట్ అనుభవాలు మన ముందున్నవి. 2016-17 బడ్జెట్‌లో ఒక ఆరోగ్య భీమా పథకాన్ని ప్రకటించింది ప్రతి కుటుంబానికి లక్ష రూపాయల ఆరోగ్య భీమా, వృద్ధులకు అదనంగా రు. 30 వేలు కవరేజీ ఇస్తామని తెలిపింది. ఇది నేటికి అమలు కాలేదనడానికి పార్లమెంటే ప్రత్యక్ష సాక్షం. కాగా ఈ బడ్జెట్‌లో కుటుంబానికి రు. 5 లక్షల ఆరోగ్య భీమాని 50 కోట్ల మందికి ప్రయోజనం ఉంటుందని ఆర్భాటంగా జనారోగ్య ప్రకటన చేసింది.

రెండేళ్ల కిందటి ప్రకటనే అమలైతే పక్కనే ఉన్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎన్‌టిఆర్ వైద్య సేవ పేరిట, తెలంగాణ ప్రభుత్వం ఆరోగ్య శ్రీ పేరిట ఆరోగ్య భీమా పథకాలను తమ సొంత నిధులతో ఎందుకు అమలు చేస్తున్నట్లు. ముందు ప్రకటించిన ఆరోగ్య భీమా పథకం అమలు ప్రారంభం నేటికి కాలేదని కేంద్ర ప్రభుత్వ పెద్దలే పార్లమెంట్ సాక్షిగా రెండు నెలల క్రితమే ప్రకటించారు. కాగా ఈ బడ్జెట్‌లో ప్రకటించిన ఆరోగ్య భీమా పథకం కేవలం రాబోయే లోక్‌సభ ఎన్నికల జ్వరానికి ఆర్థిక మంత్రి ముందు చూపుతో చేసిన చికిత్సా ప్రకటనే తప్ప మరొకటి కాదన్నది నిష్టూర సత్యం. ప్రజారోగ్య వ్యవస్థ పటిష్టం చేయకుండా ఆరోగ్య భారత్‌ను నిర్మించడం అసాధ్యమవుతుంది. పేదలకు వైద్యం పేర వసూలు చేసే ప్రజాధనం సర్కారు దవాఖానలను బలోపేతం చేసే బదులు ప్రైవేట్, కార్పొరేట్ వైద్య రంగాన్ని పెంచి పోషిస్తున్నాయి. ఈ నేపథ్యంలో 2022 కల్లా కొత్తగా ఆరోగ్య భారత్‌ను నిర్మించే క్రమంలో కేంద్రం ఆయుష్మాన్ భారత్‌ను ప్రకటించి దేశ వ్యాప్తంగా ఉన్న లక్షన్నర వెల్‌నెస్ సెంటర్ల ఏర్పాటుకు 1200 కోట్లు కేటాయించారు. లక్షన్నర వెల్‌నెస్ సెంటర్లకు సగటున రు. 80 వేలు ఒక వెల్‌నెస్ సెంటర్‌కు కేటాయించి ఆ రు. 80 వేలతో ప్రాథమిక వైద్యం, మాతా శిశు ఆరోగ్య సమస్యలు, ఇతర సాధారణ వ్యాధులకు చికిత్సలు, అత్యవసర మందులు ఉచితంగా అందించాలి. స్టెతస్కోప్‌లు, స్ట్రెచర్‌లకు ప్రథమ చికిత్సా పరికరాలకు కూడా సరిపోని ఈ నిధులతో పైన ప్రకటించినవి ఎంత మేరకు సాధ్యమో ఆలోచించాలి.

ఇప్పటికైనా భారతదేశ జనాభాకు తగినంత మంది వైద్యులు, ఉత్పత్తికి కావలసిన వైద్య కళాశాలలు, వైద్య రంగంలో నైపుణ్యత కలిగిన డాక్టర్ల పెంపునకు కృషి చేయాల్సిన అవసరాన్ని గుర్తించాలి. దేశ వ్యాప్తంగా వైద్య కళాశాలల ఏర్పాటుకు నిధులు కేటాయించి, క్రమంగా ఆరోగ్య భాతర్ నిర్మాణానికి ప్రణాళికలు వేసుకోకుండా కేవలం ప్రకటనతో వైద్య ప్రగతి పల్లవినందుకోవడం హాస్యస్పదమే అవుతుంది. చిత్తశుద్ధి ఉంటే ప్రజారోగ్యాన్ని ప్రభుత్వాల ప్రథమ కర్తవ్యంగా భావించాలి. ఇప్పటికే ప్రభుత్వ పెద్దలు, పొలిటీసియన్స్, కార్పొరేట్ దిగ్గజాలు విదేశీ వైద్యానికి విమానాలెక్కడం మనం చూస్తూనే ఉన్నాం. స్వదేశీ వైద్య రంగం డొల్లతనం ఏమిటో ఇక్కడే బట్టబయలవుతుంది.

### విద్యా రంగం

దేశ యువత యావత్ జాతి కలిమిగా బలిమిగా రూపాంతరం చెందాలంటే మొత్తం విద్యా వ్యవస్థలో మౌలిక మార్పు రావాలి. మానవ వనరుల అభివృద్ధికి విద్యా రంగమే పునాది. 2022 నాటికి విద్యా రంగంలో (రైజ్) రివైటలైజింగ్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ అండ్ సిస్టమ్స్ ఇన్ ఎడ్యుకేషన్ కార్యక్రమాన్ని ప్రారంభిస్తామని గొప్పగా సెలవిస్తూ రాబోయే నాలుగు సంవత్సరాలలో లక్ష కోట్లు వెచ్చించి ఆరోగ్య సంస్థలతో పాటు ప్రఖ్యాత విశ్వవిద్యాలయాల్లో మౌలిక సదుపాయాలు, పరిశోధనలకై పెట్టుబడులు పెట్టేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తుందంటూ చెపుతూ ఈ బడ్జెట్‌లో కేవలం రు. 85,010 కోట్లు అంటే 2.6 శాతం నిధుల కేటాయింపు ఈ ప్రభుత్వ వైఖరికి దర్పణం పడుతుంది. ఇందులో ఉన్నత విద్యకు రు. 35,010 కోట్లు ఈ విదిలింపులతో 760 విశ్వవిద్యాలయాలు,

38 వేల కళాశాలలు, 12 వేలకు పైగా శిక్షణా సంస్థలను తీర్చిదిద్దే ప్రభుత్వ దార్శనికత ఎంత విడ్డూరం. రు. 50 వేల కోట్లు పాఠశాల విద్యకు కేటాయించింది.

గిరిజన ప్రాంతాల్లో ఏకలవ్య పాఠశాలలు ప్రారంభిస్తామంటూ చెప్పిన ఏలికలు డెబర్ కమిషన్ సూచించిన గిరిజన ఆశ్రమ పాఠశాలల బలోపేతానికి చర్యలను చూపలేదు. నేటికి ఉపాధ్యాయ విద్య గురించి సమగ్రంగా చర్చించకుండానే ఉపాధ్యాయుల కోసం సమీకృత బిఎడ్ కార్యక్రమాన్ని ప్రారంభించాలని పేర్కొంది. ఏడు దశాబ్దాల స్వతంత్ర భారతంలో యాభై శాతం ప్రభుత్వ పాఠశాలల్లో కనీసం మౌలిక వసతులు కల్పించని ఈ ప్రభుత్వ విధానం నేడు డిజిటల్ బోధనతో ముందుకొస్తున్నా మంటూ ఆశ్చర్య పరుస్తుంది. ముందస్తుగా శిక్షితులైన ఉపాధ్యాయులను సిద్ధం చేసే కార్య ప్రణాళికలను రూపొందించకుండానే డిజిటల్ పేరున విద్యా రంగాన్ని మరోమారు దెబ్బకొట్టనుంది. కామన్ స్కూల్ విధానమే భారతదేశ నిర్దిష్ట పరిస్థితులకు అనుకూలంగా ఉంటుందని పలు కమిటీలు నివేదించినప్పటికీ వాటిని పక్కకు నెట్టి విద్యా రంగంలో భిన్నత్వం చూపడం శోచనీయం. క్రమంగా ఈ అస్పష్ట అనాలోచిత, ప్రణాళికా రహిత విధానాలతో ప్రభుత్వ విద్యా రంగాన్ని కూడా కార్పొరేట్ శక్తులకు కట్టబెట్టేందుకే మార్గం సుగమం చేస్తుంది.

ఈ సంవత్సరం ప్రైం మినిస్టర్స్ రిసర్చ్ ఫెలోస్ పథకాన్ని ప్రారంభించి వెయ్యి మంది బిటెక్ విద్యార్థులను ఎంపిక చేసి ఐఐటి, ఐఐఎస్‌సిలలో పిఎచ్‌డిలు చేసేందుకు మంచి ఉపకార వేతనంతో పాటు అన్ని సదుపాయాలను కల్పించి దేశంలోని ప్రఖ్యాత ఐఐటి, నిట్‌లో 18 స్వయం ప్రతిపత్తి గల నూతన ప్లానింగ్, ఆర్కిటెక్చర్ స్కూల్ ఏర్పాటుకు ప్రణాళికలను సిద్ధం చేస్తున్నట్లు ప్రకటించింది. లక్షలాది మంది ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్లున్న ఈ దేశంలో వెయ్యి మందిని అంటే కోటికి ఎనిమిది మందిని ఎట్లా ఎంపిక చేస్తారో, వారి లక్ష్యం ఏంటో వారికే అర్థం కావాలి. ఇది కేవలం ఈ దేశ యువతను గారడి విద్యతో మభ్యపెట్టడం తప్ప గ్రాడ్యుయేట్ల జీవితానికి గమ్యం కాదనేది సుస్పష్టం.

**వేతన జీవులు – అల్పాదాయ వర్గాలు**

ఈ బడ్జెట్ ఆదాయ పన్ను విధానంలో సవరణలుంటాయని అందరు ఎదురు చూశారు. ఆదాయ పన్నుస్లాబు మారకపోవడం వేతన జీవులను నిరాశపరిచింది. ఆదాయం రెట్టింపైనా ద్రవ్యోల్బనం కారణంగా ఖర్చులు ఎక్కువగా ఉన్నాయి. వినియోగం, వినియోగానికి పన్నులు చెల్లించడే తప్ప పొదుపు చేసే పరిస్థితులు కనిపించడంలేదు. గత ప్రభుత్వం మాదిరిగానే ఈ ప్రభుత్వం కూడా ఉద్యోగులను విస్మరించింది. ఉద్యోగులకు రు. 2.5 లక్షల నుండి కనీసం 5 లక్షల వరకు పన్ను రాయితీ పెంచితే వెసులుబాటు ఉండేది. ప్రస్తుతం జీతాల్లో 40 శాతం వరకు పన్ను చెల్లిస్తున్నారు.

ఈ దేశంలో నిజాయితీగా పన్ను చెల్లించేది ఉద్యోగులే. వ్యాపారులు, పెట్టుబడిదారులు తమ పెట్టుబడి పోగా లాభాల మీద పన్ను చెల్లిస్తే ఉద్యోగులందరు తమకు వచ్చే వేతనాల మీద పన్ను చెల్లిస్తారు. పెట్టుబడిదారులకు వ్యాపారులకు పన్ను నుండి ఎట్లా మినహాయింపు ఉంటుందో ప్రభుత్వమే సెలవిస్తుంది. కాని ఉద్యోగులు మాత్రం పన్ను పరిధి నుండి తప్పించుకోలేరు. అందువల్ల ఉద్యోగులందరు పన్ను చెల్లించాల్సిందే. రు. 40 వేల స్టాండర్డ్ డిడక్షన్ ప్రకటించి ఉద్యోగులకు ఊరట కల్పించింది. లోతుగా చూస్తే ఇప్పటికీ ఉన్న టిఎ, మెడికల్ రీయంబర్స్‌మెంట్ స్థానంలో స్టాండర్డ్ డిడక్షన్ ప్రవేశపెట్టారు. ప్రస్తుతం ఉద్యోగులు రు. 19,200 వరకు టిఎ బిల్లులు, రు. 15 వేల వరకూ మెడికల్ బిల్లులు చూపి పన్ను మినహాయింపు పొందే అవకాశం ఉంది. అంటే రు. 34,200 స్థానంలో రు. 40 వేల స్టాండర్డ్ డిడక్షన్ అంటే నికరంగా 5800 మేరకు ఊరట లభించింది. గతంలో టిఎ, మెడికల్ బిల్లులు చూపిస్తేనే మినహాయింపు లభించేది. కాని ఇప్పుడు ఆ బిల్లులు చూపాల్సిన అవసరం లేకుండా నేరుగా రు. 40 వేలకు మినహాయింపు నిస్తారు.

ఈ బడ్జెట్‌లో విద్యా సుంకాన్ని 3 శాతం నుంచి 4 శాతానికి పెంచారు. ఈ విద్యా సుంకాన్ని ఎంతమేర ఖర్చు పెడుతున్నారో ప్రభుత్వం స్పష్టం చేయడం లేదు. ఆశ్చర్యమేమంటే కోట్లాది మంది వేతన జీవుల గురించి ఆలోచించకుండా పిడికెడు మంది ప్రజా ప్రతినిధుల వేతనాల గురించి సీరియస్‌గా ఆలోచించి ద్రవ్యోల్బణం ఆధారంగా ప్రతి 5 సంవత్సరాల కొకసారి జీతాలను ఆటోమెటిక్‌గా సవరించేందుకు కొత్త చట్టాన్ని తెచ్చింది. రాష్ట్రపతి మొదలుకొని పార్లమెంట్ సభ్యుల వరకు తమ వేతనాలను, అలవెన్సులను భారీగా పెంచుకోవడంలో వచ్చిన ఏకాభిప్రాయాన్ని కుటిల రాజకీయాలను దేశ ప్రజలందరూ చర్చిస్తున్నారు.

**రైల్వే బడ్జెట్**

92 సంవత్సరాల నుండి రైల్వే బడ్జెట్‌ను విడిగా ప్రవేశపెట్టే బ్రిటిష్ సంప్రదాయానికి గత ఏడాది ముగింపు పలికి కేంద్ర బడ్జెట్‌లో కలపడం తెలిసిందే. రైల్వే బడ్జెట్ ప్రత్యేకంగా ఉన్నప్పుడు రైల్వే ఆదాయ వ్యయాలు ప్రణాళికలతో పాటు చేపట్టే కార్యక్రమాలు స్పష్టంగా తెలిసేవి. నేడు ఇతర శాఖల మాదిరిగానే రైల్వే శాఖను కూడా సాధారణ బడ్జెట్‌లో కేటాయింపులు చేస్తున్నారు. ప్రతి రాష్ట్రానికి అమలయ్యే రైల్వే అభివృద్ధి పనుల విషయంలో అవగాహన ఉండేది. ఈ అవకాశం ఇప్పుడు లేదు.

2018–19 ఆర్థిక సంవత్సరంలో రు. 1,48,528 కోట్లు కేటాయించారు. ఈ కేటాయింపులతో 4 వేల కిలోమీటర్ల కొత్త రైల్వే ట్రాక్ నిర్మాణం, అన్ని రైళ్లలో సిసి టివిలు, ఇతర ఆధునిక వసతులు, ప్రతిరోజు 25 వేలకు పైగా మంది రాకపోకలు సాగించే రైల్వే స్టేషన్స్‌లో ఎస్కలేటర్లు, దేశ వ్యాప్తంగా 600 ప్రధాన రైల్వే స్టేషన్ల అభివృద్ధి చేయాలని నిర్ణయించారు. కేటాయించిన నిధులతో ఇవి ఏమేరకు సాధ్యమో ఆచరణలో తేలిపోతుంది.

ఈ దేశంలో అతిపెద్ద ప్రభుత్వ రంగ సంస్థ అయిన రైల్వేలను కాపాడాల్సిన బాధ్యత ఈ ప్రభుత్వాల తక్షణ కర్తవ్యం. రైల్వేలు సరిగ్గా పనిచేయని రోజు కోట్లాది మందికి రవాణా సౌకర్యంతో పాటు, జీవనోపాధి కోల్పోతారు. రైల్వే వ్యవస్థను బలోపేతం చేసేందుకు తీసుకున్న చర్యలు మరింత విడ్డూరంగా ఉన్నాయి. ప్రయాణికులకు సౌకర్యవంతమైన, విలాసవంతమైన అనుభూతి కోసం ప్రపంచ శ్రేణి రైళ్లను అందుబాటులోకి తేవాలనే ప్రభుత్వ ప్రటకన అమలు జరగాల్సిన అవసరముంది.

రైల్వే బడ్జెట్‌లో కూడా తెలంగాణ రాష్ట్రానికి మరింత నిరాశను మిగిల్చింది. విభజన హామీల్లో ప్రధానమైన కాజీపేట కోచ్ ఫ్యాక్టరీ ఊసులేదు. తెలంగాణలో ఆరు స్టేషన్లను ఆదర్శ స్టేషన్లుగా ఖమ్మం, వరంగల్, కాజీపేట, మంచిర్యాల స్టేషన్లను ఎ-1 స్టేషన్లుగా అభివృద్ధి చేస్తామన్న ప్రకటనను మరిచిపోయారు. వనపర్తి, డోర్నకల్, లింగంపలి, కాజీపేట, ఆదిలాబాద్, నిజామాబాద్ స్టేషన్లకు ఓవర్ బ్రిడ్జిలను నిర్మించాలని ప్రకటించారేతప్ప నిధుల ప్రకటనలలో అస్పష్టతే కనిపిస్తుంది.

**రక్షణ రంగం**

మొత్తం బడ్జెట్‌లో గత సంవత్సరం కంటే 7.81 శాతం అధిక నిధులతో రు. 2.95 లక్షల కోట్లు రక్షణ రంగానికి కేటాయించారు. దీనితో ఈ రంగం వాటా 12.10 శాతం. ఈ మొత్తంలో త్రివిధ దళాలకు కొత్త ఆయుధాలు, విమానాలు, యుద్ధ నౌకలు ఇతర సామాగ్రి కొనుగోలుకు రు. 99,947 కోట్లు, రెవెన్యూ ఖర్చుగా రు. 1,95,947 కోట్లుగా ప్రతిపాదించారు. రక్షణ సిబ్బంది పెన్షన్ల కోసం మరో రు. 1,08,853 కోట్లు ప్రత్యేకంగా కేటాయింపులున్నాయి. గతేడాది 57 శాతం సైన్యానికి, 22 శాతం వాయుసేనకు, 14 శాతం నావికా దళానికి మిగిలిన 7 శాతం రక్షణ పరిశోధన అభివృద్ధి కోసం కేటాయించారు. ఇలా మన బడ్జెట్‌లో కేటాయించినదంతా రక్షణ కోసమేనని చెప్పుకోవడానికి లేదు. నిజానికి రక్షణ అవసరాలన్నీ అంతర్గతంగా మరో మార్గాల నుంచి పొందుతున్న స్థితి ఉంది. అలాగే వివిధ రాష్ట్రాల్లో జరిగే గిరిజన, వేర్పాటు వాద ఉద్యమాల నుంచి రక్షణ కల్పిస్తున్న సిఆర్‌పిఎఫ్ బలగాలకు లక్షా డెభైవేల కోట్లు కేటాయించడం జరిగింది. వీటికి తోడు ఇతర బలగాలకు మన ప్రభుత్వాల ఖర్చు నుంచే వెచ్చించడం జరుగుతున్నది. ఈ నేపథ్యంలో వాస్తవంగా దేశ రక్షణ రంగంలో వ్యయం చేస్తున్నది, కేటాయిస్తున్నది ఎంత అన్నది చూడాల్సిన అవసరముంది. ఇది మొత్తం కలిస్తే 4 లక్షల కోట్లకు దాటుతుంది. మొత్తం కేటాయింపుల్లో ఐదో భాగం.

దేశంలో 38 శాతం మంది పిల్లలు సరైన పౌష్టికాహారం లేక ప్రాణం నిలుపుకోవడానికి అల్లాడుతున్నారు. దేశంలో మూల మూలనా బాలల పరిస్థితి ఇలా ఉంటే, ప్రపంచంలోనే అతిపెద్ద ఆయుధాల దిగుమతి దారుగా భారత్ అగ్ర భాగాన నిలిస్తే ఆ బాలలకు ఈ దేశం ఇచ్చేదేమిటి? ఎముకలు తేలిన అస్థి పంజరాలకు ఎకె ఫార్టీ సేవన్‌లు తగిలించి యుద్ధం చేయమంటుందా? దేశం అంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్ అన్న గురజాడను గమనిస్తే మట్టిని కాపాడుకోవడానికా ప్రభుత్వాలు మనుషుల్ని కాపాడుకోవడానికా? తేల్చుకోవాలి. మనిషి లేని మట్టి దేనికి? కనీస పౌష్టికాహారం అందించడానికి లేని నిధులు రక్షణ కోసం దేనికి ఎంతకి అర్థం కాని ప్రశ్న ఇది. కుప్పలు తెప్పలుగా ఆయుధాలను పోగు చేసుకోవడమే దేశ రక్షణ అయితే దేశంలోని భవిష్యత్ తరాల కోసం ఎంత శక్తిని పోగేసుకోవాలి ఆలోచించుకోవాలి. స్టాక్ ఆర్ ఇంటర్‌నేషనల్ పీస్ రిసర్చ్ ఇనిస్టిట్యూట్ అధ్యయనం ప్రకారం 2012-16 మధ్య పెద్ద తరహా ఆయుధాల దిగుమతిలో భారత్ ప్రపంచంలోనే అగ్ర స్థానంలో ఉంది. ప్రపంచం మొత్తం మీద ఆయుధ దిగుమతిలో 13 శాతం మనదేశమే దిగుమతి చేసుకుంటుంది. ఆయుధాల దిగుమతిలో ముందున్నప్పటికీ ఆయుధాల వినియోగం నేటికీ రాలేదు. కాని 59 వేల కోట్లు వెచ్చించి 36 కొత్త యుద్ధ విమానాలను కొనుగోలు చేశారు. గతేడాది చైనాతో డొక్లాంలో ఏర్పడిన ఉద్రిక్తతల నేపథ్యంలో అలాంటి అవసరం ఏర్పడుతుందా అన్న భావాన్ని ప్రభుత్వం కల్పించినప్పటికీ సమస్య సామరస్యంగా పరిష్కారం కావడం మంచి పరిణామమే. నిజానికి గత నలభై సంవత్సరాలలో భారత్-చైనా సరిహద్దుల్లో మన రక్షణ దళాలు ఒక్క బుల్లెట్‌ను కూడా కాల్చలేదు. రాఫెల్ యుద్ధ విమానాల లెక్కలు నేటికీ పార్లమెంట్‌లో రగడలేపుతూనే ఉన్నాయి. మరి అలాంటప్పుడు మనదేశం కొత్త ఆయుధాల కోసం ఎందుకు వెంపర్లాడుతున్నట్లు? దీని వెనుకున్న మతలబ్ ఏమిటి? మరోవైపు మన పాలకులు 'మేక్ ఇండియా' గురించి ఉపదేశాలేనా? ఆచరణ లేదా అన్నది చర్చించాలి. అనేక అధ్యయనాల ప్రకారం మన ప్రభుత్వాలు ప్రజలకు అవసరమైన కనీస సౌకర్యాలు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, పాఠశాలలు, కళాశాలలు, వైద్యశాలల నిర్మాణం కన్నా బాంబుల తయారికి, ఆయుధ సంపత్తికి ఎందుకో అధిక ప్రాధాన్యత ఇస్తున్నాయన్న భావన సగటు మనిషి మదిని తొలుస్తుంది.

**అప్పుల భారతం**

దేశం ఎడాదికేడాది అప్పుల ఊబిలో కూరుకుపోతోంది. ఇప్పుడే పుట్టిన శిశువు నెత్తిన సహితం దాదాపుగా రు. 75 వేల అప్పు పడుతుంది. వ్యవసాయ రంగం స్వయం సమృద్ధి సాధించి, పారిశ్రామిక రంగంలో అభివృద్ధి చెందుతున్న దేశాలతో పోటీపడుతున్న భారత్ అప్పుల భారాన్ని మాత్రం తగ్గించుకోలేకపోతుంది. తాజాగా కేంద్ర బడ్జెట్ గణాంకాల ప్రకారం దేశం మొత్తం రుణం దాదాపు రు. 90 లక్షల కోట్లు. భారీ స్థాయిలో ఉన్న ఈ రుణం ఒక్క ఎత్తయితే ఈ అప్పులు ఏటికేడు గణనీయంగా పెరగడం మరో ఎత్తు. ప్రపంచ ఆర్థిక శక్తిగా చైనాతో పోటీ పడుతున్న మనదేశం రుణాల అదుపు చేసే చర్యలు తీసుకోకపోవడం విచారకరం. ఏవో కొన్ని ఆర్థిక సంవత్సరాలను మినహాయిస్తే దాదాపుగా ఏటా మన రుణాల్లో పెరుగుదలే ఉంటోంది. ఇది మన పటిష్టమైన ఆర్థిక వ్యవస్థకు ఇబ్బందులను సృష్టిస్తుంది. ఈ కింది పట్టిక మన అప్పుల భారతాన్ని విశదపరుస్తుంది.

| సంవత్సరం | మొత్తం అప్పు (కోట్లలో) |
|---|---|
| 2013-14 | 56,76,181 |
| 2014-15 | 62,78,854 |
| 2015-16 | 68,94,991 |
| 2016-17 | 73,14,991 |
| 2017-18 | 82,32,653 |
| 2018-19 | 89,58,193 |

**ఈ బడ్జెట్‌లో తెలంగాణకేం దక్కింది?**

రాష్ట్ర విభజన సందర్భంగా ఇచ్చిన హామీలు నాలుగు సంవత్సరాలైనా కార్యరూపం దాల్చకపోవడం బాధాకరం. తెలంగాణ రాష్ట్ర ప్రజల జీవన గమనాన్ని రాష్ట్ర ఆర్థిక సామాజిక చిత్ర పటాన్ని మార్చే కీలక ప్రాజెక్టులకు నయా పైసా ఇవ్వలేదు. కాళేశ్వరం ప్రాజెక్టు నిర్మాణం కోసం రు. 10 వేల కోట్లతో కలిపి వివిధ ప్రాజెక్టులకు మొత్తం రు. 40 వేల కోట్ల ఆర్థిక సహకారం అందించమని అభ్యర్థించిన తెలంగాణకు రు. 2085

# పేదల బడ్జెట్లా? పెద్దల బడ్జెట్లా?

***బడ్జెట్‌లలో విలాస వస్తువుల మీద ధరలు పెరిగినా అవి సామాన్యులకు అవి ఎలా భారమవుతాయో చూపుతూ విలాస వస్తువులకూ సామాన్యులకూ మధ్య ఉండే సంబంధాన్ని వివరిస్తున్నారు* వి.వెంకట్రావు**

'విమాన చార్జీలు పెరిగాయి, ఎ.సి రైలు చార్జీలు పెరిగాయి'

'పోనీలే మనం విమానం ఎక్కాలా? ఎ.సి. రైలు ప్రయాణం చెయ్యలా? అదంతా పెద్ద వాళ్ల వ్యవహారం.'

'పెట్రోల్ ధరలు పెరిగాయి'

'కాళ్ల సత్తువే మన పెట్రోలు. కార్లు, బళ్లు వున్న వాళ్లు బాధ పడాలి'

'ఫ్రిజ్‌లూ, ఎ.సి.లూ పెరిగాయి'

'అన్నీ...పెద్దవాళ్లు వాడేవే...ఈసారి పేద, మధ్యతరగతి వాళ్లు వాడే వస్తువుల జోలికి రాలేదు' అని కొత్త బడ్జెట్ రాకతో సంబరపడి పోతుంటారు కొంతమంది. అందులో వాస్తవమెంత? వాళ్లు అభిప్రాయ పడినట్లు, అదంతా పెద్దవాళ్ల వ్యవహారమేనా? విమాన చార్జీలు పెరగడానికీ, పేదవాడికీ ఏమీ సంబంధం లేదా? కాస్త వివరంగా చూడాలి.

మనం ఎప్పుడూ విమానం ఎక్కక పోవచ్చు. కనీసం జీవితంలో ఒక్కసారి కూడా విమానం ఎక్కలేక పోవచ్చు. పైన వివరించిన ధరల పెరుగుదలైన వస్తువులు వాడకపోవచ్చు. కానీ...నిత్య జీవితంలో అనేక ఇతర వస్తువులు వాడుతుంటాం. ఉదయం లేచి బ్రషూ, టూత్ పేస్టూ దగ్గర నుండి రాత్రి పడుకునే ముందు ఆన్ చేసే దోమల మందు వరకూ ఎన్నో వస్తువులు వాడుతుంటాం. వాటి పెరుగుదలకూ, పైవాటి పెరుగుదలకూ ఏమైనా సంభందం వుందా? వుంటే... అదేమిటి? అదీ కావలసింది. అదేమిటో చూడాలంటే, వస్తువుల ధరలు ఎలా నిర్ణయం అవుతాయో చూడాలి. ఏ వస్తువు తయారవ్వాలన్నా, ముడిపదార్థాలూ, శ్రమపరికరాలూ, శ్రమ చేసే శ్రామికులూ ఇవి ప్రధానంగా కావలసినవి. ఒక్కొక్కటి చూసుకొని వెళదాం. మొదట ముడిపదార్థాలు...మనం అనేక వస్తువులు వాడతాం కాబట్టి అన్నిటికీ ప్రతినిధిగా 'వస్తువు' అందాం.

---

కోట్లు అంటే 5 శాతం నిధులను కేటాయించింది. ఇందులో రు. 2000 కోట్లు సింగరేణికే. హైదరాబాద్ ఐఐటికి 75 కోట్లు కాగా తెలంగాణలో గిరిజన యూనివర్సిటీకి రు. 10 కోట్లు కేటాయించింది. ప్రధాని ప్రశంసించింది ప్రపంచమే మెచ్చుకున్నదన్న ఇంటింటికి తాగు నీరందించే మిషన్ భగీరథకు కాని, దేశ ప్రజలందరి మన్ననలు పొందిందని రాష్ట్ర పాలకులు చెప్పే మిషన్ కాకతీయకు కాని అద్భుత ప్రపంచ స్థాయి ఇంజనీరింగ్ రూపశిల్పులు రూపొందించే కాళేశ్వరం ప్రాజెక్టుకు జాతీయ హోదా రాకపోవడం, బయ్యారం ఉక్కు కర్మాగారానికి చివరగా తెలంగాణ ఎయిమ్స్‌కు కనీసం కేటాయింపులు లేకపోవడం సమాఖ్య విధానానికి విఘాతంగా అర్థం చేసుకోవచ్చు. తెలంగాణ రాష్ట్రం నుంచి కేంద్రానికి పన్నుల వసూళ్ల రూపంలో రు. 30 వేల కోట్లకు పైగా చేరుతున్నా అత్యంత కీలకమైన ప్రాజెక్టులకు నిధులు రాకపోవడానికి రాష్ట్రాల నుండి రాజకీయ లబ్ధిని ఆశించే కేంద్ర ప్రభుత్వ వైఖరికి ఈ బడ్జెట్ అద్దం పడుతుంది.

**ముగింపు**

గతంలో బడ్జెట్ అనగానే తీవ్రమైన ఉత్కంఠ. ఏ వస్తువుల ధరలు పెరుగుతాయి? ఏ ఏ వస్తువుల ధరలు తగ్గుతాయి? దేశీయ మార్కెట్‌కు దేశీయ ఉత్పత్తికి ఊతమిచ్చే క్రమంలో దిగుమతి చేసుకునే వస్తువులపై కస్టమ్స్ డ్యూటీని ఏ మేరకు పెంచుతారోనని ఆందోళనతో సామాన్య ప్రజలు మొదలుకొని మధ్యతరగతి, వేతన జీవులు, పారిశ్రామిక వేత్తలతో పాటు ధనవంతులు సహితం ఎదురుచూసేవారు. కాని ఇప్పుడు బడ్జెట్‌లో కీలకమైన నిర్ణయాలు స్వల్పంగా ఉంటున్నాయి. ఎప్పటికప్పుడు నిర్ణయాలు ప్రకటించడం వల్ల బడ్జెట్‌లో నూతన ఆవిష్కరణలు తగ్గిపోతున్నాయి. ఒకే దేశం ఒకే పన్ను నినాదంలో పరోక్ష పన్నులన్నింటిని జిఎస్‌టి కిందికి తీసుకొచ్చారు. జిఎస్‌టి స్లాబు రేట్లలో మార్పు, ఏ స్లాబులో ఏ వస్తువులను తీసుకురావాలనేది పూర్తిగా జిఎస్‌టి కౌన్సిల్ పరిధిలోని అంశం. అందువల్ల బడ్జెట్‌లో పన్ను హెచ్చు తగ్గుల ప్రస్తావన కేవలం నామ మాత్రమే. ప్రస్తుతం కస్టమ్స్ పన్నుల్లో మార్పులు, సర్ చార్జీలు, సెస్‌ల విధింపునకు మాత్రమే పరిమితం కావాల్సిన స్థితి. ఐనప్పటికీ వ్యక్తిగత ఆదాయ పన్ను, వ్యాపార సంస్థలు చెల్లించే కార్పొరేట్ పన్ను, సంపద పన్ను ప్రత్యక్ష పన్నుల పరిధిలోకి వస్తాయి. ఆదాయ పన్ను స్లాబుల్లో మార్పుల పరిధిలో హెచ్చు తగ్గులు ఏమైనా ఉంటే వాటి ప్రస్తావన మాత్రమే వర్తమాన బడ్జెట్‌లో కనిపిస్తుంది. గతంలో ప్రణాళికా ప్రణాళికేతర వ్యయాలుండేవి. ప్రణాళికా వ్యయం అంటే మూలధన వ్యయంగా, ప్రణాళికేతర వ్యయం అంటే రెవెన్యూ ఖర్చులుగా భావించేవారు. గత బడ్జెట్ నుండి ప్రణాళికా, ప్రణాళికేతర వ్యయాల భావనలను తొలగించినారు.

ప్రధానంగా, ప్రస్తుతం కేంద్ర బడ్జెట్ జమ, ఖర్చుల లెక్కకు పరిమితం అవుతుంది. ఆదాయం ఎంత ఖర్చు ఎంత అనే లెక్కలు మాత్రమే బడ్జెట్‌గా మారింది. సమీప భవిష్యత్‌లో బడ్జెట్ అనేది పెద్ద సందర్భంగా ఉండకపోవచ్చు, ఇతర బిల్లులు, చట్టాల మాదిరిగానే బడ్జెట్ కూడా ఏటా ఒకసారి వచ్చిపోయేదిగా మారే పరిస్థితి, దుస్థితి కనిపిస్తుంది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ విశ్వవిద్యాలయం)* వీ

ఏ వస్తువు ధర అయినా అది పడే ఉత్పత్తి ధరను బట్టే, అమ్మకం ధర నిర్ణయమవుతుంది. ఆ వస్తువు ధర పన్నెండు. ఇందులో ముడి పదార్థాలు ఆరు. శ్రమ పరికరాలు రెండు. కార్మికుల జీతాలు నాలుగు అనుకుందాం. ఇవన్నీ కాకి లెక్కలు. ఉదాహరణ కోసం. విషయాన్నీ అర్థం చేసుకోవడానికే.

ఇక్కడ ముడి పదార్థాలు అంటే...ఆ విభాగంలో అనేకం ఉంటాయి. రవాణా, స్టోరేజ్, వర్తక కమీషనూ, విద్యుత్, పన్నులూ, ఇంకా ఇతర ఖర్చులూ అన్నీటినీ కలిపే ముడి పదార్థాలు అంటున్నాం. ఒక వస్తువు తయారీలో ఎంత చిన్న అవసరమైనా, అగ్గిపుల్ల అవసరమైనా సరే దాని ధర కూడా కలపాల్సిందే. రవాణా సంగతి చూద్దాం. వస్తువు తయారికి కావలిసిన ముడి పదార్థాలు కావాలి. ఎక్కడ దొరుకుతాయి? కంపెనీ గోడ పక్కనే ఉంటాయా? అలా ఉన్నాసరే ఎవరో ఒకరు తీసుకు రావాల్సిందే. తీసుకువచ్చే వాళ్లకు కొంతజీతం ఇవ్వాల్సిందే. అంతేతప్ప, ఎగురుకుంటూ రావు. కానీ...అవి ఎక్కడో ఎక్కడో వేరే ప్రదేశంలో ఉంటాయి. అక్కడ నుండి తయారయే ప్రదేశానికి రావాలి. రావాలంటే బస్సూ, రైలూ, లారీ ఎలాగో ప్రయాణించి రావాలి.

ఇప్పుడు కొత్త బడ్జెట్ వచ్చింది. పెట్రోల్ ధర పెరిగింది. పెట్రోల్ ధర పెరిగింది కాబట్టి, రవాణా చార్జీ పెరిగింది. అలాగే తయారయిన సరుకు అమ్మకానికి వేరే ప్రదేశానికి వెళ్లాలి. మళ్లీ రవాణా. ధర పెరిగింది. అంతేకాదు. ఈ ముడి పదార్థాల నాణ్యతను పరిశీలించాలంటే, యజమాని గానీ...అతని ప్రతినిధి గానీ.. కాస్త పైస్థాయి వాళ్లు వెళ్లాలి. వెళ్లాలంటే ఎలా వెళతారు. గతం కన్నా చార్జీలు పెరిగాయి అని, జనరల్ బోగీలో నిలబడి ప్రయాణం చేసుకొని వెళతారా? లేదు, విమానంలో గానీ..ఎ.సి రైల్లో గాని వెళతారు.

ఇప్పుడు కొత్త బడ్జెట్ వలన, గతం కన్నా చార్జీలు పెరిగాయి. పెరిగిన చార్జీలు వస్తువు ధరలో కలుస్తాయి. ఖర్చులు అనే పేరుతో. పోనీ పెట్రోల్ ధర పెరగలేదు గానీ...విద్యుత్ యూనిట్ ధర పెరిగింది అనుకుందాం అప్పుడు రవాణా ఖర్చు అలాగే ఉంటుంది. గానీ....ఈసారి విద్యుత్ ఖర్చు పెరుగుతుంది. ముందు ముడిపదార్థాలు ఆరు అని వేశాం కదా! పెరిగిన తరవాత ఒక అర కలుపుదాం. ఇప్పుడు ముడి పదార్థాల ధర ఆరున్నర అయ్యింది.

ఇక రెండో విషయం శ్రమ పరికరాలు. ఇవి యంత్రాలు. యంత్రాలు ఎప్పుడో కంపెనీ ప్రారభించినపుడు కొంటారు. కాబట్టి పెట్రోల్ ధర పెరిగినా సంబంధం లేదు అనుకోకూడదు. యంత్రాలు కొనకపోయినా వాటి నిర్వహణ ఉంటుంది. దానికోసం ఇంజినీర్ల పర్యవేక్షణ ఉంటుంది. విడిభాగాల కొనుగోళ్లు ఉంటాయి. అవి కొంత దూరం ప్రయాణం చేసి రావాలి. వాటి ధరపెరుగుతుంది. అవసరమైతే దూర ప్రదేశాల నుండి నిపుణులని తెప్పిస్తారు. వాళ్ల ప్రయాణ చార్జీలు పెరుగుతాయి. అవి కూడా కలపాలి. కలిపితే...అదొక అర అనుకుందాం.

ఇప్పుడు వస్తువు ధర పదమూడు అయ్యింది. ఇలాంటివన్నీ వస్తువు ధర పెరగడానికి కారణం అవుతాయి. ఇక కార్మికుల జీతాలు. ఇది చివరలో చూద్దాం.

అయితే ఇక్కడ ఒక ప్రశ్న వస్తుంది. ఎప్పుడు కొత్త బడ్జెట్ వచ్చినా వెంటనే, అన్ని వస్తువుల ధరలూ పెరగాలి కదా! అన్నీ అలా పెరుగు తున్నాయా? లేదు, కొన్నే పెరుగుతాయి. అలా ఎందుకు జరుగుతున్నాయో కూడా ఆలోచించాలి. వస్తువు ధర పెరగడానికి అవసరమయ్యే ఇతర అంశాలు ఉన్నప్పటికీ ఒక్కోసారి ధర పెరగపోవచ్చు. అదెలాగంటే...

కొన్ని వస్తువుల ధర సప్లయ్ డిమాండ్‌ను బట్టి అసలు ధర కన్నా ఎక్కువ తక్కువలు జరుగుతుంటాయి. అలాంటి హెచ్చు తగ్గులు మనం కాయగూరల్లో ఎక్కువగా చూస్తుంటాం. ఉదాహరణకి టమాటాలు ఎక్కువగా వచ్చాయనుకుందాం. అప్పుడు సప్లయ్ ఎక్కుగా ఉండడం చేత టమాటా ధర తగ్గుతుంది. టమాట పచ్చళ్ల తయారికీ టమాటా ముడి పదార్థం. అలాంటి సందర్భాలలో ఇతర ఖర్చులు పెరిగినా, ముడి పదార్థం ధర తగ్గడం వలన వస్తువు ధర పెరగదు.

అలాగే, కొన్ని వస్తువుల తయారీలో కొత్త యంత్రాలు ప్రవేశిస్తాయి. వాటి రాక వలన ఉత్పత్తి పెరిగి, సగటున ఒక్కో వస్తువు ఉత్పత్తి ధర తగ్గుతుంది. పైగా కొత్త యంత్రాల రాక వలన కార్మికులు తగ్గుతారు. అంటే వాళ్లకి ఇవ్వవలసిన జీతాలు తగ్గుతాయి. తక్కువమంది తోనే మొత్తం ఉత్పత్తి తయారైయిపోతుంది. లేదా ఎక్కువ కూడా జరగవచ్చు. అలాంటి సందర్భాలలో ఇతర ఖర్చులు పెరిగినా వస్తువు ధర పెరగదు.

అలాగే ఒకే రకమైన సరుకుల మధ్య పోటీ ఉంటుంది. ధర పెంచితే అమ్మకాలు తగ్గుతాయి అనే భయం ఉంటుంది. అలాంటి సందర్భాలలో కూడా ధర పెరగక పోవచ్చు. ఇన్ని కారణాలవలన కొన్ని వస్తువుల ధర పెరగకపోవచ్చు. అన్నిటి విషయంలోనూ అలా జరగదు.

ఈ సందర్భంలో మనం అర్థం చేసుకోవలసింది ఏమిటంటే, ఒక వస్తువు ధర పెరగడానికి ఉత్పత్తి ధర పెరగడమే. ఉత్పత్తిధర పెరగడానికి దాని తయారీకి కావలసిన ఇతర వస్తువుల ధరలు పెరగడమే. అంటే...బడ్జెట్లలో ఏ ఒక్క ధర పెరిగినా దాని ప్రభావం అన్నిటి మీదా ఉంటుంది. ఇదంతా ఒకదానితో ఒకటి సంబంధం కలిగి ఉన్న సమిష్టి వ్యవహారం, అనే విషయాన్నీఅర్థం చేసుకోవాలి.

ఇప్పుడు మూడో విషయం. 'కార్మికుల జీతాలు' అని మనం అన్నాం గానీ 'లాభం' సంగతి మాట్లాడలేదు. మన లిస్టులో కార్మికుల జీతాలు నాలుగు అని వేసాము. నిజానికి మొత్తం నాలుగు కార్మికులకే చెందాల్సి ఉన్నప్పటికీ అతనికి దక్కేది రెండే. మిగతా రెండూ లాభం రూపంలో యజమానికి పోతుంది.

ఈ 'రెండు' లో నుండే అతను ఏం ఖర్చుపెట్టినా సరే. ఈ రెండు మాత్రం తగ్గదు. విమాన చార్జీలు పెరిగినా, రాకెట్ ధర పెరిగినా, అతనికి బుద్ధి పుట్టి చంద్రమండలం మీదకు విహార యాత్రకు వెళ్లినా అన్నీ రెండులో నుండే. అంటే కార్మికులకు వెళ్లవలసిన దాంట్లో నుండే. బడ్జెట్ గురించి మనం అర్థం చేసుకోవలిసింది మార్కెట్లో ధర పెరిగినా దాన్ని భరించవలసినది పేదవాడే.

ఇక్కడ మరొక విషయం. నిత్య జీవితంలో అనేక వస్తువులు వాడుతుంటాం. వాటి ధరలు పెరిగినా మరో వైపు జీతాలు పెరుగుతాయి కదా! మరేమిటి ఇబ్బంది. అనుకోవచ్చు. దాన్నే మరోరకంగా చూడవచ్చు. జీతాలు పెరిగితే మాత్రం ఏమిటి ప్రయోజనం ధరలు పెరిగాయి కదా! అంటే, కథ మొదటికి వచ్చినట్లే కదా! మొత్తంగా చూస్తే ఎన్ని బడ్జెట్లు వచ్చినా పేద, మధ్యతరగతికి ఒరిగేదేమిలేదు.

*(రచయిత దర్జీ)* వీ

# బడ్జెట్ పద్దులు నీటి మూటలే!

*వచ్చే ఏడాది ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని మోదీ సర్కార్ ఈ ఏడాది బడ్జెట్‌ను ప్రవేశపెట్టిందనీ, ఇందులో కూడా సామాన్య ప్రజలకు పెద్దగా ఒరిగిందేమీ లేదనీ అంటున్నారు* **షేక్ కరిముల్లా**

అచ్చేదిన్ వారీ కలర్‌ఫుల్ ఎన్ని'కలల' బడ్జెట్ (2018-19) అరుణ్ జైట్లీ ప్రవేశపెట్టారు. అసలే ఎన్నికల సంవత్సరం కదా వాగ్దానాల హోరు అంతా ఇంతా కాదు. అందరికీ ఆరోగ్యమే లక్ష్యం అన్నారు. దేశ వ్యాప్తంగా 10 కోట్ల పేద కుటుంబాలకు ఆరోగ్య భీమా అన్నారు. రైతులకు కనీస మద్దతు ధర ఇస్తాం అన్నారు. 4 కోట్ల కుటుంబాలకు ఉచిత విద్యుత్ కనెక్షన్‌లు అన్నారు. ఎల్‌కెజి నుండి 12వ తరగతి వరకు ఉచిత విద్య అన్నారు. గిరిజన ప్రాంతాలలో ఏకలవ్య స్కూల్స్ అన్నారు. మహిళల జీవితాల్లో వెలుగులు నింపుతామని, బడ్జెట్‌లో మహిళలకు పెద్దపీట వేశామన్నారు. వైఫై రైళ్లు అన్నారు.

ఇక వచ్చే ఏడాది ఎన్నికలే లక్ష్యంగా గ్రామీణ ఓటర్లకు గాలం వేస్తూ, మొత్తం బడ్జెట్‌ను గ్రామీణ భారతం చుట్టూ తిప్పారు. మధ్య తరగతి వేతన జీవుల ఆశలపై నీళ్లు చల్లారు. తెలుగు రాష్ట్రాలకు మొండిచేయి చూపించారు. కార్పొరేట్లకు రాయితీలు ఇస్తూ వరాలు ప్రకటించారు. సామాన్య ప్రజలపై భారాలు మోపారు. మొత్తానికి ఎన్నికల 'మాయల మరాఠీ గారడి' బడ్జెట్‌ను జైట్లీ ప్రవేశ పెట్టారు.

కాస్త లోతుకెళ్లి చూస్తే బడ్జెట్‌లో చెప్పే అంకెలు వేరు, తరువాత కేటాయించే అంకెలు వేరు. ఈ కేటాయింపులోంచి వాస్తవంగా ఖర్చు పెట్టేది వేరు. అంతా 'మాయల ఫకీరు టక్కుటమార గారడీ విద్యలు' తప్ప ఇందులో వాస్తవం లేదు. ఇంకా ఎన్నాళ్లీ మోసం? అసలు బడ్జెట్ అంటే, స్థూలంగా ఒక ఆర్థిక సంవత్సరంలో ప్రభుత్వ ఆదాయ వ్యయం సర్కారు ఆర్థిక విధాన పత్రం. దేశ వార్షిక ఆర్థిక నివేదిక. ఈ సంవత్సర కాలంలో భారత ప్రభుత్వం చేసే ఆదాయ వ్యయాల వివరాలు బడ్జెట్‌లో ఉంటాయి. ప్రభుత్వం ప్రజల నుంచి పన్నులు, ఇతరత్రా రూపంలో వసూలు చేసిన ధనాన్ని వారి ప్రయోజనాల కోసం ఎలా వినియోగించ బోతున్నదో వివరించే కార్యాచరణ ప్రణాళిక. ఇందులో రాజ్యాంగ ఆశయాలైన ఆర్థిక, రాజకీయ, సామాజిక న్యాయం సాధించాలనే అంశం ఇమిడి ఉంది. ప్రజా సంక్షేమమే పరమావధిగా భావించి, సత్వర సామాజిక ఆర్థికాభివృద్ధిని సాధించాలి.

అందుకే 1950లో 'ప్లానింగ్ కమిషన్'ను ఏర్పాటు చేసి, 1951 నుంచి పంచవర్ష ప్రణాళికలను అమలు చేశారు. ఇప్పటి వరకు 12 పంచవర్ష ప్రణాళికలను అమలు చేశారు. కానీ ఈ ఆశయాలు సాధించలేదు. ప్రజల బతుకులు బాగుపడలేదు. పైగా పార్లమెంట్ చట్టం ద్వారా ఏర్పడిన ప్రణాళిక సంఘాన్ని రద్దు చేసి, ఏ ప్రాధాన్యత లేని నీతి అయోగ్‌ను ఏర్పాటు చేసింది ఎన్‌డిఎ ప్రభుత్వం.

స్వాతంత్రం వచ్చి 70 సంవత్సరాలైయింది. ఇప్పటికీ 70 బడ్జెట్‌లు వచ్చిపోయాయి. ఈ 70 సంవత్సరాలలో 70 బడ్జెట్‌లలో కేటాయించిన కేటాయింపులకు, ఖర్చులకు, సాధించిన ప్రగతి అంచనా లెక్కలు ఏనాడైనా ప్రజల ముందు పెట్టారా? పాలకులు చెప్పే 'అభివృద్ధి' ఫలాలు ప్రజలకు అందాయా? కనీసం సమీక్షలున్నాయా? ఆర్థిక వ్యవస్థ ప్రజలకు జవాబుదారీగా ఉంటూ, పారదర్శకంగా ఉండాల్సింది పోయి అంకెల గారడీలు, తప్పుడు చిట్టా పద్దులతో, ముద్దు ముద్ద మాటలతో ప్రజల్ని ఏడాదికి ఓసారి మోసపుచ్చే తంతే బడ్జెట్.

1991 నుంచి ప్రపంచీకరణ, కార్పొరేటీకరణ మొదలైనప్పటి నుంచి బడ్జెట్ అర్థం పూర్తిగా మారిపోయింది. కడుపులో చల్ల కదలకుండా కార్పొరేట్లకు ఎర్ర తివాచీలు పరిచి మరీ వారిపై వరాల జల్లులు, అనేక రాయితీలు కల్పిస్తూ బడ్జెట్‌లు తయారవుతున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే బడ్జెట్ రూపకల్పన మొత్తం ప్రపంచ బ్యాంకు, దేశ, విదేశీ కార్పొరేట్ల కనుసన్నల్లో రూపుదిద్దుకుంటే అట్టహాసంగా తెచ్చి పార్లమెంట్‌లో చదవడమే ఆర్థిక మంత్రుల పని. ఇందులో వారి ప్రయోజనాలే ఉంటాయి. ఈ బడ్జెట్‌ల వలన సామాన్య ప్రజలకు ఒరిగేదేమిటి? మనం బడ్జెట్ భ్రమలు వీడి ఒక్కసారి వాస్తవాలను ఇప్పుడు పరిశీలిద్దాం.

భారతదేశం ప్రపంచంలోనే వెలిగి పోతుందని, భారతదేశ స్థూల జాతీయోత్పత్తి (జిడిపి) వృద్ధిరేటు అమాంతంగా 7.5 శాతానికి పెరిగి చైనాను కూడా మించి పోయిందని మోదీ ప్రభుత్వం ఊదరగొడుతుంది. జిడిపి పెరుగుదల గురించి ఒకటే మోత మోగిస్తూ ఉంది. వాస్తవానికి పెద్దనోట్ల రద్దు, జిఎస్‌టిల వల్ల ఆర్థిక వ్యవస్థ దెబ్బతిని అనిశ్చిత పరిస్థితులు నెలకొని, జిడిపి వృద్ధిరేటు 3.5 శాతానికి పడిపోయింది.

నిజానికి ఈ జిడిపి గణాంకాలకు, ప్రజల జీవన ప్రమాణాలకు లంకె ఎప్పుడో తెగిపోయింది. అప్పటి నుంచే ఈ గణాంకాలు ప్రజల విశ్వసనీయతను కోల్పోయాయి. అంకెల గారడీతో తిమ్మిని బమ్మిని చేసి జిడిపి వృద్ధిరేటు బేషుగ్గా ఉందంటున్నారంటే ఇది ప్రజల చెవుల్లో 'కాలీఫ్లవర్' పెట్టాలను కోవడమే. 2004 పార్లమెంట్ ఎన్నికలకు ముందు అప్పటి ఎన్‌డిఎ ప్రభుత్వం కూడా ఇలాంటి జిమ్మిక్కులే చేసి భారత్ వెలిగిపోతుందని ఊదరగొట్టి ఎన్నికల్లో ఆరిపోయింది. ఇప్పుడు ఎన్నికలకు ముందు అంకెల గారడీతో ఆర్థికాభివృద్ధి బ్రహ్మాండంగా ఉన్నట్లు చూపుతున్నారు.

వ్యవసాయం సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్నా, పారిశ్రామికోత్పత్తి మందగించినా, ఆర్థిక వ్యవస్థ బేషుగ్గా ఉందంటే ఎలా నమ్మాలి. పాలక వర్గాల మాటల ప్రకారం ఏదైన అభివృద్ధి జరిగిందంటే అది సంపన్నుల అభివృద్ధి తప్ప, సామాన్యుల అభివృద్ధి మాత్రం కాదు. ఇక్కడ పెరిగిన

సంపద కొద్ది మంది కుబేరుల చేతిలో పోగుపడుతోంది. ఒక అంచనా ప్రకారం భారత్‌లో మొత్తం సంపదలో 50 శాతానికి పైగా సంపద కేవలం ఒక్క శాతం మంది వద్దే పోగుపడి ఉంది. ఫలితంగా పెరుగుతున్న ఆర్థిక అసమానతలు ఈ వ్యవస్థను అస్తవ్యస్తం చేస్తున్నాయి.

ప్రపంచీకరణ మొదలై దేశం ప్రపంచ బ్యాంకు కదంబ హస్తాలలో కూరుకుపోయినాక దేశాభివృద్ధి మరింత దిగజారింది. అన్నార్తులు ప్రపంచంలోనే అత్యధికంగా భారతదేశంలో ఉన్నారని ఐక్యరాజ్య సమితి ఆహార వ్యవసాయ సంస్థ (ఇఎఒ) నివేదిక వెల్లడించింది. ప్రపంచ ఆకలి సూచిక 2017 నివేదిక వివరాల ప్రకారం మన ర్యాంకు.

2011లో – 67, 2012లో – 66, 2013లో – 63, 2014లో – 55, 2015లో – 80, 2016లో – 97, 2017లో – 100వ ర్యాంకులో ఉంది.

ఈ నివేదికలో మొత్తం 118 దేశాలకు గాను భారత్ 100వ స్థానంలో నిలిచింది. ఇరుగు పొరుగు దేశాల్లో చైనా (29), నేపాల్ (72), మయన్మార్ (75), శ్రీలంక (84), బంగ్లాదేశ్ (90) మనకంటే మెరుగైనా స్థానంలో ఉన్నాయి. ఇక బ్రిక్స్ దేశాల్లో భారత్ చివరి స్థానంలో ఉంది.

పేదరిక నిర్మూలన సామాజిక బాధ్యత. ప్రభుత్వాలు ఈ బాధ్యత నుంచి వైదొలిగాయి. మరోవైపు ప్రతి సంవత్సరం బడ్జెట్‌లో బడా పారిశ్రామికవేత్తలకు వేల కోట్ల రాయితీలు ఇస్తూ, సాధారణ పేద ప్రజానీకానికి ఇచ్చే సబ్సిడీలకు కోత పెడుతోంది. ఇది సహించరానిది.

ఉపాధి దొరకక, ఉద్యోగ భద్రత లేక కార్మికులు వేతన భరోసాలేని అడ్డ కూలీలుగా మారుతున్నారు. ప్రధానంగా స్త్రీలు పనిలేని వారవుతున్నారు. గ్రామాల్లో ఉపాధి హామీ పథకం అలంకారమై పోయింది.

ఇక మన ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక అయిన రైతు, వ్యవసాయ సంక్షోభం అంతా ఇంతా కాదు. దేశ జనాభాలో 70 శాతం మంది ఆధారపడుతున్న సాగు రంగాన్ని వరుస కరువులు పట్టి పీడిస్తున్నాయి. ప్రకృతి ప్రతికూలతలు, నకిలీ విత్తనాలు, రుణ భారాలు, గిట్టుబాటు ధరలు లభించక దేశ వ్యాప్తంగా రైతులు నిరాశ నిస్పృహలకు లోనయి ఈ దశాబ్దంలో లక్షల సంఖ్యలో ఆత్మహత్యలు చేసుకున్నారు.

దేశంలో ఎక్కువ మంది రైతులు కౌలుదారులుగా ఉన్నారు. రైతు కూలీలున్నారు. వీరిని ప్రభుత్వం పరిగణలోనికి తీసుకోవడం లేదు. కనీసం రైతులకు గిట్టుబాటు ధర కూడా కల్పించలేని చేతకాని తనంలో ప్రభుత్వాలున్నాయి. దీనికి సమాధానం బడ్జెట్‌లో ఉందా? ఈ బతుకు తెరువు సంక్షోభాన్ని పరిష్కరించలేని ఉత్తుత్తి బడ్జెట్‌లు ఎందుకు? ఇంకా ఎంత కాలం ఈ బడ్జెట్‌ల మాయాజాలంలో ప్రజల్ని మభ్యపెడతారు?

ప్రస్తుత బడ్జెట్‌లో వ్యవసాయ రంగాన్ని పరిశీలిస్తే రు. 46,700 కోట్లు కేటాయించారు. ఇందులో రు. 13 వేల కోట్లు పంటల భీమాకు, రు. 15 వేల కోట్లు వడ్డీ మాఫీకి, రు. 4 వేల కోట్లు 99 ప్రాజెక్టుల నిర్మాణ వ్యవయంకు, రు. 3,600 కోట్లు గోదాముల నిర్మాణానికి కేటాయించారు. ఉద్యాన వన పంటలకు రు. 2536 కోట్లు కేటాయించారు. పై 5 పద్దులకు రు. 38 వేల కోట్లు తీసివేస్తే మిగిలిన 8,700 కోట్లతో ప్రధాన రంగమైన వ్యవసాయ రంగాన్ని అభివృద్ధి పరుస్తారంటా! ఇది సాధ్యమేనా?

ఇక ఆరోగ్య రంగానికి రు. 1.38 లక్షల కోట్లు కేటాయించారు. కొత్త భీమా పథకం అంటూ కొత్త ముసుగు వేశారు. ఈ పథకం 'కొత్త సీసాలో పాత సారా'లా ఉంది. ఈ నిధులు ఎలా సరిపోతాయి? భారత పాలకులు ప్రజలకు వైద్యం అందించే బాధ్యత నుండి ఎప్పుడో తప్పుకున్నారు. ఇక్కడ రోగం మార్కెట్ సరుకుగాను, వైద్యం వ్యాపారంగాను మారింది. చివరికి శవాల మీద కూడా వ్యాపారం జరుగుతుంది. మన దేశంలో ప్రజలు ఆరోగ్యం కోసం ఖర్చు చేస్తున్న డబ్బులో ప్రభుత్వం ఖర్చు చేస్తున్నది 15 శాతం మాత్రమే. 85 శాతం ప్రజలు తమ సొంత డబ్బుతోనే వైద్యం చేయించుకుంటున్నారు.

ఎంతో ప్రాధాన్యత కలిగిన విద్యా రంగంపై ఎప్పుడూ చిన్న చూపే. సామాజిక లక్ష్యాల సాధనంగా విద్యను గుర్తించి విద్యా లక్ష్యాలను సాధించాల్సి ఉంది. ఇందుకు స్థూల జాతీయోత్పత్తిలో కనీసం ఆరుశాతం నిధులు విద్యకు కేటాయించాలి. ఇది ఎప్పుడూ జరగలేదు. ఫలితంగా విద్య ప్రైవేటీకరించబడి, మార్కెట్‌లో సరుకుగా మారి, విద్యార్థులపై ఒత్తిడి పెరిగి దేశంలో సగటున ప్రతి గంటకు ఒక విద్యార్థి ఆత్మహత్య చేసుకుంటున్నాడు. మెజార్టీ జనాభాగా ఉన్న ఎస్‌సి, ఎస్‌టి, మైనార్టీలు, పిల్లలు, మహిళలు పాలక వర్గాల దృష్టిలో అసలు మనుషులే కాదు. వీరి అభివృద్ధికి ఎప్పుడు అరకొర నిధులే. ఎన్ని బడ్జెట్‌లు వచ్చిపోయినా వీరి జీవనంలో ప్రగతి లేదు.

కొత్తగా ఏర్పడిన ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాల ప్రజలకు తీవ్ర అన్యాయమే మిగిలింది. ఆంధ్రకు హోదా అన్నారు. ప్రత్యేక ప్యాకేజీ అన్నారు. బడ్జెట్‌లో రిక్తహస్తం చూపి, చివరకు పిడికెడు మట్టి చెంబు నీళ్లతో సరిపుచ్చారు. సామాను సర్దుకొమ్మన్నారు. ఇది అన్యాయం కాదా? ఆశజీవులైన వేతన జీవుల నెత్తిన శఠగోపం పెట్టి, ఉత్తచేయి చూపించారు.

ఆదాయపు పన్ను శ్లాబుల్లో మార్పులేమీ చేయకుండా వీరి నుండి అందిన వరకు దోచుకుంటున్నారు. ప్రతి సంవత్సరం రెండు నెలల జీతాన్ని ఆదాయ పన్ను కింద కడుతున్నారు ఉద్యోగులు. ఇలా ఇచ్చి అలా లాగేసుకోవడమంటే ఇదేమరి.

ఇదే సమయంలో కేంద్ర బడ్జెట్‌లో అలంకారమైన పదవుల్లో ఉండే రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి వేతనాలు భారీగా పెంచారు. రాష్ట్రపతి వేతనం నెలకు రు. 5 లక్షలకు, ఉపరాష్ట్రపతి వేతనం నెలకు 4 లక్షలకు, గవర్నర్ల వేతనం రు. 3.5 లక్షలకు పెంచారు. ఇక ఎంపిలకు డబుల్ ధమాకా... వీరి మూల వేతనాన్ని ఏప్రిల్ 1 నుంచి రు. 50 వేల నుంచి రు. లక్షకు, ఇతర భత్యాలను కూడా పెంచనున్నారు.

ఇది ఇలా ఉంటే అనుత్పాదక రంగమైన రక్షణ రంగానికి ఈ బడ్జెట్‌లో గతేడాది కంటే 7.81 శాతం మేరకు కేటాయింపులు పెంచారు. (రు. 2.95 లక్షల కోట్లు). రోజులు గడుస్తున్న కొద్ది దేశ ప్రజలకు 'అచ్చేదిన్' అంతర్యం అర్థమవుతోంది.

త్వరలో జరగనున్న ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని సామాన్యులకు అర్థం కాని అంకెల గారడి తప్పితే ఏమీ లేదు. ఉపాధిలేమి, ద్రవ్యోల్బణం, పేదరికం లాంటి ప్రధాన సమస్యలకు పరిష్కారం చూపడంలో బడ్జెట్ విఫలమైంది. అణగారిన ప్రజలు మరోమారు వంచనకు గురైనారు. బడ్జెట్ కేటాయింపుల్లో దాగిన మోదీ సర్కారు సంపన్న సేవా తత్పరత మరోమారు తేటతెల్లమైంది.

*(రచయిత ఆర్థిక శాస్త్ర విద్యార్థి, సామాజిక విశ్లేషకులు)* వీ

# కేంద్ర బడ్జెట్ 2018-19

***బడ్జెట్ కేటాయింపుల్లో పాలకుల మాటలకు, కేటాయింపులకు పొంతన లేదని, ప్రజల మౌలిక అవసరాలు అప్రధానమై కార్పొరేట్ల సేవకే అధిక ప్రాధాన్యత ఇచ్చిందని అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి***

పెద్దనోట్ల రద్దు, జిఎస్‌టిలతో తీవ్రంగా దెబ్బతిన్న ఆర్థిక రంగాన్ని సరిదిద్దే ప్రయత్నం ఏ మాత్రం చేయకుండా ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ 2018-19 బడ్జెట్‌ను అంకెల గారడీగా, మాటల మాయాజాలంతో, కార్పొరేట్ల కొమ్ముకాసేలా తీర్చిదిద్దారు. ఫిబ్రవరి 1న ఆయన లోక్‌సభలో ప్రవేశపెట్టిన బడ్జెట్ సామాన్య, మధ్యతరగతి ప్రజలను, సగటు వేతన జీవులను తీవ్ర నిరాశకు గురిచేసింది. వ్యవసాయం, మౌలిక సదుపాయాల కల్పన, విద్య, వైద్యం, ఉపాధి రంగాలకు ప్రాధాన్యత ఇస్తున్నట్లు ప్రకటించారు. అయితే వాస్తవానికి ఆ రంగాలకు ఏ మాత్రం తగిన రీతిలో కేటాయింపులు చేయకపోగా, వాటిని కార్పొరేట్ శక్తులు అనుకూలంగా మార్చుకునేందుకు బడ్జెట్ విన్యాసాలు ప్రదర్శించారు. అసాధ్య పథకాలతో జనానికి వల, తాయిలాలతో ఓటర్లకు ఎర, బీమా కంపెనీలకు భరోసా, కార్పొరేటు ఆసుపత్రులకు ఊరట, ఇదీ జైట్లీ బడ్జెట్ బండారం. ప్రత్యక్షంగా పన్ను పోటు కనిపించకుండా జనంపై బాదుడుకు అవకాశం ఉండే ప్రతిపాదనలను చాప కింద నీరులా ప్రవేశపెట్టారు.

బడ్జెట్‌లు దేశ భవిష్యత్‌ను నిర్మించే కార్యాచరణ ప్రణాళికలుగా కాక, అవి క్రమంగా ఓటు బ్యాంకు నిర్మాణం సాధనాలుగా మారిపోవడం దురదృష్టకరం. గతంలో కేంద్ర బడ్జెట్ అంటే ఎంతో పెద్ద కసరత్తు. దేశంలోని అన్ని రంగాల మీద ఎంతో ప్రభావాన్ని చూపేదిగా బడ్జెట్‌కు ప్రాధాన్యం ఉండేది. అభివృద్ధి, సంక్షేమ కార్యక్రమాలకు సంబంధించి కేంద్ర ప్రభుత్వం వైఖరి ఏమిటి? ఏ విధంగా ముందుకు వెళ్లాలను కుంటోంది? అనేది తెలుసుకోవాలనే ఆసక్తి అందరిలో కనిపించేది. పలు కీలకమైన నిర్ణయాలు, మార్పులను బడ్జెట్ ద్వారా ప్రభుత్వం వెల్లడించేది. సామాన్య ప్రజల నుంచి అసమాన్యుల వరకూ ప్రతిఒక్కరూ తమపై బడ్జెట్ నిర్ణయాల ప్రభావం ఎంతా ఉంటుందోనని ఎదురుచూచేవారు. కానీ ఇప్పుడు బడ్జెట్‌లో కీలకమైన నిర్ణయాలు ఉండడం లేదు. కీలకమైన నిర్ణయాలను బడ్జెట్‌తో సంబంధం లేకుండానే, పార్లమెంట్‌కు తెలుపకుండానే మంత్రి మండలి నిర్ణయాలతోనే పన్నులు, సంస్కరణలు, సంబంధిత ఇతర మార్పులను చేస్తున్నారు. దీంతో బడ్జెట్ ప్రాధాన్యం ప్రజల్లో తగ్గిపోతున్నట్లు స్పష్టమవుతోంది.

వచ్చే సార్వత్రిక (2019) ఎన్నికల్లో ఓట్లు సంపాదించడానికి నరేంద్ర మోడీ ప్రభుత్వం 2018 వార్షిక బడ్జెట్‌ను ఒక బలమైన ఎన్నికల ఆయుధంగా వినియోగించుకునేందుకు తీవ్ర కసరత్తు చేసింది. అయితే ఆర్థిక వ్యవస్థ ఎదుర్కొంటున్న సవాళ్లు, వాటిని సకాలంలో సవ్యంగా పరిష్కరించలేని మోడీ ప్రభుత్వ వైఫల్యం స్పష్టంగా కనిపిస్తుంది. ఇది సార్వత్రిక ఎన్నికలకు ముందు చివరి పూర్తిస్థాయి బడ్జెట్ గనుక ఎన్నికల లబ్ది దృష్టితోనే బడ్జెట్ రూపకల్పన జరిగింది. పెద్దపెద్ద సంఖ్యలతో గ్రామీణ ప్రజల్లో భ్రమలు కల్పించడం ప్రధానోద్దేశంగా కనిపిస్తున్నది. బడ్జెట్ ప్రతిపాదనలు సంబంధిత ప్రజలకు చేకూర్చగల మేలుకన్నా పాలకపార్టీ ఎన్నికల ప్రచారానికి ఉపకరించేవిగా ఉన్నాయి. గత బడ్జెట్లలో ప్రకటనలకు- ఆచరణకు మధ్య అగాథాన్ని గమనించినప్పుడు, ఈ తాజా ప్రతిపాదనలు చాలా మేరకు ఊహాలోక విహారం అనక తప్పదు. బడ్జెట్ దిశలో ఎట్టి మార్పు లేదు. కార్పొరేట్లు పొందుతున్న రాయితీలు, ప్రయోజనాల్లో ఏ ఒక్కటీ కోత పెట్టలేదు. ప్రభుత్వ ఆదాయ అంచనా నెరవేరే సూచన లేనందున ద్రవ్యలోటు పరిమితిని పెంచుకున్నారు. ఇది ద్రవ్యోల్బణానికి దారితీస్తుంది.

ప్రస్తుత బడ్జెట్ రు. 24,42,213 కోట్లు 2017-18లో సవరించిన బడ్జెట్ రు. 22,17,750 కోట్లుగా ఉన్నది. అంటే గతం కంటే ఈసారి బడ్జెట్ గత బడ్జెట్ కంటే 10 శాతం పెరిగింది. బడ్జెట్‌లో పెరిగింది ఈ సంవత్సరం రు. 2,24,463 కోట్లు. మొత్తం 24.42 లక్షల కోట్ల బడ్జెట్‌లో వివిధ అవసరాల కోసం క్రమం తప్పకుండా చేయాల్సిన చెల్లింపుల మొత్తం చాలా ఎక్కువగా ఉన్నాయి. 18 శాతం వడ్డీ చెల్లింపులకు, 9 శాతం రక్షణకు, 9 శాతం సబ్సిడీలు, పింఛన్లు 5 శాతం. రాష్ట్రాలకు పన్ను, సుంకాలు ఇతర బదలాయింపుల రూపంలో వాటా పంచేందుకు 32 శాతం, కేంద్ర ప్రాయోజిత పథకాలకు 9 శాతం, కేంద్ర ప్రభుత్వ కార్యక్రమాలకు 10 శాతం ఖర్చు అవుతోంది. ఈ వ్యయాలన్నింటినీ మినహాయించిన తరువాత ప్రభుత్వం దగ్గర మిగిలేది కేవలం ఎనిమిది శాతమే. ఈ నామమాత్రం మిగులుతో దేశంలో దారిద్ర్య నిర్మూలన, ఉత్పత్తి రంగాల అభివృద్ధి, ఆత్మహత్యల నివారణ, అందరికీ విద్య, ఆరోగ్యం సమకూర్చడం సాధ్యమౌతుందా? అంటే, అసాధ్యమని చెప్పక తప్పదు.

బడ్జెట్‌లో ప్రధానంగా కనిపిస్తున్న దగాకోరు విధానాలు. మొదటి దగా అవసరం ఎక్కడుందో అక్కడ నిధులు కేటాయించకపోవడం, గ్రామీణ రంగానికి, చిన్న పరిశ్రమలకు ప్రాముఖ్యత ఇచ్చినట్లు గొప్పగా చెప్పుకున్నా కేటాయించిన నిధులు చూస్తే కొసిరి విదిలించారు. వ్యవసాయం, సహకారం, రైతు సంక్షేమానికి బడ్జెట్‌లో 42,211 కోట్లు కేటాయించారు. అంటే 7 శాతం నిధులు పెంచారు. తీవ్ర సంక్షోభంలో ఉన్న ఒక రంగానికి ఈ నిధులు ఏ మూలకు సరిపోవు. రైతులకిచ్చే సంస్థాగత రుణాలకు నిధులను రు. 10 లక్షల కోట్ల నుండి 11 లక్షల కోట్లకు పెంచినట్లు ఆర్థిక మంత్రి చెప్పారు. కానీ దానికి ఆయన నిధులిచ్చిందేమీ లేదు. బ్యాంకులిస్తాయని చెప్పారు. సంక్షోభంలో ఉన్న రైతాంగానికి సంక్షోభంలో

ఉన్న బ్యాంకులు అప్పులిస్తాయా ? మనం నమ్మాలా? ఈ బడ్జెట్‌లో రైతులకు తీపి కబురుందంటే అది మద్దతు ధరను 1.5 రెట్లు పెంచడమే. కాని అది కూడా ఎంతవరకు అమలు చేస్తారో వేచి చూడాల్సిందే.

రెండవ దగా 10 లక్షల కుటుంబాలకు ఏడాదికి రు. 5 లక్షల ఆరోగ్య భీమా కల్పిస్తున్నట్లు ఆర్థికమంత్రి చెప్పారు. కానీ విచిత్రమేమిటంటే ఈ పథకానికి రు. 2000 కోట్లు బడ్జెట్‌లో కేటాయించారు. ఇది ఆరోగ్య సంరక్షణ రంగంలో విప్లవాత్మక పథకమని మీడియాలో ప్రభుత్వం విశేష ప్రచారం చేసింది. ప్రభుత్వం జాతీయ ఆరోగ్య బీమా పథకం గురించి ఊదరగొడుతున్న నేపథ్యంలో ఆ రంగానికి బడ్జెట్‌లో భారీ కేటాయింపు జరిగిందని అంతా భ్రమపడుతున్నారు. అందుకు విరుద్ధంగా ఆరోగ్య, కుటుంబ, సంక్షేమ శాఖకు 2018-19 బడ్జెట్‌లో కేటాయింపు కేవలం రు. 52,800 కోట్లు, 2017-18 సవరించిన అంచనాల (రు. 51,550.85 కోట్లు) పై ఇది కేవలం 2.5 శాతం అధికం. అంతేకాకుండా, ఇది సరికొత్త పథకం కానేకాదు. 2016 బడ్జెట్‌లోనే ఇది ఉంది. 2016లో ఈ పథకం మిగిల్చిన అనుభవంపై నివేదికలు లేనే లేవు. పోనీ జాతీయ ఆరోగ్య భద్రతా పథకం గురించి భీమా కంపెనీలతో చర్చించాం అనైనా చెప్పారా అంటే అదీలేదు. 125 కోట్లకు పైగా ఉన్న దేశ జనాభాలో అత్యధిక శాతం పేదలే. వీరికి వైద్యం అందుబాటులోకి తేవాలన్న చిత్తశుద్ధి ఉంటే ప్రజారోగ్య వ్యవస్థ పటిష్ఠం చేయడం ద్వారానే ఇది సాధ్యపడుతుంది. కానీ పేదలకు వైద్యం పేర వసూలు చేసే ప్రజాధనం సర్కార్ దవాఖానాలను బలోపేతం చేసే బదులు ప్రైవేట్ రంగాన్ని పెంచి పోషిస్తాయనడంలో సందేహం లేదు. గత పథకం లాగానే ఈ పథకం కూడా అటకెక్కక తప్పదు.

మూడో దగా ద్రవ్యలోటు అదుపుకు సంబంధించిన విషయం. 2017-18 సంవత్సరం ద్రవ్యలోటు 3.5 శాతం ఉందనీ, ఈ ఏడాది 3.3 శాతం ఉంచాలనీ ఆర్థిక మంత్రి జైట్లీ చెప్పారు. నడుస్తున్న సంవత్సరం ద్రవ్యలోటు అదుపులో పెట్టలేకపోయిన ఆయన వచ్చే ఆర్థిక సంవత్సరం సరిపెడతామని చెప్పడం హాస్యాస్పదంగా ఉంది. 2017-18లో కార్పొరేట్ల రుణ ఎగవేత వల్ల ఇబ్బందుల్లో పడ్డ బ్యాంకులకు డబ్బు సర్దడం బడ్జెట్‌లో చూపకుండా ఇతర మార్గాలు అనుసరించారు. ఓఎన్‌జిసి 51 శాతం వాటాను ఎచ్‌పిసిఎల్ కొనుగోలు చేసినందున ప్రభుత్వానికి ఓఎన్‌జిసి నుండి 36,915 కోట్ల రూపాయలు ఆదాయం బడ్జెట్‌కు ఒక్కరోజు ముందు ఒక్కసారిగా వచ్చిపడింది. దీంతో పెట్టుబడుల ఉపసంహరణ ద్వారా రు.72,500 కోట్లు వస్తుందని గత బడ్జెట్‌లో వేసిన అంచనా మించిపోయి రు. 1 లక్ష కోట్లు వచ్చింది. జిఎస్‌టి వల్ల తగ్గిపోయిన ఆదాయాన్ని ఇది పూడ్చింది. ఉత్పాదకత పెంచి ద్రవ్య లోటు తగ్గించడానికి బదులు పెట్టుబడులు ఉపసంహరణ ద్వారా దాన్ని సాధించే ప్రయత్నం చేస్తున్నారు. ఈ బడ్జెట్‌లోనూ అది కన్పిస్తుంది. దీనివల్ల తెలుస్తున్నదేమంటే, జిఎస్‌టి వల్ల ఆదాయమూ రాలేదు, మన ఆర్థిక వ్యవస్థ ఆరోగ్యంగానూ లేదు.

అందువల్లనే ఆదాయాన్ని పూడ్చుకోవడానికి జైట్లీగారు ఉద్దేశ పూర్వకంగానే ఒకవైపు పెట్టుబడుల ఉపసంహరణకు మరోవైపు మధ్యతరగతిపై పన్నుల భారాన్ని మోపుతున్నారు. అందువల్లనే లక్ష రూపాయలు మించిన దీర్ఘకాల క్యాపిటల్ గెయిన్ ట్యాక్స్‌ను 10 శాతం, స్వల్పకాలిక క్యాపిటల్ గెయిన్ ట్యాక్స్‌ను 15 శాతం పెంచారు. 2003-04లో రద్దు చేసిన ఈ పన్నును తిరిగి వేయడం గమనార్హం. దీంతో స్టాక్ మార్కెట్ ఒక్కసారిగా ఒడిదుడుకులకు గురయ్యాయి.

2019 నాటికి ఒక కోటి మంది గ్రామీణులను దారిద్ర్యరేఖ నుంచి తప్పిస్తామని, గ్రామీణాభివృద్ధికి రు. 3 లక్షల కోట్లు వెచ్చించబోతున్నామని గ్రామీణ పేదలందరికి ఇళ్లుకట్టించి ఇచ్చేస్తామన్నారు. కానీ ప్రధానమంత్రి ఆవాస్ యోజన యోజనాకు పెంచిన నిధులు 3 శాతం మాత్రమే. ఈ నిధులతో గ్రామీణ పేదలందరికీ ఇళ్లునిర్మించడం ఎలా సాధ్యం. ద్రవ్యలోటును తగ్గించే పేరుతో ఎన్‌డిఏ సర్కారు ప్రజల ఉపాధి, సంక్షేమానికి కోతలు పెట్టింది. గ్రామీణాభివృద్ధికి నిరుడు జిడిపిలో 1.15 శాతం కేటాయించగా ఈసారి 1.08 శాతానికి తగ్గించారు. వ్యవసాయానికి బడ్జెట్‌లో నిరుడు 6.11 శాతం కేటాయించగా ఈసారి బడ్జెట్‌లో 5.65 శాతం మాత్రమే కేటాయించారు. సామాజిక రంగానికి సంబంధించిన స్కీమ్‌లకు కేటాయింపులు 2016-17 బడ్జెట్‌లో ఈ కేటాయింపులు 21.4 శాతంగా ఉంటే, ఈ బడ్జెట్‌లో 14.5 శాతం మాత్రమే. ఇదేనా పెద్దపీట? ఇక గ్రామాల్లో పేదలు ఉపాధి పనుల కోసం పెద్ద ఎత్తున ఎదురు చూస్తున్నారు. కానీ బడ్జెట్‌లో ఉపాధి హామి పథకానికి 55 వేల కోట్లు కేటాయించారు. ఒక్క రూపాయి కూడా అదనంగా పెంచలేదు.

అరుణ్ జైట్లీ ప్రవేశపెట్టిన సాధారణ బడ్జెట్ ఎన్నో అంచనాలు, ఆశల మధ్య బాధ్యతాయుతంగా ప్రవేశపెట్టిన బడ్జెట్‌గా తమకు తామే కితాబిచ్చుకున్నారు. బడ్జెట్ అంతస్సూత్రం అక్షరాలా- ఆర్థిక సవాళ్లు, రాజకీయ అవసరాల మధ్య సమతూకానికి చేసిన కసరత్తుగానే ఉంటుంది. వ్యవసాయం, మౌలిక సదుపాయాలు, విద్య, ఆరోగ్య, ఉపాధికల్పన రంగాల బాధ్యతలపై గొప్పగా సంకల్పాలు ఉల్లేఖిస్తూ - బడ్జెట్ పరిమాణం, కీలక కేటాయింపులపై అమిత లౌక్యం ప్రదర్శించింది. బడ్జెట్ గమనం, సారాంశంపై చిత్తశుద్ధి కన్నా తాము ఏ వర్గాల్నీ వదిలిపెట్టలేదని చాటుకోవాలనే ఆరాటమే ప్రస్ఫుటమైంది. అదే విధంగా తమ లక్షిత పిపిపి, ఎఫ్‌డిఐలు, ప్రైవేటీకరణ బాటను వదులుకోలేదు. స్థూలంగా కార్పొరేట్‌కు ఊతంగా, సామాన్యులను ఉసూరు మనిపించేలా ఈ బడ్జెట్ ఉంది. పన్నులు, సబ్సిడీల కోత, ధరల పెరుగుదల తప్పదనే సంకేతాలూ ఇచ్చింది. పన్నుల్లో రాయితీలపై ఎన్నో ఆశలు పెట్టుకొన్న వేతనజీవులు, మధ్యతరగతి ప్రజానీకాన్ని నిరాశపరిచింది.

వ్యవసాయరంగం నుంచి, గ్రామీణ ఉపాధిని విడదీసి చూడలేం. వ్యవసాయరంగంలో యాంత్రీకరణ ప్రవేశించి, సామూహిక క్షేత్రాలకు రంగం సిద్ధమవుతున్నది. ప్రచ్ఛన్న నిరుద్యోగాన్ని రూపుమాపడానికి, మానవ వనరుల సంపూర్ణ వినియోగానికి, సమాజంలో సగం ఉండే మహిళల ఉపాధి కల్పనకు తగిన ప్రాధాన్యం బడ్జెట్‌లో లేదు. స్వయం సహాయక బృందాలు సంప్రదాయ జీవనోపాధి నుంచి మహిళలను బయటపడేసి, ఆధునిక ఆర్థిక వ్యవస్థలో భాగం చేయడానికి బాట వేయాలి. ఉత్పత్తి, మార్కెటింగ్ వంటి విభిన్న రంగాలలో మహిళల ప్రాధాన్యం విస్మరించలేనిది. కానీ తాజా బడ్జెట్ వీరికి తగిన ప్రాధాన్యాన్ని ఇవ్వడంలో విఫలమైంది.

2014లో ఎన్‌డిఏ ప్రభుత్వం ఏర్పాటైన నాటి నుంచి గతేడాది వరకు

వెల్లడైన గణాంకాలు ప్రకారం చూస్తే గ్రామీణ ప్రాంతంలో తీవ్ర అనిశ్చితి నెలకొంది. వ్యవసాయ సంబంధ ఆందోళనలు పెరిగాయి. ఉత్తరప్రదేశ్, బీహార్, గుజరాత్, హర్యానా, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ మొదలుకొని దక్షిణాది తమిళనాడు రాష్ట్రాల వరకు పలుచోట్ల రైతుల ఆందోళనలు చోటుచేసుకున్నాయి. ఇవి పంటకు గిట్టుబాటు ధర అనే కాకుండా, అనేక రూపాల్లో పెల్లుబుకుతున్నాయి.

'ఈజ్ ఆఫ్ లివింగ్' నినాదంతో ఈ బడ్జెట్‌ను తీర్చిదిద్దినట్లు ప్రధానమంత్రి మోడీ ప్రకటించారు. దీన్ని రైతు బడ్జెట్‌గా అభివర్ణించారు. ఆర్థికమంత్రి కూడా తమ ప్రథమ ప్రాథమ్యం వ్యవసాయం, రైతు సంక్షేమమేనంటూ మాటల కోటలు కట్టారే తప్ప రైతుకు రక్షణఛత్రం అందించే ప్రయత్నం చేయలేదు. దేశ ఆర్థిక ప్రగతికి, సామాజిక పురోగతికి వెన్నుదన్నుగా నిలుస్తున్న రైతును దశాబ్దాలుగా పాలకశ్రేణులు పూర్తిగా నిర్లక్ష్యం చేసిన పాపాన్ని కడుక్కునేందుకు ముందుకు వచ్చామంటూనే వ్యవసాయ రంగాన్ని కార్పొరేట్ కబంధహస్తాలకు అప్పగించే ప్రమాదకర ప్రయత్నానికి ఒడిగట్టారు. అంతేకాదు, ఉత్పాదకత, ఉత్పత్తి కేంద్రంగా ఉన్న వ్యవసాయాన్ని ఆదాయ వనరుగా మారుస్తున్నామని మంత్రి అరుణ్ జైట్లీ ప్రకటించడమే అర్థరహితం. ఉత్పాదకత, ఉత్పత్తి లేకుండా ఆదాయం ఎక్కడ నుంచి వస్తుంది. దేశంలో వ్యవసాయరంగంపై ఇప్పటికీ 60 శాతానికి పైగా జనం ఆధారపడి జీవిస్తున్నారు. అయితే ఈ రంగంలో వృద్ధిరేటు కేవలం 2.1 శాతం మాత్రమే ఉందంటే దేశ ఆర్థిక వృద్ధి బాగుందని ఎలా చెప్పగలం.

ఉపాధి కల్పన, వ్యవసాయ అనుబంధ కార్యకలాపాలు, గ్రామీణ మౌలిక సదుపాయాలకు ప్రాధాన్యం ఇస్తున్నట్లు వెల్లడించినా తగినన్ని నిధులు కేటాయించ లేదు. దేశవ్యాప్తంగా 22 వేల సంతలను మెరుగుపరచడానికి రెండు వేల కోట్లు, వ్యవసాయ రవాణా ఏర్పాట్లకు ఐదు వందల కోట్లు కేటాయించారు. 96 జిల్లాల్లో నీటిపారుదల కొరత తీర్చడానికి 2,600 కోట్లు కేటాయించారు. తరిచిచూస్తే సంతృప్తికరంగా లేవు. తీవ్రస్థాయిలో ఉన్న వ్యవసాయ సంక్షోభాన్ని పరిష్కరించగల సమగ్ర చర్యలు బడ్జెట్‌లో లేవు. 2022 నాటికి దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 75 ఏండ్లవుతుందని, అప్పటి వరకు రైతుల ఆదాయాన్ని రెట్టింపు చేస్తానని ప్రధాని మోడీ పిలుపు ఇచ్చారని జైట్లీ గుర్తుచేశారు. కానీ గత నాలుగేండ్ల మోడీ పాలన గమనించినా, తాజా బడ్జెట్‌ను పరికించినా మోడీ ప్రభుత్వం ఈ లక్ష్యాన్ని సాధించగల సూచనలు కనిపించడం లేదు. 86 శాతం బక్క రైతులేనని చెబుతున్నప్పుడు వారి అభివృద్ధికి అనుసరించే వ్యూహమేమిటో స్పష్టంగా చెప్పలేదు.

ప్రభుత్వానికి సంపన్నులపై ఉన్న ప్రేమ జన బాహుళ్యంపై ఏ మాత్రం లేదనడానికి పన్నుల వ్యవహారమే ఉదాహరణ. ప్రత్యక్ష పన్నుల రాబడి ఈ సంవత్సరం 51.6 శాతం ఉంటే వచ్చే ఏడాది 50.6 శాతంగా అంచనా వేశారు. కార్పొరేట్ ట్యాక్స్‌ను 25 శాతానికి తగ్గించారు. ఇదే సమయంలో పరోక్ష పన్ను ఆదాయాన్ని ఎక్కువ ఆశించారు. ప్రత్యక్ష పన్నులు సంపన్నులు, కార్పొరేట్లు చెల్లిస్తారు. పరోక్ష పన్నులను జనం కడతారు. దొడ్డిదారిలో పన్నులు వడ్డించి ప్రజల నుంచి ఆదాయం పిండుకోవాలని చూస్తూ ప్రజలకు అచ్చే దిన్ అనడం ముమ్మాటికీ దగానే. మరో ఉదాహరణ. ద్రవ్యోల్బణం, ధరల పెరుగుదలను చూపిస్తూ ప్రజాప్రతినిధుల వేతనాలను ఘనంగా పెంచుకున్నారు. అంతేకాదు, ప్రతి ఐదేళ్లకోసారి రాజ్యాంగ పదవుల్లో ఉన్నవారి వేతనాలపై సమీక్ష జరపనున్నారు. ఎంపిల జీతాల పెంపుపై రెగ్యులేటరీ అథారిటీని ఏర్పాటుచేశారు. ఈ ద్రవ్యోల్బణం, ధరలు, సగటు వేతనజీవుల విషయంలో వీరికి గుర్తురాకపోవడం శోచనీయం. అత్యంత కీలకమైన తయారీ రంగం ప్రస్తావనే లేకపోవడం ఈ బడ్జెట్ ప్రధాన లోపం. ఈ బడ్జెట్ ద్వారా దీర్ఘకాలంలో ఎన్నో ప్రయోజనాలు చేకూరుతాయంటూ హామీలు, భరోసాలకు మాత్రం అంతులేకుండా పోయింది.

దేశ జనాభాలో 48 శాతం మహిళలు ఉన్నప్పటికీ ఆరోగ్యం, విద్య, ఆర్థిక అవకాశాల కల్పన తదితర కీలక సామాజిక సూచికల్లో పురుషుల కన్నా వెనుకబడే ఉన్నారు. ప్రపంచ ఎకనామిక్ ఫోరమ్ అంచనాల ప్రకారం ప్రపంచ స్థాయిలో 2016 లింగ వ్యత్యాస సూచికలో భారతదేశం 87వ స్థానంలో ఉంది. మహిళల ఆరోగ్యానికి సంబంధించి భారతదేశం 142వ స్థానంలో ఉంది. దేశంలో 27 శాతం మహిళలే కార్మిక శక్తిలో భాగం పంచుకొంటున్నారు. మొత్తం మన దేశ జనాభాలో మహిళలు, శిశువులు కలిసి సుమారు 60 శాతం వరకు ఉంటారు. అయితే మోడీ ప్రభుత్వం మాతా శిశు సంక్షేమానికి క్రమంగా నిధులు కేటాయింపుకు కత్తెరేస్తుంది. 2013-14 బడ్జెట్‌లో 24,385 కోట్లు కేటాయించగా 2018-19 బడ్జెట్‌లో కేటాయించింది 24,700 కోట్లు మాత్రమే. రానున్న ఎన్నికల దృష్ట్యా మహిళలకు గాలం వేసే ప్రయత్నంలో భాగంగా ముద్రా యోజన కింద రు.3 లక్షల కోట్ల రుణాలు ఇవ్వాలని నిర్ణయించడం, ఉజ్వల యోజన కింద ప్రస్తుతం 5 కోట్ల వంట గ్యాస్ కనెక్షన్లను 8 కోట్లకు, మహిళా స్వయం సహాయ బృందాలకు ఇచ్చే రుణాలను 75 వేల కోట్లకు పెంచారు. అంటే 37 శాతం పెరిగింది.

జనాభాలో 16.6 శాతంగా ఉన్న షెడ్యూల్ కులాల సంక్షేమానికి కేటాయించింది 56,619 కోట్లు, 8.6 శాతం జనాభా కలిగిన షెడ్యూల్ తెగలకు కేటాయించింది 39,135 కోట్లు అంటే బడ్జెట్ వ్యయంలో ఎస్‌సిలకు 6.55 శాతం కాగా ఎస్‌టిలకు 4.53 శాతం మాత్రమే కేటాయించారు. ఇక ఎస్.సి. సంక్షేమ పథకాల కింద జరిగే కేటాయింపుల తీరుతెన్నులు చూస్తే వారికి ఉద్దేశించిన పథకాలలో కేవలం 50.7 శాతం (రు. 28,698 కోట్లు) ఎస్‌టిల విషయంలో 51.24 శాతం (రు. 19,623 కోట్లు) మాత్రమే నిర్దేశిత లక్ష్యాలకు చేరుతున్నాయి. అత్యధిక భాగం సాధారణ ఖర్చుల కింద జీతభత్యాల కింద పోతున్నాయి. నేరుగా లబ్ధిదారులకే ప్రయోజనం అన్న సూత్రానికి ఇది పూర్తి విరుద్ధం. మరోవైపు ఈ బడ్జెట్‌లో ఎస్‌సి ఎస్‌టిలకు సంబంధించిన కేటాయింపుల్లో మౌలికమైన మార్పు ఒకటి తీసుకొచ్చింది. వారి కోసం కొనసాగుతున్న సబ్‌ప్లాను పద్ధతిని మార్చి ఎస్‌సి కంపోనెంట్ (భాగం), ఎస్‌టి కంపోనెంట్ అంటూ చూపించారు. వీటినే ఎస్‌సిసి ఎస్‌సిటి అని పేర్కొన్నారు. ఇదొక అవాంఛిత తిరోగామి చర్య.

వ్యవసాయం, గ్రామీణాభివృద్ధిపై ఖర్చు జిడిపిలో 1.15 శాతం నుంచి 1.08 శాతానికి తగ్గిపోయింది. మొత్తం ఆరోగ్య రంగం వ్యయం జిడిపిలో 0.32 శాతం నుంచి 0.29 శాతానికి పడిపోయింది. విద్యపై కేంద్ర ఖర్చు 0.49 శాతం నుంచి 0.45 శాతానికి తగ్గింది. మహిళా సంక్షేమ బడ్జెట్ జిడిపిలో 0.68 శాతం నుంచి 0.65 శాతానికి పడిపోయింది.

ఎస్‌టి సంక్షేమానికి కేటాయింపులు 1.6 శాతం కాగా, ఎస్‌సిలకు కేటాయింపు 2.32 శాతం మాత్రమే, వీరి జనాభాతో పోల్చుకుంటే కేటాయింపులు చాలా అత్యల్పమని అర్థమవుతుంది. అయితే రక్షణ వ్యయం మాత్రం రు. 2,95,511 కోట్లు కేటాయించింది. గత కేటాయింపుల (రు.2,74,114 కోట్లు) తో పోలిస్తే 7.81 శాతం పెరిగింది. ఇది జిడిపిలో 1.58 శాతం వరకు ఉంటుంది. విద్యకు గత సంవత్సరం ఖర్చు చేసింది. రు. 81,869 కోట్లు కాగా ఈ సంవత్సరానికి 85,010 కోట్లు కేటాయించింది.

ఈ బడ్జెట్ ఉపాధి అవకాశాలను, సంక్షేమ కార్యక్రమాలపైన ఖర్చును తగ్గించింది. స్థూల జాతీయోత్పత్తి (జిడిపి)లో ప్రభుత్వ వ్యయం 13.2 శాతం నుంచి 13 శాతానికి తగ్గిపోయింది. గత ఏడాది కేంద్ర సామాజిక పథకాలపై పెట్టుబడి వ్యయం బడ్జెట్‌లో పెట్టుకున్న లక్ష్యాల కన్నా తక్కువగా ఖర్చు చేసింది. ఉపాధి కల్పనపై మోడీ సర్కారు తొలినుంచి కల్లబొల్లి కబుర్లే చెబుతోంది. దేశంలో 66 శాతం జనాభా 34 ఏళ్ల లోపు వారే. కాబట్టి ఉపాధి కల్పనే ప్రభుత్వ ప్రాథమిక ప్రాధాన్యం కావాలి. అందుకు విద్యారంగం ముఖ్యమైన పాత్ర పోషిస్తుంది. కాని మానవ సృజనశక్తుల తయారీకి తోడ్పడే విద్యారంగానికి తగిన నిధులు లేవు. ఈ ఆర్థిక సంవత్సరంలో 70 లక్షల కొత్త ఉద్యోగాలకు హామీ ఇచ్చింది. గత మూడేళ్లుగా ఏటా 0.4శాతం ఉద్యోగకల్పన క్షీణిస్తూ వచ్చిన నేపథ్యంలో ఈ హామీని ఎలా నెరవేర్చుతారో స్పష్టతలేదు. కోట్లాది మంది విద్యావంతులైన యువత ఆశలతో మోడీ సర్కారు చదరంగమాడుతోంది.

ప్రభుత్వరంగ సంస్థల్లో పెట్టుబడుల ఉపసంహరణ, పలు రంగాల్లో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు ఆహ్వానం వంటివి మరింతగా సంస్కరణలను పరుగులు పెట్టించనున్నాయి. కార్పొరేట్ పన్ను తగ్గించిన సర్కారు వేతన జీవుల పన్ను శ్లాబులను సవరించలేదు. చమురు ధరలపై ఆర్థిక సర్వేలో ఆందోళన వ్యక్తపరచగా బడ్జెట్‌లో ఆ విషయాన్ని కప్పెట్టింది. దిగుమతులపై పరిమితి విధించడానికి అదనపు కస్టమ్ సుంకాన్ని విధించడం, ఎగుమతులు పెంచడానికి ఏ చర్య చేపట్టకపోవడం మోడీ మార్కు పాలనకు నిదర్శనం. రైల్వే బడ్జెట్‌లో చెప్పుకోదగిన మెరుపుల్లేవు. మొత్తంగా ఈ బడ్జెట్ సామాన్యుణ్ణి కాకుండా కార్పొరేట్ శక్తుల ప్రయోజనాలు లక్ష్యంగా ఉన్నట్లు స్పష్టమవుతోంది. అంతిమంగా ప్రైవేటీకరణ దిశగానే దేశాన్ని నడిపే చర్యలనే బడ్జెట్‌లో చొప్పించారు.

తెలుగు రాష్ట్రాల ఆశలపై మరోసారి నీళ్లుజల్లారు. విభజన చట్టంలోని హామీలను విస్మరించారు. అమరావతి, రైల్వేజోన్‌ల ప్రస్తావన లేదు. ద్రవ్యలోటును భర్తీచేసేందుకు సాయం, పారిశ్రామిక ప్రోత్సాహకాలు, కడప ఉక్కు ఫ్యాక్టరీ ఉత్తరాంధ్ర, రాయలసీమకు నిధులు, ప్రత్యేక ప్యాకేజీ ఊసేలేదు. తెలంగాణకు ఇదే పరిస్థితి ఎదురైంది. తెలంగాణ ప్రభుత్వం ఆయా ప్రాజెక్టులకు అదనంగా 40 వేల కోట్లు కావాలని కేంద్ర ప్రభుత్వం దృష్టికి తెచ్చినా నిరుపయోగమైంది. కాళేశ్వరం, ప్రాణహిత-చేవెళ్ల ప్రాజెక్టులకు కూడా మొండి చెయ్యి చూపించారు. బయ్యారం ఉక్కు కర్మాగారం, కాజీపేట రైల్వే కోచ్ ఫ్యాక్టరీ, ఎయిమ్స్ హామీలు ఆచరణకు నోచుకోలేదు. ఇక మిషన్ భగీరథ, మిషన్ కాకతీయకు నిధుల కేటాయింపు పైనా చాలా కాలంగా తెలంగాణ ప్రభుత్వం కేంద్రాన్ని కోరుతున్నా బడ్జెట్‌లో ఆ ప్రస్తావన లేదు.

విద్యా, ఉపాధి, వ్యవసాయ రంగాలకు ప్రాధాన్యం ఇవ్వాలని ఆర్థిక సర్వే సూచించింది. వాస్తవానికి మోడీ పాలనలలో తీసుకుంటున్న ఆర్థిక విధానాలు ఈ లక్ష్యాలకు పూర్తి విరుద్ధంగా ఉన్నాయి. దేశ ఆర్థిక రంగాన్ని విదేశీ పెట్టుబడుల ఆధారంగా నిర్మించాలనుకునే భావన నుంచే మోడీ బడ్జెట్‌లు రూపుదిద్దు కుంటున్నాయి. అంతర్జాతీయంగా చోటుచేసుకుంటున్న కొత్త పరిణామాలు ఈ నమూనాను, దానిని నమ్ముకున్న దేశాలను ప్రమాదంలో పడవేశాయి. ఉపాధి అవకాశాలు లేని అభివృద్ధి అంకెల్లో ఎంత ఘనంగా ఉన్నా ప్రజలందరికీ అన్నం పెట్టదు. 125 కోట్ల మంది ప్రజలను బలోపేతం చేసే విధానాలు, ఆర్థిక లక్ష్యాలు, వీటికి అనుగుణమైన బడ్జెట్లే మనకు కావాలి. మోడీ సర్కారు ఆ పని చేసేందుకు సిద్ధంగా లేదని ఈ బడ్జెట్ మరోమారు రుజువు చేసింది. ఈ బడ్జెట్‌లో చర్యలన్నీ పేదసాదలను కాల్చుకు తినేవి, ప్రజలపై భారాలు మోపుతూ, కార్పొరేట్లకు రాయితీలు ధారపోసే ప్రజా వ్యతిరేక విధానాలు పౌర సమాజానికి ఆశనిపాతం.

అభివృద్ధి ప్రచార జోరులో ఉన్న బిజెపి, దేశంలో వస్తు తయారీ (మాన్యుఫ్యాక్చరింగ్) పరిశ్రమల్ని స్వయంగా దేశవాళీ పరిశ్రమలుగా తీర్చిదిద్దవలసిన తరుణంలో 'మేక్ ఇన్ ఇండియా' అంటూనే అమెరికా కంపెనీల ప్రవేశానికి అవకాశాలు, వెసులుబాటు కల్పించడం దాదాబాయి నౌరోజీ, ఆర్‌సీ దత్‌లు ఆశించిన స్వదేశీ భావనకు పూర్తి విరుద్ధం కాదా? విద్య, ఆరోగ్యం సామాజిక కార్యక్రమంగా స్వీకరించలేదు సరికదా, రోజువారీ వ్యవసాయ, కార్మిక, పార్ట్‌టైం ఉపాధిలో ఉన్న పారిశ్రామిక వ్యవసాయ కార్మికుల కనీస వేతనాల పరిరక్షణకు, ఉద్యోగావకాశాల కల్పనకు కొత్త బడ్జెట్‌లో తగిన భరోసా లేదు. ప్రజల కొనుగోలు శక్తి పెరిగినప్పుడే వస్తు ఉత్పత్తులకు గిరాకితో పాటు ఉపాధి అవకాశాలు పెరుగుతాయి. ఈ దిశలో బడ్జెట్ రూపకల్పన జరుగలేదు. ప్రజల జీవన ప్రమాణాలు పెరుగుదలకు బడ్జెట్‌లో ఎలాంటి చర్యలు కనపడడం లేదు. ఈ విషయాన్ని ప్రస్తావించిన వివిధ సర్వే నివేదికల అంచనా ప్రకారం రోజువారి కూలీ వేతనానికి ఉన్నతాధికారి పొందే వేతనం మధ్య అంతరం వందల రెట్లు ఉంది.

దేశ ఆర్థిక వ్యవస్థ అందరికీ సమానావకాశాలు, సమాన న్యాయం, వివక్షలేని స్వేచ్ఛ కల్పించాలన్న రాజ్యాంగ నిర్దేశాన్ని పాటించాలి గానీ కృత్రిమ సంపాదనల ద్వారా 'అదృష్టరేఖలు' చూసుకుంటున్న వారికి అండదండలుగా నిలవకూడదు. ప్రజా ప్రయోజనాలను కాపాడగల నిర్దిష్ట విధానాల ఆచరణ కావాలి. ఈసారి బడ్జెట్‌లో కూడా ప్రభుత్వ మాటలకు, కేటాయింపులకు, ఆచరణకు మధ్య పెద్ద వ్యత్యాసం ఉంది. మొత్తంగా ప్రజా సమూహాలకు నిరాశ మిగిల్చింది. కార్పొరేట్ అనుకూల, ఉద్యోగ, కార్మిక, ప్రజావ్యతిరేక విధానాలు, చర్యలకు పాల్పడుతున్నది మోడీ ప్రభుత్వం. పెట్టుబడి సేవకు కట్టుబడి ప్రజలకు ప్రపంచీకరణ ప్రవచనాలు, ప్రభోదాలు చేస్తున్నారు. ప్రపంచంలో విఫలమైన సదరు నమూనాతో ప్రజల అభివృద్ధి అసాధ్యం. ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు, మతతత్వ రాజకీయాలతో మోడీ ప్రభుత్వం లాగానే ఆకర్షిత నినాదాల ద్వారానే నాజీ హిట్లర్ చాపకింద నీరులా ఫాసిజాన్ని అమలు పరిచాడు. తస్మాత్ జాగ్రత్త.

*(రచయిత రాజనీతిశాస్త్ర విద్యార్థి, ఉపాధ్యాయ నాయకులు)* వీ

# ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక రైల్వేజోన్

***ఆంధ్రప్రదేశ్‌కి ప్రత్యేక రైల్వేజోన్ అంశం బిజెపి ఎన్నికల హామీలకే పరిమితమైంది తప్ప అమలు జరగడం లేదని, ప్రజల అవసరాలను దృష్టిలో పెట్టుకొని ఏర్పాటు చేయాలని అంటున్నారు చిమ్మె జాన్ బర్నబాస్***

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విభజన సమయంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి రావలసిన విశాఖపట్నం కేంద్రంగా ప్రత్యేక రైల్వేజోన్ విషయం మళ్లీ తెరమీదకి వచ్చింది. ఈస్ట్ కోస్ట్ రైల్వేజోన్, దక్షిణ మధ్య రైల్వేజోన్‌ల పరిధిలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఉండడం వలన, ఈ రెండు జోన్‌లలోని మధ్య భాగాన్ని అనగా విశాఖపట్నం కేంద్రంగా, వాల్తేర్ డివిజన్ అనే ఒక ప్రత్యేక రైల్వే డివిజన్ ఏర్పాటు చేయాలనే డిమాండ్ ప్రజల నుంచి వస్తున్నది. అంతేకాకుండా అది 2014 పార్లమెంట్ ఎన్నికల సందర్భంగా భారతీయ జనతా పార్టీ ఎన్నికల హామీ కూడాను. విశాఖపట్నం లోక్‌సభ సభ్యుడు కంభంపాటి హరిబాబు బిజెపి పార్టీకి చెందినవాడే.

భారతీయ జనతా పార్టీ నాయకత్వంలోని ఎన్‌డిఎ ప్రభుత్వం నాలుగు సంవత్సరాలుగా నాలుగు బడ్జెట్లు ప్రవేశపెట్టినప్పటికీ, వాటన్నింటిలోనూ కూడా విశాఖపట్నం రైల్వేజోన్ విషయం మాత్రం ప్రస్తావనకు రావడం లేదు. దానిని భారతీయ జనతా పార్టీ నాయకత్వం ఎందుకు నాన్చుతున్నదో అర్థం కావడం లేదు. కేంద్ర రైల్వే శాఖా మంత్రి సురేశ్ ప్రభు కూడా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నుంచే రాజ్యసభకు ఎన్నికయ్యారు. ఆయన ఎన్నికైన సందర్భంగా జరిగిన మొట్ట మొదటి ప్రెస్ కాన్ఫరెన్స్‌లో కూడా విశాఖపట్నం కేంద్రంగా కొత్త రైల్వేజోన్ నిర్మాణం తప్పకుండా తీసుకొస్తామని చెప్పారు. అది ఆయన ప్రగాఢ సంకల్పం కూడా.

కేవలం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి మాత్రమే ప్రత్యేక రైల్వేజోన్ ఉండాలనే డిమాండ్‌కు ప్రధాన కారణం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర (రెవెన్యూ) భూ భాగం దాదాపు 3,594 కిలోమీటర్లు వివిధ రైల్వేజోన్‌లలో ఇమిడి ఉన్నది. అనగా దక్షిణ (సౌత్ సెంట్రల్) మధ్య రైల్వేజోన్‌లో 2,785 కిలోమీటర్లు, తూర్పు తీరం (ఈస్ట్‌కోస్) లో 515 కిలోమీటర్లు, నైరుతి (సౌత్‌వెస్ట్ జోన్) లో 224 కిలోమీటర్లు, దక్షిణ (సౌత్) రైల్వేజోన్‌లో 70 కిలోమీటర్ల భూ భాగం కలదు. అనగా దాదాపు నాలుగు రైల్వేజోన్‌లలో ఆంధ్రప్రదేశ్ భూభాగం ఉన్నది. దీనిని కూర్చు చేసి ప్రత్యేక రైల్వేజోన్ ఏర్పాటు చేయడానికి ఎప్పటి నుంచో కసరత్తు జరుగుతున్నది. కానీ దానికి కేంద్రం లో ఉన్న భారతీయ జనతా పార్టీ నాయకత్వం, దక్షిణ భారతదేశ రాష్ట్రాల మీద ఉన్న చిన్నచూపు కారణంగా దీనికి వెనుకంజ వేస్తున్నది. వాస్తవానికి ఈస్ట్‌కోస్ట్ డివిజన్‌లో ఉన్న విశాఖపట్నం రైల్వే ఆదాయం మొత్తం డివిజన్‌ల వారీగా చూస్తే దాదాపుగా 55 శాతం ఉన్నది (అధికం). ఇంత ఆదాయం ఇచ్చే జోన్ డివిజన్‌ల వారీగా ఏ జోన్‌కు లేదు.

**ప్రత్యేక జోన్ వలన కలిగే ప్రయోజనాలు:**

ప్రస్తుతం తూర్పుకోస్తా జోన్ పరిధిలో ఉన్న వాల్తేర్ డివిజన్ ఉండగా ఇక్కడ నుండి అధిక ఆదాయం వస్తున్నప్పటికీ రైళ్ల కేటాయింపు, వివిధ ప్రాజెక్టుల విషయంలో వాల్తేర్ నిర్లక్ష్యానికి గురవుతున్నది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి సుదీర్ఘమైన తీరం ఉంది. రాష్ట్రం మొత్తం ఒకే జోన్ పరిధిలోనికి తెస్తే, తీరంలోని పోర్టులన్నీ వస్తాయి. వీటి ద్వారా జరిగే రవాణా మొత్తం ఆదాయం విశాఖ జోన్‌కే వస్తుంది. ఇతర జోన్‌ల వారు కూడా ఈ పోర్టుల నుంచి సరుకు రవాణా చేసుకుంటే రుసుములను స్థానిక జోన్‌కే చెల్లించాల్సి ఉంటుంది. తద్వారా అధిక ఆదాయం లభిస్తుంది.

తీర ప్రాంతంలోని సరుకు రవాణా పరంగా ఏర్పడే ఇబ్బందులను పరిష్కరించుకునే సామర్థ్యం జోన్‌కే ఉంటుంది. ఉదాహరణకు అదనపు రేట కావాలన్నా అదనపు రూట్‌లలో రైళ్లను నడపాలన్నా నిర్ణయాలను వెంటనే తీసుకోవచ్చును.

విశాఖ నుంచి మొదలవ్వాల్సిన రైళ్లన్నీ భువనేశ్వర్‌కు మళ్లించడంపై తీవ్ర విమర్శలు వచ్చాయి. ఇక్కడ జోన్ వస్తే గనుక, విశాఖ నుంచే ఉత్తరాంధ్ర రైళ్లన్నీ మొదలయ్యే అవకాశం ఉంటుంది. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల డిమాండ్‌లను జోన్ ద్వారా సాధించుకోవచ్చు. రిజర్వేషన్ కోటా కూడా ఎపికే ఎక్కువగా ఉంటుంది.

ప్రత్యేక రైళ్ల విషయమై ప్రస్తుతం నిర్ణయాలన్నీ తూర్పు కోస్తా రైల్వేనే తీసుకుంటోంది. విశాఖ కేంద్రం నుంచి ఎలాంటి డిమాండ్ వెళ్లినా ఏటా మొండిచేయి ఎదురవుతోంది. జోన్ వస్తే ఈ పరిస్థితి ఉండదు. పండుగలకు, ప్రత్యేక సందర్భాలకు, సెలవులకు ప్రత్యేక రైళ్లను నడిపే అధికారం జోన్‌కే ఉంటుంది. రైల్వే ప్రయాణికుల పరంగా, సరుకు రవాణా చేసే సమయంలో ఎలాంటి ఇబ్బందులు వచ్చినా బాధ్యతా యుతంగా ఉండడానికి, పనిచేయడానికి చీఫ్ ప్యాసింజర్ ట్రాఫిక్ మేనేజర్, చీఫ్ కమర్షియల్ మేనేజర్ (సిసిఎం) లాంటి ఉన్నతాధికారు లంతా అందుబాటులో ఉంటారు. ఎలాంటి పక్షపాతం లేకుండా సమస్యలను పరిష్కరించుకోవచ్చు.

రైల్వే రిక్రూట్‌మెంట్ బోర్డ్ (ఆర్ఆర్‌బి) కూడా జోన్ కేంద్రంగానే ఉంటుంది. ఉద్యోగాల నియామకం నేరుగా చేయవచ్చు. స్టేషన్ల అభివృద్ధి, వసతుల కల్పనపై కూడా దృష్టి పెట్టవచ్చు. పరోక్షంగా ఉపాధి అవకాశాలు కూడా పెరుగుతాయి. అవసరమైన చోట లోకల్ రైళ్లను కూడా పెంచుకునే అవకాశం ఉంటుంది. రూట్ స్లాట్‌ను తీసుకునే అవకాశం, అధికారం జోన్‌కే ఉంటుంది.

స్థానిక ప్రజల డిమాండ్‌లనే పార్లమెంట్ సభ్యులు కోరినవి తప్ప మరొకటి ఏమీ లేవు. డివిజన్ నుంచి జోన్‌కు, జోన్ నుంచి బోర్డుకు పంపి అనుమతి కోసం వేచి చూడాల్సి వచ్చేది. ఇప్పుడు అలా కాకుండా నేరుగా జోన్ నుంచి బోర్డుకు ప్రతిపాదనలు పంపి డిమాండ్‌లను తీర్చుకునే అవకాశం వస్తుంది.

ప్రస్తుతం ఈస్ట్ కోస్ట్ జోన్ కింద ఉన్న వాల్తేర్ డివిజన్‌లో ఎపి రూట్ 515.87 కి.మీ, (ట్రాక్ 1384.84 కి.మీ,ఛత్తీస్‌గడ్ ప్రాంతం

# పొత్తుదారిలో పవన్ కళ్యాణ్ జనసేన

*రెండు రాష్ట్రాల్లోని అధికార పార్టీలను రానున్న ఎన్నికల్లో తిరిగి అధికారంలోకి తేవడమే జనసేన పార్టీ లక్ష్యం తప్ప మరొకటి కాదని దాని కార్యాచరణే చెబుతుందని అంటున్నారు* **వై.హెచ్.కె. మోహన్‌రావు**

'**నా**క్కొంచెం తిక్కుంది! దానికో లెక్కుంది' అనేది 'గబ్బర్‌సింగ్' అనే చలన చిత్రంలోని విస్తృత ప్రచారం పొందిన పవన్ కళ్యాణ్ డైలాగ్. అయితే ఏ లెక్కకూ అందడం లేదంటున్నారు రాజకీయ విశ్లేషకులు.

ఇటీవల తెలంగాణ, ఎపి రాష్ట్రాలలో పర్యటించిన ఆయన నోటి వెంబడి వెలువడిన పరస్పర వైరుధ్య భాషణలు, భూమికలేని ప్రసంగాలు ఈ మేరకు సూత్రీకరిస్తున్నాయి అంటున్నారు. ప్రశ్నిస్తాను, ఆపై పోరాడతాను అంటూ జనసేన జెండాతో బయలుదేరిన జనసేనాని వైఖరిలో ప్రశ్నా పోరూ రెండు అనుమానాస్పదమే అంటున్నారు మేధావులు. రాబోవు ఎన్నికలలో ఎవరితో కలిసి ప్రయాణం చేస్తాడా! అనే సందిగ్ధానికి కూడా ఆయన కొద్ది కొద్దిగా ముసుగును తొలగించుతున్న సందర్భంలో పవన్ అస్వతంత్రునిగానే రాజకీయాలలో ఎదగాలని కాంక్షిస్తున్నట్లుగా బోధపడుతుంది అంటున్నారు. అస్వతంత్రంగా ఎదగడం రాజకీయాలలో సాధ్యమేనా అని కూడా ప్రశ్నిస్తున్నారు.

గత కొంతకాలంగా మేలిముసుగుతో అస్పష్టంగా కనిపిస్తున్న జనసేన రాజకీయాలు అనంతపురం పర్యటనలో పొత్తుపై జారిన మాటలు ముసుగును తొలగించాయి. సరికొత్త రాజకీయాలు చేస్తానంటూ బయలుదేరిన పవన్ కళ్యాణ్‌కు ఎలాంటి జెండా ఎజెండా లేదంటున్నారు విజ్ఞులు. మరో వేషగానితో ఎపి ప్రజలు ఇంకోమారు మోసపోవడమే జరుగనుందన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు.

ప్రశ్నిస్తాననే పవన్ కళ్యాణ్ కూడా సమాధానాలు చెప్పవలసిన ప్రశ్నలు తమవద్ద ఉన్నాయని ప్రజలంటున్నారు. వాటిలో కొన్నేంటంటే! ఇప్పటి వరకూ ఆయన సినిమాలకు పొందిన పారితోషికమెంత? తను చెల్లించిన ఆదాయపు పన్ను ఎంత? ఆయన సినిమాలు విడుదలైన సందర్భాలలో విక్రయించే టికెట్ ధర ఎంత? ప్రభుత్వం నిర్ణయించిన ధరలకే విక్రయిస్తున్నారా? 10 నుండి 20 రెట్లు ధరలు పెంచి విక్రయం జరుగుతుంటే, ఆయన ఎందుకు నిలువరించలేదు. తన ఆస్తులన్నింటినీ మార్కెట్ విలువతో ముదింపు చేస్తారా? ఆ ప్రకారం ఆదాయపు పన్ను శాఖకు కాప్టెల్‌గైన్ పన్ను చెల్లిస్తారా? తన కుటుంబంలోని వారిని కూడా ఈ దిశగా మళ్లిస్తారా? ఈ ప్రశ్నలన్నీ ఆయన నీతి, నిజాయితీ, నైతిక, పారదర్శకమైన ఆదాయ వ్యయాలకూ, ఆస్తులకూ సంబంధించినవి

---

169.936 కి.మీ, (ట్రాక్ 228.27 కి.మీ), ఒడిశా ప్రాంతం 420.65 కి.మీ (ట్రాక్ 553.846 కి.మీ) ఉంది. అనగా వాల్తేర్ డివిజన్‌లో కిలోమీటర్ల వారీగా 46 శాతం, ట్రాక్ వారీగా 63 శాతం ఆంధ్రప్రదేశ్ వాటా ఉంది.

ఉత్తరాంధ్ర ప్రజలు, నిరుద్యోగులు, విద్యావంతులు ఇక్కడ సరైన ఉపాధి లేక వేరు వేరు ప్రాంతాలకు వలస వెళుతున్నారు. రాజ్యాంగంలోని ఆర్టికల్ 371-డి ప్రకారం ప్రభుత్వ సంస్థల్లో 55 శాతం స్థానికులకే ఉద్యోగాలు ఇవ్వాల్సి ఉంది. గతంలో విశాఖ స్టీల్ ప్లాంట్, పోర్ట్‌లలో కూడా ఇదే విధంగా ఉద్యోగాలు ఇవ్వబడ్డాయి. రైల్వే ద్వారా జరిగే చౌకైన రవాణా కార్గో హ్యాండ్లింగ్‌లో విశాఖ పట్టణానికే ప్రాధాన్యత ఉంది. విశాఖ కేంద్రంగా జోన్ ఏర్పడితే కార్గో రవాణా అభివృద్ధి చెందే అవకాశాలున్నాయి. దీని వలన ఉపాధి అవకాశాలు మెరుగయ్యే పరిస్థితి ఉంది. ఎలాగూ వందలాది ఎకరాలు రైల్వే పరిధిలో, రైల్వే స్వాధీనంలో ఉన్నది కాబట్టి అదనపు భూసేకరణ జరుపకుండానే జోన్ కార్యాలయాలు ఏర్పాటు చేయడానికి ఏమాత్రం కొత్త భూమి అవసరం పడదు. ఇది కూడా పరిగణనలోనికి తీసుకోవాల్సిన అంశం. దీనిని దృష్టిలో పెట్టుకొని విశాఖ కేంద్రంగా రైల్వేజోన్ కేంద్ర ప్రభుత్వం ఏమాత్రం తాత్సారం చేయకుండా వెంటనే ప్రకటించడం మంచిది. లేనిచో ఇప్పటికే 'రైల్వేజోన్ సాధన సమితి' పేరుమీద, ఉత్తరాంధ్ర అభివృద్ధి వేదికల పేరుమీద వివిధ ప్రాంతాలలో సదస్సులు, చర్చా వేదికలు జరుగుతున్నాయి. ఇది భవిష్యత్‌లో పెద్ద ప్రజా ఉద్యమంగా మారే అవకాశం ఉంది.

కేంద్ర ప్రభుత్వం దీనిని రాబోయే 2019 సంవత్సరం పార్లమెంట్ ఎన్నికల అంశంగా మార్చాలని చూస్తున్నది. పక్కన ఉన్న ఒడిశా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఒకేసారి ఎన్నికలు రాబోతున్నందున, దీనిని ఒడిశాలో ఉపయోగించుకునేందుకు భారతీయ జనతా పార్టీ నాయకత్వం ప్రయత్నిస్తున్నది. విశాఖ జోన్ రాకుండా చేయడానికి ప్రస్తుత కేంద్ర పెట్రోలియం శాఖా మంత్రి ధర్మేంద్ర ప్రధాన్ తీవ్రంగా కృషి చేస్తున్నారు. అదే విధంగా తెలుగుదేశం పార్టీకి చెందిన కేంద్ర మంత్రులు సుజనా చౌదరి, అశోక్ గజపతి రాజులలో కూడా చిత్తశుద్ధి లేదు. ముఖ్యంగా, ప్రధాన పోర్ట్ ఫోలియో అయిన పౌర విమానయానా శాఖా మంత్రి అయిన విజయనగరం పార్లమెంట్ సభ్యుడు అశోక్ గజపతిరాజు ఈ అంశంపై నోరు మెదపడం లేదు.

ప్రజల నుంచి వస్తున్న డిమండ్‌లను సయితం పార్లమెంట్‌లో ప్రస్తావించకపోవడం విచారకరం. కేంద్ర ప్రభుత్వంలో టిడిపి-బిజెపి రెండూ కలిసి ఉంటున్నాయి కాబట్టి రైల్వేజోన్ అంశం ఇరువురీ బాధ్యతగా సాధించాలి. ఒకరిపై ఒకరు ఆరోపణలు చేసుకుంటూ సమయం వృథా చేయడం విచారకరం, ప్రజా వ్యతిరేకం.

విశాఖ రైల్వేజోన్ 'ఆంధ్రుల హక్కు'గా భావించాలి. ఇది భవిష్యత్తులో ఉద్యమరూపం దాల్చకముందే కేంద్ర ప్రభుత్వం 'ఆర్డినెన్స్'ను విడుదల చేయాలి. లేనిచో జరుగబోయే పరిణామాలకు బిజెపి-టిడిపి రెండూ మూల్యం చెల్లించుకోక తప్పదు.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

అంటారు ప్రజలు. ఇంకా అనేకం ఉన్నాయంటారు.

ఎపి ప్రత్యేక హోదా విషయంలో పవన్ వ్యాఖ్యలు ఒక మొరటు నానుడిని గుర్తుకు తెస్తున్నాయి. 'మిట్ట మధ్యాహ్నం నిద్రలేచిన ఒక ప్రబుద్ధుడు తెల్లవారిందహో' అంటూ డప్పుకొట్టి చెప్పాడట. ప్రధాన ప్రతిపక్ష పార్టీ వైఎస్ఆర్‌సిపి, ఇతర పార్టీలపై హోదా గురించి ఆయన విసురుతున్న వాగ్బాణాలు పై నానుడికి సరిగ్గా అన్వయమవుతాయి. ఇటీవల వరకూ పాలక టిడిపి హోదా గురించి కేంద్రంతో తలపడి బొప్పికట్టి మిన్నకుండడం మనందరికీ ఎరుకే. ఇప్పటికీ ఆ పార్టీ ప్రజా ప్రతినిధులు అలవోకగా హోదా అవసరాన్ని గూర్చి ప్రస్తావిస్తూనే ఉంటారు. వైఎస్ఆర్‌సిపి, ఇతర పార్టీలు ఆ డిమాండును విడువకుండా పోరాటం కొనసాగిస్తూనే ఉన్నాయి. ఇటీవల ముగిసిన శాసనసభ సమావేశాల సందర్భంలో అన్ని ప్రతిపక్ష పార్టీలు, ప్రజా సంఘాలు, మేధావుల సంఘాల నేతృత్వంలో హోదా డిమాండుపై అమరావతికి చలో అసెంబ్లీ ఆందోళన చేపడితే నిద్ర నుండి మేల్కొని జనసేనను మనం చూశాం. ఈ ఆందోళన పట్ల పవన్ కళ్యాణ్ నుండి కనీస స్పందన లేకపోయే. బహుశా చంద్రబాబు ప్రభుత్వాన్ని ఇరుకున పెట్టడం ఇష్టం లేకనే ఆయనలో అచేతనం నిండుకుందేమో! ఇప్పుడు డిసెంబర్, జనవరి మాసాలలో పవన్ చేపట్టిన చలోరే! చల్! చల్ యాత్రలో భాగంగా వైఎస్ఆర్‌సిపి హోదా గురించి గట్టిగా మాట్లాడడం లేదని ఆరోపించిన వైనం ఆయనలోని ఏ వివేకానికి ఆదర్శమో! అర్థం కాదు. ముద్దాయిని వదిలి ఫిర్యాదిని శిక్షించినట్లుగా ఉంది పవన్ తీరు. 10 ఏళ్లు చాలదు, 15 ఏళ్లు కావాలని కోరిన చంద్రబాబును, ఆయన పార్టీని వదిలి జగన్ పార్టీపై ఒంటికాలితో లేవడం సహేతుక సంకేతాలను ఇవ్వదు. పాచిపోయిన లడ్డూలను బహుశా డస్ట్‌బిన్‌లో పడవేసి ఉండవచ్చు.

2019 నుండి తాను క్రియాశీల రాజకీయాలలో కొనసాగుతున్నానని కొండగట్టు పర్యటనలో చెప్పిన పవన్ కళ్యాణ్, ఇంకా తెలంగాణ సమస్యలను అధ్యయనం చేయాల్సి ఉందని ప్రకటించాడు. వాస్తవమే ప్రజారాజ్యం పార్టీ అనుబంధ యువత విభాగమైన యువరాజ్యానికి పవనే అధ్యక్షుడిగా వ్యవహరించాడు. ఏమీ అధ్యయనం చేయకుండానే ఎట్లా పంచలూడదీసి కొడతానన్నాడో! ఆయనే వివరిస్తే అర్థవంతంగా ఉంటుంది. 18 మంది శాసనసభ్యులు గల ప్రజారాజ్యం పార్టీని అన్న చిరంజీవి కాంగ్రెస్ పార్టీలో గంపగుత్తగా విలీనం చేస్తుంటే ఏమీ అధ్యయనం చేయకుండానే మిన్నకున్నాడా! జనసేన పార్టీ స్థాపించి కూడా నాలుగేళ్లకు చేరువకానుంది. రెండు రాష్ట్రాల్లో పోటీ చేస్తానంటున్న పవన్‌కు సమస్యల అధ్యయనానికి, ఆకళింపుకి ఎన్ని దశాబ్దాలు పడుతుందో? ప్రకటిస్తే! ప్రశ్నించే అవకాశం ప్రజలకు లేకుండా చేసినట్లు అవుతుంది. తనుతప్ప పార్టీకి ఏ స్థాయిలోనూ కార్యవర్గాలు లేని జనసేన పరిస్థితిని అర్థం చేసుకుంటే ఎవరికైనా పవన్ మనోగతం ఇట్టే అవగతమవుతుంది. ఇదో విచిత్ర రాజకీయం. పార్టీకి కార్య వర్గాలు లేకపోయినా అభిమాన అమాయక గుంపులను వెంటేసుకుని రాజకీయ పబ్బం గడపవచ్చనేది బహుశా పవన్ వ్యూహం కావచ్చు. అభిమాన మత్తులో సినీ యువత ఉన్నంత కాలం తను 'వైకుంటపాళి' జూదం ఆడుతూనే ఉంటాడు. సినీ అభిమాన శ్రేణులను తన రాజకీయ భవితవ్యానికి వాడుకోవడం కూడా ఒక అరుదైన కళాత్మకతే! ఈ కళలో పవన్ బాగానే అనుభవం సాధించాడు. గతంలో కూడా కొందరు చలన చిత్ర నటీ నటులు ఈ పంథాలో లాభపడి ఉన్నారు. అయితే వారికి, పవన్‌కు ఉన్న భేదం సుస్పష్టం. ఆయా రాష్ట్రాలలో రాజకీయ పార్టీలు స్థాపించిన చలన చిత్ర నటులు అన్ని సీట్లకు పోటీ పడినారు. మొత్తం రాష్ట్ర పాలనాధికారాన్ని హస్తగతం చేసుకునే లక్ష్యంతో రాజకీయ పార్టీలు స్థాపించినవారే! పవన్ అన్న చిరంజీవిని కూడా ఈ కోవలోకే చేర్చవచ్చు. కాగా పవన్ తమ పార్టీకి బలమున్న స్థానాలలో మాత్రమే పోటీ చేస్తామనడంలోనే మర్మమంతా ఉంది. తన అభిమాన గణాల సహకారంతో ఒక పార్టీని ఓడించి, మరో పార్టీని విజయ తీరానికి చేర్చే ప్రక్రియలో భాగమే పవన్ వ్యూహమై ఉంటుందనేది సర్వత్రా వినపడుతున్నది. రెండు రాష్ట్రాలలోని పాలక పార్టీలను ఆశ్రయించి, వారిని కొన్ని స్థానాలు దేబరించి, వారితో పొత్తు పెట్టుకుని, ఆయా పార్టీలకు ఉపయోగపడడం పవన్ లక్ష్యం కావచ్చు. బహుశా ఈయన ఎపిలో టిడిపి, తెలంగాణలో టిఆర్ఎస్ పార్టీలకు అవుట్ సోర్సింగ్ కొలువు చేయాలనుకుంటుండవచ్చు. అందుకే చంద్రబాబును అనుభవజ్ఞుడని, కెసిఆర్‌ను స్మార్ట్ అంటూ తెగ పొగిడేస్తున్నాడు.

రాష్ట్ర విభజన వలన మనస్తాపం చెంది 11 రోజులు నిద్రలేమి రాత్రులు గడిపాడట పవన్. అయ్యో! సున్నితమైన పవన్ ఎంత కలత చెందాడో! అయితే మెలుకువలో ఉన్నా ఆయన పెదవి విప్పకపోవడాన్ని మనమందరం సానుకూలంగానే అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. ఎపికి ఎట్లా న్యాయం చేయాలనే అంశంపై ఒక్క మాటంటే ఒక్కమాట మాట్లాడాడా! శూన్యం. ఎవరి మెప్పుకోసం ఈ దుఃఖ భరిత డైలాగులు. ఎవరిని ఉద్దరిస్తాయి. ఈ వ్యాఖ్యల పట్ల తెలంగాణ ప్రజానీకం ఆగ్రహించడంతో, జై తెలంగాణ నినాదం, వందేమాతరం సమానమంటూ మరో రాగం అందుకున్నాడు. ఫక్తు బూటకపు ఎత్తుగడలు గాక మరొకటి కాదంటున్నారు బుద్ధిజీవులు. 2014 ఎన్నికల సమయంలో కెసిఆర్ తాటతీస్తానని పేలిపోయిన పవన్‌ను వెయ్యి తునకలౌతాడని హెచ్చరించాడు కెసిఆర్. బిజెపికి మద్దతుగా మాట్లాడిన పవన్‌కు జవాబుగా జనసేన పార్టీని బిజెపి భజనసేన పార్టీగా పేరు మార్చుకోవాలని కెటిఆర్ వ్యంగ్యంగా ఒక పోటు పొడిచాడు. ఈ పూర్వ రంగమే కెసిఆర్‌ను స్మార్ట్ సిఎంగా మలిచిందని పవన్ భావించి ఉండవచ్చు.

ఇకపోతే ప్రశ్నిస్తానన్న పవన్ ఈ నాలుగేళ్లలో రెండు రాష్ట్రాల పాలకులను ఏనాడూ ప్రశ్నించినట్లు కనిపించదు. అడపా దడపా ప్రశంసించిన సందర్భాలే ఉంటాయి. ఎపిలోని సమస్యలపై వేళ్లమీద లెక్కవేయని సందర్భాలకు మించకుండా సిఎం చంద్రబాబును కలిసి విన్నపాలు చేసినట్లు గమనిస్తాము. పవన్ ఏకరువు పెట్టిన సమస్యలపై అన్నింటిపట్లా సానుకూల ఆచరణ మాత్రం అడగకండి. విపక్ష పార్టీలూ, ప్రజా సంఘాలూ, మేధావుల సంఘాలు ఉద్యమాలు, ఆందోళనల బాటపడితే, ముక్కు మూసుకుని ప్రపంచం పట్టనట్లు సినీ స్టూడియోలకూ, షూటింగులకూ మాత్రమే పరిమితమైన పవన్ సమస్యలను అధ్యయనం చేస్తానంటే నమ్మేవారు అమాయకులే అవుతారు. చంద్రబాబు ఇచ్చిన హామీలు అమలులోకి రాకపోయినా తిరిగి వాటి ఊసే ఎత్తకపోవడం పవన్ నిజాయితీని ప్రశ్నిస్తుంది.

ఉదాహరణకు ఫాతిమా వైద్య కళాశాల విద్యార్థుల సమస్య. డిసెంబర్ మాసంలో ఈ సమస్యపై ఉద్రేకపడిన పవన్ జనవరిలో జావగారి పోయాడు. ఆ సమస్య ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందంగా ఉంది. అయినా సరే! పవన్ దృష్టిలో బాబు అనుభవజ్ఞుడు. అందువలన బాబును ఇరుకున పెట్టకూడదు. ఈ సద్భావనతోనే ఓటుకు నోటు కేసులో చిక్కుకున్న టిడిపిని ఇబ్బంది పెట్టే యోచన చేయలేదట. ఈ అంశాన్ని హైలెట్ చేస్తే సిఎం చంద్రబాబు ఆత్మరక్షణలో పడిపోతాడట.

ఎంత పెద్ద మనసు పవన్ కళ్యాణ్‌ది. తప్పును తప్పు అనలేని ప్రజా నాయకుని ఎట్లా అంచన వేసుకుంటారో ప్రజలు. పోలవరం ప్రాజెక్టు స్థితిగతులపై శ్వేతపత్రాన్ని విడుదల చేయాలని కోరిన పవన్‌కు, సిఎం చంద్రబాబు ఆ అవసరం లేదని సమాధానమివ్వగానే రాముడు మంచి బాలుడిలా నోటిపై వేలేసుకుని మౌనం పాటించడమే ఆయన గొప్ప పోరాట పటిమకు నిదర్శనం. తెలంగాణ సమస్యలపైన అయితే పవన్ నోరు విప్పిన పాపానే పోలేదనేది సామాజిక వాస్తవం.

సరికొత్త రాజకీయమంటూ పర్యటనలు ప్రారంభించిన పవన్ రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులను కీర్తిస్తూ పోతున్నాడు. పొగడ్తలతో రాజకీయాలు చేస్తాననడం విడ్డూరం. ఈ వైనం ఏమిటో అర్థం కాక విశ్లేషకులు బుర్రలు గోక్కుంటున్నారు. వాస్తవానికి జనసేన పార్టీ అధికారానికి రావాలని లేదనేది ఆయనే స్పష్టం చేశారు. అంటే ఆయన ఏమి చేయాలనుకుంటున్నాడు. ఒక్కటైతే తేల్చిపడేశాడు. ఏదో ఒక పార్టీకి తోక పార్టీలా ఉంటుందని. ఏదో ఒకటేముందిలేండి! ఎపిలో నైతే అధికార టిడిపికి. ప్రజాభిష్టం మేరకు టిడిపితో పొత్తు విషయం ఆలోచిస్తున్నానని తన మనసులో దాగిన మాటకు తెరతీశాడు. అట్లా ఎపిలో తన వైఖరిని బట్టబయలు చేశాడు.

అదే విధంగా తెలంగాణ రాష్ట్రంలో పాలక టిఆర్ఎస్‌తో పొత్తుకు కాంక్షిస్తుండవచ్చు. అంటే ఎపి, తెలంగాణల్లో పాలక పార్టీల వద్ద కొన్ని సీట్లను దేబరిస్తాడన్నమాట. ఎపిలో ఓకే. తెలంగాణలో పవన్ పప్పులుడుకుతాయో లేదో చూడాలి. ఎపిలో కూడా పవన్ కోరినన్ని, కోరిన స్థానాలు పొందుతాడా! అనేది భవిష్యత్ తేలుస్తుంది.

ఇంకో కోణం గురించి అధ్యయనం చేస్తే కాకినాడ కార్పొరేషన్‌లో బిజెపి పెడుతున్న పెడబొబ్బలను కూడా పవన్ ఆకళింపు చేసుకోవలసి ఉంటుంది. తన పర్యటనల సభా సమావేశాల్లో అభిమానులంతా పవన్‌ను ఉద్దేశించి సిఎం, సిఎం అంటూ నినదిస్తుంటే తనకంత సీన్ లేదని స్పందిస్తున్నాడు. సిఎం పదవి చాలా కష్టసాధ్యమని ఆయన పలుకుతున్న చిలుక పలుకుల వెనుక అంతరార్థం ఇదేనేమో! అధ్యయనం చేయాలి, అధ్యయనం చేయాలి అంటూ పదే పదే జపం చేస్తున్న పవన్‌కు శ్రమ లేకుండా, కష్టపడకుండా సమస్యలు తనవద్దకు తెచ్చుకునే వెసులుబాటు ఒకటుంది. రెండు రాష్ట్రాల్లోని ఇద్దరు ముఖ్యమంత్రులూ ఒకరు పాదయాత్ర ద్వారా, మరొకరు సుదీర్ఘ ఉద్యమ పర్యటనల వలన అధ్యయనాల మీద అధ్యయనాలు, కసరత్తుల మీద కసరత్తులు చేసి ఎన్నిక సమయంలో రూపొందించిన ఎన్నికల ప్రణాళికలు అచ్చుగుద్దినట్లు అచ్చోసి నాలుగేళ్లు కావస్తుంది.

టిడిపి ఎన్నికల ప్రణాళికలో 600 హామీలున్నాయట. అదే విధంగా టిఆర్ఎస్ ప్రణాళికలో వందలున్నాయి. వాటిని ముందేసుకుని ఎన్ని అమలయ్యాయి. ఎన్ని విస్మరణకు గురయ్యాయో ఈజీగా తెలుసుకుని, వాటి అమలుకు ఆయన పోరు మొదలు పెట్టవచ్చు. అయితే పాలక రెండు పార్టీలపై ఉద్యమించే ఆలోచనే ఉన్నట్లు అగుపించదు.

కేవలం సినిమా అభిమాన సమూహాలు మాత్రమే పవన్ సభలకు హాజరయ్యారన్నది నిర్వివాదం. వాస్తవానికి వీరికి రాజకీయాలతో అవసరమే లేదు. పవన్‌పై అభిమానమే వీరిని ఆయన వెంట పరుగులు తీయించింది. జనసేన సిద్ధాంతాలు గాని, పవన్ ప్రసంగ పాఠాలు గాని వీరికి అవసరం లేదు. పవన్ ప్రసంగాలను శ్రద్ధగా విన్నవారు మచ్చుకు కూడా కనిపించరు. ఆయన మైకు ముందు మాట్లాడినంతసేపూ నినాదాలు, గొడవతోనే సరిపుచ్చుతారు. దాదాపు ఆయన పర్యటనలు, సభలు అన్ని ఈ పద్ధతిలోనే ప్రారంభమై ముగిశాయి. అంటే పవన్‌ను అనుసరిస్తున్న శ్రేణులు ఆయన విధానాలతో కంటే, సినీ మోజుతోనే అన్నది విస్పష్టం.

రెండు రాష్ట్రాలలో ఇప్పటి వరకూ ఎన్ని అవాంఛనీయ సంఘటనలు, దుర్ఘటనలు జరిగినా ఎప్పుడో ఆయనకు వీలైనప్పుడు, తోచినప్పుడు, ఒకటో అరో విషయాలపై స్పందించడం, సందర్శించడం మినహా ఆయనలో సమకాలీన విషయాలపై తక్షణ కదలికలు కనిపించనే కనిపించవు. విజయవాడ పడవ ప్రమాద మృతుల కుటుంబ సభ్యులను ఒంగోలులో పరామర్శించి, మంత్రి అఖిలప్రియపై విమర్శలు సంధించడం పెళ్లి అయిన ఆర్నెల్లకు మేళం ఊదడమే అవుతుంది. అప్పటికి ఆ దుర్ఘటన చోటు చేసుకుని ఎంతకాలమైంది. దటీజ్ పవన్ స్టైల్.

పరిటాల రవి వివాదం గురించి వాస్తవాలను వివరిస్తున్నానంటూ సినిమాలతో విసిగిపోయి గుండు చేయించుకున్నానని చెప్పిన పవన్ రాజకీయాలపై చిరాకేస్తే ఎవరికి గుండు కొడతాడోనని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. చంద్రబాబు సొంత మనుషులనే వాడుకుని వదిలేశాడని చెప్పిన పవన్ ఆయనతో పొత్తు ఏ నమ్మకంతో కొనసాగించి రాజకీయాల నుండి బయటపడతాడో వేచి చూడాలి. కేంద్రంలో అధికారంలో ఉండి దేశవ్యాప్తంగా తమకు ప్రతికూలంగా ఉండే నాయకులను కేసులు పెట్టి, జైళ్లలో కుక్కి ఒక ఆట ఆడించే ప్రధాని నరేంద్ర మోదీ నాయకత్వంలో ఎపిలో పనిచేసే బిజెపి శ్రేణులే తలలు బాదుకుంటున్న అయోమయంలో బాబుతో పవన్ ఎట్లా సర్దుకుపోతాడో భవిష్యత్ చెప్పాల్సిందే!

ఇది ఇలా ఉంటే పెరియార్ రామస్వామి విధానాలు తన సిద్ధాంతాలని పదేపదే చెపుతున్న పవన్ కళ్యాణ్‌కు పెరియార్ నాస్తికుడనే సంగతి తెలుసో తెలియదో! పెరియార్ ఆశయాలంటూ కొండగట్టు ఆంజనేయ స్వామి ఆరాధనతో తెలంగాణ పర్యటన ప్రారంభించి అపహాస్యం చేశాడు. అసలు పవన్ నోటికి ఏదోస్తే అది పలికే అలవాటున్నట్లుగా ఉంది. కమ్యూనిస్టులు కూడా తనకు స్ఫూర్తి, తరిమెల నాగిరెడ్డి 'తాకట్టులో భారతదేశం' చదివి ప్రభావితం చెందానని ప్రకటించుకునే పవన్ ఏ విషయంలో కూడా వారిని కలుపుకుపోయే ప్రయత్నం చేయలేదు. వారికి దూర దూరంగా ఉండడమే మనం గమనిస్తున్నాం. ఇటీవల సిపిఐ ఎపి కార్యదర్శి రామకృష్ణ పవన్‌ను సంప్రదించి అభిప్రాయాలు చర్చించుకున్న సంగతి గుర్తుండే ఉంటుంది. ఈ పరిణామాలన్నీ ప్రజలను, అభిమానులను మభ్యపెట్టి తన పబ్బం గడుపుకునే ప్రయత్నం మినహా మరొకటి కాదని తేటతెల్లం చేస్తున్నాయి.

సంకల్ప యాత్ర పేరుతో వైఎస్ఆర్ పార్టీ అధినేత జగన్మోహన్‌రెడ్డి చేస్తున్న పాదయాత్ర నుండి ప్రజల దృష్టిని మళ్లించడానికే టిడిపి ఎపిలో పవన్‌ను వెనుకనుండి పురమాయించిందనే ప్రచారం విస్తృతంగా హల్‌చల్ చేసింది. బలమున్నచోటే జనసేన పోటీ చేస్తుందని, టిడిపితో పొత్తు విషయం ఆలోచిస్తున్నానన్న పవన్ మాటలు ఈ ఆరోపణలకు బలాన్నిస్తున్నాయి.

స్వీయ ఆలోచనతో పార్టీని అధికారంలోకి తీసుకవచ్చే దృక్పథమే ఉంటే పవన్ రెండు రాష్ట్రాల వ్యాప్తంగా పాదయాత్రకు సిద్ధమయ్యేవాడని తెలుస్తుంది. ఈ కామెంట్ ఇట్లా ఉంటే! రెండు రాష్ట్రాల పరిధిలో వేల కిలోమీటర్లు నడిచే అంత సినిమా, సున్నితమైన పవన్‌కు లేదని మరికొందరు అంటున్నారు.

*(రచయిత గౌరవాధ్యక్షులు: గుంటూరు జిల్లా రచయితల సంఘం)* వీ

# తిరుమల తిరుపతి దేవస్థానంలో మత చిచ్చు

***తిరుమల తిరుపతి దేవస్థానంలో ఎంతో కాలంగా అన్ని మతస్తుల వారు పనిచేస్తుండగా, తాజాగా హిందువులే ఉద్యోగులుగా ఉండాలనే నిర్ణయం అంతర్గత విభేదాలకు కారణమవుతుందని అంటున్నారు ఎం.కె. కుమార్***

తిరుమల తిరుపతి దేవస్థానం (తితిదే)కు ప్రపంచవ్యాప్తంగా హిందూ ఆధ్యాత్మిక కేంద్రంగా గుర్తింపు ఉంది. తితిదే బడ్జెట్ ఏటా 2,500 కోట్లకు పైనే ఉంది. ఇందులో 8 వేలమంది శాశ్వత ఉద్యోగులు, 12వేల మంది కాంట్రాక్ట్, అవుట్‌సోర్సింగ్ ఉద్యోగులు ఉన్నారు. తితిదేలో హిందువులే కాకుండా ముస్లీంలు, క్రిస్టియన్లు, సింగ్‌లు అనాదిగా పనిచేస్తున్నారు. అన్ని మతాలకు చెందిన ఉద్యోగులు ఐక్యంగా సంవత్సరాలుగా సేవాభావంతో పనిచేయబట్టే, తితిదేకి అంతార్జాతీయ ఖ్యాతి దక్కింది.

తాజాగా తితిదేలో హిందువులే ఉద్యోగాలు చెయ్యాలి, హిందూయేతరులు ఉండకూడదనే చర్చను హిందూత్వ శక్తులు రేపాయి. క్రిస్టియన్లు కూడా తితిదే ఉద్యోగులుగా ఉన్నారని, వారు స్వామివారి ప్రసాదం తాకరని, వేంకటేశ్వరుని పటానికి దణ్ణం పెట్టరని, తిలక ధారణ చేయరని ప్రచారాన్ని జరుపుతున్నారు. ఈ విషయంలో తితిదేలోని హిందూ మతానికి చెందిన ఉద్యోగుల్లో భిన్నాభిప్రాయం ఉంది. హిందువుల్లోని కింది తరగతి ఉద్యోగుల్లో ఏ మతానికి చెందిన వారైనా ఆలయంలో కాకుండా మిగిలిన తితిదే విభాగాల్లో పనిచేయవచ్చని భావిస్తున్నారు. హిందువుల్లోని అగ్రవర్ణ ఉద్యోగుల్లో ఎక్కువమంది ఇటువంటి వారు ఉండకూడదని భావిస్తున్నారు.

మొత్తం 8 వేల మంది తితిదే ఉద్యోగుల్లో బిసి, ఎస్‌సి, ఎస్‌టీలు 5 వేలమంది వరకు ఉన్నారు. మిగిలిన 3 వేలమంది అగ్రవర్ణానికి చెందిన ఉద్యోగులు. తితిదేలో హిందూయేతర ఉద్యోగులు ఉన్నమాట వాస్తవమే. తితిదే సర్వీసు రూల్స్ ప్రకారం ఆ విధంగా ఉండడం చట్టసమ్మతమే. రాజ్యాంగానికి లోబడే ఇక్కడ హిందూయేతర ఉద్యోగులు పనిచేస్తున్నారు. వారివల్ల తితిదేకు ఎటువంటి అప్రతిష్ట కలగలేదు. వీరివల్ల తిరుమల, తిరుపతిలో ఎటువంటి చెడ్డ సంఘటనలు జరగలేదు. నిజానికి తిరుమలకు మందు, మాంసం, సిగరేట్లు తీసుకెళ్లి వ్యాపారం చేస్తున్న వారందరూ హిందువులే. నిషేధిత వస్తువులను సరఫరా చేసే వారిపై పెట్టిన కేసులను పరిశీలిస్తే, వారిలో అందరూ హిందూమతానికి చెందిన వ్యక్తులేనని స్పష్టం అవుతుంది.

తితిదేలో ఉన్న సామరస్య వాతావరణాన్ని, ఉద్యోగుల మధ్య ఉన్న సత్సంబంధాలను, ఐక్యంగా పనిచేసే స్వభావాన్ని దెబ్బతీయడానికి కొన్ని హిందూ అతివాద శక్తులు పనిచేస్తున్నాయి. ఇందులో భాగంగా తితిదేలో హిందూయేతరులను ఉద్యోగాల నుండి తీసివేయాలని బిజెపి, దాని అనుబంధ సంస్థలు నిరసన ప్రదర్శనలు చేస్తున్నాయి. తితిదే సానుకూలంగా స్పందిస్తూ మొదట విడతగా 45 మంది తితిదే ఉద్యోగులకు నోటీసులు జారీ చేసింది. నోటీసుల్లో వారిని హిందూయేతరులుగా పేర్కొంటూ, ఎందుకు వారిపై క్రమశిక్షణా చర్యలు చేపట్టకూడదో పేర్కొంది. తితిదే ఉద్యోగుల సర్వీసు రిజిస్టర్లను పరిశీలించి, అందులో క్రిస్టియన్, ముస్లీం అని రాసున్న వారిపై మాత్రమే ప్రస్తుతం చర్యలు తీసుకుంటున్నామని తితిదే చెపుతోంది. నిజానికి 2000 మందికి పైగా ఉద్యోగులకు రెండో విడతలో నోటీసులు ఇవ్వనున్నారు.

నిజానికి తితిదేలో వెంకటేశ్వర స్వామిని నమ్మిన వారికే ఉపాధి ఉండాలని సహజంగా అందరూ అనుకుంటారు. ఎందుకంటే హుండీలో హిందూ భక్తులే డబ్బులు చెల్లిస్తారని, అంతేకాకుండా హిందూయేతరుల వల్ల తిరుమల గుడికి నష్టం వాటిల్లే ప్రమాదముందని హిందువుల్లో కొంతమంది భావిస్తున్నారు. అది సరి అయింది కాదు. ఎందుకంటే తితిదేలోని 156 విభాగాల్లో టెంపుల్ అనేది ఒక విభాగం మాత్రమే. ఈ ఆలయ విభాగంలో హిందువులే పనిచేయాలని అనుకోవడంలో తప్పులేదు. మిగిలిన విభాగాల్లో ఎవరైనా పనిచేయవచ్చు.

1989 తర్వాత ఉద్యోగంలో చేరిన హిందూయేతర ఉద్యోగులైన 45 మందికి నోటీసులు తితిదే అందజేసింది. 1989 ముందర హిందువులు, హిందూయేతరులు తితిదేలో ఉన్నారు. ఈ విషయంపై ఈవో మీడియాతో మాట్లాడుతూ వారందరిని ప్రభుత్వ సంస్థల్లోకి పంపిస్తామని చెప్పారు. దానికి విరుద్ధంగా వారందరిని ఉద్యోగంలో నుండి తీసివేయడానికి ప్రస్తుతం పావులు కదుపుతున్నారు. ఈవో పై కేంద్ర ప్రభుత్వం వత్తిడి మేరకే ఈవో తన నిర్ణయాన్ని మార్చుకున్నట్టు వార్తలు వస్తున్నాయి. ఎందుకంటే అధికార పార్టీకి చెందిన కేంద్ర మంత్రుల సిఫారసు మేరకే, దక్షిణ భారతదేశానికి చెందిన ఈవోను తితిదేకు నియమించారని పత్రికలు పేర్కొన్నాయి. 45 మంది తితిదేలో ఆ కాలంలో ఉన్న నిబంధనల ప్రకారమే చేరారనే విషయం తితిదేకి తెలుసు. రాష్ట్రవ్యాప్తంగా హిందుత్వ సంస్థలు తితిదేలో క్రిస్టియన్లు, ముస్లీంలు ఉన్నారని, వారిని వెంటనే విధుల నుండి తప్పించాలని డిమాండ్ చేస్తున్నారు. మెజారిటీ గ్రూపుల అభిమతానికి అనుకూలంగా న్యాయస్థానాలు తీర్పులు వెలువరించినట్లే, తితిదే నోటీసులు జారీ చేసింది. ఈ విషయంపై రాష్ట్ర ప్రభుత్వం తితిదేకి ఎటువంటి షోకాజ్ నోటీసులు ఇవ్వలేదు.

2007లో వచ్చిన జీవో 1372, తితిదేలో హిందూయేతరులు ఉండకూడదని చెప్పబడింది. నిజానికి ఇది రాజ్యాంగ విరుద్ధమైన జీవో. ఎందుకంటే భారతదేశంలో ఒక ప్రాంతం ఒక మతానికి సంబంధించినదిగా ఉండకూడదు. చిన్నసైజు మత రాజ్యాలను స్థాపించడం లౌకిక రాజ్యంలో కుదరదు. అందుకే కాశీ, ఆయోధ్య, మధుర యాత్రాస్థలాల్లో గుడి పక్కనే మసీదులుండడం తెలిసిందే. తిరుచానూరులోను మసీదులు,

చర్చిలు ఉన్నాయి. తిరుమల వాటికన్ సిటీ కాదు. తిరుమల ప్రాంతం పూర్తిగా హిందూమతస్థులకే సంబంధించిన స్థలం కాదు. తిరుమల గుడికి కూతవేటు దూరంలోని ప్రాంతమంతా కేంద్ర అటవీ శాఖ అధీనంలో ఉంది. దీన్ని దృష్టిలో పెట్టుకోకుండా తిరుమల ఏడు కొండలు హిందువులదే అనే తప్పుడు ప్రచారం జరుగుతోంది. అటువంటి జీవోలు ఏవీ కేంద్ర ప్రభుత్వం ఇప్పటివరకు ఇవ్వలేదు.

తిరుమల ప్రాంతం హిందువులకే ఉండాలనే ఆకాంక్షను హిందూత్వ సంస్థలు వ్యక్తపరుస్తు న్నాయి. 2007కు ముందర తితిదేలో హిందూయేతరులు కూడా విద్యా, వైద్య విభాగాల్లో ఉద్యోగాల్లో చేరారు. 2007 తర్వాత కూడా కారుణ్య నియామకాల ద్వారా కొంతమంది హిందూయేతరులు ఉద్యోగాల్లో చేరారు. ఇదంతా తితిదే నిబంధనల ప్రకారం, ఉన్నతాధికారుల నిర్ణయం మేరకే జరిగింది. నోటీసులు తీసుకున్న వారందరూ తమ మతాలను సర్వీసు రిజిష్టర్లలో చట్టబద్ధంగా పొందుపరిచారు. తితిదేని ఎటువంటి మోసం చేయలేదు. ఇప్పటివరకు వారు తితిదేలో అన్యమత ప్రచారానికి పాల్పడిన దాఖలాలు లేవు. వారి కుల ధ్రువీకరణ పత్రాలను పరిశీలించిన తర్వాతే వారికి ఉద్యోగాలు ఇవ్వడం జరిగినది. తితిదేలో చట్టబద్ధంగా ఉద్యోగాల్లో చేరి, విధులు నిర్వర్తిస్తున్న వీరు తితిదేలో పదవీవిరమణ వరకు కొనసాగే హక్కు ఉంది. వీరిని తీసివేయడం తితిదేకి సాధ్యం కాదు.

45 మందిని అన్యమత ఉద్యోగస్థులుగా పేర్కొంటూ నోటీసులు అందజేసిన తితిదే వివక్ష చూపిందనే విమర్శలు ఉన్నాయి. 45 మందిలో 40 మందికి పైగా నాల్గవ తరగతికి చెందిన ఉద్యోగస్థులే ఉన్నారు. పారిశుద్ధ్య కార్మికులు, టెక్నికల్ రంగాల్లో పనిచేసేవారు అధికంగా ఉన్నారు. వీరంతా ఆలయాల్లో పనిచేయడం లేదు. గార్డెన్, వాటర్‌వర్క్స్, రవాణా, విద్య, వైద్య, రిసెప్షన్, విద్యుత్ తదితర విభాగాల్లో పనిచేస్తున్నారు. ఏ మాత్రం ప్రాధాన్యత లేని విభాగాల్లో పనిచేస్తున్నారు. వీరు ఎవ్వరూ, ఎప్పుడూ తితిదే ఆలయాల్లో పనిచేస్తామని కోరలేదు. కనీసం లేఖ సైతం ఇవ్వలేదు. వీరివల్ల తితిదేకి ఎటువంటి ముప్పులేదు. ప్రశాంతంగా ఉన్న తితిదేలో మత ఉద్రిక్తతలకు చోటు కల్పించేందుకు తితిదే తాజా నిర్ణయం దోహదపడే అవకాశం ఉంది. ఇప్పటికే తితిదేలో ముస్లీంలా అని కరపత్రాలను హిందుత్వ శక్తులు విరివిగా పంచుతున్నాయి. వారందరినీ తీసివేయాలని దేశ, రాష్ట్రవ్యాప్త ఉద్యమాలకు హిందుత్వ శక్తులు శ్రీకారం చుడుతున్నాయి.

రాజ్యాంగంలో లౌకికవాదాన్ని 1976లో 42వ సవరణ ద్వారా ప్రవేశికలో పొందుపరిచారు. మత స్వేచ్ఛను ప్రాథమిక హక్కుల్లో భాగంగా చేశారు. విధుల్లో కూడా పరమత సహనాన్ని, గౌరవాన్ని ప్రతి పౌరుడు కలిగి ఉండాలని రాయడం జరిగింది. ప్రతి పౌరుడు వ్యక్తిగత విశ్వాసం, నమ్మకం కల్గి ఉండొచ్చని రాజ్యాగంలో స్పష్టం చేయబడింది. రాజ్యాంగంలోనే మూడో భాగంలో ప్రాథమిక హక్కుల్లో మతస్వేచ్ఛను పొందుపరిచారు. ప్రకరణ 15 ప్రకారం మత ప్రాతిపదికన ప్రజల పట్ల వివక్షను చూపకూడదు. తితిదే ఈ ప్రకరణను ధిక్కరిస్తోంది. తితిదే ఉద్యోగాల్లో హిందూయేతరులను చేర్చుకుని, వారిపై ఇప్పుడు వివక్షను ప్రదర్శిస్తోంది. నోటీసులు అందుకున్న వారంతా అవమాన భారంతో దేశ ప్రజల ముందర దోషులుగా నిలబడేటట్టు తితిదే చేసింది. ప్రకరణ 16 ప్రకారం అన్ని మతస్థుల వారికి ప్రభుత్వ సంస్థలు సమాన ఉద్యోగ అవకాశాలు కల్పించాలి. తితిదే కూడా ప్రభుత్వంలో భాగమే. ప్రభుత్వ ఉద్యోగులకు ఇస్తున్న అన్ని సదుపాయాలు తితిదే ఉద్యోగులు పొందుతున్నారు. తితిదే సర్వీసు రూల్స్‌ను ప్రభుత్వమే పర్యవేక్షిస్తోంది. ఇటువంటప్పుడు అన్ని మతస్థుల వారికి తితిదే ఉద్యోగ అవకాశాలు కల్పించాలి. దీనికి విరుద్ధంగా తితిదే ప్రవర్తిస్తోంది. తితిదే లౌకికవాదానికి తూట్లు పొడిచే విధంగా, తన అధీనంలో ఉన్న హిందూయేతరుల పిల్లలకు సీట్లను ఇవ్వడం 2014 నుండి మానేసింది. ఇది రాజ్యాంగ వ్యతిరేక చర్య. విద్యాసంస్థల్లో హిందువులే చదవాలనే నిబంధన ఎక్కడా లేదు. క్రిస్టియన్ మిషనరీ పాఠశాలల్లో హిందువులు ఎంతోమంది చదువుకున్నారు. ప్రకరణ 25 ప్రకారం ప్రతి వ్యక్తి తన ఆత్మ ప్రబోధం మేరకు నచ్చిన మతాన్ని విశ్వసించి, ఆచరించవచ్చు. మతాన్ని మార్పు చేసుకోవడానికి స్వేచ్ఛను కల్గిఉన్నాడు. ఈ ప్రకరణ ప్రకారమే తితిదేలో పనిచేస్తున్న హిందువులు క్రిస్టియన్లగా మారారు. వీరికి సైతం భవిష్యత్తులో నోటీసులు అందజేయడానికి తితిదే ప్రణాళికలను సిద్ధం చేస్తోంది. తితిదేలో పారిశుద్ధ్య కార్మికుల్లో శాశ్వత, తాత్కాలిక సిబ్బందిలో 90 శాతం మంది దళితులే ఉన్నారు. వీళ్లలో కొంతమంది క్రిస్టియన్ మతాన్ని ఆచరిస్తున్నారు. వీరిని తితిదే తొలగించితే, ఆ మురికి శ్రమల్లోకి దళితేతరులు రారు. కాబట్టి వీరిపై చర్యలు తీసుకోవడానికి తితిదే జంకుతోంది. తాజాగా డిప్యూటీ ఈవోగా పనిచేస్తున్న స్నేహలత క్రైస్తవ మతాన్ని ఆచరిస్తోందని ఆమెకు తితిదే నోటీసులు జారీ చేసింది. ఆమె ఆదివారం చర్చికి వెళ్లిందని, ఆఫీసులో పూజకు హాజరు కాదని, శ్రీవారి ప్రసాదం తీసుకోదని ఆమెపై ఆరోపణలు చేసింది. ఆమె 30 సంవత్సరాలుగా తితిదేలో సేవలిందిస్తోంది. ఆమెపై ఎటువంటి రిమార్కు లేదు. ఆమె తన ఎస్‌ఆర్‌లో క్రిస్టియన్ అనే నమోదు చేసుకుని ఉద్యోగంలో చేరింది. ఆమె తితిదే ఆఫీసులో ఎటువంటి అన్యమత ప్రచారం చేయలేదు. చేసినట్టు ఎటువంటి ఆధారాలు లేవు. ఆమె తితిదే ప్రతిష్టకు భంగకరంగా ఎప్పుడూ ప్రవర్తించలేదు. తితిదే ఆలయాల్లో విధులు నిర్వర్తించలేదు.

ప్రకరణ 26 ప్రకారం ప్రతి పౌరుడు మత సంస్థలను నెలకొల్పి, నిర్వహించుకోవచ్చు. తమకిష్టమైన మత విశ్వాసాలను ప్రచారం చేసుకోవచ్చు. ఈప్రకరణ ప్రకారమే అన్యమతస్థులు తిరుపతి, తిరుమలలో మత ప్రచారం చేసుకోవచ్చు. రాజ్యాంగంలోని ప్రకరణ 28 ప్రకారం ప్రభుత్వ విద్యా సంస్థలోను, ప్రభుత్వ గుర్తింపు పొందిన ప్రైవేటు విద్యాసంస్థల్లోను మత బోధనలను నిషేధించడం జరిగింది. అయినా తితిదే విద్యాసంస్థల్లో హిందూమత బోధనలు జరుగుతున్నాయి. తితిదే అనుబంధ విశ్వవిద్యాలయాల్లో మతతత్వ ప్రచారాలు జరుగుతున్నాయి. ప్రకరణ 44 ప్రకారం ఉమ్మడి పౌర నియమావళిని ఏర్పాటు చేయాలి. ఏ మత విశ్వాసమైనా దేశ సమగ్రతకు, ఐక్యతకు భంగం కలిగించకుండా ఉండాలి. తితిదేలోని అన్యమత ఉద్యోగస్థులు దేశ భద్రతకు, సమగ్రతకు భంగకరంగా ప్రవర్తించలేదు. కనీసం తితిదే భద్రతకు ఎటువంటి ముప్పును తీసుకురాలేదు. ప్రతి ఏటా తిరుమలలో జరిగే బ్రహ్మోత్సవాల్లో భక్తులు చనిపోతున్నారు. తితిదే ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా తిరుమలలో అవాంఛనీయ సంఘటనలు జరుగుతూనే ఉన్నాయి. ఎంతోమంది తిరుమలలో చనిపోతే వైకుంఠప్రాప్తి జరుగుతుందని గదుల్లో ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఈ మరణాలకు ఎవరు బాధ్యత వహించాలి. దీనిపై హిందుత్వ శక్తులు ఎందుకు మాట్లాడవు. ఇవన్నీ హిందూమత వ్యవస్థలో

భాగంగా జరుగుచున్న మరణాలుగా కనపడవా. 2003లో అరుణరాయ్ వర్సెస్ ఇండియన్ యూనియన్ కేసులో సుప్రీంకోర్టు నిర్మాణాత్మకమైన లౌకికవాద స్ఫూర్తిని నింపడానికి విద్యాలయాల్లో వివిధ రకాల మతాల విలువలను బోధించవచ్చని పేర్కొంది. దీని ఆసరాగా చేసుకుని చాలా ప్రైవేటు విద్యా సంస్థలు అన్యమత విద్యార్థులపై బలవంతపు మత ప్రార్థనలను చేయిస్తున్నాయి. దీన్నే తితిదే అనుసరిస్తోంది.

45 మందితోనే తితిదే తన ప్రస్థానాన్ని ఆపడం లేదు. తితిదేలో 2000 మందికిపైగా క్రిస్టియన్ మతాన్ని ఆచరిస్తున్నారని, వీరంతా హిందువులుగా ఉద్యోగాల్లో చేరారని చెపుతోంది. త్వరలో తితిదే ఉద్యోగుల మెడకు పరమత ఆచరణ పేరిట నోటీసులు అందనున్నాయి. హిందూ ఉద్యోగుల్లో కొంతమంది అవినీతిపరులు ఉన్నారు, తిరుమల దేవాలయం లో ఇప్పటికీ అర్చకుల్లోని రెండు గ్రూపుల మధ్య పోరు జరుగుతూనే ఉంది. ఈ వర్గపోరు వల్ల శ్రీవారి నిత్యకైంకర్యాలు ఆలస్యం అవుతున్నాయి. ఆగమశాస్త్రానికి విరుద్ధంగా ఆలయంలో పూజాకైంకర్యా లలో అపరాధం జరుగుతున్నా తితిదే అర్చకులకు నోటీసులు ఇవ్వడం లేదు. ఇటువంటి వారిపై తితిదే ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదు. తితిదే ప్రతిష్టకు భంగకరంగా ప్రవర్తించిన వారిపై చర్యలు తీసుకోవడంలో తప్పులేదు. తితిదేలోని అవినీతిపరులపై చర్యలు తీసకోవడంలోను తప్పులేదు. తితిదే ఉన్నతికి హిందువులతో పాటు హిందూయేతరులు సైతం దశాబ్దాలుగా పాటుపడిన విషయాన్ని విస్మరించకూడదు. తిరుమల కేంద్రంగా ప్రతిరోజు కోట్లల్లో అవినీతి జరుగుతుంది. సేవా టికెట్లను వేల రూపాయలిచ్చి అమ్ముకుంటున్నారు. తిరుమలలో అక్రమ వ్యాపారాన్ని సుమారు 5 వేలమంది దళారీలు చేస్తుంటారు. వీరంతా ప్రముఖ వ్యాపారవేత్తలకు, రాజకీయనాయకులు, బ్యూరోక్రాట్ల మద్దతుతోనే ఉండ గలుగుతున్నారు. తితిదేకి సేవా టిక్కెట్లు అమ్మితే ఒక రోజుకి వచ్చే ఆదాయం 50 వేలకి మించి ఉండదు. కాని ఈ సేవా టిక్కెట్లను అక్రమంగా అధిక ధరకి అమ్ముతారు. రు.200 సుప్రభాత టిక్కెట్టును 10వేలకు అమ్ముతారు. తోమాల, అర్చన, సహస్రదీపాలంకరణ తదితర సేవా టిక్కెట్లను ఎక్కువ ధరకు అమ్ముతారు. ఒక రోజుకు అరకోటికిపైగా ఈ సేవా టిక్కెట్ల అక్రమ దందా ద్వారానే దండుకుంటున్నారు. ఆర్జితం కుంభకోణం 2012 లో జరిగింది. ప్రతి ఏటా టిక్కెట్లకి సంబంధించి ఏదో ఒక కుంభకోణం బయట పడుతూనే ఉంది. అయినా వారిపై చర్యలు లేవు. దీనిగురించి హిందూత్వ శక్తులు మాట్లాడవు. లడ్డూలు, రూములు అమ్ముకున్నారని పేదవారిని మాత్రమే పోలీసులు పట్టుకుని వారి ముఖాలకు ముసుగులు ధరించి మీడియా ముందు ప్రవేశపెట్టడం రివాజుగా మారింది.

ఇక నోటీసులు అందుకున్న 45 మందిలో హిందూమతాన్ని పాటించే వారు ఉన్నారు. తితిదేలోని బర్డ్ ఆసుపత్రిలో స్టాఫ్ నర్సుగా పనిచేస్తున్న డి. భాగ్యమ్మ హిందూ సంప్రదాయంలో పెళ్లిచేసుకుని, హిందూమతాన్ని ఆచరిస్తోంది. 1989లో తితిదేలో ఉద్యోగంలో చేరింది. ఆమె క్రిస్టియన్ పాఠశాలలో చదువుకోవడం వల్ల టిసిలో క్రిస్టియన్ అని రాశారు. దాన్నే ఆమె సర్వీసు రిజిస్టర్‌లో నమోదు చేయడంతో ఆమెకు నోటీసు అందింది. అలాగే సందీప్ అనే ఉద్యోగి తితిదే విజిలెన్స్ విభాగంలో పనిచేస్తున్నాడు. ఇతను, ఇతని కుటుంబం హిందూమతాన్ని ఆచరిస్తోంది. సందీప్ తండ్రి దేవప్రసాద్ తితిదేలో పనిచేస్తూ, చనిపోయాడు. ఆయన హిందువే. సందీప్ అమ్మ హిందువే. కాని సందీప్ సర్టిఫికేట్లలో ఇండియన్ క్రిస్టియన్ అని ఉండడంతో ఇతనికి నోటీసులు జారీ చేశారు. నోటీసులు అందుకున్న 45 మందిలో 30 మంది ముస్లింలు. వీరంతా దూదేకుల కులానికి చెందిన వారు. ఈ కులపు ఆచారాలన్నీ హిందూ మతాచారాలకు సంబంధించినవే. వీరు హిందూ సంప్రదాయాలను, ఆచారాలనే పాటిస్తారు. ధార్మిక సంస్థ అయిన తితిదేలో అన్యమత ప్రచారం చేస్తున్నారన్న ఆరోపణతో వీరందరికీ నోటీసులు అందించారు.

హిందువుల్లో చాలామంది అన్యమతాల్లోకి వెళ్లిపోతున్నారని దేశ ప్రధాని మోడీగారు ఘర్‌వాపసీని ప్రవేశపెట్టారు. మరి హిందుయేతరు లుగా ఉన్నవారు హిందూమతాన్ని పాటిస్తుంటే వారిని ఉద్యోగాల్లో తీసివేయడం ఎలా సమంజసమో తితిదే ఆలోచించాలి. వెంకటేశ్వర స్వామి హుండీలో అన్ని మతాల వారు డబ్బులు వేస్తున్నారు. వాటిలో నుండే తితిదే ఉద్యోగులకు జీతాలు అందుతున్నాయి. తిరుపతిలో శ్రీవారి భక్తులకు ముస్లింలు అన్నదానం చేస్తారు. తిరుపతిలోని ముస్లీం ఇళ్లల్లో శనివారం నియమాన్ని హిందువులు పాటించే విధంగానే ముస్లీంలు పాటిస్తున్నారు. మాంసం దుకాణాలను చాలామంది ముస్లింలు శనివారం నాడు తిరుపతిలో మూసివేస్తారు. తితిదేలోకి వచ్చిన అన్యమతస్థులు ఉపాధి కోసం మాత్రమే వచ్చారు. ఏ దురుద్దేశ్యంతోను రాలేదు. తిరుపతిలో మతచిచ్చును రేపడానికి మతశక్తులు ప్రయత్నిస్తు న్నాయి. అందుకుగాను తితిదేని ఉపయోగించుకోవాలని చూస్తున్నాయి. తద్వారా తిరుపతిని బిజేపి కంచుకోటగా మార్చాలని అధికారపార్టీ ప్రయత్నిస్తోంది. ఇవి ఫక్తు ఓటు రాజకీయాలు. ఈ రాజకీయాలకు తితిదే ఉద్యోగులు బలౌతున్నారు. తితిదేలో హిందూయేతరులను తీసివేసి మైనారిటీలను ఆర్థికంగా దెబ్బకొట్టాలని హిందుత్వ శక్తులు ప్రయత్నిస్తు న్నాయి. అలాగే వారికి తిరుమలలో ఎటువంటి ఉపాధిని అందివ్వకుండా చూస్తున్నాయి. ఇప్పటికే తిరుమల నుండి స్థానిక ప్రజలను తరిమేశారు. ఇదే గుజరాత్ అభివృద్ధి నమూనా. తిరుపతిలోని మైనారిటీలను వెళ్లగొట్టడానికి, వారిని ఉపాధి నుండి, వ్యాపారాల నుండి తరిమివేయ డానికి జరుగుతున్న కుట్రగా దీన్ని ప్రజాసంఘాలు, కమ్యూనిస్టు పార్టీలు అభివర్ణిస్తున్నాయి.

నిన్నటిదాకా సోదరులుగా ఉన్న ఉద్యోగస్థుల్లో మతవిద్వేషాలను రెచ్చగొడుతున్నారు. ఇది తితిదే ప్రతిష్టకు భంగం కలిగిస్తుంది. తితిదేపై మతాధిపతుల వత్తిడులు ఎక్కువయ్యాయి. ఇన్నాళ్లు పట్టించుకోని తితిదే 20 రోజుల క్రితమే నోటీసులు అందజేయడం వెనుక కేంద్ర ప్రభుత్వం హస్తం ఉందనే విమర్శలు వస్తున్నాయి. ఇంత జరుగుతున్నా రాష్ట్ర ప్రభుత్వం సున్నితమైన ఈ అంశాన్ని పట్టించుకోవడం లేదు. తితిదేకు ఎటువంటి మార్గదర్శకత్వం చేయడం లేదు. అన్యమత ఉద్యోగుల వల్ల ప్రమాదం లేనప్పుడు వారిని ఉద్యోగాల నుండి తీసి వేయాల్సిన అవసరం లేదు. ఏ సమస్యా లేని తితిదేలో మత ఉద్రిక్తతలను రెచ్చగొట్టడం వల్ల అధికారపార్టీకే లాభం చేకూరుతుంది. తితిదే ఉద్యోగుల తొలగింపు మానుకోవాలని, సంఘపరివార్ బారినుండి తితిదేను రక్షించుకుందామని తిరుపతిలోని ప్రజాసంఘాలు ఆందోళనలను కొనసాగిస్తున్నాయి. ప్రభుత్వం వెంటనే జోక్యం చేసుకుని నోటీసులు అందుకున్న ఉద్యోగుల ఆందోళనలను తొలగించాలి. వారి ఉద్యోగాలకు భరోసాను, భద్రతను ఇవ్వాలి. లౌకికరాజ్యంలో మత విద్వేషాలకు తావివ్వకుండా రాజ్యాంగం ప్రకారం పాలన కొనసాగించాల్సిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వానికి, తితిదేకి ఉంది. నోటీసులు అందుకున్న ఉద్యోగులు న్యాయంకోసం న్యాయస్థానాన్ని

# ప్రజా వ్యతిరేక జాతీయ వైద్య కమిషన్ బిల్లు

***ప్రభుత్వ వైద్యరంగంలోని అవినీతిని అరికట్టే పేరుతో జాతీయ వైద్య కమిషన్ బిల్లును తెచ్చి మొత్తం వైద్యరంగాన్నే ప్రైవేట్‌పరం చేయడం వల్ల సామాన్య ప్రజలకు వైద్యం, వైద్య విద్య దూరమవుతుందని అంటున్నారు* డా. నళిని**

నేడు విద్యా వ్యవస్థ లాగానే వైద్య ఆరోగ్య వ్యవస్థ కూడా మనదేశంలో గడ్డు పరిస్థితులు ఎదుర్కొంటోంది. 90వ దశకం నుంచి ప్రపంచీకరణ, సరళీకరణల ఫలితంగా ప్రైవేటీకరణ అన్ని రంగాల్లోకి చొచ్చుకు రావడం వల్ల ముఖ్యంగా విద్య, ఆరోగ్యం ఎక్కువగా దెబ్బతిన్నాయి. ప్రస్తుతం కార్పొరేట్లకి విందు భోజనం అందించి, ప్రభుత్వ పథకాలను నీరుగార్చే విధానాలు నెలకొంటున్నాయి. అమలులో ఉన్న వ్యవస్థలను అవినీతి పేరుతో రద్దుచేసి, కొత్త వ్యవస్థలతో దొడ్డిదోవన ప్రైవేట్‌ని చేతులు చాచి ఆహ్వానిస్తున్నాయి.

అలా వైద్యరంగంలో ప్రతిపాదించిన జాతీయ మెడికల్ కమిషన్ (ఎన్ఎంసి) బిల్లు చాలా ప్రశ్నలను లేవనెత్తింది. డాక్టర్లు ఈ బిల్లును వ్యతిరేకిస్తూ జనవరి 2న వీధుల్లోకి రావడంతో, దాన్ని పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ ముందుకు తీసుకొచ్చారు. అల్లోపతి డాక్టర్లు ఈ బిల్లుకి తమ అభ్యంతరాలను తెలుపుతూ అనేక విన్నపాలు పంపితే, ప్రభుత్వం దానికి సమాధానంగా ఆయుష్ డాక్టర్లతో ఆ బిల్లు సమర్థింపు ప్రదర్శన నిర్వహించింది. విభజించి పాలించే అతి తెలివి విధానాలకు ఇది మరో మచ్చుతునక. ఈ బిల్లులో కొన్ని ప్రత్యేకమైన అంశాలను డాక్టర్లు సమ్మతించడం లేదు. అలానే, జాతీయ మెడికల్ కమిషన్ సభ్యుల నియామకంపై కూడా చాలా అనుమానాలు వ్యక్తమవుతున్నాయి.

మెడికల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా, లేదా ఎంసిఐ అవినీతిలో కూరుకు పోయిందని చెపుతూ, దాన్ని రద్దుచేసి, దాని స్థానంలో ఈ కొత్త కమిషన్‌ను ఏర్పరుస్తోంది కేంద్ర ప్రభుత్వం. అవినీతి లేనిదెక్కడ? అవినీతిని నియంత్రించే చర్యలు ఏవి? మనదేశాన్ని ఏలుతున్న అమాత్యుల్లో ఎంత మంది లంచగొండులు లేరు? అందుకే ఐదేళ్ల పరిపాలనా కాలంలో వారి ఆస్తులు ఎంత పెరిగాయో లెక్కలు తీసి ఫాస్ట్ కోర్టులకు అప్పగించాలని జస్టిస్ చలమేశ్వర్ సూచించారు. కానీ పార్లమెంటులో కూర్చుంటే అన్ని దోషాలూ పోతాయి కాబోలు! ఎన్నికల సంఘం ముందు దాఖలు చేసిన అఫిడవిట్‌లను పరిశీలిస్తే, 34 శాతం కొత్త ఎంపిల మీద క్రిమినల్ కేసులున్నాయని ప్రజాస్వామిక సంస్కరణల సంస్థ (ఎడిఆర్) విశ్లేషించింది.

డాక్టర్లు ఎన్నుకున్న ఎంసిఐలో 120 మంది సభ్యులున్నారు. వారిలో కొద్దిమంది అవినీతిపరులున్నారనే నెపంతో ఆ సంస్థనే రద్దు చేస్తే, మరి పై అంచనాల ప్రకారం పార్లమెంటును, అసెంబ్లీలను ఏమి చేయాలి? దొంగే 'దొంగ! దొంగ!' అని అరిచినట్లు ఉంది. ఇప్పుడు ఎన్ఎంసిలో 25 మంది సభ్యులుంటే, వారిలో ఐదుగురిని మాత్రమే డాక్టర్లు ఎన్నుకోవాలి. మిగిలిన వారిని ప్రభుత్వం నామినేట్ చేస్తుంది. వీరు డాక్టర్లు కానవసరం లేదు. ఎన్ఎంసిలో నాలుగు బోర్డులు ఉంటాయని, ప్రతి బోర్డులో ముగ్గురు సభ్యులుంటారని, వారు కూడా నామినేటెడ్ సభ్యులేనని చెపుతున్నారు. ఈ బోర్డులు యుజి, పిజి కోర్సులను నడుపుతాయి. మెడికల్ కాలేజీలను పరిశీలించి అక్రెడిటేషన్ ఇస్తాయి. ప్రాక్టీస్ చేసే డాక్టర్లను రిజిస్టర్ చేయిస్తాయి. మెడికల్ నైతిక నియమాలను నియంత్రిస్తాయి. మరే ఇతర వ్యాపకాలకి, వృత్తులకి వారి స్వయం ప్రతిపత్తి కలిగిన నియంత్రణ సంస్థలకు ఇలాంటి నిబంధనలు వర్తించవు. వారి సంస్థలను వారే ఎంచుకుంటారు. ప్రభుత్వ ప్రమేయం ఉండదు. మరి వైద్య వ్యవస్థకు మాత్రమే ఈ నియమాలు ఎందుకు? వైద్యంతో సంబంధం లేనివారు వైద్య వృత్తిని ఎలా నియంత్రిస్తారు. దీన్ని అతి కేంద్రీకరణ అంటారు. ప్రభుత్వ పెత్తనం అంటారు. రాష్ట్రాల వారీ ప్రాతినిధ్యం చూసినా, ఎన్ఎంసిలో ఒకోసారి ఐదు రాష్ట్రాల ప్రతినిధులే ఉంటారు. అంటే ఒక రాష్ట్రం తిరిగి ప్రాతినిధ్యం వహించాలంటే రెండు దశాబ్దాల కాలం పడుతుంది. అంత వరకు ఆయా రాష్ట్రాల సమస్యలు నానుతూనే ఉంటాయి. వైద్య వృత్తిలో ఉన్నవారి ప్రజాస్వామిక హక్కులకి ఈ కమిషన్ గొడ్డలిపెట్టు అవుతుంది.

ఈ కమిషన్ చేతిలో ఉండే నియంత్రణలు సజావుగా, న్యాయ బద్ధంగా, సమానంగా ఉంటాయా అంటే అదీ లేదు. ప్రభుత్వ కళాశాలలకు మాత్రమే నియంత్రణలు వర్తిస్తాయి. ప్రైవేట్ కళాశాలలకు పెద్దపీట వేస్తున్నాయి. వారికి నియమ నియంత్రణలు ఉండవు, తనిఖీలు ఉండవు. నామమాత్రపు అనుమతితో కాలేజీ పెట్టవచ్చు. సీట్లు పెంచుకోవచ్చు. తాము చేసిన వాగ్దానాలు నిలుపుకుంటామని వారు నమ్మబలికితే చాలు, 'సాత్‌ఖూన్ మాఫ్!' దాదాపు 80 మంది ఎంపిలకు ప్రైవేట్ వైద్య కళాశాలలతో సంబంధాలున్నాయి. వాటి యజమానులుగానో, ట్రస్టీలు

---

ఆశ్రయించారు. రాజ్యాంగ విరుద్ధంగా తితిదే ఇచ్చిన నోటీసులు వెనక్కి తీసుకోవాలని, తితిదే ఆలయ విభాగం తప్ప, మిగిలిన అన్ని విభాగాల్లో అన్ని మతాల వారు పనిచేయవచ్చుని, తితిదే ప్రభుత్వ అధీనంలో నడుస్తున్న సంస్థ అని వారు హైకోర్టులో రిట్ దాఖలు చేశారు. న్యాయస్థానాలే సంక్షోభాలతో కూరుకుపోయాయి. సమాజంలో ఉన్న అన్ని వ్యవస్థీకృత చెడు ధోరణులు అక్కడ ఉన్నాయి. తాజా సుప్రీంకోర్టు సంక్షోభం దేశ ప్రజలకు న్యాయస్థానాల పట్ల ఉన్న నమ్మకాన్ని తగ్గించింది. ఈ నేపథ్యంలో న్యాయస్థానాలు రాజ్యాంగంలోని చట్టాల ప్రకారమే తీర్పు ఇవ్వాలని, మెజారిటీ అభిమతాన్ని పరిగణలోనికి తీసుకోకూడదని వారు కోరుకుంటున్నారు. పరిపాలనలో మతం జోక్యం చేసుకుంటోంది. ఈ జోక్యం న్యాయస్థానాల్లో ఎక్కువగా జరుగుతోంది. లౌకికవాదాన్ని కాపాడాల్సిన బాధ్యత న్యాయస్థానాలకే ఎక్కువ ఉంది. హైకోర్టు తితిదే నోటీసులు రాజ్యాంగ విరుద్ధమని తీర్పు ఇస్తుందనే కాంక్షిస్తాం. వీ

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)*

గానో, మేనేజింగ్ పార్ట్‌నర్లుగానో వారికి వాటితో భాగస్వామ్యం ఉంది. అప్పుడు వారి మొగ్గు ఎటువైపు ఉంటుంది? ప్రభుత్వ కాలేజీల సంఖ్యని, నాణ్యతని పెంచడం వైపా? ప్రైవేటు కాలేజీల రాయితీల వైపా? 90వ దశకం తర్వాత పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చిన ప్రైవేటు కాలేజీలని ప్రభుత్వ పరం చేయాలి. వాటిలో పనికిరాని వాటిని రద్దు చేయాలి. అవన్నీ పూర్తిగా ప్రభుత్వ రంగ సంస్థలైపోతే, అప్పుడు నియంత్రణ సజావుగా, సమానంగా ఉంటుంది. అంతేకాని ఇలా పక్షపాతంగా, అసమానంగా ప్రైవేటు కాలేజీలను ప్రోత్సహించడం ఎంతవరకు సమంజసం? అలా వైద్య విద్యా ప్రమాణాలను ప్రభుత్వాలే దిగజార్చి వేయడం లేదా?

ఈ జాతీయ కమిషన్ రాష్ట్రాలని, ఎన్నికైన రాష్ట్ర మెడికల్ కౌన్సిళ్లని కూడా నియంత్రిస్తుంది. అంటే, అది దాని ఇష్టానుసారం కాలేజీలకు అనుమతులు ఇవ్వగలదు. ఎలాంటి డిగ్రీలైనా అనుమతించవచ్చు. ఎవరికైనా ప్రాక్టీసు చేసే వీలు కల్పించవచ్చు. రాష్ట్ర మెడికల్ కౌన్సిల్ ఎప్పుడైనా ఏ డాక్టర్ పైన అయినా నిర్లక్ష్యం, లంచగొండితనం పేరుతో క్రమశిక్షణా చర్యలు తీసుకుంటే, ఈ కమిషన్ వాటిని రద్దుచేసి, ఆ నేరపూరిత డాక్టరుకి చేయూతనివ్వవచ్చు!

వైద్య విద్యని మెరుగుపరిచే మిషతో లైసెన్సియేట్ పరీక్షని పెట్టడం కూడా ఈ కమిషన్ కార్యాచరణలో భాగం. అయితే, వైద్య విద్యలో ప్రవేశించడానికి పరీక్ష, విద్య పూర్తయ్యే వరకు ప్రతి సబ్జెక్టులో అనేక పరీక్షలు. ఫైనల్ పరీక్షలన్నీ పూర్తయ్యాక వైద్య విద్యార్థి మళ్లీ ఈ పరీక్ష రాస్తేనే ప్రాక్టీసు చేసే వీలు ఉంటుంది. కాలేజీలో థియరీ, ప్రాక్టీస్ రెండూ పరీక్షిస్తారు. కానీ ఈ కామన్ పరీక్షలో మల్టిపుల్ ఛాయిస్ ప్రశ్నలు మాత్రమే ఉంటాయి. నీట్ పరీక్షల కోసం పుట్టుకొస్తున్న కోచింగ్ సెంటర్లు లక్షలు సంపాదిస్తున్నట్లే, ఇక ఇప్పుడు ఎగ్జిట్ ఎగ్జామ్ సెంటర్లు కూడా చేతులు బారజాపి సంపాదిస్తున్నాయి. డాక్టర్ నైపుణ్యాన్ని, రోగ నిర్ధారణ విధానాన్ని, వారి వృత్తి కుశలతకి, చికిత్స నాణ్యతని ఈ పరీక్ష ఏమాత్రం పరీక్షించలేదు. అలాంటపుడు అది ఒక డాక్టర్ ప్రాక్టీస్ చేయడానికి అనుకూలించే పరీక్ష ఎలా అవుతుంది?

ఈ కమిషన్ ప్రతిపాదనల్లో మరో అంశం – అల్లోపతికి చెందని వైద్య రంగాల అభ్యర్థులకి ఆరు నెలల బ్రిడ్జి కోర్సులు పెట్టి, వారిని అల్లోపతి డాక్టర్లుగా చెలామణి చేయాలనే ఆలోచనని అందరూ ఏక కంఠంతో ఖండిస్తున్నారు. ఎవరి రంగంలో వారిని ప్రావీణులు చేయడం కాక, కలగాపులగం చేసి వైద్య వృత్తినే అవహేళన చేస్తున్నారు. ఈ ఆరు నెలల తర్వాత మరి వారికి కూడా ఎగ్జిట్ పరీక్ష ఉంటుందా అంటే అది లేనేలేదు. ప్రస్తుతం ఆయుష్ సీట్లు ఖాళీగా ఉంటున్నాయి. ఆ కాలేజీలు నడుపుతున్న రాజకీయ నాయకులు నష్టపోతున్నారు. అందుకే ఆ డాక్టర్‌కి దొడ్డి దోవన బ్రిడ్జి కోర్సుల ద్వారా ఎంబిబిఎస్‌లోకి ప్రవేశం కల్పిస్తే, బ్రిడ్జి కోర్స్ అనే షార్ట్‌కట్ ద్వారా వారు ఎంబిబిఎస్‌తో సమానమై పోవచ్చు. ఈ వెసులుబాటు వల్ల వారి సీట్లు నింపుకోవచ్చు. నాలుగున్నరేళ్లు చదివిన అల్లోపతి డాక్టర్‌కి ఆరు నెలల బ్రిడ్జి కోర్స్ చదివిన ఆయుష్ డాక్టర్ సమానం. అప్పుడు విద్య ప్రమాణాలు పెరుగుతాయా తరుగుతాయా?

ఇప్పటికే వైద్య రంగం నిర్లక్ష్యానికి గురవుతోంది. బడ్జెట్ కేటాయింపులు పెంచకుండా, ప్రభుత్వ వైద్య సంస్థల ప్రమాణాలు పెంచకుండా, అల్లోపతి డాక్టర్ల నియామకాలు పెంచకుండా, అడ్డ దారులతో, చిట్కాలతో, మాయ మాటలతో వైద్య విద్యని, ప్రభుత్వ వైద్య సంస్థలని దిగజార్చివేసే హేయమైన చర్య ఇది.

ఈ మార్పులు చేయడానికి కారణం ఏమి చెపుతున్నారు? అల్లోపతి డాక్టర్‌లు పల్లెలకు పోవడం లేదని, పల్లెల్లో ఆరోగ్య వ్యవస్థని పటిష్టం చేయడం కోసం ఈ చర్య తప్పదని అంటున్నారు. మన దేశంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల (పిఎచ్‌సిల) సంఖ్య 27 వేలు. ఎంబిబిఎస్ ఖాళీలు 2,700 మాత్రమే. ప్రతి ఏటా మనం అరవై వేల మంది డాక్టర్లని తయారు చేస్తున్నాం. వారందరికీ ఉద్యోగాలు కల్పిస్తే అక్కడికి ఇక్కడికి పోమని ఎవరంటారు? వారి నిరుద్యోగాన్ని రూపుమాపే చర్యలు ఏవి? దాదాపు లక్ష మంది నీట్ అభ్యర్థులున్నారు. వారికి తోడు, విదేశాల్లో చదివి వచ్చినవారు యాభైవేల మంది డాక్టర్లున్నారు. వీరెవరికీ ఉద్యోగాలు లేవు. ఉన్నకొద్ది ఉద్యోగాలు కాంట్రాక్టు ప్రాతిపదికపైనే ఉంటున్నాయి. 'పల్లెలకు పోతాము. తగిన వసతులు కల్పించండి. జీతాలు ఇవ్వండి. ల్యాబ్ వంటి సౌకర్యాలు కల్పించండి. మేము సేవకు సిద్ధం' అని వైద్యులు పదేపదే చెపుతున్నారు. కానీ కార్పొరేట్ ఆసుపత్రుల చుట్టు పక్కల ఉన్న ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను రద్దు చేసే ధోరణులు కలిగి ఉన్న ప్రభుత్వాలకు ఈ కేకలు ఎందుకు వినిపిస్తాయి? ప్రభుత్వ నియామకాలు ఎందుకు పెరుగుతాయి? నిజానికి డాక్టర్ల కొరత లేదు. స్పెషలిస్టుల కొరత ఉంది. పిజి సీట్లు పెంచి, వారి నైపుణ్యాన్ని పెంచి, వారిని ప్రభుత్వ రంగంలో నిలిపి ఉంచుకోగలిగితే అతి త్వరలో వైద్య రంగం పురోగమించవచ్చు. కానీ కార్పొరేట్లకు రాయితీలు ఇచ్చే బడా బాబుల ప్రభుత్వాలకు ఆ చిత్తశుద్ధి ఏది?

ఫీజుల నియంత్రణ అనేది ఈ బిల్లులో మరో ముఖ్యమైన అంశం. ప్రైవేట్ మెడికల్ కాలేజీల్లో నలభై శాతం సీట్లు ఫీజులని మాత్రమే జాతీయ వైద్య కమిషన్ నియంత్రిస్తుందట. మిగిలిన అరవై శాతం యాజమానుల ఇష్టాయిష్టాలకు వదిలేస్తుంది. ప్రస్తుతం పదిహేను శాతం సీట్లను మాత్రమే ప్రైవేట్ కాలేజీల్లో తమ ఇష్ట ప్రకారం అమ్ముకోవచ్చు. ఇప్పుడు ఈ బిల్లు దాన్ని అరవై శాతానికి పెంచి వారినోట్లో చక్కెర కుక్కుతోంది. వైద్య విద్యని మేధ కాక డబ్బు నియంత్రిస్తుంది! ఇక ఇప్పుడు నీట్ ఎందుకు? కష్టపడి చదవడం ఎందుకు? విద్యని కొనుక్కునే డాక్టర్లు తర్వాత సామాన్యుల కాంక్షలను తీరుస్తారా? పెరిగే వైద్య ఖర్చులతో ఆస్తులు అమ్ముకునే ప్రజలు మరింత పేదరికంలోకి కూరుకుపోతారు. ఎలాంటి సహాయం అందక అల్లాడిపోతారు.

విద్య, వైద్యం పూర్తిగా ప్రభుత్వ పరంగా ఉండి, ప్రజల విద్య, వైద్య అవసరాలన్నీ ప్రభుత్వ బాధ్యతగా ఉంటేనే దేశం అభివృద్ధి చెందుతుంది. అలాకాక, అన్ని రంగాల్లో ప్రైవేట్ సంస్థలకే పెద్దపీట వేస్తే, ప్రమాణాల నియంత్రణ ఉండదు, ఒకే రకమైన కొలబద్దలు ఉండవు. సామాన్యులకు విద్య, వైద్యం అందని ద్రాక్షలుగా మిగిలిపోతాయి. ఈ రెండు రంగాలు వ్యాపార రంగాలుగా కాక సేవ రంగాలుగా గుర్తించి, సమూలమైన మార్పులు చేస్తూ ప్రభుత్వ మెడికల్ కాలేజీలు పెంచి, అందులో నిపుణులైన డాక్టర్లని నియమించి, వైద్య విద్యా ప్రమాణాలను పెంచుతూ, వాటి అనుబంధ ఆసుపత్రులకు కేటాయింపులు పెంచి, న్యాయ్యమైన పరికరాలు అందిస్తే వైద్య రంగం అందరికీ అందుబాటులోకి వస్తుంది. మరెక్కడా లేని విధంగా మన ప్రజలు ఎనభై శాతం వైద్య ఖర్చులు సొంతంగా పెట్టుకుంటున్నారు. ప్రభుత్వ బాధ్యత శూన్యం. క్యూబా, కెనడా వంటి నమూనాలు పరిశీలించి, మన వైద్య, ఆరోగ్య విధానాల్లో సమూలమైన మార్పులు తేవాలి. లేదంటే అవకతవక విధానాల వల్ల ప్రజలు డాక్టర్లను జెలగలుగా, డాక్టర్లు ప్రజలను డబ్బు సంచులుగా చూసే అమానుష వైఖరి కొనసాగుతుంది. వీ

*(రచయిత వైద్యురాలు)*

# కాస్‌గంజ్ ముస్లింలపై తిరంగా దాడి

***కేంద్రంలో, వివిధ రాష్ట్రాల్లో బిజెపి అధికారంలోకి వచ్చాక దేశభక్తి పేరు మీద హిందూ ఫాసిస్టు శక్తుల అరాచకాలు మితిపోయాయనీ, అది ఇప్పుడు ఉన్మాద దశకు చేరుకుందనీ అంటున్నారు* అరణ్య**

బిజెపి అధికారంలోకి వచ్చిన ఈ నాలుగేళ్ల కాలంగా మతంపేరిట ఎన్నెన్ని మారణకాండలు జరిగాయో చూస్తూనే ఉన్నాం. ఈ వరుసలో జరిగిందే జనవరి 26 కాస్‌గంజ్ ఘటన. జనవరి 26 గణతంత్ర దినోత్సవం సందర్భంగా పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లోని కాస్‌గంజ్‌లో హిందూ ముస్లింల మధ్య ఘర్షణ తలెత్తిందని అందులో ఒక వ్యక్తి మరణించాడని వార్తలు వచ్చాయి. ఈ విషయమై వివరాలు తెలుసుకోవడానికి లోతుల్లోకి వెళ్తే ఒకే సంఘటన గురించి విభిన్న రకాల వాదనలు వినాల్సివచ్చింది. వాటిలో ఏది నిజమో తెల్సుకుని అర్థం చేసుకోవడానికి చాలా సమయమే పట్టింది. కనుక కాస్‌గంజ్‌లో ఏం జరిగిందో చూడాలంటే అందుకుగాను ఈ సంఘటన గురించి ఎవరెవరు ఏయే రకాలుగా ప్రజలకు చెప్తూ వచ్చారో తెలుసుకుంటేగాని అందులోంచి నిజానిజాలు బైటపడవు.

మొదట మీడియా చెప్తున్న విషయాలు చూద్దాం. కాస్‌గంజ్‌లో రిపబ్లిక్ డే రోజున జెండా ర్యాలి జరగకుండా అక్కడి ముస్లింలు అడ్డుకున్నారు. అందుకే అక్కడ ఇరువర్గాల మధ్య అల్లర్లు జరిగాయి. అల్లర్లలో చందన్ గుప్తా అనే యువకుడు మరణించాడు. అతను ఎ.బి.వి.పి–ఆర్.ఎస్.ఎస్ కార్యకర్త. దాదాపుగా అన్ని న్యూస్ ఛానళ్లు, వార్తా పత్రికలు ఇదే వార్తను ప్రసారం చేశాయి. జాతీయ వార్తల విషయంలో ఏదో ఒక ఛానల్‌ను అనుసరించే ప్రాంతీయ ఛానళ్లు కూడా కాస్‌గంజ్ వార్తను ఇదేవిధంగా ప్రసారం చేశాయి. ఈ వార్తను పదేపదే ప్రసారం చేయడం వల్ల మీడియా ప్రజలకు ఏం చెప్పదలచుకున్నదంటే ఎబివిపి లేదా బిజెపికి చెందినవాళ్లు గణతంత్ర దినోత్సవం రోజున దేశభక్తిని ప్రదర్శించే ఒక గొప్ప ప్రయత్నంగా తిరంగా ర్యాలి చేపట్టగా ముస్లింలు అడ్డుకున్నారు. అంటే దేశభక్తికి, మూడు రంగుల జెండాకు, దాన్ని ప్రదర్శించడానికి ముస్లింలు వ్యతిరేకులు. వాళ్ల దేశ వ్యతిరేక ఆలోచనా ధోరణి దీనివల్ల బయట పడుతున్నది. – ఇదీ మీడియా వార్తల అంతరార్థంగా ప్రజలకు చేరిన విషయం. ఎబివిపి న్యూస్ జర్నలిస్టు అభిసార్ శర్మ, ఆజ్‌తక్ రోహిత్ సర్దానాల వంటి వాళ్లు తమ ఛానళ్లలో చర్చలు పెట్టి పదేపదే ఈ వంకర ఆలోచనా ధోరణిని ప్రసారం చేస్తూ వచ్చారు. సర్దానా అయితే జెండా ఎగురవేస్తుంటే ఎవరో అడ్డుకున్నారనే అర్థంలో 'జాతీయ జెండా ఎగురవేయాలన్న సంకల్పం బలంగా ఉన్న చందన్ తన ప్రాణాలను త్యాగం చేశాడు' అని ట్వీట్ చేశాడు. రెండు వేల రూపాయల నోట్లలో ట్రాకింగ్ చిప్స్ పెడ్తున్నారనే తప్పుడు వార్తల సృష్టికర్త అయిన శ్వేతాసింగ్ అనే ఆజ్‌తక్ జర్నలిస్టు 'భారత మాతాకీ జై అనడమే పాపమా?' అని ట్వీట్ చేసింది. దాదాపు మీడియా అంతా అక్కడి ముస్లింలనే నిందిస్తూ వార్తలు ప్రసారం చేశాయి.

ఇక ఈ విషయమై బిజెపి ప్రచారం చేస్తున్నదేమిటంటే – దేశభక్తి చిహ్నంగా కాస్‌గంజ్‌లో తిరంగా యాత్ర చేపడుతుంటే దేశం మీద ప్రేమలేని దేశద్రోహులైన ముస్లింలు 'పాకిస్తాన్ జిందాబాద్' అని నినాదాలు చేస్తూ దారికడ్డం కాపుకాసి యాత్రను అడ్డుకుని తామిక్కడ పాకిస్తాన్ జెండానే ఎగురవేస్తామని అంటూ గుంపుపై రాళ్లు రువ్వారు. ఈ ఘర్షణల్లో చందన్ గుప్తా అనే దేశభక్తున్ని కాల్చి చంపారు. ఇదంతా పథకం ప్రకారం ముస్లింలు సాగించిన విద్రోహకాండ. దేశద్రోహుల దౌర్జన్యకాండ. జాతీయ పతాకం అనేది దేశ సార్వభౌమాధికారానికి, దేశ ప్రజల సమిష్టి అస్తిత్వానికి ప్రతీక కనుక దాన్ని ప్రదర్శించడాన్ని అడ్డుకున్న వాళ్లంతా దేశద్రోహులే. తాము పతాకాన్ని ఊరేగిస్తూ మాతృ భూమిపై మమకారాన్ని ప్రదర్శించాలనుకుంటూ ఉంటే తల్లిపాలు తాగి రొమ్ము గుద్దే విద్రోహులు తమను అడ్డుకున్నారు. పైగా నిర్లజ్జగా జాతీయ పతాకాన్ని, గీతాన్ని, వందేమాతర మంత్రాన్ని వ్యతిరేకిస్తున్నారు.

గత ప్రభుత్వాలేవీ ఇట్లాంటి చర్యలపై రాజ్యాంగపరమైన చర్యలు తీసుకోలేదు కనుక ఈ విద్రోహులు ఇంత ధైర్యంగా తెగబడ్డారు. కనుక వెంటనే వారిపై కఠిన చర్యలు తీసుకోవాలి. గతంలో కూడా దేశంలోని వివిధ ప్రాంతాలలో జాతీయ మహోత్సవాల సందర్భంగా జాతీయ చిహ్నాలను కించపరచడానికి వ్యతిరేకులు విఫలయత్నాలు చేశారు. కశ్మీర్‌లోని పాకిస్తాన్ తొత్తులైన జిహాదీలు ఏళ్ల తరబడిగా ఇట్లా రాళ్లు రువ్వుతూ వస్తున్నారు. ఇప్పుడు దేశం నడిబొడ్డున ఆ పాకిస్తానీ చర్యలే పునరావృతమవుతున్నాయి. రాళ్లు రువ్వడంతో సంతృప్తి చెందక ఈ పతాక వ్యతిరేకులు తిరంగా ఊరేగింపుపై దాడిచేశారు. ఈ దాడిలోనే ఒక దేశభక్తుడు అమరుడైనాడు. ఆ తర్వాత ఊరేగింపులో పాల్గొన్న వాళ్లు ప్రతిఘటనకు పూనుకోవడంతో ఘర్షణలు జరగగా పోలీసులు కర్ఫ్యూ విధిస్తూ హిందువులనే నియంత్రించారు.

అయితే ఒక వ్యక్తిని బలి తీసుకుని దేశ వ్యతిరేకులే ఈ ఘటనలో పైచేయి సాధించారు. ఒక చిన్న శోభాయాత్రకు, దేశభక్తి యాత్రకు నిఘా విభాగం, పోలీసులు భద్రత కల్పించలేక పోయారు. బిజెపి నాయకుడు వినయ్ కతియార్, "అక్కడ పాకిస్తాన్ పూజారులు వచ్చేశారు. వాళ్లు భారత జెండాను గౌరవించడం లేదు. పాకిస్తాన్ జెండానే గౌరవిస్తున్నారు. పాకిస్తాన్ జిందాబాద్ నినాదాలిచ్చారు. అలాంటి వారి పట్ల కఠినంగా వ్యవహరించాలి" అన్నాడు. సిఎన్ఎన్–ఐబిఎన్ రిపోర్టర్ ఆయనతో "అక్కడ పాకిస్తాన్ జిందాబాద్ నినాదాలిచ్చినట్లు పాకిస్తాన్ జెండా ఎగరేసినట్లు పోలీసులు, జిల్లా మెజిస్ట్రేట్ చెప్పడం లేదు. ఎఫ్ఐఆర్‌లో కూడా ఆ ప్రస్తావన లేదు. మరి మీరెలా చెప్పగలుగు తున్నారు?" అని అడిగితే అక్కడి నుండి వెళ్లిపోయాడు. కేంద్రమంత్రి నిరయన్ జ్యోతి "కాస్‌గంజ్ ఘటనను చూస్తే దేశ ద్రోహశక్తులు జెండా యాత్రను సహించడం లేదని తెలుస్తున్నది" అన్నాడు. ఇట్లా దేశభక్తి పేరిట అనేక కథలు ప్రచారం చేస్తూ బిజెపి, ఆర్ఎస్ఎస్, విశ్వహిందూ

పరిషత్ వాళ్లు, వాళ్ల మంత్రులు, నాయకులు, వాళ్ల మీడియా వాళ్లు పై విధమైన వాదనలతో అబద్ధాలను ప్రచారంలో పెడుతూ ఇష్టం వచ్చినట్లుగా కాస్‌గంజ్ ఘటనను వక్రీకరిస్తూ వచ్చారు.

మీడియా ప్రచారాలు, బిజెపి వాదనలు చూశాక అసలు వాస్తవంగా కాస్‌గంజ్‌లో ఏం జరిగిందో ఇప్పుడు చూద్దాం!

కాస్‌గంజ్ పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లోని ఒక పట్టణం. ఢిల్లీ నుంచి 220 కిలోమీటర్లు, లక్నో నుంచి 340 కిలోమీటర్ల దూరంలో 1.4 లక్షల జనాభాగల పట్టణం. జనవరి 26 గణతంత్ర దినోత్సవం సందర్భంగా కాస్‌గంజ్‌లోని ఒక ముస్లిం ప్రాంతంలో ముస్లింలు అబ్దుల్ హమీద్‌చౌక్ వద్ద జెండా ఆవిష్కరణ కార్యక్రమం కోసం ఏర్పాట్లు చేసుకున్నారు. 1965లో పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధంలో తన మిలిటరీ జీబుతో పాకిస్తాన్ యుద్ధ ట్యాంకులను ఢీకొట్టి కాల్చేసి ఆ యుద్ధంలోనే మరణించిన పరమ్‌వీరచక్ర అబ్దుల్ హమీద్ పేరును తమ కూడలికి పెట్టుకున్న నాటికి ముందు నుంచీ, తర్వాత కూడా ఆ ప్రాంతంలోని వాళ్లు ఏ ప్రధాన కార్యక్రమాన్నైనా ఆ కూడలిలో జరుపుకుంటూ వస్తారు. పతాకావిష్కరణలైతే సరేసరి.

ఈసారి కూడా పతాకావిష్కరణ కోసం రోడ్డుమీద కుర్చీలు వేసి పరిసరాలన్నీ ముస్తాబు చేసి ఉంచారు. ఈలోగా అటువైపు నుంచి ఎబివిపి, భజ్‌రంగ్‌దళ్, సంకల్ప్ ఫౌండేషన్ వాళ్లు మోటర్ సైకిళ్ల మీద తిరంగా యాత్ర పేరుతో  అటువైపుగా వచ్చారు. ఈ యాత్రకు ఎలాంటి పోలీసు అనుమతి లేదు. అధికారిక అనుమతి కూడా లేదు. నాలుగు వందల మంది, మతపరమైన జనసంఖ్య ఉన్న ప్రాంతానికి దండుగా ర్యాలీగా వెళ్తున్నపుడు అనుమతి తీసుకోవాలన్న కనీస విషయాన్ని బేఖాతరు చేసి అటువైపు వచ్చారు. పేరేమో తిరంగా యాత్ర. కానీ కొందరి చేతుల్లో కాషాయ జెండాలు కూడా ఉన్నాయి. ఇంకొందరు కాషాయ రంగు జెండాలపై ఓం గుర్తు, దేవుని బొమ్మలు ఉన్నవి పట్టుకుని వచ్చారు. హఠాత్తుగా దాదాపు నాలుగు వందల మంది చేతుల్లో వేర్వేరు రకాల జెండాలతో వచ్చేసరికి అక్కడున్న వాళ్లెవరికీ వచ్చిన వాళ్లెవరో, ఎందుకు వచ్చారో అదేం ర్యాలీనో అర్థం కాలేదు. మోటర్ సైకిళ్లపై వచ్చిన వాళ్లు దారికడ్డంగా ఉన్న కుర్చీలను తొలగించాలని అక్కడున్న వాళ్లను అడిగారు. ఆ సమయానికి అక్కడి వాళ్లంతా జెండా కార్యక్రమానికి సిద్ధమయ్యే పనుల్లో నిమగ్నమై ఉన్నారు. కొద్దిసేపట్లో జెండా ఎగరేయాల్సి ఉండగా కుర్చీలు సర్దడం చేస్తే పతాకావిష్కరణకు ఆలస్యం జరుగుతుంది. అట్లాంటి సందర్భంలో ఎవరైనా సరే, 'మీరెవరు? మేము కుర్చీలు ఎందుకు తీసేయాలి? వేరే దారిలో పోండి, మేము తియ్యము. ఏం చేస్తారు?' లాంటి ఎదురు ప్రశ్నలు సహజంగానే ఎవరైనా వేస్తారు. కానీ అక్కడి స్థానికులెవరూ ఇలాంటి మాటలు కూడా మాట్లాడలేదు. చేతుల్లో కాషాయ జెండాలు చూసిన తర్వాత ఎదురొడ్డి మాట్లాడితే గొడవలు జరిగే అవకాశం ఉంటుందని భావించి వాళ్లు సంయమనం పాటించారు.

ఇక్కడ గుర్తుంచుకోవాల్సిన విషయమేమిటంటే అప్పటి వరకు కూడా వాళ్లకు అది తిరంగా యాత్ర అని తెలియదు. ఇక వచ్చిన వాళ్లతో ఒకటే చెప్పారు. 'పతాకావిష్కరణ ప్రారంభం కాబోతున్నది. మీరు కూడా మా పతాకావిష్కరణలో పాల్గొనండి. అది పూర్తవగానే మొట్టమొదట కుర్చీలు తీసేసి మీకు దారి వదిలి ఆ తర్వాతే మా తదుపరి కార్యక్రమాన్ని కొనసాగించుకుంటాం' అన్నారు. కానీ తిరంగా యాత్రికులు వినలేదు. 'మీ కార్యక్రమం కోసం రోడ్డును ఎట్లా బ్లాక్ చేస్తారు?' అంటూ వాదనకు దిగారు.

నిజానికది అక్కడి ముస్లింల మతపరమైన సొంత కార్యక్రమం కాదు. పతాకావిష్కరణ జరిపే హక్కు బిజెపి వాళ్లకు, దేశంలోని ప్రజలందరికి ఎంత ఉందో ముస్లింలకు కూడా అంతే ఉంది. జెండా ఎగరేయరని, జెండాకు సెల్యూట్ చేయరని ముస్లింలను నిందించేలా తరచు విష ప్రచారాలు చేసే బిజెపి వాళ్లు పతాకావిష్కరణ కోసం తమను ఆహ్వానించిన కాస్‌గంజ్ ముస్లింలను చూశాకనైనా అర్థం చేసుకుని, వాళ్లను అభినందించి కాసేపు ఆగవలసింది. ఆగలేదు సరికదా రోడ్డు బ్లాక్ గురించి ప్రశ్నించారు. దేశంలో లక్షలాది గణపతి విగ్రహాలు పెట్టడానికి, దుర్గామాత విగ్రహాలు పెట్టడానికి, స్వామిజీల రాజకీయ నాయకుల సభల కోసం మైళ్లకు మైళ్లు తాము రోడ్లు బ్లాక్ చేస్తే ఏం తప్పు లేదు గానీ దేశభక్తియుతంగా పతాకావిష్కరణ కోసం కాసేపు రోడ్డు దారిని నిలిపి వేస్తే అది పెద్ద తప్పుగా కనబడింది తిరంగా వాళ్లకు. అయినా జెండాను ఎవరైనా ఇంటిలోనో, ఆఫీసు లోపలనో నాలుగ్గోడల మధ్య ఎగరేసుకుంటారా? ఎక్కడనైనా బైటనే కదా ఎగరేసేది. ఇక బైటకంటూ వచ్చాక సొంత ఆవరణ లేనపుడు రోడ్డును బ్లాక్ చేయకుండా జెండా ఎలా ఎగరేస్తారు? ఇళ్లెక్కి ఆఫీసులెక్కి వాటి మీద నిల్చుని జెండా ఎగరేసి ఆ పెంకలమీదే సెల్యూట్ చేసి జనగణమన పాడతారా? ప్రజలు రోడ్డుమీదికొచ్చి అందరూ కలిసి సంతోషంగా జెండా ఎగరేస్తారు గానీ తలుపులు పెట్టుకుని ఎవరింట్లో వాళ్లు ఎగరేసుకుంటారా? మాట్లాడే ముందు కనీస జ్ఞానమైనా ఉండక్కర్లేదా?

తిరంగా వాళ్లు రోడ్డు బ్లాక్ విషయమై వాదనకు దిగగానే ఆ అరుపులకు చుట్టు పక్కన ఉండేవాళ్లంతా పోగయ్యారు. అందులో కొందరు ఇరుపక్షాలకు నచ్చజెప్పే ప్రయత్నం చేస్తూ వచ్చారు. ఇంతలో హఠాత్తుగా తిరంగా ర్యాలీ వాళ్లు నినాదాలివ్వడం ప్రారంభించారు. 'ఈ దేశంలో ఉండాలంటే వందేమాతరం పాడాల్సిందే (భారత్ మే రహనా హోగాతో వందేమాతరం బోల్నా హోగా)' అని, 'ఇది పాకిస్తాన్ కాదు, హిందుస్తాన్ (యే పాకిస్తాన్ నహీ, హిందుస్తాన్ హై)' అని, 'పాకిస్తాన్ ముర్దాబాద్' అని నినాదాలివ్వడం మొదలైంది. వందేమాతరం పాడడం అనడం ఏ సందర్భంలోనూ తప్పనిసరి కాదు. ఆ మాటకొస్తే జనగణమన పాడడం కూడా ఐచ్ఛికమే.

బిజోయ్ ఎమాన్యువల్ వర్సెస్ స్టేట్ ఆఫ్ కేరళ కేసు (1986) తీర్పుగానీ, ఈ మధ్యనే వచ్చిన శ్యాంనారాయణ్ చౌస్కి వర్సెస్ యూనియన్ ఆఫ్ ఇండియా కేసు (2018) తీర్పు గానీ దీన్ని స్పష్టం చేస్తున్నది. అయినా సరే ఎంత ధైర్యంగా 'భారత్‌లో ఉండాలంటే పాడాల్సిందే' అంటున్నారు. రాజ్యాంగాన్ని అనువర్తిస్తూ కోర్టులు తీర్పులిచ్చాక కూడా ఇట్లా బెదిరించడం పూర్తిగా రాజ్యాంగ విరుద్ధం. అయినా బెదిరిస్తూ నినాదాలిచ్చారు. అలాగే ఆ సమయంలో అక్కడెవ్వరు పాకిస్తానీయులు లేరు. అక్కడెవరైనా పాకిస్తానీయులు ఉంటే అప్పుడు పాకిస్తాన్‌ను వ్యతిరేకిస్తూ నినాదాలిస్తే, ఆ ఇచ్చే వారి మనసులో బాధను నినాదాల ద్వారా వ్యక్తీకరించినట్లవుతుంది. కానీ పాకిస్తాన్ వాళ్లెవరూ లేనపుడు ఉన్న రెండు సమూహాలలో ఒక సమూహం పదే పదే పాకిస్తాన్ వ్యతిరేక నినాదాలను పదేపదే ఇస్తున్నదంటే దాని అర్థం ఎదుటి సమూహాన్ని పాకిస్తాన్ అనుకూల సమూహంగా చూస్తున్నదనే కదా. ఆ ఎదుటి సమూహం 'మేము భారతీయులమైతే, పాకిస్తానీయులుగా చిత్రిస్తున్నారేమిటి?' అనే అనుమానానికి వచ్చి ఆగ్రహం తెచ్చుకునే అవకాశముండదా? ఈ సందర్భమే ఘర్షణకు మూలకారణమైంది. అప్పటి దాకా శాంతంగా మాట్లాడిన స్థానికులు కూడా గట్టిగా మాట్లాడడం ప్రారంభించారు. ససేమిరా జరగబోమని మొండికేశారు. అప్పటివరకూ పది ఇరవై మంది మాత్రమే మోటర్ సైకిళ్లు దిగి మాట్లాడుతూ ఉండగా గొడవ పెద్దదవుతుండడాన్ని చూసి చాలామంది మోటర్ సైకిళ్లు దిగి వాదనలు జరుగుతున్న ప్రదేశానికి రావడం ప్రారంభించారు. వారిలో

కొందరి చేతుల్లో జెండాలు కట్టిన కట్టెలు, జెండాలు లేని కట్టెలు ఉన్నాయి. ఆ సమయంలో అక్కడి దృశ్యం ఎలా ఉందంటే కట్టెలు పట్టుకుని దాడులకు దిగుతున్నట్లుగా ఉంది. ఈలోపు ఎవరో అక్కడి వాదనలు జరుగుతున్న ప్రాంతంవైపు రాళ్లు రువ్వడం ప్రారంభించారు. ఇప్పుడు బిజెపి వాళ్లు స్థానికులే రాళ్లురువ్వారని ఆరోపిస్తున్నారు గానీ అందుకు ఒక్క ఆధారం కూడా లేదు. పైగా ఒకవేళ స్థానికులే రాళ్లు రువ్వారనుకుంటే, వాదనలు జరుగుతున్న ప్రాంతంలో మాట్లాడుతున్న దగ్గర, జెండా కట్టిన దగ్గర స్థానికుల సంబంధీకులే ఉన్నారు. తమవాళ్ల మీద తామే రాళ్లు వేసుకోరు కదా! రాళ్లు రువ్వడం మొదలవడంతో వాదనలు చేస్తున్న వాళ్లలోని రెండు పక్షాల వాళ్లు వెనక్కిపోతూ వచ్చారు. మోటరు సైకిళ్లు దిగివచ్చిన వాళ్లు మాత్రం స్థానికుల వైపుకు పోతూ రోడ్లపైన మోహరించారు. తర్వాత రాళ్లు రువ్వడం ఆగిపోయింది. ఈలోపు అక్కడికి కొద్దిమంది పోలీసులు కూడా వచ్చారు గానీ వాళ్లు ప్రేక్షకుల్లాగా చూస్తూ నిల్చున్నారు. ఘర్షణ జరగకుండా చూడలేకపోయారు. అంతా కలగలిసిపోయి ఎవరు స్థానికులో ఎవరు బయటవాళ్లో తెలియని పరిస్థితి ఏర్పడింది. ఈలోపుగా ఉన్నట్టుండి ఫైరింగ్ ప్రారంభమైంది. పెట్రోల్ బాంబులు కూడా పేలాయంటున్నారు. ఈ కాల్పుల కారణంగా చందన్ గుప్తా అనే వ్యక్తి మరణించాడు. నౌషద్, అక్రమ్‌లు ఘర్షణలలో తీవ్రంగా గాయపడ్డారు.

ఇదంతా జరిగాక గంటసేపటికి పూర్తిస్థాయిలో పోలీసులు రంగప్రవేశం చేశారు. ర్యాలీ వాళ్లను వెళ్లగొట్టారు. వాళ్లలోవి దాదాపు 70 బైక్‌లను స్వాధీనం చేసుకున్నారు. కానీ స్టేషన్‌లో మాత్రం 30-35 బైక్‌లనే స్వాధీనపరచుకున్నట్లు చూపించారు. ఆ బైక్‌ల వాళ్లను కూడా ఆ తర్వాత విచారించిన దాఖలాలు లేవు. ఘర్షణల వార్త క్రమంగా పట్టణమంతా పాకగా గణతంత్ర దినోత్సవ ఏర్పాట్లలో ఉన్న పోలీసులు పోను మిగిలిన పోలీసులను పట్టణంలోని ముస్లిం ప్రాంతాలన్నింటిలోనూ మోహరించారు. జెండా సంబరాలు లేకుండా వాళ్లను భయభ్రాంతులకు గురిచేసేలా ఆయుధాలు, కర్రలతో పోలీసులు ముస్లిం ప్రాంతాలను నిర్మానుష్యం చేశారు. అబ్దుల్ హమిద్ చౌక్‌లో ఘర్షణల తర్వాత బయల్దేరిన ఎబివిపి-సంకల్ప్ ఫౌండేషన్ వాళ్లు ఎటువైపు వెళ్తున్నారనేది చూడకుండా పోలీసులంతా అబ్దుల్ హమీద్ చౌక్‌లోనే ఉండిపోయారు. దాంతో ర్యాలీగా బయల్దేరిన వాళ్లు కాస్‌గంజ్ పట్టణం మీద పడ్డారు. ప్రభు పార్క్ నుంచి బయల్దేరి వెళ్తుండగా బిల్ రామ్ గేట్ క్రాస్ రోడ్ వద్ద ఇటుకల ట్రాక్టర్ కనబడగా ఆ ఇటుకలను తీసి రోడ్డుపై వెళ్తున్న రిక్షాలు, వాహనాల మీద, దుకాణాల మీద వేస్తూ దౌర్జన్యానికి దిగారు. రెండు మసీదులపై దాడులు చేశారు. రాహుల్ ఉపాధ్యాయ అనే మరోవ్యక్తి కూడా కనిపించడం లేదనే వార్తను సృష్టించి వ్యాపింపచేసి దాడులను మరింత ఎక్కువ చేశారు. ఆ వార్తలు విని అతను నేరుగా పోలీసుల దగ్గరికి వెళ్లి తాను సురక్షితంగానే ఉన్నానని చెప్పుకోవాల్సి వచ్చింది. ప్రజలను రెచ్చగొట్టడానికి ఇలాంటి వదంతులకు దిగారు బిజెపి వాళ్లు.

జనవరి 27న చందన్ గుప్తా అంతిమ యాత్ర సమయంలో 500-600 మందితో కూడిన ర్యాలి బిల్‌రామ్ మార్కెట్ ప్రాంతానికి రాగానే అక్కడి ముస్లిం దుకాణాల మీద ర్యాలీలోని హిందువులు విధ్వంసానికి దిగారు. లూటికి పాల్పడ్డారు. ముస్లిం దుకాణాలకు నిప్పు పెట్టారు. వీడియోల్లో కనిపించిన విధ్వంసకారుల్లో ఎక్కువమందిని సాహబ్‌వాలా, షా వాలే గలి, చిత్రగుప్త కాలని ప్రాంతాలకు చెందిన వారుగా ఎందరో చెప్పినా కూడా పోలీసులు వాళ్లను అరెస్టు చేయలేదు. అట్లా ముస్లిం దుకాణదారులు తీవ్రంగా నష్టపోయి దుకాణాలు మూసేశారు.

జనవరి 28 రోజున ఒక శాంతి సమన్వయ సమావేశాన్ని ఏర్పాటు చేయగా ముస్లిం దుకాణాలు తిరిగి తెరిచేలా జిల్లా మెజిస్ట్రేట్ వాళ్లకు హామీ ఇచ్చాడు. కానీ అప్పటికే లూటీలు చేసిన విధ్వంసకారులను వదిలేసి, నష్టానికి గురైన ఆ దుకాణదారులనే పోలీసులు అరెస్టు చేశారు. కానీ జిల్లా ఎస్పీ సునిల్ సింగ్ మాత్రం కొంత నిజాయితీగా వ్యవహరిస్తూ వచ్చాడు. ఎలాంటి దౌర్జన్యాలకు పాల్పడవద్దని హిందూ సంస్థల వాళ్లను శాంతి సమావేశంలో కఠినంగా హెచ్చరించాడు. ఈ హెచ్చరిక కారణంగానే యోగి ఆదిత్యనాథ్ ప్రభుత్వం అతన్ని మర్నాడే మీరట్‌లోని పోలీస్ శిక్షణ కళాశాలకు బదిలి చేసింది. పీయుష్ శ్రీవాస్తవను ఎస్పిగా నియమించింది.

జనవరి 29, 30లలో దుకాణదారులు పెట్టిన కేసులను చాలామట్టుకు పోలీసులు నమోదు చేసుకోలేదు. మళ్లీ విధ్వంసం జరగకుండా వాళ్ల ప్రాంతాలలో ఎలాంటి భద్రతాచర్యలు చేపట్టలేదు. ముస్లింల ఇళ్లవద్ద, మసీదుల వద్ద కూడా ఎలాంటి భద్రతనూ నెలకొల్పలేదు. పైగా అనేకమంది ముస్లిం యువకులపై ఎఫ్ఐఆర్‌లు నమోదు చేశారు. అలాంటి యువకుల్లో ఒకడైన సలీంను ఎలాంటి ఆధారాలు లేకుండా చందన్ గుప్తాను చంపినట్లుగా అనుమానిస్తూ అతని ఇంట్లో ఎలాంటి ముందస్తు సమాచారం ఇవ్వకుండా, సెర్చ్ వారెంట్ లేకుండా పోలీసులు 'వెతకడం' పేరుతో ఇంట్లో ఎవరూ లేనపుడు నానా భీభత్సం సృష్టించి, కనీసం మళ్లీ తాళం వేయకుండానే వదిలేసి పోయారు. పోలీసులు వెళ్లిపోగానే హిందూ యువకుల గుంపు చొరబడి లూటీకి పాల్పడింది. కుక్కలు పందులకు నిలయమై అసహ్యకరంగా మారిపోయింది. సలీమ్ సోదరులు పారిపోయారని పోలీసులు తప్పుడు ప్రచారం చేస్తూ వచ్చారు. కానీ సలీం సోదరుడు వసీం నెల కిందటే తబ్లిగి జమ్మత్‌కు వెళ్లాడని, జమ్మత్ నియమాల ప్రకారం ఫోన్ తీసుకుపోలేదని చెప్పినా వినిపించుకోలేదు. సలీం ఇంకో తమ్ముడు నసిం డిప్రెషన్‌తో భయాందోళనలతో కాలం వెళ్లదీస్తున్నాడు. ఫిబ్రవరి 2న ఒక నిజనిర్ధారణ కమిటీ చొరవ తీసుకుని పోలీసులతో ఆ ఇంటికి తాళాలు వేయించింది.

ఇవీ ఫిబ్రవరి 2 వరకూ జరిగిన సంఘటనలు. ఈ మొత్తంలో నిజానిజాలు విషయాన్ని ఓ కొలిక్కి తేవడానికి రాళ్లు రువ్విందెవరు? కాల్పులు జరిపిందెవరు? వంటి ప్రశ్నలకు జవాబులు తెలియాల్సి ఉంది. జనవరి 26 కాస్‌గంజ్ ఘర్షణల్లో మొదటగా కాల్పులు జరిపింది, పెట్రోల్ బాంబులు వేసింది స్థానిక ముస్లింలే అని బిజెపి వాళ్లు అంటుండగా, రెండ్రోజులకోసారి పోలీస్ పెట్రోలింగ్‌లు జరిగే మా ప్రాంతంలో తుపాకులు, బాంబులు ఎలా ఉంటాయని ప్రశ్నిస్తూ ఆ పనులు ర్యాలీగా వచ్చిన వాళ్లవేనని స్థానికులు అంటున్నారు. చందన్ గుప్తా వయస్సు 21-22 సంవత్సరాలు. చందన్ తల్లిదండ్రులు ఆరోపిస్తూ పాకిస్తాన్ జిందాబాద్ అనాలని అక్కడి ముస్లింలు చందన్‌పై ఒత్తిడి చేయగా అట్లా అననందుకే చందన్‌ను కాల్చారని అన్నారు. కానీ వాళ్ల మాటలకు ఆధారాలేమీ లేవు. ఎవరో చెప్పిన మాటల ఆధారంగా అనడం తప్ప వాళ్లైతే సంఘటన ప్రాంతంలో లేరు. పాకిస్తాన్ జిందాబాద్ అనే మాటే అక్కడ రాలేదని న్యూస్ ఛానళ్ల వాళ్లకు, పోలీసులకు, నిజనిర్ధారణలవాళ్లకు చాలా మంది చెప్పారు. చందన్ తల్లి, సోదరి ఆదిత్యనాథ్‌ను కలిసి రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన 20 లక్షల డబ్బు తమకు అవసరం లేదని, చందన్‌కు 'అమరు'ని హోదా ఇవ్వాలని అడిగారు. తమ ప్రాణాలకు హాని ఉందని చెప్పగా ఆదిత్యనాథ్ ప్రభుత్వం చందన్ తల్లిదండ్రులకు పోలీస్ రక్షణ కల్పించింది.

# రామె ఏమైనట్లు ?

***పోలీసు కాల్పుల్లో గాయపడిన ఆదివాసి సాధారణ మహిళ చికిత్స అనంతరం ఇంటికి చేరకపోవడం వెనుక పోలీసుల ప్రమేయం ఉన్నట్లు గత అనుభవాలను బట్టి గ్రామస్తులు అనుమానిస్తున్నారని అంటున్నారు* లక్ష్మణ్ గడ్డం**

ఛత్తీస్‌గడ్ ఆదివాసీ మహిళ సోయం రామె పోలీసు తూటాలకు గాయపడి భద్రాచలంలో చికిత్స పొందుతుండగా భర్తతో పాటు ఆమెను పోలీసులు పట్టుకుపోయి మిస్సింగ్ చేశారని ఆమె ఆడపడుచు పోయం సీత బిలాస్‌పూర్ హైకోర్టులో 2018, జనవరి 22న హెబియస్ కార్పస్ పిటిషన్ వేసింది. రామె మా అదుపులో లేదని పోలీసులు బుకాయిస్తున్నారు. ఛత్తీస్‌గడ్ పోలీసులు మహిళలను టార్గెట్ చేసి రాజ్యహింసను ప్రయోగిస్తున్నారు. సాధారణ మహిళలను ఎన్‌కౌంటర్ల పేరుతో చంపేస్తున్నారు. అత్యాచారాలకు పాల్పడుతున్నారు. చివరకు పట్టుకుపోయి మాయం చేస్తున్నారు. మహిళలను టారెట్ చేసి హింసాత్మకం చేస్తే ప్రజలు పారిపోయి అడవి ఖాళీ అయితే అత్యంత విలువైన ఖనిజ సంపదను విదేశీ బహుళ జాతి సంస్థలకు అప్పజెప్పే ప్రక్రియ వేగవంతం అవుతుందని ప్రభుత్వం భావిస్తోంది.

సోయం రామె (35) ఛత్తీస్‌గడ్ రాష్ట్రంలోని సుక్మా జిల్లా కుంట తహసీల్ గోంపాడు గ్రామానికి చెందిన ఆదివాసీ డోరియా తెగకు చెందిన సాధారణ మహిళ. ఈమెకు భర్త సోయం కామ (37), ముగ్గురు కొడుకులు దుర్గ (9), కళ్యాణ్ (8), సుధాకర్ (7)లు ఉన్నారు. వ్యవసాయం చేసుకుంటూ జీవనం వెళ్లదీస్తున్నారు.

2017, డిసెంబర్ 18న మధ్యాహ్నం సోయం రామె మరో ఇద్దరు మహిళలు సోయం వీరి, మడ్కం మూడెలతో కల్సి ఊరు పక్కన ఉన్న చెరువులో చేపలు పట్టడానికి పోయింది. ఇంతలోనె ఆకస్మికంగా తుపాకుల మోత వినపడ్డది. ఒక్క ఉదుటన వెనక్కి తిరిగి పరుగెడుతుండగా ఓ తూటా వచ్చి ఎడమ తొడ పైబాగాన తుంటిలో దిగింది. తీవ్రంగా గాయపడి రక్తమోడుతున్న రామెను ఆ ఇద్దరు మహిళలు ఇంటికి తీసుకువచ్చారు. పోలీసుల కంట్లో పడకుండా ఇంటి వద్దనే వాళ్లకి తోచిన

---

కాస్‌గంజ్ ఘటన ప్రభావాన్ని తగ్గించాల్సింది పోయి మరింత ఆజ్యం పోసేలాగా బిజెపి వ్యవహరించింది. ఉత్తరప్రదేశ్ టెక్స్‌టైల్ మంత్రి సత్యదేవ్ పచోరి, 'కాస్‌గంజ్ చాలా చిన్న విషయం. దాన్ని పట్టించుకోనవసరం లేదు. అలాంటివి తరచు జరుగుతూనే ఉంటాయి' అన్నాడు. వినయ్ కతియార్ అయితే ఈ విషయమై మాట్లాడుతున్నంత సేపు హిందువులు, ముస్లింలు అనే స్పష్టమైన విభజనరేఖ గీస్తూ 'వాళ్లు–మేము' అని విభజిస్తూ మాట్లాడాడు. ఉత్తరప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి కళ్యాణ్‌సింగ్ కొడుకు, కాస్‌గంజ్ ప్రస్తుత ఎంపి అయిన రాజ్‌వీర్‌సింగ్ కూడా పదే పదే రెచ్చగొడుతూ మాట్లాడాడు. ఎలాంటి ఆధారాలు లేకుండానే, పాకిస్తాన్ జిందాబాద్ అనే నినాదాలిచ్చినట్లు వీళ్లు విషప్రచారానికి దిగారు. బిజెపి సోషల్ మీడియా ట్రోల్ విభాగం ముస్లింలను పాకిస్తాన్ వెళ్లిపొమ్మనే వాక్యాలు పెడుతూ అసత్య వార్తలను, చిత్రాలను ప్రసారం చేసింది. ఇట్లా ఒక ప్రణాళికాబద్ధంగా ముస్లింలను తప్పుగా చూపేందుకు బిజెపి కాస్‌గంజ్ ఘటనను శాయశక్తులా ఉపయోగించుకుంది. గవర్నర్ రాంనాయక్ అయితే ధైర్యం చేసి 'మాయని మచ్చ' అన్నాడు. గవర్నర్‌గిరి ఉంటుందో ఊడుతుందో చూడాలి.

కాస్‌గంజ్ ఘటనతో సంబంధం ఉందని ఆరోపిస్తూ సంబంధం లేని వాళ్లనెందరినో పోలీసులు అరెస్టు చేశారు. మొదట 112 మందిని అరెస్టు చేశారు. వారిలో ఎక్కువమంది ముస్లింలే. వాట్సప్‌లో విద్వేషాలు రెచ్చగొడుతున్నారని నక్షత్ర కంప్యూటర్స్‌కు చెందిన ఇద్దరిని అరెస్ట్ చేశారు. హిందూ సంస్థల వాళ్లతో కలిసి పోలీసులు కూడా అనేకమంది ముస్లింలపై భౌతికదాడులకు దిగి, దుకాణాలు మూయించారు. చందన్‌ను చంపిన ప్రధాన నిందితునిగా అనుమానిస్తూ సలీమ్‌ను అరెస్టు చేశారు. అదే కారణంతో తర్వాత రాహత్ ఖురేషిని అరెస్టు చేశారు. ఇట్లా ఇష్టం వచ్చినట్లుగా ఈ నెల రోజులలో అక్రమ అరెస్టులతో ప్రజల హక్కులను ప్రభుత్వం కాలరాస్తూ వచ్చింది.

గణతంత్ర దినోత్సవం రోజున బరేలి జిల్లా మెజిస్ట్రేట్ రాఘవేంద్ర విక్రమ్‌సింగ్ ఫేస్‌బుక్‌లో పోస్ట్ చేసిన వాక్యాలు ఈరోజున చాలామంది యొక్క ఆవేదనాపూరితమైన సహేతుకమైన మాటలుగా ఇక్కడ ప్రస్తావించవలసిన అవసరముంది. "విచిత్రమైన వ్యవహారాలు నడుస్తున్నాయి. ముస్లింల మహల్లాల్లోకి బలవంతంగా ఊరేగింపుగా వెళ్లి పాకిస్తాన్ ముర్దాబాద్ అని ఎందుకు నినాదాలిస్తున్నారు? వాళ్లు ఏమైనా పాకిస్తానీయులా? ఆ తర్వాత రాళ్లు విసరడం, కోర్టు కేసులు కావడం. దేశంలో సామాజిక సమైక్యతను దుష్టశక్తులు నాశనం చేస్తున్నాయి" అని బాధపడ్డాడాయన.

ఇప్పుడు దేశంలో ఒక ట్రెండ్ నడుస్తున్నది. బిజెపి మార్క్ హిందుత్వ ఫాసిస్టు ట్రెండ అది. మొదటివాళ్లకు నచ్చని, వాళ్లు వ్యతిరేకించే ప్రజా సముదాయాలున్న ప్రాంతాలకు వాళ్లు తిరంగా జెండాలతో వెళ్తారు. తిరంగా పేరును ఉచ్ఛరిస్తూ తిరంగా వాక్యాలు నినదిస్తూ తిరంగా జెండా పట్టుకుని వాళ్లేం చేస్తున్నా ఎవ్వరూ మాట్లాడడానికి అనుమతి లేదు. అట్లా వాళ్లు హింసలకు దిగుతారు. గొడవలు చేస్తారు. ప్రజలు నోరుమూసుకుని భరించాలి. చిన్నమాట మాట్లాడినా దేశద్రోహులంటారు. ఈ దేశ జెండా వాళ్ల చేతుల్లో పడి మారణాయుధంగా మారిపోతున్నది. అందుకే రానురాను ఈ జెండాను ప్రేమించాలంటే, దానికి సెల్యూట్ చేయాలంటే ఇబ్బంది పడే రోజులు మొదలవుతాయేమో? అయినా ప్రజలు గౌరవిస్తూనే ఉంటారు, కాస్‌గంజ్‌లో లాగా ఎక్కడ తమమీద కూడా విరుచుకు పడతారేమోనన్న భయంతో..!

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

నాటువైద్యం చేశారు. మరుసటి రోజు రామెను తెలంగాణలోని మల్లంపేట హాస్పిటల్‌కు తీసుకెళ్లారు. ఇక్కడి డాక్టర్ల సలహా మేరకు డిసెంబర్ 20న భద్రాచలం ప్రభుత్వ హాస్పిటల్‌కు తరలించారు. కాని డాక్టర్లు వెంటనే వైద్య సహాయం అందించలేదు. ఇది పోలీసులు జరిపిన కాల్పుల వల్ల జరిగిన తూటాల గాయం కనుక సంబంధిత పోలీస్ స్టేషన్ నుండి చికిత్స నిమిత్తం అనుమతి పత్రం తేవాలన్నారు. దాంతో సోయం కామ అతని అన్న పోయంచంద్ర కుంట పోలీసు స్టేషన్‌కు వెళ్లి అవమానాలు, తిట్లు భరించి కాళ్లావేళ్లా పడి అనుమతి పత్రం డిసెంబర్ 21న తీసుకు వచ్చారు. అప్పుడు భద్రాచలం ప్రభుత్వ డాకర్లు రామెకు చికిత్స మొదలు పెట్టారు. అయితే సర్జరీ నిర్వహించి తూటాను వెలికితీసే పరికరాలు లేకపోవడం వలన వరంగల్ ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకెళ్లమని సలహా ఇచ్చారు. ఇంతలో "ఎల్లలు లేని వైద్యులు" అనే విదేశీ స్వచ్ఛంద సంస్థ ద్వారా జయభారత్ హాస్పిటల్ అనే ప్రైవేటు సంస్థలో డిసెంబర్ 24న చేర్చారు. తూటాల గాయాల మూలంగా ఎక్కువ రక్తస్రావం జరిగినందువల్ల రక్తం ఎక్కించాలన్నారు. సోయం కామ రక్తం ఇవ్వడంతో జయభారత్ డాక్టర్లు జివివి సుదర్శన్ రావు, మోహన్ రావులు డిసెంబర్ 30న సర్జరీ చేసి తూటాను వెలికి తీశారు.

ఈలోగా విషయం తెలుసుకున్న ఛత్తీస్‌గఢ్ హక్కుల కార్యకర్త సోని సోరి డిసెంబర్ 27న భద్రాచలం హాస్పిటల్‌లో చికిత్స పొందుతున్న రామెను పరామర్శించి అక్కడే ప్రెస్ కాన్ఫరెన్స్ నిర్వహించి జరిగిన వాస్తవాలను మీడియాకు వెల్లడించింది. తిరిగి ఛత్తీస్‌గఢ్ వెళ్లి సుక్మా జిల్లా కలెక్టర్‌ను, కల్పి రామెకు మెరుగైన వైద్యం అందించేలా చర్యలు చేపట్టాలని విన్నవించింది. రామె చికిత్స నిమిత్తం హాస్పిటల్‌లో చేరిన రోజు నుంచి చివరి రోజు వరకు ఛత్తీస్‌గఢ్ పోలీసులు, తెలంగాణ పోలీసులు హాస్పిటల్‌లోనే క్యాంపు వేశారు. కావున సోనిసోరి సుక్మా జిల్లా పోలీసు సూపరింటెండెంట్‌ను కల్పి హాస్పిటల్ నుండి పోలీసులను ఉపసంహరించాలని డిమాండు చేసింది. ఇదిలా ఉండగా డిసెంబర్ 28న సుక్మా జిల్లా పోలీసు సూపరింటెండెంట్ ప్రెస్ కాన్ఫరెన్స్ నిర్వహించి సోయం రామె మావోయిస్టు మహిళా దళ సభ్యురాలని, ఆమె హాస్పిటల్‌లో కోలుకున్న వెంటనే అరెస్టు చేస్తానని ప్రకటించాడు.

సోయం రామె శరీరంలోంచి వెలికి తీసింది బుల్లెట్ కాదని అది పిల్లెట్ అని జయభారత్ హాస్పిటల్ డాక్టర్లు వెల్లడిస్తున్నారు. వెలికి తీసిన ఆ పిల్లెట్‌ను పోలీసులకు సీల్డ్ కవర్‌లో అందజేశామని తెలియజేస్తున్నారు. పోలీసులు పిల్లెట్లతో గాయపరిచి సజీవంగా దొరికిన నక్సలైట్లను చిత్రహింసలకు గురిచేసి సమాచారాన్ని రాబట్టాక కాల్చిచంపేసే ఎత్తుగడను ప్రయోగిస్తున్నారు. సర్జరీ చేసిన తర్వాత గాయం పూర్తిగా తక్కువయ్యేంత వరకు హాస్పిటల్‌లోనే ఆశ్రయమిచ్చిన డాక్టర్లు 2018, జనవరి 9న కుట్లు విప్పి మరుసటి రోజు డిశ్చార్జి చేశారు. హాస్పిటల్ ఖర్చులన్ని 'మెడిసన్ సాన్స్ ఫ్రాంటియరర్స్' (ఎం.ఎస్.ఎఫ్) – ఎల్లలు లేని డాక్టర్స్ అనే స్వచ్ఛంద సంస్థ భరించింది.

సోయం రామె ఆమె భర్త సోయం కామె తిరిగి సమీక్ష కోసం 2018, జనవరి 20న తిరిగి జయభారత్ హాస్పిటల్‌కు వెళ్లారు. ఎం.ఎస్.ఎఫ్. కార్యకర్త రజనికి ఫోను చేసి పిలిపించుకున్నారు. హాస్పిటల్‌లో సమీక్ష పరీక్షలు చేయించుకుని మందులు కొనుక్కుని భార్యభర్తలు వెళ్లిపోయారు. 20 జనవరి 2018 హాస్పిటల్ నుండి వెళ్లిపోయిన వారి ఆచూకీ ఇప్పటి వరకు తెలియరాలేదు. కుటుంబీకులు తీవ్ర ఆందోళనకు గురవుతున్నారు. ముగ్గురు పిల్లలు తల్లిదండ్రి కోసం ఆశతో ఎదురు చూస్తున్నారు. పోలీసులే పట్టుకుపోయి మిస్సింగు చేశారని కుటుంబీకులు, గ్రామస్థులు తీవ్ర ఆందోళనకు గురౌతున్నారు. గోంపాడు ప్రజల భయాందోళన తీవ్రతకు గత చరిత్ర గుర్తులున్నాయి.

2016, జూన్ 6న 200 మంది పోలీసులు ఉదయం 7 గంటలకు మాజీ సాల్వా జుడుం సభ్యులతో కలిసి ఊర్లో ప్రవేశించి దొరికిన వాళ్లను దొరికినట్లు చితకబాదారు. మహిళలు, చిన్న పిల్లలను సైతం చితక బాదారు. కుంట బడికి వెళుతున్న పిల్లలను కూడ విపరీతంగా కొట్టారు. మావోయిస్టులను కలుస్తున్నారని, ఆశ్రయమిస్తున్నారని, అన్నం పెడుతున్నారని ఆరోపిస్తూ కొట్టారు. చివరికి మడ్కం కొస్సా ఇంటికి చేరుకుని కొస్సాను ఆయన భార్య మడ్కం లక్ష్మీలను బయటికి లాగి తీవ్రంగా కొట్టారు. పిల్లలు మడ్కం జోగ (8), మడ్కం భీమా (6)లను కూడా కొట్టారు. తీవ్ర చలి జ్వరంతో బాధపడుతు ఇంట్లో పడుకున్న పెద్ద కూతురు మడ్కం హిడ్మె (20) ఈ అలజడికి లేచి బయటికి వచ్చింది. ఆమెను కూడ పట్టుకుని తీవ్రంగా కొట్టారు. హిడ్మేకు ముస్సాకి మూడే తో అప్పటికి సంవత్సరం కింద పెళ్లయింది. బహిరంగంగా తీవ్రంగా కొట్టిన పోలీసులు తల పిన్నులు, చేతి కడాలు, మెడలో గొలుసులు తీసేసి వెంట్రుకలు పట్టి మర్రి గూడెం లోని క్యాంపుకు తీసుకెళ్లారు. గ్రామస్థులంతా అడ్డం పడితే గాలిలో కాల్పులు జరిపారు. క్యాంపుకు తీసుకెళ్లి సామూహిక అత్యాచారం చేసి కాల్చి చంపారు. మధ్యాహ్నం ఒంటి గంటకు గ్రామస్థులకు కాల్పుల శబ్దాలు వినబడ్డాయి. పెద్ద సైజు ఆలివ్ గ్రీన్ డ్రస్సు, చెప్పులు వేసి భీకర ఎన్‌కౌంటర్ జరిగిందని హిడ్మే మావోయిస్టు దళ సభ్యురాలని ప్రకటించారు. హిడ్మేసైజుకు సరిపడే డ్రస్సు, చెప్పులు కూడా పోలీసులకు దొరకలేదు కాబోలు. పోలీస్ క్యాంపు నుంచి శవాన్ని మోసుకొచ్చి కుంట ఆసుపత్రిలో పడేశారు. శవాన్ని పలుచోట్ల కోశారు. కళ్లు పీకేశారు. కాళ్లు, చేతులు, ఎదలో కోశారు. తొడలపై గాయాలు చేశారు. తల్లిదండ్రులు హిడ్మె శవాన్ని 2016 జూన్ 7న తీసుకొచ్చి అంత్యక్రియలు చేశారు. అప్పట్లో బస్తర్ రేంజి ఇన్‌స్పెక్టర్ జనరల్ ఎస్ ఆర్ పి కల్లూరి ఆగడాలకు అంతులేకుండా పోయింది. రాజ్యాంగాన్ని, చట్టాలను ఏ మాత్రం గౌరవించలేదు.

ఇదే తరహా మరో దాడిలో సల్వా జుడుంతో బాటు 300 మంది పోలీసులు 2009 అక్టోబర్ 1న ఉదయం 7 గంటలకు ఇదే ఊరిపై దాడి చేసి 9 మందిని తీవ్రంగా కొట్టి గాయపరిచారు. ఈ దాడిలో మడిమిబజ్జి, మడిమి సుబ్బి, మడిమి కన్ని, మడిమి ముత్తి, మడిమి ఎంక, ముచ్చకే వుంగ, మడివి దేవ, సోయం సుబ్బ, సోయం జోగి, తీవ్రాతి తీవ్రంగా గాయపడ్డారు. ఇందులో మడిమి కన్ని కుమారుడు మూడు నెలల బాలుడి వేళ్లు తెగ్గోశారు. నిజానికి మడిమి కన్ని మర్రి గూడెం గ్రామానికి చెందిన మహిళ. గోంపాడులో చుట్టాల ఇంటికి వచ్చి కొడుకు చేతి వేళ్లు పోగొట్టుకుంది.

ఇలాంటివి ఎన్నో పాశవిక చర్యలకు ఛత్తీస్‌గఢ్ పోలీసులు పాల్పడు తున్నారు. చట్టాలకు అతీతంగా వ్యవహరిస్తున్నారు. ఛత్తీస్‌గఢ్‌లో ప్రజాస్వామిక పౌర పరిపాలనా ఎక్కడా కనిపించదు. పోలీసులు, పారా మిలిటరీ బలగాలే రాజ్య మేలుతున్నాయి. దీన్ని సరిచేయడానికి మేధావులు, ప్రజా సంఘాలు మరింత సృజనాత్మకంగా కృషి చేయాలి. సోయం రామెను భర్త కామను వెంటనే న్యాయస్థానం ముందు హాజరు పర్చాల్సిన చట్ట బాధ్యతను పోలీసులు నిర్వర్తించాలి.

వీ

*(రచయిత అధ్యక్షుడు, పౌరహక్కుల సంఘం)*

# దేశంలో చెలరేగుతున్న ఫాసిస్టులు

***సామ్రాజ్యవాద శక్తుల బహిరంగ ఉగ్రవాద నియంతృత్వమే ఫాసిజమనీ, ఇప్పుడు అది భారత దేశంలో విజృంభిస్తూ ప్రజలను భయోత్పాతాలకు గురిచేస్తోందనీ అంటున్నారు*** **పూర్ణేందు ముఖర్జీ**

దాదాపు శతాబ్దం క్రితం నాగ్‌పూర్‌లో సంఘ్‌పరివార్ విషబీజాలు నాటింది. ఇప్పుడవి సనాతన రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (ఆర్‌ఎస్‌ఎస్) ప్రచారకుడు నరేంద్రమోడీ అధికారంలోకి వచ్చాక ఫలాలిస్తున్నాయి.

మోదీ ప్రాతినిధ్యం వహిస్తున్న బ్రాహ్మణీయ – హిందూ ఫాసిస్టు శక్తులూ, అతని కాషాయదళం మేధోరంగాన్ని ఆక్రమించడానికి ప్రయత్నిస్తున్నాయి. ప్రచార మాధ్యమాల ద్వారా, ద్వేషపూరిత చాణక్య ప్రచారం ద్వారా ఉన్నత విద్యాసంస్థలపైన దారుణమైన దాడుల్ని చేపడుతోంది.

దళితులపైనా, మైనారిటీలపైనా – సాంస్కృతంగా, భౌతికంగా దాడులు అన్ని రంగాల్లో పెరుగుతున్నాయి. ఈ దాడుల మాటున బడా పెట్టుబడిదారులకు ఊడిగం చేసే తమ ఆర్థిక కార్యక్రమాన్ని కప్పి పెట్టడానికి ఈ ఫాసిస్టులు తెగ పాటుపడుతున్నారు.

బ్రాహ్మణీయ హిందూ ఫాసిస్టు శక్తులను ప్రతిఘటించడం కోసం, ఫాసిజం నిజ స్వభావాన్నీ, దాని చరిత్రనూ మనం అర్థం చేసుకోవాలి. ఆర్‌ఎస్‌ఎస్, దాని అనుబంధ సంస్థల ద్వారా భారతదేశంలో ఫాసిజం నిర్దిష్ట వ్యక్తీకరణలను తెలుసుకోవడం మరింత తక్షణావసరం

**బూర్జువా ప్రజాస్వామ్య మరో రూపమే ఫాసిజం**

బూర్జువా వర్గ పాలనకు రెండు ప్రధాన రూపాలున్నాయి. అందులో ఫాసిజం ఒకటి. బూర్జువా ప్రజాస్వామ్యం మరో రూపం. అంతులేని పెట్టుబడిదారీ దోపిడీకి పాలిత వర్గాల నుండి ఎలాంటి ప్రతిఘటన రానంత వరకు – ప్రజాస్వామిక పద్ధతులనూ, విలువలనూ, హక్కులనూ – తన పాలనలో పాటించడానికీ, అనుసరించడానికీ పెట్టుబడిదారీ వర్గం ప్రయత్నిస్తుంది. అయితే, వ్యవస్థ ఎప్పుడైతే తీవ్ర సంక్షోభంలోకి కూరుకుపోతుందో, అధిక లాభాలను అది పొందలేక పోతుంది. ఆ సంక్షోభ కారణంగా వచ్చే కార్మిక వర్గం, ఇతర పీడిత వర్గాల తిరుగుబాటు, పోరాట వెల్లువలతో పెట్టుబడిదారీ వ్యవస్థ భయ భ్రాంతమౌతుంది. ఆ పరిస్థితుల్లో బూర్జువావర్గం ప్రజాస్వామ్య ముసుగును తొలగిస్తుంది. నగ్నమైన నియంతృత్వ రూపాన్ని బయటకు తెస్తుంది. దీన్నే కార్పొరేటిజం అంటారు. రాజ్యం, కార్పొరేట్ శక్తుల గాఢాలింగనమే కార్పొరేటిజం.

చరిత్రలో ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ ఇంతకు మున్నెప్పుడూ చవిచూడని తీవ్ర సంక్షోభాన్ని ఎదురొన్నప్పుడు యూరప్‌లో ఫాసిజం పెరిగింది. ఫాసిస్టు శక్తుల ఎదుగుదలను ప్రజలు అన్నిచోట్లా కళ్లారా చూశారు. ఆర్థిక సంక్షోభం మరోసారి ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థను వెంటాడుతున్న నేపథ్యంలో ఇండియాతో సహా నేటి ప్రపంచమంతా తీవ్ర మితవాద శక్తులు, ఫాసిజం – జాతీయ దురహంకారవాదం విజృంభిస్తున్నాయి.

ఫాసిజం వెనుకబడ్డ చైతన్యం ఉన్న శ్రామిక వర్గాన్ని సమీకరిస్తుంది. బూర్జువా ప్రజాస్వామ్యం ఊతతో అధికారం చేజిక్కించుకుంటుంది. ఫాసిజం దేశభక్తి పేరు మీద విశాల ప్రజానీకాన్ని సమీకరించ గలుగుతుంది. అలా చేయడానికి ఒక వర్గం లేదా ఒక సముదాయాన్ని (మనదేశంలో ముస్లింలను) దేశ భద్రతకు ప్రమాదకారిగా చిత్రిస్తుంది. మెజారిటీ ప్రజా సముదాయాన్ని (మనదేశంలో హిందువులను) సమీకరించి మైనారిటీలను ఒంటరి చేస్తూ దాడులు నిర్వహిస్తుంది. ఫాసిజం జాతీయ భద్రత గురించీ, ప్రస్తుత ప్రపంచంలో 'టెర్రరిస్టు ప్రమాదం'పై ప్రచార మాధ్యమాల్లో అతిగా ప్రచారంచేసి, ప్రజాభిప్రాయాన్ని సృష్టిస్తుంది. ప్రజాస్వామిక హక్కులను ప్రజలు వదులుకునేలా వాతావరణాన్ని కల్పిస్తుంది. అందరూ అనుకునేదేమంటే – లంపెన్ బూర్జువాజీనే ఫాసిజాన్ని అభివృద్ధి చేసిందని, ఫాసిజానికి ఆసరా ఇచ్చిందని. నిజానికి వాణిజ్య పెట్టుబడికి చెందిన అత్యంత ప్రతీఘాతక శక్తులూ, తీవ్ర జాతీయవాదులూ యుద్ధోన్మాద సామ్రాజ్యవాద శక్తుల బహిరంగ ఉగ్రవాద నియంతృత్వమే ఫాసిజం. ఈ అవగాహన సామ్రాజ్యవాద దేశాలకు సంబంధించినంత వరకూ భారతదేశంలో ఫాసిజం – విశిష్ట లక్షణాలు సరైనదే.

ఇండియా వంటి అర్ధ భూస్వామ్య – అర్ధవలస దేశాల్లో దళారీ బూర్జువా వర్గం మొత్తంగానూ, భూస్వామ్య వర్గమూ, ఈ ఫాసిస్టు నియంతృత్వాన్ని అమలు చేస్తాయి. భారతీయ నిర్దిష్ట పరిస్థితుల్లో కులం, మతం ఈ సమీకరణంలోకి వస్తాయి. సారాంశంలో ఇది అగ్రకుల నియంతృత్వం. ప్రతీఘాతుక హిందూ ఛాందసవాదుల, పాలక వ్యవస్థలోని దేశభక్తి ముసుగులో ఉన్న యుద్ధోన్మాదుల నియంతృత్వం. భావజాల పరంగా బ్రాహ్మణీయ – హిందూ ఫాసిజంగా దీన్ని వర్ణించవచ్చు. బడా పెట్టుబడిదారులంతా అంబానీల నుండి అదానీల వరకు, టాటాలూ, బిర్లాలూ, అగర్వాల్‌లూ తమ శక్తినంతా ఉపయోగించి మోదీని ప్రధాన మంత్రి అభ్యర్థిగా బలపరిచారు. ఫాసిజానికి సామాజిక పునాది ఏమిటో తెలిపే రుజువు ఇదే!

బూర్జువా వర్గ భావజాల పరంగా చూస్తే ఎన్నికలే ప్రజాస్వామ్యం. క్రమం తప్పకుండా ఎన్నికలు నిర్వహిస్తూ పాలక వర్గాల్లోని పలు ముఠాలు వాటిలో పాల్గొని ఎవరికో ఒకరికి గెలిచే అవకాశం కల్పిస్తే ఆ వర్గం దృష్టిలో ప్రజాస్వామ్యం మూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్ధిల్లుతున్నట్లే. సంఘం పెట్టుకునే హక్కూ, సమావేశ హక్కూ, వాక్ స్వాతంత్ర్యమూ, సమ్మె హక్కూ, వగైరా ఘోరంగా అణచివేతకు గురైనా వాళ్లకేమీ పట్టదు.

శ్రామిక వర్గానికీ, వారికోసం పోరాడే సంస్థలకూ, పార్టీలకూ ప్రజాస్వామిక హక్కులు సంపూర్ణంగా అమలు చేయడమే ప్రజాస్వామ్యం. ప్రజాభిప్రాయాన్ని వ్యక్తపరిచే ఒక మార్గం మాత్రమే ఎన్నికలు. ఈ కోణం నుండి చూస్తే భారతదేశం ఎప్పుడూ ఒక ప్రజాస్వామిక దేశంగా లేదు. (కశ్మీర్, ఈశాన్య రాష్ట్రాలు నిరంతర ఫాసిస్టు పాలన కిందే ఉన్నాయి. నిజానికి పోరాడే ప్రజానీకానికి ఎక్కడైనా ఇదే పరిస్థితి) తెలంగాణ సాయుధ పోరాట కాలం నుండే దోపిడీ వ్యవస్థకు ప్రమాదంగా పరిణమించిన వారి పట్ల ఎప్పుడూ ఫాసిస్టు అణచివేతే కొనసాగింది. పట్టణ ప్రాంతాల్లో ఒక మేరకు పరిమితంగానైనా ప్రజాస్వామిక హక్కులు ఉనికిలో ఉన్నాయి.

రోజురోజుకూ ఆ పరిమిత హక్కులు కూడా కుంచించుకు పోతున్నాయి. టాడా, పోటా, ఊపా, అఫ్సా, రాజద్రోహం చట్టం లాంటి నల్లచట్టాల ద్వారా ప్రజా పోరాటాలను ప్రభుత్వం అణుచుతోంది. పోలీసులూ, సాయుధ బలగాలూ 'ఎదురు కాల్పుల' పేరుతో హత్యలు చేస్తూ చట్టం ఉల్లంఘనలకు పాల్పడినా వాళ్లు శిక్షల నుండి సులభంగా తప్పించుకోగలుగుతున్నారు.

విప్లవోద్యమంపై హంతక దాడులు చేయడానికి రాజ్య బలగాలకు ప్రైవేట్ హంతక ముఠాలైన రణవీర్ సేనా, సల్వాజుడుం, టిపిసి (తృతీయ ప్రస్తుతీ కమిటీ), జెపిసి నయీముద్దీన్ గ్యాంగ్ లాంటివి తోడ్పడు తున్నాయి. ప్రస్తుత భాజపా – స్వయం సేవక్ సంఘ్ పాలనలో సంఘ్‌పరివార్ సంస్థలైన శ్రీరామ్ సేన, భజరంగ్‌దళ్, విశ్వహిందూ పరిషత్, హిందూ మున్నాని, అఖిల భారత విద్యార్థి పరిషత్, శివసేనలకు – ముస్లింలపై, క్రిస్టియన్లపై, దళితులపై దాడులూ, సామూహిక హత్యాకాండలూ చేయడానికి పూర్తి స్వేచ్ఛనిచ్చారు. ఇది ఫాసిజం స్వాభావిక లక్షణం. గ్రామాల్లో, పట్టణాల్లో, విశ్వవిద్యాలయాల్లో – ఇక్కడా, అక్కడా అని లేకుండా పెరుగుతున్న దాడులే దీనికి సాక్ష్యం.

**హిందుత్వ ఫాసిజం ఎదుగుదల దశలు**

హిందుత్వ భావజాల దృక్పథం, హిందూ మతానికి భిన్నమైనది. ప్రత్యేకించి, గత 3–4 దశాబ్దాలుగా హిందుత్వ భావజాలం పెరుగుదలను గమనించవచ్చు. హిందీ – హిందూ – హిందుత్వ నినాదం వెనక హిందువులను సమీకరించడానికి 1925 నుండి సంఘ్ ప్రయత్నిస్తు న్నప్పటికీ, ఎనభైల చివరి నుండీ ఈ ఫాసిస్టు భావజాలం చెప్పుకోదగ్గ స్థాయిలో విస్తరించింది. రాముడి విగ్రహ పూజ కోసం బాబ్రీ మసీదు తాళాలు తెరిపించినప్పటి నుండి దాని కూల్చివేత వరకు ముంబయి, తదితర ప్రాంతాల్లో ముస్లిం సముదాయాలపై సంఘటిత మూకల సామూహిక హత్యాకాండను భారతదేశంలో ఫాసిజం ఎదుగుదలకు మొదటి దశగా భావించవచ్చు.

నరేంద్రమోదీ గుజరాత్ ముఖ్యమంత్రి కావడం, గుజరాత్‌లో గోద్రా ఘటనానంతరం గుజరాత్‌లో ముస్లింల సామూహిక మారణకాండ, కరడుగట్టిన హిందుత్వ నాయకుడిగా మోదీ ఎదుగుదల, బడా పెట్టుబడికి ముద్దుబిడ్డగా మోదీ మారడాన్ని – రెండో దశగా చెప్పవచ్చు.

భారీ డబ్బు సంచులతో, బూర్జువా మీడియా ఏకపక్ష ఊదరగొట్టుడు ప్రచార హోరుతో నరేంద్రమోదీ 2014 ఎన్నికల్లో ప్రధాన మంత్రిగా ఉన్నత స్థానానికి ఎగబాకడం మూడవ దశ. నరేంద్రమోదీ ప్రధానిగా గద్దెనెక్కడం, పెద్ద స్థాయిలో ఫాసిస్టు శక్తులు విజృంభించడానికి ఊతం ఇచ్చింది.

భాజపా, సంఘ్ పరివార్ శక్తులూ, తీవ్ర జాతీయవాదమూ దేశభక్తి ముసుగులో తప్పుడు భావనలను రెచ్చగొడుతున్నాయి. 'భారత్ మాతాకీ జై', 'వందేమాతరం' తదితర నినాదాలు ఇవ్వడమే దేశభక్తికి సర్టిఫికేట్ అనే కుతంత్రాలతో ఫాసిస్టు శక్తులు ఒత్తిడి చేస్తున్నాయి. పాకిస్తాన్‌పై తీవ్ర దూషణ, భూషణల ముసుగులో తమ ప్రజా వ్యతిరేక సామ్రాజ్యవాద అనుకూల విధానాలను కప్పి పెడుతున్నాయి.

నిజానికి ఆర్ఎస్ఎస్ ఏనాడూ భారత స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనలేదు. సహాయ నిరాకరణోద్యమాన్ని, క్విట్ ఇండియా ఉద్యమాన్ని వ్యతిరేకించింది. కనీసం మూడు రంగుల జాతీయ జెండాకు కూడా సంఘ్ అనుకూలం కాదు.

**హిందుత్వ ఫాసిజం–సామ్రాజ్యవాద, భారత బడా పెట్టుబడిదారులతో విడరాని బంధం**

విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు అన్ని రంగాల్లో బాజాపా గేట్లు బార్లా తెరిచింది. రక్షణ వంటి కీలక రంగంతో సహా ఫార్మసీ, కేబుల్ నెట్‌వర్క్, డిటిహెచ్‌లతో 100 శాతం ప్రత్యక్ష విదేశీ పెట్టుబడులను బాజాపా అనుమతించింది. ఎటువంటి ప్రభుత్వ అనుమతులు లేకుండానే విదేశీయులు ఈ రంగాలన్నింటిలో పెట్టుబడులు పెట్టే అవకాశం కల్పించారు.

జపాన్, జర్మనీ వంటి అభివృద్ధి చెందిన దేశాలు ఇప్పుడు అణు విద్యుత్ ఉత్పత్తి నుండి పూర్తిగా వైదొలిగే క్రమంలో ఉన్నాయి. మోదీ ప్రభుత్వం మాత్రం అమెరికన్ గుత్త సంస్థల ఒత్తిడికి తలొగ్గి ప్రమాదాల పట్ల ఎటువంటి జవాబుదారీ తనం లేకుండానే అణు విద్యుత్ కేంద్రాల స్థాపనకు పచ్చజెండా ఊపింది. అమెరికా అభ్యంతరాలతో భారత్ అణు జవాబుదారీ చట్టాన్ని తుంగలోకి తొక్కింది.

జాతీయ బ్యాంకులను ప్రైవేటీకరించడానికి భాజపా ప్రభుత్వం కసరత్తులు మొదలు పెట్టింది. విదేశీయులను ఇన్సూరెన్సు రంగంలోకి అనుమతించింది. ఐటి రంగంలోని దేశ, విదేశీ బడా ఫైనాన్స్ పెట్టుబడి దారులకు లాభాలు కట్టబెట్టడానికి నోట్లరద్దు, నగదు రహిత ఆర్థిక విధానాలను ముందుకు తెచ్చింది.

బహుళజాతి గుత్త సంస్థలు, ప్రైవేట్ కంపెనీలు తమ ఇష్టా రాజ్యంగా కార్మికులతో పని చేయించుకోవడానికి, వారిని తొలగించడానికి కార్మిక చట్టాల్లో సవరణలు తెచ్చింది. ఫలితంగా యాజమాన్యాలు కార్మికులకు ఎటువంటి హక్కులు లేకుండా క్యాజువల్ కార్మికులుగా కంపెనీలు ఉద్యోగంలో చేర్చుకుంటున్నాయి. ఇదంతా వారు కార్మిక వర్గం సంఘటితం కానివ్వకుండా చేయడం కోసమే. అధ్వాన్నమైన పని పరిస్థితులు, చాలీ చాలని వేతనాలతో కార్మికులను పనిచేయిస్తున్నారు.

తమ వైఫల్యాలు కప్పి పెట్టుకోవడానికి వీరు పాకిస్తాన్ భూతాన్ని, టెర్రరిస్టు బూచిని చూపుతారు. తమకు తీపిగా అనిపించే యుద్ధ ప్రేలాపనలతో ఉద్రిక్తలను సృష్టిస్తున్నారు. ఇప్పటికీ ఈ ప్రభుత్వం సూటిగా చైనా వ్యతిరేక దూషణ పర్వం ప్రారంభించకపోయినా, వీలైన అన్ని మార్గాలలో చైనా వ్యతిరేక ఉన్మాదాన్ని రెచ్చగొడుతుంది.

**అన్ని రంగాలనూ కాషాయీకరించే ప్రయత్నాలు**

ఆర్ఎస్ఎస్, భాజపా ప్రభుత్వం – అన్ని రంగాలనూ కాషాయీకరించడానికి ప్రయత్నిస్తున్నాయి. పాఠశాలల, కళాశాలల పాఠ్యాంశాలను, పాఠ్య ప్రణాళికలను, మూఢ విశ్వాసాలను ప్రోత్సహించే విధంగా, చరిత్రను వక్రీకరించే విధంగా మార్చివేస్తున్నాయి. అమానవీయ కుల వ్యవస్థను విస్మరించి, హిందూ మత ఔన్నత్యాన్ని కొండంతలు చేసి చూపుతున్నాయి. ఆధునిక లౌకిక, ఉదార సమానత్వ విలువల స్థానంలో బ్రాహ్మణీయ భావజాలాన్ని, పితృస్వామ్యాన్ని , అసమానత్వ విలువలను బోధిస్తున్నాయి.

భారతీయ సాంప్రదాయ విలువల పరిరక్షణ పేరుతో సంఘ్‌పరివార్ శక్తులు రోమియో వ్యతిరేక తదితర దళాలు ఏర్పాటు చేశాయి. యువతీ యువకుల మీద దాడులు చేస్తున్నాయి. వాలంటైన్స్ డే సందర్భంగా యువతీ యువకులపై దాడులు చేస్తున్నాయి. లవ్ జిహాద్ పేరుతో ముస్లిం యువకులపై దాడులు జరుగుతున్నాయి. దీని వెనక పథకం దాగుంది. బ్రాహ్మణీయ భావజాల పోషకులు కులాంతర, మతాంతర వివాహాలను అడ్డుకోవడమే.

మోదీ పాలనలో రెట్టించిన శక్తితో ఉన్నత విద్యా సంస్థల పాఠ్యాంశాల కాషాయీకరణ జరుగుతోంది. భాజపా అధికారంలో ఉన్న అన్ని రాష్ట్రాల్లో గతాన్ని ఆకాశానికెత్తుతూ చరిత్రను వక్రీకరణలతో పుస్తకాలను నింపేస్తున్నారు. ముస్లిం పాలకులను కించపరుస్తూ పాఠ్యాంశాలు రూపొందించి, వీటితో పిల్లల మనసులను ప్రభావితం చేస్తున్నారు.

**విద్యాలయాలల్లో అణచివేత**

ఆర్ఎస్ఎస్ నేపథ్యం ఉన్న వారిని ఉన్నత విద్యా సంస్థల, సాంస్కృతిక – సామాజిక సంస్థాధిపతులుగా నియమిస్తున్నారు. ప్రగతిశీల, ఉదారవాద, కుల వ్యతిరేక సంఘాలను, విద్యార్థులను, మేధావులను ఉక్కు పాదంతో అణచివేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఎబివిపి గూండాలు, సంఘ్‌పరివార్ సంస్థలు, అధికార యంత్రాంగంతో కుమ్మక్కవుతున్నారు. సంఘ్‌పరివార్‌కు అనుకూలమైన విశ్వవిద్యాలయ ఉపకులపతులు పోలీసులను క్యాంపసుల్లోకి ఆహ్వానిస్తూ విద్యార్థులపై అణచివేత పద్ధతులను ప్రోత్సహిస్తున్నారు. విద్యార్థులను తాత్కాలికంగానూ, శాశ్వతంగానూ విశ్వవిద్యాలయాల నుండి తొలగించడం సర్వ సాధారణమయింది. విద్యాలయాలు పాటించాల్సిన అన్ని సాధారణ నియమాలను కూడా అమలు చేయడం లేదు.

రోహిత్ వేముల, తదితర విద్యార్థుల విషయంలో హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయంలో జరిగిన సంఘటనలే ఇందుకు తిరుగులేని సాక్ష్యాలు. ఎపిఎస్ఎ (చెన్నై), జెఎన్‌యు (ఢిల్లీ), బిఎచ్‌యు (వారణాసి), పంజాబ్ యూనివర్సిటీ (చండీఘడ్), ఎఫ్‌టిఐఐ (పూణే), జాదవ్‌పూర్ యూనివర్సిటీ (కలకత్తా) లతో సహా అనేక ఉన్నత విద్యా సంస్థల్లో ఈ ధోరణి కనపడుతుంది.

తరగని నిరుద్యోగం, పెరుగుతున్న అసమానతలు, అంతులేని సామ్రాజ్య దోపిడీ – ఈ విషయాల నుండి ప్రజల దృష్టి మళ్లించే కుట్రపూరిత పథకం వీటన్నింటి వెనకా దాగి ఉంది. 'వందేమాతరం' గీతం పాడడమే దేశభక్తికి గీటురాయిగా మారుస్తున్నారు.

హిందూ మతోన్మాదుల కళ్లేలు వదలడంతో 'లవ్ జిహాద్' పేరుతో, గొడ్డు మాంసం తింటున్నారని ముస్లింలపై అడ్డూ అదుపూ లేకుండా దాడులు జరుగుతున్నాయి. తక్షణ రాజకీయ ప్రయోజనాల కోసం, ప్రజలను మత ప్రాతిపదికన విభజించడానికి ఈ దాడులు జరుపుతున్నారు. మైనారిటీలను, ప్రత్యేకించి ముస్లింలను లోబరుచుకోవడం కూడా ఈ దాడుల ఉద్దేశం. దళితులతో సహా అందరి హిందువుల కోసం సంఘ్‌పరివార్ బయటకి మాట్లాడుతున్నప్పటికీ, హిందూ మత ప్రభావ సారాంశమే కులతత్వాన్ని శక్తివంతం చేసే లక్షణం గలది. గోరక్షక దళాల పేరుతో నరహంతక ముఠాలు ప్రత్యేకించి ఉత్తర భారతదేశంలో హింసకు, దౌర్జన్యానికి దిగడం నిత్యకృత్యమైంది.

ఉమ్మడి పౌర స్మృతి ముసుగులో హిందూ పౌర స్మృతిని రుద్దడానికి భాజపా ప్రయత్నిస్తోంది. ముస్లింలను దెబ్బతీయడానికి 'ఉమ్మడి పౌరస్మృతి' భాజపా చేతిలో ఒక ఆయుధం మాత్రమే. మహోన్నత లౌకిక ప్రజాస్వామిక భావనలతో మాత్రం ఉమ్మడి పౌర స్మృతిని బాజాపా ముందుకు తేవడం లేదు.

మత మార్పిడి నిరోధక చట్టం తీసుకొస్తున్నారు. ఇది కూడా పైకి ఎంత గొప్పగా కనిపించినా సారాంశంలో ముస్లింలను, క్రిస్టియన్లనే ఎక్కువ బాధిస్తుంది. రాజ్యాంగంలో పదిల పరచిన ఉదార, ప్రజాస్వామిక, లౌకిక విలువలను న్యాయ వ్యవస్థ అయినా ఎత్తిపడుతుందనే భావన ఉంది. కానీ, న్యాయ వ్యవస్థ కాషాయ శక్తుల చేతుల్లో పనిముట్టుగా మారుతోంది. అందులో ఉన్న ఒకరో, అరో మినహాయింపు కావచ్చు. ఉగ్రవాదంపై పోరాటం పేరుతో న్యాయ వ్యవస్థ కాషాయీకరించబడ్తోంది. 'ఉగ్రవాదుల'కు, మావోయిస్టు సానుభూతి పరులకు బెయిల్స్ నిరాకరించబడుతున్నాయి. సాక్ష్యాలు బలహీనంగా ఉన్న కేసుల్లో కూడా 'జాతి సామూహిక మనోభావాలను' సంతృప్తి పరచడం పేరుతో జీవిత ఖైదు, ఉరిశిక్షా విధిస్తున్నారు. మరోవైపు హిందూ మత దురహంకార హంతకులకు, అగ్రవర్గ సేనల నాయకులకు సులభంగా బెయిళ్లు మంజూరవుతాయి. వాళ్లమీద ఉన్న అత్యంత హేయమైన కేసులను కూడా కొట్టేస్తారు.

భద్రతా బలగాలు తమ అదుపులో ఉన్న ప్రాంతాల్లో పోరాడే ప్రజలను, రాజకీయ కార్యకర్తలను, ముస్లిం–దళిత–ఆదివాసులను క్రూర చిత్రహింసలకు గురిచేయడం సర్వ సాధారణంగా జరుగుతోంది. మహిళలపై దాడులకు, అత్యాచారాలకు పాల్పడుతున్నాయి. ఆదివాసి గ్రామాలు తగలబడుతున్నాయి. దారుణ హత్యలు జరుగుతున్నాయి. అయినా, భద్రతా బలగాల మనోస్థైర్యం కాపాడ్డం పేరుతో న్యాయ వ్యవస్థ ప్రభుత్వం చేస్తున్న అనేక క్రూర నేరాలను చూసీ చూడనట్లు వదిలేస్తుంది.

సినిమా హాళ్లలో జాతీయ గీతాలాపన తప్పనిసరి చేస్తూ న్యాయ వ్యవస్థ కుహనా దేశభక్తిని రుద్దుతున్నది. గో మూత్రాన్ని, ఆవు గొప్పదనాన్ని గురించి న్యాయస్థానాలు అశాస్త్రీయ పొగడ్తల్లో ముంచేస్తున్నాయి. ప్రగతి నిరోధక భావజాలంతో తమ కళ్లెదుట జరుగుతున్న తప్పులకు సహకరించడం లేదా నిలవరించడంలో న్యాయ వ్యవస్థ వైఫల్యాన్ని ఫాసిజం ఒక ప్రత్యేక లక్షణంగా చెప్పవచ్చు. మావోయిస్టులపై, ఉగ్రవాదులపై పోరాటం పేరుతో సాయుధ బలగాలకు విశృంఖల స్వేచ్ఛనిస్తున్నారు.

సమాజంలో స్త్రీ పాత్ర గురించి అభివృద్ధి నిరోధక భావాలు

# గోల్వాల్కర్ ఆలోచనల్లో హిందూ ఫాసిజం

***మతం, రాజ్యం ఒకదానికొకటి బలోపేతం చేసుకుంటూ దోపిడీవర్గంగా మారి అశేష శ్రామిక ప్రజానీకాన్ని అణచి వేస్తుంటాయనీ, ఇటువంటి భావజాలానికి ప్రతినిధి గోల్వాల్కర్ అనీ అంటున్నారు బి. రామకృష్ణ***

బ్రిటిష్ వలస పాలనకు గాని, భూస్వామ్య, రాచరిక పాలనకు గాని, సాంఘిక అసమానతలు, వివక్షతలపై గాని, పెట్టుబడిదారీ దోపిడీపై గాని, సామ్రాజ్యవాదానికి గాని వ్యతిరేకంగా పోరాడిన చరిత్రలేని సంస్థ రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (ఆర్ఎస్ఎస్). ఆ సంస్థ నిత్యం చెప్పే ధర్మశాస్త్రాలు, వేదాలు, స్మృతుల్లో ఎక్కడా కూడా హిందూ అనే పదమే లేదు.

భౌగోళిక, సాంస్కృతిక భిన్నత్వాలతో భిన్న రాజ్యాలుగా, ప్రాంతాలుగా అస్థిత్వంలో ఉన్నవి మొఘలులు, ఆంగ్లేయుల పాలన కిందకు వచ్చాక గాని భారతదేశ చిత్రపటం రూపుదిద్దుకోలేదు. 'సప్తసింధు' అనేది క్రమేపి 'హప్తహిందు'గా మారి 'హిందు' పదం వచ్చిందని చరిత్రకారులు చెబుతున్నారు. దీన్నే గోల్వాల్కర్ సహితం అంగీకరించాడు.

విదేశాలలో విభిన్న సంప్రదాయాలు, విశ్వాసాలు పుట్టి అవి మనతో సంపర్కంలోనికి వచ్చినప్పుడు మాత్రమే మనకొక పేరుండాలనే అవసరం ఏర్పడిందని, సింధు నది నుండి జనించిన 'హిందు' అన్న పేరుతో చరిత్రలో ఏర్పడిందని ఆర్ఎస్ఎస్ సిద్ధాంతకర్త అయిన గోల్వాల్కర్ చెబుతాడు. బ్రాహ్మణ మతమనో, వైదిక మతమనో అనాల్సింది హిందూ మతంగా తయారయ్యింది.

'ఆర్య', 'భారతీయ' అనే పదాలకంటే హిందూ పదమే ఎందుకు సరైందో గోల్వాల్కర్ వివరించాడు. 'ఆర్య' అన్నది ప్రాచీనమైనది, గర్వించ దగ్గరి సందేహం లేదు కాని వెయ్యేండ్లుగా అది వాడుకలో లేదు. పైగా చరిత్ర పరిశోధన ముసుగులో ఆంగ్లేయులు ప్రయోగించిన ఆర్య – ద్రావిడ విభేద ప్రచార విషం మనవారి తలకెక్కింది. అందువల్ల ఆర్య శబ్దాన్ని ప్రయోగించడం మొదటికే మోసం వస్తుందని తెలిపాడు.

'భారతీయ' అనే పదం కూడా వైదిక కాలం నుండి వాడుకలో ఉన్నదని, నిజానికి 'హిందూ' 'భారతీయ' శబ్దాలు ఒకే భావాన్ని చెబుతాయి కాని ఈనాడు ఈ దేశంలో నివసించే ముస్లింలు, పార్శీలు, క్రైస్తవులు మొదలైన వారందరిని కలిపిచెప్పే 'ఇండియాన్' అనే ఆంగ్ల శబ్దానికి అనువాదంగా 'భారతీయ' పదాన్ని వాడుతున్నారు.

---

పెరుగుతున్నాయి. కుటుంబానికి, పురుషులకు సేవ చేయడమే మహిళా సాంప్రదాయ స్త్రీ ధర్మమని ఢంకా బజాయిస్తున్నారు. సరస్వతీ శిశు మందిరాల్లో బాలికలకు ఈ పితృస్వామ్య భావజాలాన్ని ఎక్కిస్తున్నారు.

దుర్గావాహిని తదితర మహిళా సంస్థలను ఏర్పరుస్తున్నారు. వాటి ద్వారా ముస్లిం వ్యతిరేక, క్రిస్టియన్ వ్యతిరేక ఉన్మాదాన్ని మహిళల మెదళ్లనిండా నింపుతున్నారు. ఎటువంటి లింగ సమానత్వం, లింగ న్యాయం లేనిచోట మాతృశక్తి, స్త్రీశక్తి వంటి అబద్ధపు భావాలతో స్త్రీలను ప్రభావితం చేస్తున్నారు. భర్తలకు, పిల్లలకు, అత్తమామలకు సేవకురాలిగా ఉండడమనే ఏకైక పితృస్వామ్య ధర్మంగా స్త్రీలపై రుద్దుతున్నారు.

జాతుల స్వేచ్ఛ భావనలకు ప్రోత్సాహం లభిస్తుందనే భయంతో భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటును కూడా ఆర్ఎస్ఎస్ వ్యతిరేకిస్తుంది. ఆర్ఎస్ఎస్, భాజపా ఎప్పుడూ అఖండ భారత్ పేరుతో భారత జాతీయవాద భావాలు రెచ్చగొడుతున్నాయి.

భారత దళారీ బూర్జువా వర్గ ప్రయోజనాలు ఈడేర్చడానికే ఈ భావజాలం తోడ్పడుతుంది. అఖండ భారత్, ముస్లిం వ్యతిరేక భావాలు కశ్మీరు విషయంలో కలగలిసి కశ్మీరులపై అణచివేత పెరగడానికి దారితీస్తోంది. ఇటీవలి కాలంలో స్వయం నిర్ణయాధికారం కోసం జరిగే జాతుల పోరాటాలు పలు కారణాలతో వెనుకపట్టు పట్టాయి. అయినా, జాతుల పోరాటంలో ఏమాత్రం కదలిక కనిపించినా భాజపా ప్రభుత్వం అనేక రెట్లుగా క్రూర అణచివేతను ప్రయోగిస్తోంది.

భారత్ పాలకవర్గాల విస్తరణవాద పథకాలకు అఖండ భారత్ భావజాలం ఉపకరిస్తుంది. మరోవైపు అది దక్షిణాసియాలోని చిన్న దేశాలకు మరింత ప్రమాదకరం.

గుజరాత్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు తాను వ్యతిరేకించిన వస్తు సేవల పన్ను (జిఎస్టి) ను నేడు మోదీ అమలులోకి తెచ్చాడు. బహుళజాతి సంస్థలకు, బడా వ్యాపారులకు – సేవ చేయడానికి, భారతీయ మార్కెట్ను మొత్తంగా కట్టబెట్టడానికి ఈ ఆర్థిక విధానాలు తోడ్పడుతాయి. చిన్న తరహా, ప్రాంతీయ, ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలను, వ్యాపారులను దెబ్బతీస్తాడు.

విశాలమైన ఐక్య సంఘటన ద్వారానే రోజు రోజుకూ పెచ్చరిల్లుతున్న ఫాసిజాన్ని తిప్పికొట్టగలం. విప్లవకర శక్తులు, ప్రగతిశీల – ప్రజాస్వామిక శక్తులు, కుల వ్యతిరేక, బ్రాహ్మణీయ వ్యతిరేక శక్తులు, మహిళా సంఘాలు, మత మైనారిటీలు, ఆదివాసి సంస్థలు అన్నీ కలిసి ఫాసిస్టు రాజ్యానికి, సంస్థలకు, వారి భావజాలానికి వ్యతిరేకంగా పోరాడాల్సిన అవసరం వెంటనే మన ముందుకొచ్చింది. ఇప్పటికే అనేక రాష్ట్రాల్లో, దేశ వ్యాప్తంగా అలాంటి ప్రయత్నాలు జరుగుతున్నాయి. పెరుగుతున్న ఫాసిజానికి వ్యతిరేకంగా వీలైనంత విశాలమైన ఐక్య సంఘటన ఏర్పాటుకు ఇలాంటి ప్రయత్నాలు దోహదం చేస్తాయి.

*(అనువాదం వారణాసి సుబ్రహ్మణ్యం)*

*(రచయిత బెంగాల్ విప్లవోద్యమ నాయకుడు)* వీ

కనుక ప్రత్యేకంగా మన సమాజాన్ని పేర్కొనదలిస్తే 'భారతీయ' శబ్దం కూడా పెడత్రోవ పట్టిస్తుంది. అందుకే 'హిందూ' అన్న పదం ఒక్కటే మనం వ్యక్తం చేయగలిగే అర్థంను సమగ్రంగా ప్రకటించగలుగుతుందని, గత వేయి సంవత్సరాలుగా ఒడిదుడుకుల్లో 'హిందూ' అన్న పేరు హత్తుకు పోయిందని గోల్వాల్కర్ (1906 - 1973) చెబుతాడు.

అలా బ్రాహ్మణ మతంగానో, వైదిక మతంగానో పిలువబడాల్సింది హిందూ మతంగా మారి బ్రాహ్మణేతరులను, వైదికేతరులను హిందూ మతంలో చూపిస్తున్నారు. బౌద్ధులు, సిక్కులు, జైనులను హిందువుల్లో భాగంగానే గుర్తిస్తున్నారు. వారందరూ అలా అనుకునేలా ప్రచారం చేసి సఫలీకృతం అయ్యారు. దీనికి రిజర్వేషన్లు కూడా దోహదపడు తున్నాయంటే ఆశ్చర్యపడాల్సింది లేదు. భిన్న కులాలను హిందూ మతంలో అంతర్భాగంగా చూస్తున్నారు. కులాలను బట్టే కదా బిసి, ఎస్‌సి, ఎస్‌టిలనే విభజన జరిగింది.

హిందూ మహాసభ, రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌లు ఏర్పడ్డాక హిందూ జాతి, హిందూ సంస్కృతి, హిందూ దేశం అనేవి విస్తృత ప్రచారంలోకి వచ్చాయి. ఆర్‌ఎస్ఎస్ రూపకర్తలకు ముస్సోలిని, హిట్లర్‌ల ఫాసిజం, నాజీయిజంల ఆలోచనలు ఆదర్శంగా పనిచేశాయి. వాటి నుండి స్ఫూర్తి పొందిన వారిలో గోల్వాల్కర్ మినహాయింపేమి కాదు. హిట్లర్, ముస్సోలీలోనిల ఆలోచనలు, ఆచరణలు చరిత్రలో ఫాసిజంగా నిలిచిపోయాయి. అవి చేసిన నష్టం అంతా ఇంతా కాదు.

ప్రపంచవ్యాప్త శ్రామిక ప్రజలకు వ్యతిరేకంగా చరిత్రలో ఫాసిజం ప్రమాదకర పాత్రను నిర్వహించింది. రక్తపాతాన్ని సృష్టించింది. దాన్ని ఓడించడానికి ప్రపంచ వ్యాప్తంగా కోట్లాది మంది ప్రజలు ప్రాణ త్యాగాలు చేయాల్సి వచ్చింది. ఫాసిజం భిన్న ప్రాంతాలలో, భిన్న రూపాలలో తలెత్తుతూనే ఉన్నది. ఈ దేశంలో రాజకీయాధికారం తోడ్పాటుతో బ్రాహ్మణీయ హిందూ ఫాసిజం విస్తరిస్తూ ఉన్నది.

ఈ ఫాసిజానికి భూమికగా పని చేస్తున్న ఆలోచనలు, గోల్వాల్కర్ రాతల్లో కనిపిస్తాయి. వివిధ సందర్భాలలో ఆయన వెలుబుచ్చిన ప్రతిపాదనలను బంచ్ ఆఫ్ తాట్స్ అనే పుస్తకంలో చూడొచ్చు. ఈ పుస్తకం తెలుగులోకి 'పాంచజన్యం' పేరుతో అనువదించ బడింది. అందులో పుక్కిటి పురాణాలతో, పిట్ట కథలతో, తమకు తామే విరోధించుకునే విషయాలతో (సెల్ఫ్ కాంట్రడిక్షన్స్), ఆధారరహితమైన వ్యాఖ్యానాలతో మాటిమాటికి పూర్వీకులు, సన్యాసులు, సాధువులు, గురువులు, రుషులు, మునులు, చారిత్రక పురుషులు పురాణాలు, ధర్మ శాస్త్రాలు వంటి పేర్లమీద తమకు అనుకూలమైన వాదనలను వినిపించడం జరిగింది. ఈ దేశం కొన్ని వేలఏండ్ల కిందటి నుండి అఖండమైనదని నేటి ఆఫ్ఘనిస్తాన్, మయన్మార్, ఇరాక్, సింగపూర్, శ్రీలంకలు ఈ అఖండలో భాగమని వివరిస్తాడు గోల్వాల్కర్.

వలస పాలన చివరలో ఇండియా, పాకిస్తాన్‌లుగా ఏర్పడడాన్ని వ్యతిరేకిస్తూ - ముక్కలు ముక్కలుగా అయిన దృశ్యం అనుక్షణం కంటికెదురుగా కనబడుతుంటే ఏ కుమారుడు అదమరిచిపోయి గోళ్లు గిల్లుకుంటూ కూర్చుంటాడు? మాతృదేవత అఖండ స్వరూపాన్ని తిరిగి దర్శించేవరకు నిజమైన కుమారుడు ఎవడూ విశ్రాంతి తీసుకోడంటూ తల్లిని ముక్కలు చేసుకున్నామని భావోద్వేగాలను ఎగదోసే ప్రయత్నం చేస్తాడు గోల్వాల్కర్. అఖండ స్వరూపాన్ని తిరిగి దర్శించడం పేరుమీద దురాక్రమణలను, సామ్రాజ్యవాదాన్ని, వలసవాదాన్ని ముందుకు తెచ్చే ప్రయత్నానికి భూమికగా గోల్వాల్కర్ తన ఆలోచనలను స్పష్టం చేస్తాడు.

యావత్ ప్రపంచంలో పరమ పవిత్ర భూమి ఇదనీ, ఇక్కడ చేసిన స్వల్ప పుణ్యకార్యమైనా కొన్ని వేల రెట్ల ఫలమిస్తుందని పూర్వీకుల విశ్వాసమని వివరిస్తాడు. ధన్యమైన పుణ్యభూమి అంటూ ఉంటే అది భారత భూమియే. భగవత్ సాన్నిధ్యాన్ని చేరడానికి యత్నించే ప్రతిపాణి తన లక్ష్య సిద్ధికి ముందు ఈ భూమిలో జన్మించి తీరాలని వివేకానందుడు చెప్పినట్లుగా చెబుతూ భారతదేశం అంటే వారి దృష్టిలో హిందూ దేశం ఎంతో గొప్పదని చెబుతారు. దేశంలోని ప్రజలంతా ఒకే జాతివారనే అభూత కల్పనలను, కట్టు కథలను పుంఖాను పుంఖాలుగా పుట్టించి హిందూ జాతి గొప్పదని అందులో పుట్టడమే మహాభాగ్యమని నమ్మించే ప్రయత్నాలు గోల్వాల్కర్ రచనల్లో పుష్కలంగా ఉన్నాయి.

అధికారం భ్రష్టులను చేస్తుంది, సంపూర్ణ అధికారం సంపూర్ణంగా భ్రష్టులను చేస్తుంది అన్నది రాజ్యాధికారం ద్వారానే సమాజహితాన్ని సాధించాలని రష్యా చేసిన తాజా ప్రయోగం ద్వారా నిజమైందని చెబుతాడు. పెడత్రోవపట్టే రాజ్యాధికారాన్ని అదుపులో పెట్టే శక్తి కలిగి అధికార వ్యామోహాలకు అతీతంగా ఉంటూ జాగురుకంగా ఉండే సంఘటన నిర్మాణమే మనం సమాజం సుఖంగా జీవించడానికి కావల్సిన శాశ్వతమైన సుష్ఠు వ్యవస్థను నిర్మించగలదని ఆ పనిని ఆర్‌ఎస్ఎస్ చేస్తున్నదని గోల్వాల్కర్ చెబుతాడు. అధికారం భ్రష్టులను చేస్తుందని అంటూనే రాజ్యాధికారాన్ని అదుపులో పెట్టే శక్తి గురించి మాట్లాడడమంటే ఈ శక్తి మరో అధికారం కాకుండా పోతుందా?

ప్రాచీన ధర్మశాస్త్ర కర్తలు రాజకీయాధికారాన్ని పరిమితం చేశారని, అది విదేశీ దండయాత్రల నుండి ప్రజలను సంరక్షించడానికి, అసూయ ద్వేషం, దురాక్రమణ మొదలైన వాటివల్ల కలిగే అంతరిక సంఘర్షణలను పరిష్కరించడానికి మాత్రమే పరిమితం. రాజ్యాధికారం, ధర్మాధికారం ఆధీనంలో అంటే త్యాగధనులై ఆశ్రమాల్లో నివసిస్తూ ఉండే ధర్మ స్వరూపులైన రుషుల చెప్పు చేతుల్లో రాజును ఉంచారు ధర్మ శాస్త్రకారులని గోల్వాల్కర్ వివరిస్తాడు. అసలు ఈ ధర్మశాస్త్ర కర్తల ప్రామాణికత ఏమిటి? అన్నదగ్గర అసలు సమస్య వస్తుంది.

మనుస్మృతిలో ఎన్ని అన్యాయాలున్నాయో, వివక్షతులన్నాయో ఒక్కొక్క వర్గానికి, ఒక్కొక్కరికి ఒక్కో న్యాయంను వివరించిన ఆస్మృతికారుడు లేదా స్మృతికారులు రాజును నియంత్రిస్తూ ఆ రాజు చేత ఎన్ని నేరాలు, ఘోరాలు చేయిస్తాడో కదా! దుర్మార్గమైనది మనుస్మృతి అని తెలుపుతూ దాని కాల్చివేసే కార్యక్రమంలో అంబేద్కర్ పాల్గొన్నాడు.

ఎల్లప్పుడూ జాగరూకులైన ధర్మదండాన్ని ధరించిన మహా పురుషుల పరంపరయే మన ప్రాచీన జాతీయ వైభవానికి, అమరత్వానికి ప్రాణశక్తి అని గోల్వాల్కర్ వివరిస్తాడు. ఈ ధర్మదండమే కుల వ్యవస్థను సమర్థిస్తూ సమాజంలో స్త్రీలను, నిమ్న కులాలను వివక్షతలకు, దోపిడీ పీడనలకు గురిచేసిన/చేస్తున్న ప్రత్యక్ష అనుభవాలు కోకొల్లలుగా ఉన్నాయి. ఈ ధర్మదండం పేరుతోనే నేడు దేశవ్యాప్తంగా బ్రాహ్మణీయ హిందూ ఫాసిజం విస్తరిస్తూ అమానుషంగా ప్రవర్తిస్తున్నది. హైందవేతర మతాలను ద్వేషిస్తున్నది. సమానత్వాన్ని, సామ్యవాదాన్ని, ప్రజాస్వామ్యాన్ని వ్యతిరేకి

స్తున్నది. హింసలకు, నిర్బంధాలకు పాల్పడుతున్నది ఈ ధర్మదండమే కదా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు సేవలు చేయడానికే శూద్రులు పుట్టించబడ్డారని చెప్పింది ఈ ధర్మదండమే.

శూద్రులకు ఆత్మగౌరవాన్ని, విజ్ఞానాన్ని అందరితో సమానంగా ఉండగలిగే స్థాయిని కల్పించలేదు. బ్రాహ్మణ, క్షత్రియ వర్గాలచే జంతువుల చర్మాలు ఒలిచే పని, చెప్పులు కుట్టే పని చేయించగలదా ఈ ధర్మదండం అంటే సమాధానం ఉండదు. పుట్టుకతోనే వివక్షతలను మోస్తూ చనిపోయే వరకు అవమానాలతో, ఆత్మగౌరవ/ఆత్మవిశ్వాస లేమితో దుర్భరమైన జీవితాలను శూద్రులు మోస్తూ పోవడాన్ని ఈ ధర్మదండం పాలిస్తుంది. ఈ ధర్మదండం అంతిమంగా ఆధిపత్య శక్తులకు ఊడిగం చేసేది తప్పిస్తే అట్టడుగు వర్గాల వారికి మేలు చేయలేదు, చేయదు. వారిని బానిసలుగా, బలహీనులుగా చేసి వారిచేత సంపన్న వర్గాలకు సేవలు చేయించడమే ఈ ధర్మదండం విధి.

ధర్మ భూమిగా, పుణ్య భూమిగా, కర్మ భూమిగా, సాక్షాత్తు దేవ భూమిగా, మోక్ష భూమిగా రుషులు, మునుల చేత ఆరాధించడినది ఈ భూమి అని తీవ్రమైన భావోద్వేగంతో చెబుతాడు గోల్వాల్కర్. ఇంత పవిత్రమైన భూమిలో దళితులు, అంటరాని వారిపై, నిమ్నకులాలపై ఎన్ని అరాచకాలు జరిగాయో పెరియార్, ఫూలే, అంబేద్కర్‌లు వివరంగా తెలిపారు. ఈ అరాచకాలపై గోల్వాల్కర్ ఎక్కడా ప్రస్తావించడు. గోల్వాల్కర్ చెప్పే దైవ భూమిపై ఈ ప్రజలెందుకు అవస్థలు పడుతున్నారో సమాధన ముండదు. దీన్నంతా విదేశీ పాలకుల పైకి నెట్టేస్తాడు. దేశవ్యాప్తంగా దళితులు, ఆదివాసులు, మహిళలు, ముస్లింలు ఎన్నో రకాల దాడులకు గురవుతున్నారు. అభద్రతలో జీవనం సాగిస్తున్నారు. విద్యా సంస్థల్లో అట్టడుగు వర్గాల పిల్లలు అవమానాలతో, అక్రమ కేసులతో, జైళ్లు, పోలీసు నిర్బంధాలతో బతుకుతున్నారు.

మనలోని మతాలు, సాంప్రదాయాలు, కులాలు, భాషలు, ఆచార వ్యవహారాలు వీటన్నింటి బాహుళ్యాన్ని చూసి ఇంత వైరుధ్యం ఉంది కదా, ఇదెట్లా ఒకజాతి అవుతుందని తికమక పడుతుంటారని చెబుతూ ఒక చెట్టు విషయంలో ఆకు గాని, పూవు గాని ఎట్టివో మన జాతీయ జీవనంలో ఇవన్నీ అటువంటివే అని అంటాడు గోల్వాల్కర్. దీన్ని ఖండిస్తూ అంబేద్కర్ తన రచనలలో ఖరాఖండిగా భారతజాతి, భారత సంస్కృతి అనే ఏకరూపమైనది ఎక్కడా, ఎప్పుడూ లేదని స్పష్టం చేశాడు.

సమాజం వివిధ కర్తవ్యాలను నిర్వహించుకునేందుకు గాను విభిన్న వృత్తులు గల అనేక వర్గాలను రూపొందించుకుంటుంది. మన ప్రాచీన సామాజిక వ్యవస్థ అట్టి ప్రతి వర్గానికి ఒక నిర్దిష్ట కర్తవ్యాన్ని ఏర్పరిచింది. మెదడు శరీరంలోని అవయవాల విధులను నిర్దేశించినట్లుగానే అది ఆ వర్గాలన్నింటికి, వ్యక్తులందరికి వారి సహజమైన వికాసానికి మార్గం చూపింది. సమాజమనే విరాట్ పురుషున్ని అత్యుత్తమంగాసేవించడంలోనే వ్యక్తి వికాసానికి సంపూర్ణమైన అవకాశం కూడా ఇమిడి ఉంది అని చెబుతూ కుల వ్యవస్థను సమర్ధిస్తాడు.

వర్గరహిత సమాజంగా రూపొందాలని గోల పెడుతుంటారని చెబుతూ శరీరంలోని వివిధ అవయవాలు వాటి వాటి విధుల్ని నిర్వహించడానికి అనువుగా వివిధ రూపాల్ని పొందితే వాటిని విభిన్న వర్గాలుగా భావించి నిర్మూలించి శరీరాన్ని ఒక వర్గరహిత వస్తువుగా చేయవల్సిందేనా. అలా చేస్తే వికాసం అవుతుందా? హత్య అవుతుందా అని గోల్వాల్కర్ ప్రశ్నిస్తాడు. అంటే దోపిడి చేసే వర్గాలు, ఆధిపత్యం చెలాయించే వర్గాలు, పీడించే వర్గాలు అలాగే ఉండాలన్నమాట. ఈ వర్గాలతో ఘర్షణ పడొద్దని, వాటిని నిర్మూలించవద్దని, అవిచేసే అన్యాయాలను సహజమైనదిగా భావిస్తూ వాటితో సామరస్యంగా కలిసి మెలిసి, అణిగి మణిగి ఉండాలని చెప్పకనే చెబుతాడు గోల్వాల్కర్.

అసలు దోపిడి చేసే వర్గాలని, దోపిడీకి గురయ్యే వర్గాలే లేవని, అలా అనడమే తప్పని గోల్వాల్కర్ చెబుతాడు. దీన్ని ధర్మశాస్త్ర కారులు చెప్పినట్లుగా చెబుతూ తాను దోపిడి వర్గాలకు ప్రతినిధిని అని స్పష్టమైన వర్గ దృక్పథాన్ని ప్రకటిస్తాడు.

శరీర నిర్మాణంలో ప్రతి అవయవానికి నిర్మాణాన్ని, లక్షణాలను బట్టి అవి పనిచేసే విధానముంటుంది. అయితే మనుషులందరూ శారీరకంగా, మేధో పరంగా ఒకే రకానికి చెందినవారు. కాని కొందరికే కొన్ని పనులు పుట్టుకతోనే వివక్షతలతో కూడిన అగౌరవ ప్రదమైన పనులను నిర్దేశించే సామాజిక అంతరాలు దొంతరాలను సమర్థించ చూడడం, పూర్వీకులు, ధర్మశాస్త్రాల పేరుమీద గోల్వాల్కర్ ఆలోచనలు ఎవరి ప్రయోజనాల కోసం పనిచేయాలనుకుంటున్నాయో, ఎవరిని తొక్కిపెట్టి ఉంచాలనుకుంటున్నాయో స్పష్టం అవుతున్నది.

ప్రస్తుత జెండాలో మత వాసనలున్నాయని ప్రత్యేకించి ముస్లింలకు ఒక రంగును సూచించిందని ఈ జెండాలో జాతీయ పరంపర లేదని, రాజకీయ అవసరాలు తీర్చుకునేందుకు రాజకీయవాది కూర్చిన అతుకుల బొంత మాత్రమేనని గోల్వాల్కర్ చెబుతాడు. పాశ్చాత్య దేశాల వివిధ రాజ్యాంగాలలోని విభిన్న సూత్రాలతో గజిబిజియైనా కలగూర గంప మన రాజ్యాంగమని, ఇది అతుకుల బొంత వంటిదని, మనజాతి లక్ష్యాన్ని వివరించే ఒక్క అక్షరమైనా అందులో లేదని, భారతీయ ఉపదేశాలు గాని, భారతీయ రాజనీతి తత్వం గాని భారత రాజ్యాంగంలో ఛాయా మాత్రంగా కూడా లేవని గోల్వాల్కర్ అంటాడు.

రాజ్యాంగాన్ని గౌరవించని గోల్వాల్కర్ రాజ్యాంగంలోని సిక్కు, జైన, బౌద్ధ సంప్రదాయాలు హిందూ పదంలోని అంతర్భాగాలేనని రాజ్యాంగంలో స్పష్టంగా రాసి ఉంది కాబట్టి హిందువులు, సిక్కులు వేరని సూచించే పదప్రయోగం రాజ్యాంగ విరుద్ధం అవుతుందని ఉన్నత స్థాయిలోని వ్యక్తులు కూడా తెలియకుండానే మన రాజ్యాంగాన్ని ఇట్లా అవమానిస్తున్నారని అంటాడు. ఇలా తమను తామే విరోధించుకుంటూ (సెల్ఫ్ కాంట్రడిక్టరి) మాట్లాడడం ఆర్ఎస్ఎస్ భావజాలంలో విస్తరించి ఉంటుంది.

వర్ణ వ్యవస్థ మన సమాజం విశిష్ట లక్షణమని కాని ఈనాడు దాన్ని కులతత్వం పేరిట నిరసిస్తున్నారని, వర్ణ వ్యవస్థలో అసమానతలు, ఉచ్ఛనీచ భావనలు తర్వాత ప్రవేశించినవని, కుటిలుడైన ఆంగ్లేయుడు 'భేదోపాయాన్ని' అనుసరించి వర్ణ వ్యవస్థలో వచ్చిన ఈ వికృతిని మరింత ఎగదోసినాడని, కాని వర్ణ వ్యవస్థ ప్రారంభ కాలంలో వివిధ రంగాల విశిష్టతలు, విభిన్న రంగాల మధ్య తరతమభేదాలను, ఉచ్ఛనీచ భావాలను కల్పించేందుకు రూపొందలేదని, పైగా జీవితంలో తమకు విధించబడిన ధర్మాన్ని నిస్వార్థ సేవా భావంతో నెరవేరిస్తే భగవంతుని ఆరాధించినట్లు అవుతుందని భగవద్గీత బోధిస్తుందని వివరిస్తాడు గోల్వాల్కర్.

ఎవరు విధించిన ధర్మమిది? ఎవరికి విధించిన ధర్మమిది? దీని పేరు మీద వేల ఏండ్లుగా శూద్రులు, నిమ్న కులాల వారు దాసులుగా, బానిసలుగా తమను తాము మరిచి, అహర్నిషలు పై వర్గాల సేవ కోసమే శ్రమించాలనే బానిస, అసహాయ, దౌర్భాగ్య స్వభావంను నెలకొల్పే ప్రయత్నం చేశాడు గోల్వాల్కర్. ఈ భావజాలం దోపిడీ వర్గాలకు ఊడిగం చేసేదే తప్ప మరొకటి కాదు.

1818లో జరిగిన కోరేగావ్ సంఘటనను ప్రస్తావిస్తూ – పూనా నగరానికి సమీపంలో పీష్వాలపై విజయానికి స్మారకంగా ఆంగ్లేయులు ఒక విజయ స్తంభం నిర్మించారు. ఒకసారి ఈ స్తంభ చాయల్లో ఒక ప్రముఖ హరిజన నాయకుడు తనతోటి హరిజన సోదరులను సంబోధిస్తూ ఉపన్యసించాడు. ఆంగ్లేయుల నాయకత్వంతో పోరాటం జరిపి తామే బ్రాహ్మణులైన పీష్వాలను ఓడించారు కాబట్టి ఈ విజయ స్తంభం బ్రాహ్మణులపై తమ విజయానికి చిహ్నమని ప్రకటించాడు.

భానిసత్వానికి చిహ్నం అయిన దానిని విజయానికి ప్రతీకగాను, ఒక విదేశీయునికి భానిసలై మన సొంత బంధువులతో జరిగిన అవమానకరమైన పోరాటాన్ని ఒక మహా విజయంగా చెప్పుకోవడం ఎంత హృదయ విదారకరమైన విషయం! ఎంత ద్వేషాంధత! ఎవరు గెలిచారు? ఎవరు ఓడిపోయారు? అని పరోక్షంగా అంబేద్కర్‌ను దుమ్మెత్తి పోశారు గోల్వాల్కర్.

బ్రాహ్మణులైన పీష్వాలు మరాఠా ప్రాంతంలో శూద్రులు, అంటరానివారిపై చేయని నేరాలు, ఘోరాలు లేవని జ్యోతిబాఫూలే వివరించి ఉన్నాడు. అటువంటి దుర్మార్గులపై వ్యతిరేకత లేదు గాని, వారి పాలనలో అధోగతిపాలై కనీసం మనుషులుగా కూడా గుర్తింపబడని వారిపై వ్యతిరేకతను కూడగట్టుకున్న గోల్వాల్కర్ ఎవరి ప్రతినిధో అర్థం చేసుకోవచ్చు. పీష్వాలను స్వంత బంధువులని, వారిపై జరిగిన పోరాటం అవమానకరమని నిస్సిగ్గుగా ప్రకటించి తాను ఎవరివైపో స్పష్టం చేశాడు.

ఒక హిందువుగానో, ముస్లింగానో, క్రైస్తవుగానో ఏ మనిషి జన్మించడు. కేవలం మానవునిగా మాత్రమే జన్మిస్తాడు అనేదాన్ని తోసిపుచ్చుతూ ఇది ఇతరుల విషయంలో నిజం కావచ్చు గాని, హిందువుల విషయంలో కాదని అంటాడు గోల్వాల్కర్. హిందువుకు మొదటి సంస్కారం మాతృ గర్భంలో ఉండగానే లభిస్తుంది, చివరిది అతని దేహం అగ్ని జ్వాలలకు ఆహుతి ఐనప్పుడు లభిస్తుంది. నిజానికి మాతృ గర్భం నుండి వెలువడక ముందు నుంచే మనం హిందువులుగా జన్మిస్తాం. ఇతరుల విషయానికి వస్తే ఊరు పేరులేని మానవజీవిగా ఈ ప్రపంచంలో జన్మిస్తారు. అటుపైన 'సున్నతీ' చేస్తే ముస్లింగాను, 'జ్ఞానస్నానం' చేస్తే క్రైస్తవులుగాను మారుతారని ప్రకటిస్తాడు గోల్వాల్కర్. ఇలా తాను హిందువులుగా పిలిచేవారిని ఎంతగా ఇతరుల నుండి వేరుచేసి వారిలో ఒకరకమైన ఉన్మాదాన్ని ప్రోదిచేయడానికి ఏమిమాట్లాడడానికైనా గోల్వాల్కర్ వెనుదీయడన్నమాట.

ముస్లింల, క్రైస్తవుల గురించి చెబుతూ – కేవలం కొద్దిమంది ముస్లింలు మాత్రమే ఇచ్చటకు వచ్చారని, విదేశీ క్రైస్తవ ప్రచారకులు కూడా కొద్దిమందే వచ్చారని, ఈనాడు ముస్లింలు, క్రైస్తవులు అపరిమితంగా పెరిగపోయారని, ఇలా పెరగడం మతాంతరీకరణ వల్లనే సాధ్యమయిందని, ప్రాణభీతి, బలత్కారం పదవీ వ్యామోహం ప్రభువులను మంచి చేసుకోవడానికి వారి పద్ధతులను, ఆచారాలను పాటిస్తూ చివరకు వారి మతాన్ని స్వీకరించడం వంటివి కారణాలని గోల్వాల్కర్ వివరిస్తాడు. కాని హిందూ మతంలోని నికృష్టమైన కుల వివక్షత, అంటరాని తనం, అసమానతలు, సాంఘిక దోపిడీ పీడనలను గుర్తించ నిరాకరిస్తాడు. గత వేయి సంవత్సరాల విదేశీ ఆధిపత్యపు పరిపాలన ఒక్కటే ఈనాటి దోషాలన్నింటికీ ములకారణమని అంతకు ముందంతా సవ్యంగా ఉన్నట్లు వక్రీకరణలు ప్రచారం చేస్తాడు.

ఈ వేయి సంవత్సరాలకు పూర్వమే వారు చెప్పే పూర్వీకులు, రుషులు, మునులు ధర్మశాస్త్రాలు అస్థిత్వంలో ఉన్నాయని వారే చెబుతారు. వాటిల్లో ఎంత అన్యాయం, వివక్షత లున్నాయో వారేచెప్పే ఆదర్శ పరుషుడు శ్రీరాముడు శంబూకున్ని ఎంత అన్యాయంగా చంపేశాడో, అలాగే ఆర్ఎస్ఎస్ గొప్పగా కీర్తించే రామాయణ – భారతాల్లో అట్టడుగు వర్గాల వారిపై జరిగిన కుట్రలను, అన్యాయాలను అంబేద్కర్ తన రచనల్లో వివరించి ఉన్నాడు.

హిందూ మతాన్ని తీవ్రంగా వ్యతిరేకించి, హిందువునిగా పుట్టానేగాని హిందువుగా మరణించనని చివరకు బౌద్ధంలో చేరాడు. అటువంటి అంబేద్కర్ బొమ్మను ముందు పెట్టుకుని రాజకీయాలు చేస్తుండడం ఆర్ఎస్ఎస్ పరివారానికే చెల్లింది. ఇదెంత మోసపూరితమో, కుట్రపూరితమో అర్థం చేసుకోవచ్చు.

తాము పుట్టిన ఈ భూమికి విధేయులుగా ఉండనంతకాలం తమ పూర్వీకులను, సంస్కృతి సంప్రదాయాలను నిజమైన పుత్రులుగా, వారసులుగా ప్రవర్తించనంతకాలం ముస్లింలు, క్రైస్తవులు ఇచ్చట శత్రువులుగానే ఉంటారని, అట్లాగే వారిని పరిగణించాల్సి ఉంటుంది కూడా అని గోల్వాల్కర్ అంటాడు.

వేయి సంవత్సరాలుగా మన దేశంపై అనేక విదేశీ ఆక్రమణలు జరిగాయి. ముందుగా దండెత్తి వచ్చిన గ్రీకులను, శకులను, హూణులను ఓడించి తరిమేశాం. ఇక్కడ మిగిలిపోయిన వారంతా హిందూ సమాజం లో లీనమైపోయారు. కాని గత పది, పన్నెండు శతాబ్దాలలో దండెత్తి వచ్చిన వారిని మాత్రం తరిమేయలేకపోయాం. వారిని విలీనం చేసుకోలేక పోవడం కూడా అసాధ్యమయిందని అంటూ పరోక్షంగా ముస్లింలు, క్రైస్తవుల గురించి గోల్వాల్కర్ చెబుతాడు.

మోదీ ప్రధానమంత్రి అయ్యాక 'ఘర్‌వాపసి' వార్తలు చాలానే వచ్చాయి. ఇది బలవంతపు ఘర్‌వాపసీలుగా వెలుగు చూశాయి. దీని మూలాలు గోల్వాల్కర్ ఆలోచనల్లో ఉన్నాయి. మనంలోంచి విడిపోయి, శతబ్దాల తరబడి ధార్మిక దాస్యంలో మగ్గిపోతున్న మన సోదరులను మరల వారి తాత ముత్తాల కుదుటికి ఆహ్మానించడం మన విద్యుక్త ధర్మం.

నిజాయితీగల, స్వాతంత్ర ప్రియులైన మానవులుగా వారందరూ తమలోని భానిసత్వపు చిహ్నాలను తొలగించుకుని, తమ పూర్వీకుల ఆరాధనా పద్ధతులను జాతీయ జీవనాన్ని అనుసరించాలి. మన జాతీయ జీవనంలో తమ స్వంత స్థానాన్ని తిగిరి చేరుకొమ్మని అట్టి సోదరులందరినీ ఆహ్వానిస్తున్నామని గోల్వాల్కర్ చెబుతాడు.

తమ సొంత స్థానమంటే తమ తాత ముత్తాతల మూలాల్లోకి వెళ్లి పూర్వం వారున్న కులంలోకి అన్నమాట. కుల కట్టుబాట్లను, నిచ్చెనమెట్ట కుల వ్యవస్థను, చాతువర్ణ హైందవ దుర్మార్గాలను తమకు తాముగా

అంగీకరించడమే ఇది. దారితప్పిన సోదరులందరూ తిరిగి వచ్చిననాడే మనమంతా పెద్ద ఎత్తున దీపావళి పండుగా జరుపుకోవాలి అని అంటాడు గోల్వాల్కర్.

ప్రస్తుతమున్న సమాఖ్య స్వరూప వ్యవస్థ వేర్పాటు భావాలను కలిగిస్తుందని, ఇది ఏకైక జాతి అన్న భావానికి వ్యతిరేకం కాబట్టి ఒకే దేశం, ఒకే రాజ్యం, ఒకే శాసనసభ, ఒకే కార్యనిర్వాహక వర్గంగా ఏకాత్మక రూపమైన ప్రభుత్వాన్ని ఏర్పరిచేందుకు గాను రాజ్యాంగాన్ని పునః పరిశీలించి, తిరిగి రచించాలని గోల్వాల్కర్ సూచిస్తాడు.

కశ్మీర్ ప్రజలే తమ భవిష్యత్‌ను నిర్ణయించుకుంటామని చెప్పడం ఈ భారతదేశం, ఇంతటి ప్రజల ఏకత్వాన్ని నిరాకరించడమే అవుతుంది. ఏకత్వం పేరుతో భిన్న ప్రాంతాలు, జాతులపై హిందూమత పెత్తనాన్ని రుద్దే ప్రయత్నమే ఇది. ఈ దేశం భిన్న సంస్కృతుల, జాతుల సమ్మేళనం అనేదాన్ని నిర్దాక్షిణ్యంగా తొక్కేస్తూ, జాతుల మధ్య నిజమైన స్వేచ్ఛా స్వాంత్రాలను అణిచివేస్తూ మొత్తం ఒకటే జాతి అని అదే హిందూ జాతి అని చెబుతూ హిందూ ఫాసిజాన్ని ముందుకు తెస్తాడు గోల్వాల్కర్. భిన్న సంస్కృతులు, భిన్న భౌగోళిక ప్రాంతాలు, భిన్న జాతులు ఉన్న దేశంలో వాటి మధ్య సుహృద్భావ, ప్రజాస్వామిక సంబంధాలతో, పరస్పర అంగీకారాలతో ఒకరి స్వేచ్ఛా స్వాంత్రాలను మరొకరు హరించని రీతిలో సమాఖ్య వ్యవస్థలు ఉండాల్సి ఉంటుంది. అలా కాకుండా వాటన్నింటిపై నిరంకుశ నియంతృత్వాలను నెలకొల్పి హిందూ మత బుల్డోజర్‌తో సమం చేయాలనుకోవడం చాలా ప్రమాదకరం.

లౌకికవాదం గురించి చెబుతూ, పాశ్చాత్య దేశాలలో పుట్టిన లౌకికత్వ భావనకూ, మనదేశానికి సంబంధం లేనేలేదని, అది మనకు సంబంధించింది కానే కాదని, మత గురువులైన పోప్‌ను ఎదిరించి ఐరోపాలోని రాజులు తమ రాజ్యాలపైన మతపరమైన నిరంకుశ అధికారాన్ని కూలదోసి స్వంత పరిపాలనను ప్రతిష్ఠించుకున్నారని, అలా మత రాజ్యానికి వ్యతిరేకంగా లౌకిక రాజ్యమనే భావన ఆరంభమయ్యిందని, హిందూ మతం తప్ప ఇతర మతాలేవి ఈ దేశం లోనివి కావు కనుక ఈ దేశంలో లౌకికవాదమే సరైంది కాదంటాడు గోల్వాల్కర్. హిందూ మతం అతి పవిత్రమైనది కనుక అది లేకుండా, ఆ మత ప్రమేయం లేకుండా పాలన ఉండకూడదని, హిందూ మతాన్ని పాలనా మతంగా చేస్తూ మిగతా మతాలను, జాతుల అస్థిత్వాలను రద్దుచేసి మతరాజ్య స్థాపనా అనే ప్రమాదకర ఆలోచనలను వ్యాపింప చేస్తున్నాడు గోల్వాల్కర్.

సామ్యవాదం గురించి చెబుతూ, సామ్యవాదం ఈ దేశానికి చెందినది కాదని, అది మన రక్తంలోను, సంప్రదాయంలోను కూడా ఇమిడి లేదని, వేలాది సంవత్సరాల మన జాతీయ జీవనంలోని సంప్రదాయాలతో, ఆదర్శాలతో దానికెట్టి సంబంధమూ లేదని, ఇక్కడున్న కోట్లాది ప్రజలకు అది సరిపడని భావం కాబట్టి మన హృదయాలను ఉత్తేజపరిచే శక్తి దానికి లేదని, త్యాగమయమైన జీవితాన్ని, శీలాన్ని అది మనలో ప్రోత్సహించలేదని చెబుతాడు గోల్వాల్కర్. ఈయనకు సమానత్వం అంటేనే కంపరం పుడుతున్నట్లుంది. మానవుల మధ్య సమతా మమతలంటేనే అసహనం పుటుకొస్తున్నది. సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ వివక్షతలను పెంచి పోషించే మత వాదనతో ఈయన గాఢంగా పెనవేసుకుని ఉన్నాడు. వివక్షతలు స్వాభావికమైనవని వాటిని చెక్కుచెదర నీయకుండా హిందూ మతం పేరుతో స్థిరీకరించాలనే ప్రమాదకర దోపిడీపూరిత విలువలను స్థాపించాలనే ఆరాట పడుతున్నాడు.

లౌకిక జీవితంలో పౌరులందరూ సమానులే అంటూ కుల, మత, విశ్వాసాలను బట్టి సమూహాలుగా ఏర్పడుతుంటే ప్రజలు ఉద్యోగాలను, ఆర్థిక సహాయాలను కోరడంలోనూ, విద్యా సంస్థల్లో ప్రవేశం కోరడంలోనూ, తదితర రంగాలన్నింటిలోనూ తమకు మాత్రమే ప్రత్యేక హక్కులను, సదుపాయాలను కోరే పద్ధతికి పూర్తిగా స్వస్తి చెప్పాలి.

'అల్ప సంఖ్యాకులు' 'కులాలు' అంటూ మాట్లాడడం, ఆలోచించడం పూర్తిగా మానేయ్యాలని చెబుతాడు గోల్వాల్కర్. దీని ద్వారా శతాబ్దాలుగా దోపిడీ పీడనలకు గురవుతూ అనేక వివక్షతలతో విద్యా ఉపాధులకు, ఉద్యోగాలకు మరెన్నో విస్తృతావకాశాలకు దూరం చేయబడిన ఎస్‌సి, ఎస్‌టి, బిసిలకు రిజర్వేషన్లను రద్దు చేయాలని చెబుతున్నాడు గోల్వాల్కర్.

నిజానికి రిజర్వేషన్లు ఈ వర్గాలకు పూర్తి స్థాయిలో మేలు చేయలేదు. సామాజిక సంపద, వనరులపై ప్రజలందరికీ సమాన హక్కులు వచ్చినప్పుడే అది సాధ్యం. అదలా పక్కనపెట్టి కనీసం కొంతలో కొంతైనా అట్టడుగు వర్గాలకు మేలుచేసే రిజర్వేషన్లను నిరాకరించి వారిని అధోగతి పాల్జేయాలనే దుష్టతలంపు గోల్వాల్కర్‌ది.

ప్రస్తుతం రిజర్వేషన్లు ఉన్నప్పటికి పలు రంగాల్లో ఈ వర్గాలు ఉండాల్సిన సంఖ్యకు చాలా దూరంలో ఉన్నారు. సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణల నేపథ్యంలో ప్రభుత్వ రంగంలో విద్యా, ఉద్యోగ ఉపాధులు కుచించుకుపోయాయి. ప్రైవేట్ శక్తులు విచ్చల విడిగా ఈ రంగాల్లో దూసుకుపోతున్నాయి. వీటిలో రిజర్వేషన్ల మాటేలేదు. ఈ నేపథ్యంలో గోల్వాల్కర్ ఆలోచనలు కార్య రూపంలోకి వచ్చాయి.

ఓ వైపు సృష్టికర్త ఒక్కరే అని ఒప్పుకునే అన్ని మతాలు మరోవైపు మతాల మధ్య విద్వేషాలు, శత్రుత్వాలను సృష్టించడం దేన్ని సూచిస్తుంది. ప్రపంచలోకెల్లా భారత భూమే గొప్పదని, హిందూ మతమే ప్రామాణిక మైనదని, దీన్ని మించినదేదీలేదని గోల్వాల్కర్ చెబుతున్నాడంటే ఆయన విశ్వసించే భగవంతుడు మిగతా భూభాగాలను, మతాలను, ప్రజలను తక్కువ చేసి అధమస్థానంలో పుట్టించాడని అనుకోవాలా?

అంతా దైవసృష్టే అని అంటున్నప్పుడు దుష్టకార్యాలు, దుర్మార్గాలు, హత్యలు, అత్యాచారాల వంటివి కూడా దైవ కార్యాలే అవుతాయి కదా! రకరకాల దుర్మార్గాలను చేయించడమేమిటి? వాటిని సరిదిద్దడం కోసం తిరిగి అవతారాలెత్తడమేమిటి? మతానికో దేవుడుంటాడా? ప్రపంచం మొత్తానికి ఒకే దేవుడుంటాడా? మతాలను దేవుడే సృష్టించాడా? మనుషులు చేసిన దేవుళ్లా లేక దేవుడు చేసిన మనుషులా? మతాలా? కులాలా? దైవమే వీటిని సృష్టిస్తే ఆ దైవం ఎంత క్రూరమైందో కదా! మతాలు, వాటి విశ్వాసాలు ఆచరణలో చాలా వైరుధ్యపూరితంగా ఉంటాయి. అవెప్పుడూ దోపిడి వర్గాల, పాలకవర్గాల చేతుల్లో అణచివేత సాధనాలుగా ఉపకరిస్తుంటాయి.

మతం రాజ్యం ఒకదానికొకటి బలోపేతం చేసుకుంటూ దోపిడి వర్గంగా తయారయ్యి అశేష శ్రామిక ప్రజానీకాన్ని అణచివేస్తుంటాయి. ఇటువంటి భావాజాలానికి ప్రతినిధి గోల్వాల్కర్.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# అన్నమూ కావాలి, ఆత్మ గౌరవమూ కావాలి

**శ్రామిక మహిళలు పోరాడి సాధించుకున్న అంతర్జాతీయ మహిళా పోరాట దినోత్సవాన్ని పాలకులు, కార్పొరేట్ శక్తులు మార్కెట్ సరుకుగా మార్చారనీ, తమ అస్తిత్వం కోసం, ఆత్మగౌరవం కోసం శ్రామిక మహిళలు ఐక్యంగా పోరాడాలనీ అంటున్నారు బి. అనురాధ**

భూస్వామ్య భావజాలం మహిళలకు ఎటువంటి పాత్రలను నిర్దేశించిందో ఆ పాత్రలను సమర్థవంతంగా నిర్వహించడానికి 'ఫలానా ఫలానా ఉత్పత్తులను' వాడండి అంటూ కార్పొరేట్ కంపెనీలు ముందరికి వస్తున్నాయి. అందుకు అంతర్జాతీయ మహిళాదినంతో సహా ఏ అవకాశాన్నీ జారవిడుచుకోవడం లేదు. మహిళలు సమానత్వం మాటెత్తితే ప్రత్యక్షంగా విరుచుకు పడడానికి ఇప్పుడు, సామ్రాజ్యవాద దోపిడీకి అన్ని రకాలుగా అండదండలను అందిస్తున్న మతోన్మాద శక్తులు తయారుగా ఉన్నాయి. 'రామరాజ్యం' లేదా 'హిందూ రాజ్యం' నిర్మించడమే ఏకైక లక్ష్యంగా ఉన్న మతోన్మాద శక్తులకు ఇక రాజ్యాధికారం కూడా చేజిక్కిన ఈ తరుణంలో, దొంతరల కులవ్యవస్థనీ, వర్గవ్యవస్థనీ యథాతథంగా ఉంచేందుకు శాయశక్తులా పనిచేస్తున్న ఈ శక్తులు వ్యవస్థలో ఎక్కడ ఉల్లంఘనలు జరిగినా క్రూరమైన దాడులు చేస్తున్నాయి.

ఈ రోజు మతోన్మాదానికి అత్యంత భయంకరంగా బలవుతున్నది, మహిళలు, దళితులు, మైనారిటీలు, ఇతర పీడిత ప్రజలే. వాటిని తిప్పికొట్టడానికి ఐక్యంగా పోరాడడమే ఏకైక మార్గం. అలాంటి పోరాటాలకి స్ఫూర్తినివ్వగలిగేది శ్రామిక మహిళల పోరాటాలు. మనకి ఒక అంతర్జాతీయ మహిళా దినం ఉండాల్సిన అవసరాన్ని గుర్తింపజేసి మనకి పోరాట వారసత్వాన్ని అందించి పోయిన ఆ మహిళల వీరోచిత పోరాట గాథని గుర్తుచేసుకోవడం ఈనాటి అవసరం. ముఖ్యంగా ఇప్పటి యువజనులకి మార్చి 8 లోని అసలు సారాన్ని వాస్తవ చరిత్రని పదే పదే అందివ్వడం ద్వారానే వారిని పోరాటోన్ముఖులను చేయగలం.

**అంతర్జాతీయ మహిళాదినానికి నేపథ్యంగా నిలిచిన ఆనాటి పోరాటాలు**

19వ శతాబ్దారంభంలో అమెరికాలోని న్యూయార్క్‌లో ప్లాంటేషన్లలో పనిచేసే బానిసలకోసం రెడీమేడ్ దుస్తుల తయారీ జరిగేది. బానిసలు తమ దుస్తులు తామే తయారు చేసుకోవడానికి వెచ్చించే సమయం, శ్రమల విలువ కంటే ప్లాంటేషన్ యజమానులు ఈ దుస్తుల మీద వెచ్చించే ఖర్చు ఎన్నో రెట్లు తక్కువ కావడాన త్వరలోనే దుస్తుల తయారీకి గిరాకీ పెరిగింది. కుట్టు మిషన్ ఆవిష్కరణతో దుస్తుల తయారీ పరిశ్రమ రూపం దాల్చింది. దాంతో దుస్తుల తయారీ షాపులు బహుళ అంతస్తుల భవనాల్లో కిక్కిరిసిపోయాయి. న్యూయార్క్‌లోని ఈ ప్రాంతానికి ఏకంగా 'దుస్తుల జిల్లా' గా పేరొచ్చింది.

అయితే ఈ పరిశ్రమకు వెన్నెముకగా శ్రమని అందించిందంతా తూర్పు యూరోప్ దేశాలైన రష్యా, ఇటలీ, పోలెండ్ తదితర దేశాల నుండి వలసవచ్చిన ప్రజలే. వలస ప్రజల శ్రమను విపరీతంగా దోపిడీ చేసి శతాబ్దాంతానికి దేశానికి అవసరమైన మహిళల దుస్తుల్లో 70 శాతం, పురుషుల దుస్తులలో 40 శాతం ఒక్క న్యూయార్క్ నగరమే ఉత్పత్తి చేసే స్థాయికి ఎదిగింది. ముఖ్యంగా ఆ శ్రామికులలో అత్యధికులు మహిళలే.

రోజుకి కనీసంగా 15 గంటలు శ్రమచేయించి ఆ 'సమయానికి' కాకుండా 'చేసిన పనికి' వేతనం చెల్లించేవారు. సూదులూ, దారం, కరెంటూ చివరకు కూర్చోవడానికి కుర్చీలు లేక కూర్చోవడానికి ఉపయోగించే పెట్టెలకు కూడా శ్రామికులే డబ్బులు చెల్లించాల్సి వచ్చేది. ఇవే కాకుండా, ఆలస్యంగా వచ్చినప్పుడూ, పని పాడైనందుకూ, మరుగుదొడ్డిలో కొంచెం ఎక్కువసేపు ఉన్నందుకూ కూడా జరిమానాల పేరిట కోతలు పెట్టేవారు. పిల్లలు కూడా షాపు మూలల్లో ముడుచుకొని కూర్చొని తయారైన దుస్తుల నుండి దారాలు కత్తిరిస్తూ అనేక గంటలు పనిచేసేవారు.

ప్రారంభంలో ట్రేడ్ యూనియన్లు మగవాళ్లకు మాత్రమే ఉండేవి. మహిళా శ్రామికులు కేవలం వీరికి సంఘీభావం తెలుపుతూ ఉండేవారు. కానీ తమ అవసరాలను ట్రేడ్ యూనియన్లు పట్టించుకోకపోవడంతో వాళ్లు మెల్లగా బృందాలుగా సంఘటితం కావడం మొదలుపెట్టి ప్రత్యేక మహిళా ట్రేడ్ యూనియన్లు ఏర్పరుచుకొనే వరకూ ప్రయత్నాలు చేశారు. 1820లలో మొట్టమొదటిసారి మహిళలే నిర్వహించి పాల్గొన్న సమ్మెలు న్యూ ఇంగ్లండ్ టైలరింగ్ ట్రేడ్స్‌లో జరిగాయి.

సమ్మెలు మొదలైన కొత్తలో జరిగిన వాటిలో మసాచూసెట్స్‌లోని లోవెల్ కాటన్ మిల్లులో జరిగిన సమ్మె బాగా ప్రాచుర్యం పొందింది. మిల్లులో పనిచేసే యువతులు మూడు డాలర్ల వేతనానికి వారానికి 81 గంటలు పనిచేసేవారు. అందులో ఒకటింపావు డాలరు లోవేల్ కంపెనీ బోర్డింగ్ హౌస్‌లో వసతికీ భోజనానికి సరిపోయేవి. యువతులతో ఉదయం 5 గంటల నుండే పనిచేయించేవారు. ఖాళీ కడుపుతో అయితే యువతులు వేగంగా పనిచేస్తారని ఈ ఏర్పాటు. 7 గంటలకు యువతులకు అరగంట అల్పాహార విరామం ఇచ్చేవారు. పురుషులకు ఉదయం 7 గంటలకు పని మొదలయ్యేది. అనేక కారణాలతో పెట్టే వేతనాల కోతలను భరించలేక 1834లో మహిళలు మిల్లు వదిలి బయటికి వచ్చేశారు. అనేక రోజులపాటు సమ్మె చేసినా ఫలితం దక్కక పోగా వారు మరింత తక్కువ వేతనాలకే మళ్లీ పనుల్లోకి పోవాల్సి వచ్చింది.

1844లో 'లోవేల్ మహిళా శ్రామిక సంస్కరణ సంఘం' ఏర్పాటు చేసుకున్నారు. రోజుకి 10 గంటల పనిదినం వారి ప్రధాన డిమాండ్. జౌళి పరిశ్రమల స్థితిగతులలో మొట్టమొదటి సంస్కరణలకోసం చొరవ చేసిన ఘనత ఈ యూనియన్ కే చెందుతుంది. అంతర్యుద్ధ కారణంగా అనేక మంది మహిళలు భర్తలను కోల్పోవడం వల్లనూ, ఇంటి భారం

మీద పడడం వల్లనూ పెద్దఎత్తున మహిళలు దుస్తుల మిల్లుల్లో చేరసాగారు. ఇది పురుషులలో ఒక అభద్రతనూ, మహిళల పట్ల శతృత్వ భావననూ కలిగించింది. దాంతో జాతీయ ట్రేడ్ యూనియన్లలో నుండి మహిళలను మినహాయించడం ప్రారంభించారు. దాంతో మహిళలు ప్రత్యేకంగా యూనియన్లు ఏర్పాటుచేసుకోవడం మొదలుపెట్టారు. చర్మకారులు, చుట్టలు తయారుచేసేవారు, గొడుగులు తయారుచేసేవారు, ప్రింటింగ్ పనిచేసేవారు, కుట్టుపని చేసేవారు, బట్టలుతికేవారు తమ తమ సొంత మహిళా యూనియన్లను ఏర్పాటు చేసుకొన్నారు.

న్యూయార్క్‌లోని దుస్తుల కార్మికులు 1857లో మార్చి 8న పని పరిస్థితుల మెరుగుదలను, పది గంటల పనిదినాన్ని, మహిళలకు సమాన హక్కులనూ డిమాండ్ చేస్తూ నగర వీధుల్లో ప్రదర్శన నిర్వహించి పికెటింగ్ చేశారు. నిరసన చేస్తున్న మహిళలపై పోలీసులు దాడిచేసి చెల్లాచెదురు చేశారు. రెండేళ్ల తర్వాత మళ్లీ మార్చి నెలలోనే తమ మొదటి లేబర్ యూనియన్‌ను స్థాపించుకొన్నారు. 1900 లో అంతర్జాతీయ మహిళా దుస్తుల తయారీ శ్రామికుల యూనియన్ ఏర్పడింది. ఆ తరువాత మార్చి 8న మరిన్ని నిరసన ప్రదర్శనలు జరిగాయి. పని పరిస్థితులు అత్యంత ఘోరంగా ఉండడంతో అనేకచోట్ల యూనియన్లు ఏర్పడసాగాయి. షాపులలో వెలుతురు చాలా తక్కువగా ఉండేది. దానికి తోడు మిషన్ల చప్పుడుతో చెవులు గళ్లుపడేవి. బట్టలపై మిషన్ ఆయిల్ పడినా, కుట్లు మరీ పెద్దగానో, లేక మరీ చిన్నగానో ఉన్నప్పుడూ, మాట్లాడినా, నవ్వినా, దగ్గినా కూడా జరిమానాల రూపాన కోతలు పడేవి. హోవర్ టైమ్ చేయవలిసివచ్చిన దానికి ప్రత్యేక వేతనం ఉండేది కాదు. శ్రామిక మహిళలకు మధ్యతరగతి నుండి, మేధావి వర్గం మహిళల నుండి మద్దతు దొరికాక వారితో కలిపి 1903లో నేషనల్ ఉమెన్స్ ట్రేడ్ యూనియన్ లీగ్ ఏర్పడింది.

51 సంవత్సరాల తరవాత 1908లో మార్చి 8న 1857 నాటి నిరసనను గుర్తుచేసుకోంటూ, స్వెట్ షాపులనీ (అత్యంత ఘోరమైన పనిపరిస్థితుల్లో అతి తక్కువ వేతనానికి పనిచేసే స్థలాలు), చిన్న పిల్లలతో శ్రమ చేయించడాన్ని అంతం చేయాలని కోరుతూ ప్రదర్శన నిర్వహించారు. ఇదే సంవత్సరంలో మహిళలు వివిధ దుస్తుల మిల్లులలో విధులను బహిష్కరించడం, సమ్మెలు చేయడం పెరిగింది. అటువంటి ఒక పెద్ద ప్రదర్శనలో 15000 మంది మహిళలు పాల్గొన్నారు. కొన్నిసార్లు పురుష శ్రామికులతో యజమాన్యం ఒప్పందం కుదుర్చుకొని వాళ్ల డిమాండ్లను కొన్నిటిని ఒప్పుకొని వాళ్లతో సర్దుబాట్లు చేసుకొని సమ్మె విరమింపజేసేది. వారి ఒప్పంద పత్రాలలో ఇది మహిళలకు వర్తించదు అనే క్లాసు చేర్చేవారు. అనేక సార్లు అరెస్టులనూ, భారీ జరిమానాలనూ, పోలీసుల చేతిలోనూ, కిరాయి గూండాల చేతిలోనూ దెబ్బలు తినవలసి వచ్చినప్పటికీ వారు తమ ఆందోళనను కొనసాగించారు. వీరి పోరాటానికి త్వరలోనే మధ్యతరగతి, పైతరగతి మహిళల నుండి కూడా మద్దతు దొరకసాగింది. పికెటింగ్ జరిగేటప్పుడు ఈ మహిళలు శ్రామిక మహిళలకు మద్దతుగా వచ్చి కూర్చొని అరెస్టయ్యేవారు. దాంతో ఈ అసాధారణ అరెస్టుల వల్ల వార్తాపత్రికలలో ఈ నిరసనల గురించిన వార్తలకు చోటు దొరికేది. దాంతో వారి దుర్భర పని పరిస్థితుల గురించి, డిమాండుల గురించి అంతటా ప్రచారం కానారంభించింది.

నేషనల్ ఉమెన్స్ ట్రేడ్ యూనియన్ లీగ్ మద్దతుతో షర్ట్ వెయిస్ట్ తయారీ శ్రామికులు న్యూయార్క్‌లోని ప్రసిద్ధిగాంచిన లీసర్సన్ అండ్ కంపెనీ, ట్రయాంగిల్ వెయిస్ట్ కంపెనీలకు వ్యతిరేకంగా సమ్మెల పరంపరను ప్రారంభించారు. కొన్ని నెలలపాటు చిన్న చిన్న కార్యక్రమాలు నిర్వహించి క్రమంగా పోరాటాన్ని ఉధృతంచేసి ఒక సాధారణ సమ్మెకి పిలుపునివ్వాలని నిర్ణయించుకున్నారు. ఇటువంటి దీర్ఘకాలిక సమ్మెలను నిర్వహించడం కష్టం అని ఎంతగా నిరుత్సాహపరిచినప్పటికీ యూనియన్ నాయకులను ధిక్కరించి మహిళలు 1909 నవంబర్ 22న 'అప్‌రైజింగ్ ఆఫ్ ట్వెంటీ తౌజెండ్' (20 వేల మంది తిరుగుబాటు)ను ప్రారంభించారు. దీర్ఘమైన కష్టతరమైన పోరాటాన్ని నిర్వహించి కొనసాగించడం కష్టమనే వాదనలకు ఈ పోరాటం అంతం పలికింది.

13 వారాల పాటు, గడ్డకట్టించే చలిలో 16 నుంచి 25 సంవత్సరాల మధ్య వయసులోని మహిళలు ప్రతిరోజూ పికెటింగ్ చేశారు. ప్రతిరోజూ లాఠీ దెబ్బలు తిన్నారు. కోర్టులు కూడా యాజమాన్య పక్షాన్నే ఉండేవి. అరెస్టయిన సమ్మెకారుల బెయిల్ కు అవసరమైన డబ్బునీ, సమ్మె కాలంలో అవసరమైన ఖర్చులకు పెద్ద ఎత్తున మహిళా ట్రేడ్ యూనియన్ నిధులు సమకూర్చింది. నెలల తరబడి సాగిన ఈ పోరాటం పాక్షికంగానే విజయం సాధించినప్పటికీ ఈ తిరుగుబాటు, కొన్ని మౌలిక మార్పులను సాధించింది. చదువురాని వలస మహిళలు ఏమీ చేయలేరనే భావననే ఇది సవాలు చేసింది. వలస వచ్చినవారిలోనూ, మహిళా శ్రామికులలోనూ ఆత్మగౌరవాన్నీ, శక్తినీ నింపింది.

సమ్మె విచ్ఛిన్నమైన ఏడాది అనంతరం 1911 మార్చి 25న ట్రయాంగిల్ వెయిస్ట్ కంపెనీలో భయంకర అగ్నిప్రమాదం సంభవించింది. కార్మికులు విధుల బహిష్కరణ చేయకుండా ఉండేందుకు అత్యవసర ద్వారాలకు కూడా బయటి నుండి గొళ్లెం పెట్టడంతో అనేక మంది ప్రమాద స్థలం నుండి బయటపడలేకపోవడంతో 146 మంది మంటలలో కాలిపోయారు. వారిలో అనేకమంది 13-25 మధ్య వయసువారు. కొత్తగా వలస వచ్చిన వారు. ఎక్కువ మంది ఇటలీ యూదు కాందిశీకులు. రక్షణ ప్రమాణాలు లేకపోవడం కారణంగానే మృతుల సంఖ్య అంత ఎక్కువ ఉండడంతో ఈ ఘటన అమెరికా లేబర్ చట్టాలపై విశేషమైన ప్రభావాన్ని చూపింది. చివరికి ఉద్యోగులను విచారించి ఒక్కొక్కరికి 20 డాలర్ల జరిమానా విధించారు. మరణించిన వారి కుటుంబాలకి ఒక్కొక్కరి చావుకీ 75 డాలర్లు చెల్లించారు. ఇటువంటి ఒప్పందాన్ని పలువురు మహిళా మేధావులు నిరసించారు.

ఈ సమ్మెల కాలంలోనే కేవలం జీవన భృతికోసం మాత్రమే కాదు గౌరవప్రదమైన జీవితం కోసం చేస్తున్న డిమాండ్లకు చిహ్నంగా లారెన్స్ టెక్స్‌టైల్ మిల్లు సమ్మె సందర్భంగా 1912లో 'మాకు రొట్టెలే కాదు గులాబీలూ కావాలి'. అని ప్లకార్డులు పట్టుకొని మహిళలు ప్రదర్శన చేశారు. ఆ స్ఫూర్తితోనే జేమ్స్ ఒప్పెన్ హీమ్ 'బ్రెడ్ అండ్ రోజెస్' పాట రాశాడు. ఆ తరవాత కాలంలో మార్చి 8 ప్రదర్శనలలో ఈ పాట కవాతు గీతం అయ్యింది.

**మహిళా దినానికి ఆద్యులు అమెరికా సోషలిస్టు మహిళలు**

మొట్టమొదటి మహిళా దినం అమెరికాలో మొదలయ్యింది. అయితే అది స్థానిక స్థాయిలోనే ప్రారంభమయ్యింది. 1908లో అమెరికాలో మహిళలకు ఓటు హక్కు ప్రచారం కోసం సోషలిస్టు పార్టీ ఒక జాతీయ కమిటీని ఏర్పాటు చేసింది. అప్పటికి మహిళలకు ఓటు హక్కు లేదు.

ఈ కమిటీ సంవత్సరంలో ఒకరోజును మహిళల ఓటు హక్కు కోసం ప్రచారం చేయడానికి కేటాయించాల్సిందిగా సిఫారసు చేసింది. 1909 ఫిబ్రవరి 28న అమెరికా అంతటా మొదటి మహిళా దినాన్ని పాటించారు. మహిళల ఓటు హక్కు కోసం, రాజకీయ, ఆర్థిక హక్కులను డిమాండ్ చేస్తూ పెద్ద పెద్ద ప్రదర్శనలు జరిగాయి.

1910లో సోషలిస్టులూ, ఫెమినిస్టులూ మహిళా దినాన్ని అమెరికా అంతటా నిర్వహించారు. 1910, మే నెలలో జరిగిన సోషలిస్టు పార్టీ జాతీయ కాంగ్రెస్ లో ఫిబ్రవరిలోని చివరి ఆదివారాన్ని అంతర్జాతీయ మహిళా దినంగా గుర్తించాలని మహిళా జాతీయ కమీషన్ సిఫారసు చేసింది. ఆ తరవాత మహిళా దినాన్ని అంతర్జాతీయ సంఘటనగా ప్రతిపాదించాలనే ఉద్దేశంతో అదే ఏడాది కోపెన్‌హెగెన్‌లో జరిగిన 2వ సోషలిస్టు మహిళా అంతర్జాతీయ కాన్ఫరెన్స్‌కు ప్రతినిధులు వెళ్లారు.

**అంతర్జాతీయ మహిళాదినం ప్రతిపాదన**

అమెరికాలో జరుగుతున్న ఈ పోరాటాలను పరిశీలిస్తూ ఎంతో స్ఫూర్తిని పొందిన జర్మనీకి చెందిన కమ్యూనిస్టు నాయకురాలు క్లారా జెట్కిన్ ప్రతి సంవత్సరం ఒక నిర్దిష్టమైన రోజున ప్రపంచవ్యాప్తంగా మహిళలు తమ డిమాండ్ల కోసం వత్తిడి తెచ్చేందుకు కేంద్రీకరించాలని కాన్ఫరెన్సులో ప్రతిపాదన పెట్టడం కోసం ప్రణాళిక సిద్ధం చేసుకొని వచ్చింది.

ప్రతి సంవత్సరం ఒక మహిళా దినాన్ని నిర్వహించాలనీ 'సోషలిజం కోసం పోరాటంలో మహిళల ఓటు మన బలాన్ని ఏకం చేస్తుంది' అనే నినాదంతో ప్రతి దేశంలోనూ మహిళలు ఒకే రోజున మహిళా దినాన్ని జరుపుకోవాలని కోపెన్‌హెగెన్ కాన్ఫరెన్స్ నిర్ణయించింది. ఈ దినం 'ఉమ్మడి లక్ష్యాల కోసం పోరాటంలో అంతర్జాతీయ సంఘీభావం కలిగి ఉండే రోజుగా సోషలిజం పతాకం కింద మహిళా శ్రామికులను సంఘటితం చేసిన బలాన్ని సమీక్ష చేసే రోజుగా ఉండాలి' అని క్లారా జెట్కిన్ సూచించింది.

యూనియన్లకూ, సోషలిస్టు పార్టీలకూ, మహిళా శ్రామికుల క్లబ్బులకూ ప్రాతినిధ్యం వహిస్తున్న మహిళలూ, ఫిన్ లాండ్ పార్లమెంటుకు మొదటిసారిగా ఎన్నికైన ముగ్గురు మహిళలతో సహా 17 దేశాల నుండి వచ్చిన 100 మంది మహిళలు జెట్కిన్ సూచనను ఏకగ్రీవంగా ఆమోదించారు. ఫలితమే అంతర్జాతీయ మహిళా దినం. కొన్నిరోజుల తరవాత సాధారణ అంతర్జాతీయ సోషలిస్టు కాంగ్రెస్‌లో దీనిని మళ్లీ ఏకగ్రీవంగా ఆమోదించారు. అప్పటినుండీ ప్రపంచవ్యాప్తంగా వర్గచైతన్యం కలిగిన శ్రామికులూ, మహిళా విముక్తికోసం, మొత్తం మానవజాతి విముక్తికోసం పోరాడేవారూ దీనిని జరుపుకుంటున్నారు. ప్రారంభ సంవత్సరాలలో ఫిబ్రవరిలోనూ, మార్చ్‌లోనూ వివిధ తేదీల్లో జరుపుకొన్నారు. కాలక్రమేణా మార్చి 8 స్థిరపడింది.

**రష్యాలో చారిత్రక పాత్ర నిర్వహించిన మార్చి 8**

రష్యాలో మొట్టమొదట 1913లో అంతర్జాతీయ శ్రామిక మహిళా దినం జరుపుకొన్నారు. అప్పటికి రష్యాలో గడ్డుకాలం నడుస్తోంది. జారిజం శ్రామికులనూ, రైతులనూ ఉక్కిపిడికిలిలో బిగించిన కాలం అది. అంతర్జాతీయ మహిళా దినాన్ని పురస్కరించుకొని రష్యాలో జరిగిన ప్రదర్శనలు రష్యా విప్లవపు మొదటి దశగా నిరూపితమయ్యాయి. రెండు మిలియన్ల మంది రష్యా సైనికులు యుద్ధంలో మరణిచడంతో 'రొట్టె, శాంతి' లకోసం రష్యన్ మహిళలు సమ్మె చేయడానికి ఫిబ్రవరిలోని చివరి ఆదివారాన్ని ఎంచుకొన్నారు. దీనికి సెయింట్ పీటర్స్‌బర్గ్ మహిళలు నాయకత్వం వహించారు.ప్రదర్శనలను ఆపివేయాలని ప్రభుత్వం హెచ్చరించింది. పీటర్స్‌బర్గ్‌లోని పుతిలోవ్ ఫాక్టరీలోని మహిళలు నిరసనగా రోడ్లమీదకి వచ్చారు. ప్రదర్శనలపై కాల్పులకోసం పంపిన సైనికులతో ఆ మహిళలు మాట్లాడడంతో వారు కాల్పులు జరపడానికి నిరాకరించారు. తమ బయోనెట్లను జార్ రాచరికానికి వ్యతిరేకంగా తిప్పారు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా రోజురోజుకీ నిరసన పెరుగుతున్నది. ప్రపంచ యుద్ధం, సుదీర్ఘ పోరాటాలు, భయంకరమైన ఆహార కొరత అధిక ధరలను చాలా కాలంగా సహిస్తూ వచ్చిన పరిస్థితులు వేలాది మంది మహిళలను ఫ్యాక్టరీల నుండి, ఇళ్ల నుండి వీధుల్లోకి వచ్చేలా చేసింది. 1917 అంతర్జాతీయ మహిళాదినాన్ని జరిగిన నిరసన రష్యన్ విప్లవానికి చివరి కుదుపునిచ్చింది. ఫిబ్రవరి చివరి ఆదివారాన్ని జరుపుకొన్న ఆ చారిత్రకమైన రోజు అప్పటికి రష్యాలో వాడుకలో ఉన్న జూలియన్ క్యాలెండర్ ప్రకారం ఫిబ్రవరి 23. ఆ తరవాత 1918 లో రష్యా గ్రెగొరియన్ క్యాలెండర్ (ఇప్పుడు అంతటా వాడుకలో ఉన్నది)లోకి మారడంతో దాని ప్రకారం మార్చి 8 అయ్యింది.

**భారతదేశంలో అంతర్జాతీయ శ్రామిక మహిళా దినం**

భారతదేశంలో 70వ దశకం వరకూ అంతర్జాతీయ శ్రామిక మహిళా దినం జరుపుకున్న దాఖలాలు లేవు. ఇక్కడికి మార్చి 8 ప్రవేశించిన నేపథ్యం కూడా వేరు. 1975 నుండీ ఐక్య రాజ్య సమితి అంతర్జాతీయ మహిళా దినాన్ని జరపసాగింది. 1977లో సభ్య దేశాలను కూడా జరపమని ఒక తీర్మానం చేసింది. మహిళల హక్కుల కోసం మహిళా దశాబ్దాన్ని పాటించాలని కూడా పిలుపునిచ్చింది. అయితే ప్రత్యేకంగా ఏరోజు జరపాలనే తేదీని సూచించకపోయినా అన్నిదేశాలు మార్చ్ 8 నే జరుపుతున్నాయి. అయితే చరిత్రలో కానీ వాటిని జరుపుకొనే సందర్భాలలో కానీ ఎక్కడా శ్రామిక మహిళల పోరాట చరిత్రని మాట్లాడకుండా దాని ఊసేత్తకుండా ఆ చరిత్రని మరుగుపరిచే ప్రయత్నం చేస్తున్నారు. సోషలిస్టు మహిళల చొరవతో మొదలై శ్రామికవర్గ మహిళలను సోషలిజం పతాకా కిందికి సంఘటితం చేయడం కోసం ఏర్పడిన అంతర్జాతీయ శ్రామిక మహిళా దినానికి మహిళల స్పందన గమనించిన సామ్రాజ్యవాదులు దానిని కూడా తమ మార్కెట్ సరుకుగా మార్చుకో దలిచారు. ముఖ్యంగా అందులోని పోరాటసారాన్ని వక్రమార్గం పట్టించి దానిని పేలవంగా మార్చేస్తున్నారు.

అయితే భారతదేశంలోని మార్క్సిస్టు భావజాలాన్ని కలిగినవారు మాత్రం ఆ పోరాట చరిత్రని ఎత్తిపట్టి అంతర్జాతీయ మహిళా దినాన్ని ప్రత్యేకంగా అంతర్జాతీయ 'శ్రామిక' మహిళా 'పోరాట' దినం గా జరిపి మరొక్కసారి మహిళలను సమాన హక్కుల కోసం, సమానత్వం కోసం, సోషలిజం బాటలో సంఘటిత పరిచే ప్రయత్నం కొనసాగిస్తున్నారు. ముఖ్యంగా 80వ దశకం నుండీ ఈ ప్రయత్నాలు జరుగుతున్నాయి. తొంభయ్యవ దశకంలో సామ్రాజ్యవాదులు మార్చి 8ని మార్కెట్ సరుకుగా మార్చేందుకు పెద్ద ఎత్తున ప్రయత్నాలు చేశారు. మార్చి 8 మహిళల

# మయన్మార్ జర్నలిస్టులపై నిర్బంధం

***సామ్రాజ్యవాద శక్తుల చేతుల్లో ఉండే ఏ దేశంలోనైనా పౌర, ప్రజాస్వామిక హక్కులు కాలరాచి వేయబడుతాయని మయన్మార్ ఉదాహరణ చూపుతున్నారు* ఎనిశెట్టి శంకర్**

ఆంగ్‌సాన్ సూకి... ఈ పేరు వింటేనే తన దేశ ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం మిలటరీ ప్రభుత్వంతో పోరాడి దశాబ్దాల పాటు జైలుజీవితం గడిపిన ధీశాలిగా గుర్తుకు వస్తుంది. విచారకర విషయమేమంటే అలాంటి ప్రజా నాయకి ఆధ్వర్యంలోనే నడుస్తున్న ప్రభుత్వమే నేడు ప్రజల హక్కుల్ని హరిస్తూ కనీస మానవ ధర్మాన్ని పాటించని అప్రజాస్వామిక ప్రభుత్వంగా మారింది.

ప్రపంచ వ్యాప్తంగా రోహింగ్యా ముస్లింలు పడరాని పాట్లు పడుతూ తలదాచుకోవడానికి ఆశ్రయంలేక సవాలక్ష సమస్యలను ఎదుర్కొంటున్న విషయం మనకు తెల్సిందే. అలాంటి రోహింగ్యాలపై జరిగిన మారణ కాండను, అమానవీయ కృత్యాలపై రిపోర్టు చేసిన ఇద్దరు 'రాయిటర్' సంస్థ జర్నలిస్టులను మయన్మార్ ప్రభుత్వం అరెస్టు చేయడం – కోర్టు విచారణ జరపడం – పద్నాలుగేళ్ల జైలు శిక్ష విధించడం – దాంట్లో భాగంగా ఆ జర్నలిస్టులిద్దరూ జైల్లో మూడు నెలలుగా మగ్గుతున్న అత్యంత బాధాకర విషయం నేడు ప్రపంచ వ్యాప్తంగా చర్చనీయాంశమైంది.

ఏడు దశాబ్దాలుగా పాలస్తీనా ప్రజలు తమ 'గూడు' కోసం ప్రపంచ దేశాలు తిరుగుతున్న విధంగానే, నేడు రోహింగ్యా ముస్లింలు కూడా తమతమ స్వస్థలాలు వదిలి, పొట్ట చేతపట్టుకొని అమానవీయ పరిస్థితుల నెదుర్కొంటున్న దైన్యం మనముందున్నది.

ఐక్యరాజ్య సమితి రిపోర్ట్ ప్రకారం గత సంవత్సరం బర్మా దేశంలో 6700 మందిని దారుణంగా హత్య చేశారు. రోహింగ్యాలు నివాస ముంటున్న గ్రామాలకు గ్రామాలు ధ్వంసమయ్యాయి. సుమారు 70 వేలమంది సమీప బంగ్లాదేశ్‌కు పారిపోయినట్లు నివేదికలు చెపుతున్నాయి.

అసలు వీళ్లు చేసిన నేరమేమిటి? రోహింగ్యా ముస్లింలలో అధికులు టెర్రరిస్టులని ప్రచారం. టెర్రరిస్టులను అణచివేస్తున్నామని, వాళ్లను తమ భూ భాగాల్లో నుండి ఏరిపారేస్తున్నామని చెపుతూ అత్యంత అమానవీయంగా వారిని బర్మా ప్రభుత్వం అణచివేస్తున్నది. విచారకరమైన విషయమేమంటే తమ జాతి ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, జీవించే హక్కు కోసం జీవితాంతం పోరాడి దశాబ్దాల పాటు జైలు జీవితం అనుభవించి విదేశాంగ మంత్రిగా ఉన్న ఆంగ్‌సాన్ సూకి దేశం – బర్మా మిలటరీ విధానంవల్ల సూకీ ఆ దేశ అధ్యక్షురాలిగా అర్హత లేకున్నా షాడో అధ్యక్షురాలిగా యంత్రాంగాన్ని నడిపిస్తున్న విషయం విదితమే.

గత సంవత్సరం సెప్టెంబర్ నెలలో బంధించబడ్డ 10 మంది రోహింగ్యా ముస్లింల 'ఊచకోత'కు సంబంధించిన విషయాన్ని 'రాయిటర్' సంస్థకు చెందిన వాలోన్, క్యాసో ఊ అనే ఇద్దరు జర్నలిస్టులు బయటి ప్రపంచానికి తెలిపారు. తమ దేశ ప్రభుత్వ రహస్య చట్టాన్ని ఈ ఇరువురు జర్నలిస్టులు ఉల్లంఘించారని వీరిపై ఆరోపణ. దానికి వెంటనే కేసు

---

దినం కాబట్టి మహిళలకోసం అంటూ సౌందర్య సాధనాల పైనా, వంటింటి సామాన్ల పైనా ప్రత్యేక తగ్గింపులు ప్రకటించడం మొదలు పెట్టారు. 1997 లో మార్చి 8ని 'పాండ్స్' మహిళా దినం గా పాటించమని పాండ్స్ కంపెనీ ఏకంగా ప్రకటనలు జారీ చేసింది. పాండ్స్ మహిళా దినం కాదు, 'ప్రొలిటేరియన్' (శ్రామికవర్గ) మహిళా దినంగా పాటిద్దామని ప్రగతిశీల శిబిరాలు పిలుపిచ్చాయి.

భారత ప్రభుత్వం కూడా ఆ రోజు అట్టహాసంగా పండగలాగా జరిపి ముగ్గుల పోటీలు ఫాషన్ పెరేడ్‌లూ నిర్వహించే వారికి అనుమతి ఇచ్చి, శ్రామికవర్గ స్ఫూర్తితో జరిపే కార్యక్రమాలను హింసాత్మకంగా అడ్డుకొంటోంది. విప్లవ పోరాటం బలంగా ఉన్న జార్ఖండ్, ఛత్తీస్‌గఢ్ రాష్ట్రాలలో మార్చి 8 జరిపిన సందర్భాలలో ఆ మీటింగులను అడ్డుకొని కేసులు పెట్టి జైళ్లలో తోస్తోంది. ఝార్ఖండ్ రాష్ట్రంలో ఆదివాసీ మహిళలు అత్యధిక సభ్యులుగా ఉన్న నారీ ముక్తి సంఘాన్ని నిషేధించింది. కేవలం మార్చి 8 గురించి మాట్లాడినందుకే పలువురి నాయకుల మీద రాజద్రోహం కేసులు మోపింది. ఇప్పటికీ నారీ ముక్తి సంఘం ప్రధాన నాయకత్వం అంతా జైళ్లలోనే మగ్గుతోంది. 2006 మార్చి 8న 'ఆదివాసీ మహిళల స్థితిగతులు, పోరాటాలు' అన్న అంశం పై వివిధ ఆదివాసీ మహిళా సంఘాలతో కలిసి అఖిలభారత సెమినార్ ను నిర్వహించడంలో కీలక పాత్ర నిర్వహించిన నారీముక్తి సంఘానికి అదే చివరి బహిరంగ కార్యక్రమంగా మిగిలింది.

భారత దేశ ఆర్థిక వ్యవస్థకి వెన్నెముకగా ఉండి తమ వెన్ను విరగ్గొట్టు కొంటున్న శ్రామికులలో అత్యధిక భాగం సంఘటిత, అసంఘటిత రంగాల లో భయంకర దోపిడీకి గురవుతున్న మహిళలు, దళితులు, ఆదివాసీలు. ముఖ్యంగా బొగ్గు పరిశ్రమల్లోనూ, గనుల్లోనూ, టీ ప్లాంటేషన్లలోనూ తమ రక్తాన్ని, చెమటని వెచ్చించి లాభాలార్జించి పెడుతున్న వారిలో అత్యధికులు ఆదివాసీలే. అసంఘటిత రంగంలో కారు చవకగా శ్రమను అమ్ముకుంటున్నది దళితులే. ఇప్పుడు ఆ దోపిడీకి జతగా మతోన్మాదం కూడా తోడయ్యింది. బ్రెడ్ అండ్ రోజెస్... మాకు రొట్టెలూ కావాలీ, గులాబీలూ కావాలీ అంటూ నినదించిన ఆనాటి (1912) లారెన్స్ మిల్లు కార్మికుల పోరాట స్ఫూర్తితో ఈనాడు 'అన్నం కోసమే కాదు, ఆత్మగౌరవం కోసం కూడా' పోరాడాల్సిన పరిస్థితి రోజురోజుకూ తీవ్రమవుతోంది.

*(మహిళామార్గం ప్రచురణ 'మార్చి 8 చరిత్రావలోకనం బి. నల్లమ్మ పుస్తకం ఆధారంగా)*

*(రచయిత మహిళా ఉద్యమ కార్యకర్త)* వీ

నమోదు కావడం, కోర్టులో వాదాలు జరగడం, ప్రభుత్వం కోరిన విధంగా వీరిరువురికీ 14 సంవత్సరాల కారాగార శిక్ష విధించడం. దాంట్లో భాగంగా వీళ్ల జైల్లో 3 నెలలుగా నిర్బంధించబడడం ఆగమేఘాల మీద జరిగిపోయిన ఓ ప్రహసనం.

వీళ్ల నివేదించిన (పంపిన) వార్తల్లో సైన్యం చేతుల్లో బందీలుగా ఉన్న 10 మంది రోహింగ్యాలను అతి దారుణంగా, ఇందులో ఇద్దర్ని దారుణంగా కత్తులతో పొడిచి చంపారు. మిగతా వారందర్ని తుపాకులతో కాల్చివేశారు.

రాయిటర్స్ సంస్థ పంపిన ఒక ఫోటోలో 10 మంది మోకాళ్లపై కూర్చుంటే, వాళ్ల చేతులు వెనక్కు కట్టివేయబడి ఉన్నాయి. ఆ సంస్థ పంపిన మరో ఫోటోలో 10 మంది రక్తసిక్త శవాలను ఒకే సమాధిలో పూడ్చిపెట్టారు. ఇలా క్రూరంగా హత్యకాబడ్డ 10 మందిలో ఇద్దరు విద్యార్థులు. బర్మా మిలటరీ అధికారులు చేపట్టిన ఈ ప్రజా వ్యతిరేక, అమానవీయ చర్యల్ని యుఎన్‌ఒతో పాటు పలు ప్రపంచ దేశాలూ గర్హిస్తున్నాయి.

ఉత్తర ప్రాంతంలో ఇన్‌డిన్ అనే గ్రామ ప్రాంతంలో జరిగిన ఈ ఘాతుకాన్ని ఈ ఇద్దరు జర్నలిస్టులు ప్రాణాలు లెక్కచేయక పరిశోధన చేసి రహస్యాన్ని బయటపెట్టారు. ఈ ఇద్దరు అరెస్టు అయిన మరుక్షణమే మిగతా జర్నలిస్టులు ఆ దుశ్చర్యను ప్రతిఘటిస్తూ మరింత శోధనలో మునిగారు. బర్మా జర్నలిస్టుల అమానుష అరెస్టుల పట్ల పలు సంస్థలు తమ కోపాన్ని, వ్యతిరేకతని ప్రకటించాయి. ప్రఖ్యాత 'పిఇఎన్ అమెరికా' సంస్థ ఈ ఏడాది వారిచ్చే 'ఫ్రీడమ్ టు రైట్ అవార్డ్'ను ఇరువురు జర్నలిస్టులకు ఇస్తున్నట్లు ప్రకటించింది. మొన్నటికి మొన్న కర్నాటకలో ప్రముఖ జర్నలిస్టు, ప్రజా పక్షపాతి గౌరీ లంకేశ్‌ను ప్రగతి నిరోధకులు అత్యంత దారుణంగా చంపారు. అంతకు ముందు తమకు వ్యతిరేకంగా రచనలు చేశాడని ప్రముఖ తమిళ రచయిత మురుగన్‌ను సాంఘిక బహిష్కరణ చేశారు.

తరచుగా జరిగే మీడియాపై రచయితలపై దాడులు, జర్నలిస్టుల అరెస్టులు, హత్యలు చూస్తుంటే ఏ దేశ ప్రభుత్వమైనా గాని – తమను, తమ కార్యకలాపాలను వ్యతిరేకించే వారిని ఏమాత్రం సహించే స్థితిలో గాని, దశలో గాని లేదనిపిస్తుంది. అసహనం, అభద్రత వెంటాడు తుండగా పాలకులు తమ సీట్లు, ఓట్లు ఎక్కడ గల్లంతవుతాయో అనే తాపత్రయంలో ఎంతటి నికృష్టానికైనా పాల్పడుతారనే దానికి తాజా ఉదాహరణ రాయిటర్స్ జర్నలిస్టులపై అభియోగం – జైలు శిక్ష.

రాయిటర్స్ సంస్థ బర్మా దేశపు ప్రధానాధికారి అయిన అంటోనీ స్లడ్కోవిస్కీని సింగపూర్‌లో ఉన్న 'డెమోక్రసీనా' ప్రతినిధి ఆ సంస్థ జర్నలిస్టుల అరెస్టు, జైలు శిక్షల గూర్చి ప్రశ్నించింది. అంటోనీ దానికి సమాధానం చెబుతూ తమ జర్నలిస్టులిద్దరి అరెస్టు, జైలు శిక్షకు ప్రధాన విషయాలు మూడు అంటారు. మొదటగా అక్కడక్కడ అరెస్టులు చేసి ఒక స్కూల్లో బంధించి అందరినీ హత్య చేశారు. ఇందులో ఇద్దరు విద్యార్థులు, దుకాణదారులు, చేపలు పట్టే వాళ్లున్నారని చెప్తారు.

మరో విషయమేమంటే వాలోన్, క్యాసో ఊ రిపోర్టు చేసినది ఆషామషీ కాదని, వాటి లోతుల్లోకి వెళ్లి పరిశీలించి రాశారు. కాబట్టే ఆ సంఘటన కేవలం ఇన్‌డిన్ ప్రాంతానికి పరిమితం కాకుండా ఉందన్నది వాస్తవ విషయం. ఆ ప్రాంతం మొదలుకొని బర్మా మిలటరీ వాళ్లు వివిధ ప్రాంతాల్లో రోహింగ్యాలపై అమలు జరుపుతున్న హింసాకాండ బయట పడుతుందన్నది వాస్తవం. అంటే మిలటరీ దుశ్చర్యల్లో ఇన్‌డిన్ మారణకాండకే పరిమితం కాలేదనే వాస్తవాన్ని భరించలేని బర్మా ప్రభుత్వం జర్నలిస్టులకు జైలు శిక్ష వేసి మిగతా 'తస్మాత్ జాగ్రత్త' అనే హెచ్చరికను పంపింది. బర్మా దేశంలో పలు ప్రాంతాల్లో ఇలాంటి కిరాతక చర్యలు జరుగుతున్నట్లు తెలుస్తున్నాయి. రాయిటర్స్ సంస్థ ముఖ్యాధికారి అంటోనీ ఇద్దరు జర్నలిస్టుల ధైర్య సాహసాలను కొనియాడుతూ సాహసోపేత రిపోర్టు పంపారని మెచ్చుకుంటున్నాడు.

వాలో, క్యాసో ఊ తమ విధిలో భాగంగా స్థానిక పోలీసు అధికారిని కలువడానికి పోయారు. అక్కడి నుండి కొన్ని పత్రాలు తీసుకొని (చదువను కూడా చదువలేదు) రెస్టారెంట్‌కు చేరుకోగానే ఆ ఇద్దరినీ అరెస్టు చేశారు. తక్షణమే వాలోన్ తాను అరెస్టు అయినట్లు వార్త పంపాడు. ఎన్నో పోలీస్ స్టేషన్లలో వారి గూర్చి వాకాబు చేశారు. తెల్లవారి పేపర్లో ఆ ఇద్దరు జర్నలిస్టులను అరెస్టు చేసినట్లు వార్త ప్రచురితమైంది. రెండు వారాలు వాళ్లను ఒక వకీలును గాని, కుటుంబ సభ్యులను గాని కలువనివ్వలేదు.

వాలోన్‌ను కోర్టు రూమ్ నుండి బేడీలు వేసుకొని నడిపించుకు పోయారు. తన అభియోగ పత్రంపై బలవంతంగా సంతకం పెట్టించారు. ఈ ఇద్దరు జర్నలిస్టులను తక్షణమే విడుదల చేయాలని ఐరా సమితి సెక్రటరీ జనరల్ అంటోనియా గుటెరెస్ జర్నలిస్టులను అరెస్టు చేయడం అంటే భావ ప్రకటనా స్వాతంత్ర్యాన్ని కించపరచడమే నన్నాడు. దానికి జవాబుగా ఆ దేశ రాయబారి అయిన హౌడో సునా జవాబిస్తూ వారిని ప్రభుత్వం జర్నలిస్టులు వార్తలు పంపినందుకు అరెస్టు చేయలేదని, ఆ దేశ భద్రతకు సంబంధించి వారి వద్ద ప్రమాదకర ప్రభుత్వ రహస్య పత్రాలు ఉన్నందున అరెస్టు చేశారని, ఆ పత్రాలు కలిగి ఉండడం ఆ దేశ సార్వభౌమత్వానికి అభద్రతగా భావించారట. పైగా వారి దేశం (మయన్మార్) పత్రికా స్వాతంత్ర్యాన్ని సంపూర్ణంగా గౌరవిస్తుందట.

యుఎన్‌ఒ డిప్యూటీ ఛీఫ్ (రాజకీయ విభాగం) మిరాస్లావ్ జెంకా కూడా మాట్లాడుతూ రాయిటర్స్ జర్నలిస్టులు తమ వృత్తి ధర్మాన్ని పాటించి వార్తను శోధించారని, ఈ విషయంలో వారిరువురూ ఎలాంటి సూత్రాలను భగ్నపరచలేదని ప్రకటించడం మనం గమనించాల్సిన విషయం.

ఏది ఏమైనా ప్రదేశాలు, పేర్లు మారాయి తప్ప ఇలాంటి అరెస్టుల పరంపర, అభూత కల్పనలు, వగైరా మనదేశంలో గాని, రాష్ట్రంలో గాని మక్కీ టు మక్కీ అన్పిస్తున్నది. ఐరాస సెక్రటరీ జనరల్ మాటనే ఖాతరు చేయని బర్మా మిలటరీ ప్రభుత్వంపై ప్రపంచ వ్యాప్త ఒత్తిళ్లు, ఆంక్షలు పెరిగితేనే ఆ దేశ ప్రభుత్వ దురహంకారానికి అడ్డుకట్ట వేయగలం – పత్రికా స్వేచ్ఛను, భావప్రకటనా స్వేచ్ఛను రక్షించుకోగలం.

మొన్నటికి మొన్న 'నక్సలైట్ల ఎజెండానే తమ ప్రభుత్వ ఎజెండా'గా ప్రకటించి కుర్చీలెక్కిన టిఆర్ఎస్ ప్రభుత్వం కూడా ప్రజా సమస్యలపై ఏమాత్రం చిత్తశుద్ధి చూపకపోవడం ఒక ఎత్తయితే, వారు చేసిన వాగ్దానాలనే నెరవేర్చమని డిమాండ్ చేస్తున్న ప్రజానీకంపై అమానుషంగా ప్రవర్తిస్తున్నది మనముందున్న తాజా ఉదాహరణ. ఇక దేశంలో అప్రకటిత 'అత్యవసర పరిస్థితి'ని గోచరించే మతవాద రాజకీయాలు నడుస్తున్నది మనమెరిగిన విషయమే. ప్రజాస్వామిక వాదులు, ప్రజాతంత్ర వాదులు ప్రజలను మభ్యపెట్టే ప్రభుత్వ విధానాలను ఎప్పటికప్పుడు ఎండగట్టడమే తక్షణ, శాశ్వత పరిష్కారం.

వీ

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్ట్)*

# కార్పొరేట్ల దావోస్ సమావేశాలు

***ప్రపంచ పర్యావరణ, ఆరోగ్య, రుణభారాలపై చర్చిస్తామని చెప్పుకునే దావోస్ సమావేశాలు వాస్తవానికి కార్పొరేట్ శక్తుల, పాలకుల మధ్య జరిగే పెట్టుబడి ఒప్పందాల కూడలిగా మారిందని అంటున్నారు* సంతోష్**

ప్రపంచ వాణిజ్య స్థితిగతులను మెరుగుపరిచే లక్ష్యంతో 47 సంవత్సరాల కిందట అవతరించిన వరల్డ్ ఎకనమిక్ ఫోరమ్ (డబ్ల్యుఇఎఫ్) 48వ వార్షిక సమావేశం దావోస్‌లో 2018 జనవరి 23-26 తేదీల మధ్య జరిగింది. వాణిజ్య బ్యాంకర్లు, కార్పొరేట్ అధిపతులు, రాజకీయనేతలు విద్యా వినోద తదితర రంగాలకు సంబంధించిన ప్రముఖులను ఏటా చర్చల్లో భాగస్వాముల్ని చేయడం ద్వారా విశ్వ, ప్రాంతీయ, పారిశ్రామిక, వాణిజ్య గమనాన్ని మెరుగుపరచే ఉద్దేశంతో డబ్ల్యుఇఎఫ్ సదస్సులు జరుగుతుంటాయి. ప్రతి ఏడాది జనవరి చివరిలో స్విట్జర్లాండ్‌లోని ఆల్ప్స్ పర్వత విడిది కేంద్రం దావోస్‌లో ఈ సదస్సు నిర్వహిస్తారు. 'ముక్కలైన ప్రపంచంలో భాగస్వామ్య భవిష్యత్తు సృష్టించాలి' అనే ఇతివృత్తం (థీమ్)తో ఈ ఏడాది సదస్సు జరిగింది. ఈ సదస్సులో అమెరికా అధ్యక్షులు ట్రంప్, జర్మనీ చాన్సెలర్ ఏంజెలా మెర్కల్, ఇటలీ ప్రధాని పౌలో జెంటిలోని, ఈయూ ప్రెసిడెంట్ జీన్ క్లాండ్ జంకర్, ఫ్రాన్స్ అధ్యక్షుడు మెక్రాన్, బ్రిటన్ ప్రధాని థెరిసా మె, భారత ప్రధాని మోడీ సహా 70 దేశాల ప్రభుత్వాధినేతలు పాల్గొన్నారు.

తొలిరోజు జనవరి 23న ప్రపంచ ఆర్థిక వేదిక (డబ్ల్యుఈఎఫ్) వ్యవస్థాపకుడు ఎగ్జిక్యూటివ్ చైర్మన్ ప్రొఫెసర్ క్లాస్ శ్వాబ్ ప్రారంభోపన్యాసం చేశారు. భారత ప్రధాని మోడీ ప్రపంచ ఆర్థిక వేదిక ప్లీనరీని ఉద్దేశించి కీలకోపన్యాసం చేశారు. దావోస్‌లో జరిగిన ప్రపంచ ఆర్థిక వేదిక (వరల్డ్ ఎకనామిక్ ఫోరమ్ డబ్ల్యుఇఎఫ్) వార్షిక సమావేశాల్లో ఈసారి మోడీ ప్రసంగించడంతో చర్చనీయాంశమయింది. 20 ఏండ్ల తరువాత (దేవెగౌడ తరువాత) భారత ప్రధాన మంత్రి నరేంద్ర మోడీ దావోస్ సమావేశాలకు వెళ్లడం ఒక కారణమైతే, తెలుగు రాష్ట్రాల నుండి ఏపి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, ఆయన తనయుడు- మంత్రి లోకేష్, తెలంగాణ మంత్రి కెటిఆర్ దావోస్‌లో హడావిడి చేయడం మరో కారణం. ఈ సమావేశాల్లో కార్పొరేట్ వ్యాపార సంస్థలు, ప్రభుత్వాల నేతలు, అంతర్జాతీయ సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, మేధావులు, మీడియా నుండి సుమారు 2,500 మంది ప్రతినిధులు పాల్గొన్నారు.

దావోస్ వేదిక గురించి స్థూలంగా చెప్పాలంటే 1971లో క్లాస్ శ్వాబ్ అనే వ్యాపారవేత్త 'ఐరోపా యాజమాన్య వేదిక' పేరుతో స్విట్జర్లాండులో ఒక స్వచ్ఛంద సంస్థ స్థాపించి దాని పేరును 1987లో 'ప్రపంచ ఆర్థిక వేదిక'గా మార్చాడు. ప్రారంభంలో ఆయన 'ఐరోపా యాజమాన్య సదస్సు'ను నిర్వహించి 444 మందిని ఆహ్వానించాడు. తరువాత క్రెడిట్ స్విస్ బ్యాంకు వంటి పెద్ద బ్యాంకులు చేరడంతో వేదిక స్థాయి పెరిగింది. జర్మనీలోని జ్యూరిచ్ నుండి పనిచేసే క్రెడిట్ స్విస్ బ్యాంకు ప్రపంచంలోని ధనవంతుల నల్లడబ్బు స్విస్ బ్యాంకుల్లో దాచుకోవడానికి సహకరిస్తుంది. వారి అక్రమ ఆస్తులకు రక్షణ ఇవ్వడమే కాకుండా వాటిని ఎలా, ఎక్కడ పెట్టుబడులు పెట్టాలో సలహా ఇస్తుంది. ప్రపంచ వ్యాపితంగా 50 దేశాల్లో ఇది కార్యకలాపాలు నిర్వహిస్తుంది. దావోస్‌కు వచ్చే వాళ్లు పనిలో పనిగా తమ ధనాన్ని దాచుకోవడం, మేనేజ్ చేసుకోవడంలో ఈ బ్యాంకు, ఇతర స్విస్ బ్యాంకుల 'సేవలు' తీసుకుంటారు.

డబ్ల్యుఇఎఫ్ సదస్సులో ప్రపంచంలోని బడా పెట్టుబడిదారీ సంస్థల సిఇఓలు ఒక చోట చేరి ఆధునిక వ్యాపార యాజమాన్య పద్ధతుల గురించి, మరింత అధిక లాభాలు గడించే విధానాల గురించి అభిప్రాయాలు మార్చుకుంటారు. ఒక స్వచ్ఛంద సంస్థ అధ్వర్యంలో నడుస్తున్న ఈ వేదిక వార్షిక సమావేశాల్లో పాల్గొనేవారికి ప్రత్యేకంగా ఆహ్వానాలు ఉండవు. ఫీజు కట్టి పాల్గొనాలి. దాని చరిత్ర పరిశీలిస్తే ఈ విషయం మరింత అర్థమవుతుంది. ప్రపంచ స్థాయి కార్పొరేట్ సంస్థలు మాత్రమే ప్రపంచ ఆర్థిక వేదికలో సభ్యత్వం పొందగలవు. దావోస్ వేదికలో సభ్యత్వం పొందాలంటే వార్షిక రెవిన్యూ ఆదాయం కనీసం 5 బిలియన్ డాలర్లు (రు.33 వేల కోట్లకు సమానం) ఉండాలి. ఈ సమావేశానికి హాజరు కావాలంటే కనీసం 72,000 డాలర్లు (రు.47 లక్షలు) ఫీజు చెల్లించాలి. కార్పొరేట్ కంపెనీల సిఇఓలు, ప్రభుత్వాల అధికారులు, ప్రభుత్వాధినేతలు, వివిధ రంగాల్లోని సెలబ్రిటీలు, బ్యాంకర్లు, హెడ్జ్ ఫండ్‌ల మేనేజర్లు దావోస్ వేదిక సమావేశాలకు యేటా హాజరవుతారు. ప్రవేశ రుసుము ఒక్కో వ్యక్తికి సుమారు రు.13 లక్షలు. శాశ్వత సభ్యునికి ఏడాదికి సభ్యత్వ రుసుం రు. 36 లక్షలు, సంస్థలకైతే సుమారు రు.కోటీ 85 లక్షలు, వ్యూహాత్మక భాగస్వామి చెల్లించాల్సిన రుసుం సుమారు రు. 4 కోట్ల 40 లక్షలు.

దావోస్ సమావేశాలు వ్యాపారాలు ఎలా అభివృద్ధి చేసుకోవాలో చర్చించుకునే ప్రయివేటు చర్చా వేదికలే గాని అవి విధానాల విషయంలోగానీ, పెట్టుబడులు, వ్యాపారాల విషయంలోగానీ నిర్ణయాలు చేసే వేదికలు కావు. ఐరోపా వ్యాపార ప్రముఖుల అభిప్రాయ వేదికగా ప్రారంభమైన దావోస్ వేదిక క్రమంగా అంతర్జాతీయ ఫైనాన్స్ పెట్టుబడి వేదికగా మారింది. ప్రపంచీకరణ విధానాలను ఎలా ముందుకు తీసుకు పోవాలన్న అంశంపై ముఖ్యమైన ఆలోచనలు చేసే వేదిక ఇది. ఈ సమావేశాల్లో వివిధ అంశాలపై 400 వరకు వివిధ చర్చా గోష్టులు జరిగాయి. ఆయా సంస్థలు స్టాల్స్ ఏర్పాటు చేసుకుంటాయి. వాటికి కూడా ఫీజులు చెల్లించాల్సిందే. ముఖ్యంగా టూరిజం అభివృద్ధికి ఇక్కడ పెద్ద ప్రచారం జరుగుతుంది.

2003 నుంచి ప్రతి సంవత్సరం జనవరి చివరి వారంలో సమావేశమయ్యే అనవాయితీ ప్రారంభమైంది. ఏటా నిర్వహించే ఈ సదస్సుకు ప్రతి ఏడాది ఒక లక్ష్యాన్ని ఎంచుకుంటారు. 2003లో పరస్పర విశ్వాసాన్ని పెంపొందించుకోవడం, 2004లో భద్రత, అభివృద్ధిలో

భాగస్వామ్యం, 2005లో కఠినమైన అవకాశాల్ని ఎంచుకుని, బాధ్యత వహించడం, 2006లో అత్యవసరాల సృజనాత్మక ఎంపిక, 2007లో సామర్థ్యాల సమీకరణాల బదలాయింపు, 2008లో సహకార ఆవిష్కరణల సామర్థ్యం, 2009లో పునరాలోచన, పునర్వ్యవస్థీకరణ, పునర్నిర్మాణం, 2011లో నూతన వాస్తవాల భాగస్వామ్య నిబంధనలు, 2012లో మహాపరివర్తనం, 2013లో స్థితిస్థాపక చైతన్యం, 2014లో ప్రపంచ పునర్నిర్మాణం, 2015లో నూతన భౌగోళిక సందర్భం, 2016లో నాలుగవ పారిశ్రామిక విప్లవ సాధన, 2017లో బాధ్యత, ప్రతిస్పందనలతో కూడిన నాయకత్వం, 2018లో విచ్ఛిన్న ప్రపంచంలో భాగస్వామ్య భవిష్యత్తును సృజించడం ఇతివృత్తంగా చర్చించారు.

2008లో ఏర్పడ్డ ఆర్థిక సంక్షోభం నేటికి కొనసాగుతుంది. దావోస్ దృష్టిలో విచ్ఛిన్న ప్రపంచం అంటే ప్రపంచ ద్రవ్య సంస్థల, బహుళజాతి సంస్థల ప్రయోజనాల మధ్య తీవ్రమైన పోటీ ఏర్పడడంగా భావించాలి. పేదల బాధలు దీనికి సమస్యలు కావు. ప్రజలు ఎదుర్కొంటున్న ఆకలి, దరిద్రం, నిరుద్యోగం, అధమ వేతనాలు, వేతనాల తగ్గుదల, పేదరికం... మొదలయిన సమస్యలేవీ వేదికకు సమస్యలు కావు. పడిపోతున్న జిడిపి, దిగజారుతున్న లాభాలు, వివిధ దేశాల, ప్రాంతాల బహుళజాతి కంపెనీల మధ్య పెరుగుతున్న వైరుధ్యాలు, సంస్కరణల విధానాల సక్రమ అమలు... ఇవే వేదికకు ప్రధాన సమస్యలు. తమలో తమకు వస్తున్న తగాదాలు ఎప్పటికప్పుడు రాజీలు, సర్దుబాట్లు ద్వారా పరిష్కారం కావడానికి బదులు అంతకంతకూ ఎక్కువగా ఘర్షణ రూపం తీసుకోవడం, వాణిజ్య యుద్ధాలు, కరెన్సీ యుద్ధాలు, చివరికి భౌతిక యుద్ధాలు కూడా అనివార్యం కావడం వేదికకు లేదా పశ్చిమ బహుళజాతి కంపెనీలకు పెను సమస్యలుగా మారాయి. ఈ సమస్యలకు సానుకూల పరిష్కారాలు వెతుక్కోవడానికి ఒక ప్రయత్నంగా దావోస్ వేదిక సమావేశాలను సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీలు చూస్తున్నాయి.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాల్లో ప్రధానమైన స్వేచ్ఛ వాణిజ్యం 'అమెరికా ప్రొటెక్షనిజం' వల్ల ప్రపంచ వాణిజ్యానికి ఒక ముఖ్య సవాలుగా పరిణమించింది. ఇవాళ యూరోపియన్ యూనియన్, చైనా, రష్యా సామ్రాజ్యవాదాలకు అమెరికా అధ్యక్షుడు ట్రంప్ ప్రారంభించిన 'అమెరికా ఫస్ట్' విధానం తీవ్ర సమస్య అయింది. దావోస్ సమావేశాలకు బయలుదేరడానికి కొద్ది రోజుల ముందే కొన్ని సరుకుల దిగుమతులపై భారీ సుంకం విధించడం ద్వారా తాను వెనక్కి తగ్గేది లేదని ట్రంప్ చాటి చెప్పాడు. ఇందుకోసం అధ్యక్షుడు చాలా అరుదుగా ప్రయోగించే వాణిజ్య చట్టాన్ని దుమ్ము దులిపి ట్రంప్ వెలికి తీశాడు. విదేశీ దిగుమతుల వల్ల దేశీయ తయారీదార్లకు 'తీవ్ర గాయం' తగిలినట్లయితే వాటిపై భారీ సుంకం విధించవచ్చన్నదే ఆ చట్టం సారాంశం. నాఫ్టా, ఆసియాన్, డబ్ల్యుటిఒ మొదలైన బహుళ పక్ష ఒప్పందాల సహాయంతో అమెరికా, ఐరోపాలు మూడో ప్రపంచ దేశాలను అదిరించి, బెదిరించి కొల్లగొట్టడం సజావుగా సాగినన్నాళ్లూ ఈ చట్టం అవసరం అమెరికాకు రాలేదు.

2008 ప్రపంచ ఆర్థిక సంక్షోభం దరిమిలా అమెరికా ఆర్థిక శక్తి వేగంగా క్షీణించింది. చైనా ఆర్థిక శక్తి వేగంగా వృద్ధి చెందుతోంది. ఉక్రెయిన్-క్రిమియా పరిణామాలను సాకుగా చూపిస్తూ అమెరికా రష్యాపై విడతలు విడతలుగా వాణిజ్య ఆంక్షలు విధించింది. జర్మనీ, ఫ్రాన్స్, బ్రిటన్ తదితర ఇయు దేశాలు రష్యా నుంచి దిగుమతి చేసుకుంటున్న ఇంధనం (చమురు, గ్యాస్) ప్రయోజనాలకు విఘాతం ఏర్పడింది. దాంతో అమెరికా ఇయుల మధ్య వైరుధ్యాలు తీవ్రం అయ్యాయి. సిరియా యుద్ధంలో రష్యా జోక్యంతో అమెరికాకు పరాభవం ఎదురయింది. ఫలితంగా సిరియాను మూడు ముక్కలు చేసి, మధ్య ప్రాచ్యంలో ఇరాన్ ప్రభావాన్ని తగ్గించి, సౌదీ అరేబియా-ఇజ్రాయిల్ ప్రభావాన్ని పెంచి తన చమురు, గ్యాస్ వాణిజ్యాన్ని పెంచుకోవాలన్న అమెరికా సామ్రాజ్యవాద లక్ష్యం నెరవేరలేదు.

చైనా, రష్యాలు ఉమ్మడిగానూ, విడివిడి గానూ అమెరికా డాలర్ ఆధిపత్యాన్ని గండి కొడుతున్నాయి. చైనీయ కరెన్సీ యువాన్ అంతర్జాతీయ పెట్రోల్ వాణిజ్యంలో ఫ్యూచర్ కాంట్రాక్టుల్లో అడుగు పెట్టడం ద్వారా పెట్రో యువాన్‌కు నాంది పలికింది. పెట్రో రూబుల్‌కూ ఏర్పాట్లు జరుగుతున్నాయి. దరిమిలా పెట్రో డాలర్ పెత్తనం పతనమయ్యేందుకు తొలి అడుగులు పడ్డాయి. అమెరికా ఆర్థిక ఆధిపత్యానికి చివరి రక్షణ దుర్గంగా నిలిచిన పెట్రో డాలర్ క్షీణిస్తే అమెరికా సైనికాధిపత్య దుష్కృత్యాలకు, యుద్ధాలకు ద్రవ్య వనరులు కొడిగడతాయి. ఇప్పటికే అమెరికా మాటకు అటు ఐరాస భద్రతా సమితిలోనూ ఇటు డబ్ల్యుటిఓ లోనూ విలువ పడిపోయింది. అమెరికాకు ఎదురు మాట్లాడడానికి ఇయు దేశాలు వెరవడం లేదు. అమెరికా ఆధిపత్యంలోని ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్‌లకు ప్రత్యామ్నాయంగా చైనా ఆసియా ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంక్ (ఏఐఐబి) స్థాపించగానే ఈయూ దేశాలు పోలోమంటూ వెళ్లి అందులో సభ్యత్వం తీసుకున్నాయి. ఏఐఐబిలో చేరడానికి వీలు లేదన్న అమెరికా హెచ్చరికలను అవి బేఖాతరు చేశాయి.

ప్రధాని నరేంద్ర మోడీ ఈసారి దావోస్ ప్లీనరీల్లో ప్రారంభోపన్యాసం చేస్తూ విదేశీ పెట్టుబడులకు భారతదేశం ఎంత అనుకూలంగా ఉందో వివరించారు. చంద్రబాబునాయుడు, తెలుగు రాష్ట్రాల మంత్రులు లోకేష్, కెటిఆర్‌లు మా రాష్ట్రాలకు రారండని దావోస్‌లో చేరిన పెట్టుబడిదారులకు ఆహ్వానం పలికారు. పెట్టుబడులకు తమ దేశం, రాష్ట్రాలు సానుకూలమని ప్రదర్శనలు ఇచ్చారు. కానీ పెట్టుబడిదారులు ఎప్పుడూ బ్రతిమాలితేనో, రమ్మని ఆహ్వానం పలికితేనో రారు. వారికి లాభాలు గడించే వాతావరణం ఉంటే వస్తారు. భూములను పెట్టుబడిదారులకు ధారాదత్తం చేయడం, కార్మికులకు తక్కువ వేతనాలు, కనీస హక్కుల లేమి, పని భారం ఇవన్నీ పెట్టుబడిదారులు కోరుకునే విధానాలు. పెట్టుబడుల కోసం ఎంతటి ప్రజావ్యతిరేక విధానానికైనా వెనుకాడబోమని మన పాలకులు దావోస్‌లో అంతర్జాతీయ పెట్టుబడిదారుల ముందు ఏకరువు పెట్టడం శోచనీయం. మన దేశంలో తమ ప్రభుత్వం అనుసరిస్తున్న సరళీకృత ఆర్థిక విధానాలను, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను సానుకూల పరిచేందుకు తీసుకున్న విధాన నిర్ణయాలను వివరించేందుకు ప్రధాని మోడీ ఆదానీ, అంబానీ వంటి పలువురు పేరొందిన పారిశ్రామిక వేత్తలను వెంటబెట్టుకుని పెద్ద బృందంతో దావోస్ వెళ్లడం గమనార్హం.

దావోస్ సమావేశంలో తెలంగాణ ప్రభుత్వం తొలిసారిగా పాల్గొంది. తెలంగాణ ఐటి, వాణిజ్యం, పరిశ్రమల శాఖ మంత్రి కెటిఆర్ నాయకత్వాన ఒక ప్రతినిధి బృందం డబ్ల్యుఇఎఫ్ సమావేశంలో పాల్గొంటుందని తెలంగాణ ప్రభుత్వం ప్రకటించింది. సులభ వ్యాపార సౌలభ్య సూచీలో తెలంగాణ భారత్‌లో మొదటి స్థానంలో ఉంది. ప్రపంచ వ్యాపార ఔత్సాహిక వ్యాపారవేత్తల సదస్సు కూడ ఇటీవలనే హైద్రాబాద్‌లో జరిగింది. తెలంగాణ ప్రభుత్వం ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనాను అమలు చేయడంలో ముందుంది. వనరులను దోచుకోవడానికి దేశీయ,

విదేశీ పారిశ్రామిక వేత్తలకు స్వాగతం పలుకుతుంది. ఈ దళారి తనాన్ని మరింత విస్తృతపరచుకోవడానికి డబ్ల్యుఇఎఫ్ సదస్సుకు కెటిఆర్ నాయకత్వంలో ఒక బృందాన్ని తెలంగాణ ప్రభుత్వం పంపిందని గుర్తించాలి. దావోస్‌లో బహుళజాతి సంస్థల ప్రతినిధులతో చర్చలు జరిపింది. ఆ సమావేశాల్లో తెలంగాణ ప్రతినిధి బృందం తెలంగాణలో పెట్టుబడులు పెట్టమని ఆహ్వానిస్తూ పెట్టుబడిదారులకు ఎర్ర తివాచీ పరిచింది. తెలంగాణ వనరులు దోచుకోవడానికి ఏలాంటి అడ్డంకులు లేవని నిస్సిగ్గుగా వ్యక్తం చేసింది.

ప్రధాని మోడీ.. దావోస్‌లో ప్రపంచ ఆర్థిక వేదిక మీదనుంచి ప్రసంగిస్తూ 'భారత్ అంటేనే వాణిజ్యం' అన్నారు. తాను అధికారం చేపట్టిన మూడున్నరేళ్ల కాలంలో దేశాన్ని హిందూత్వ దిశగా ఈడ్చుకుపోవడానికీ, కార్పొరేట్‌శక్తుల పరం చేయడానికి అన్ని రకాలుగా దిగజారిన మోడీ ఇటువంటి నిర్వచనం కాకుండా మరోటి ఇస్తారను కోవడం మన భ్రమే, రాజ్యాంగ స్ఫూర్తికీ, ప్రజాస్వామ్య విలువలకూ పూర్తి భిన్నమైన పంథాలో పాలన సాగిస్తూ దేశ ఆర్థిక వ్యవస్థను సంపన్నుల ఖజానాగా మార్చేందుకు నానా తంటాలు పడుతున్న పాలకుడికి ఇంత కన్నా గమ్యం, గమనం ఏముంటుంది? 'పెట్టుబడులకు గమ్యస్థానం భారతదేశం, ఆరోగ్యంతో కూడిన సంపద, సౌభాగ్యంతో కూడిన శాంతి కోరుకునేవారు భారతదేశం రావాలి'. అంటూ మోడీ అంతర్జాతీయ పెట్టుబడిదారుల ముందు సాగిల పడ్డారు. మరోవైపు తాము 'సమ్మిళిత వృద్ధి' పంథా అనుసరిస్తున్నామని ప్రధాని చెప్పినప్పటికీ, ఆక్స్‌ఫామ్, డబ్ల్యువెల్త్ నివేదికలు భారత్‌లో పెరుగుతున్న ఆర్థిక అంతరాలను ఎత్తిచూపాయి. దావోస్‌లో పెట్టుబడిదారుల చర్చలు అధిక లాభాల గురించే తప్ప ఆర్థిక అసమానతల గురించి ఉండవు.

ఇవాళ ప్రపంచం ముందు ప్రధానంగా మూడు సవాళ్లున్నాయని వాటిని దేశాలన్నీ ఐక్యంగా ఎదుర్కోవాలని మోడీ దావోస్ ప్లీనరీ సభలు ప్రారంభిస్తూ చెప్పారు. ఉగ్రవాదం, ప్రపంచ వాణిజ్యంలో స్వీయ రక్షణ విధానాలు, పర్యావరణ విధ్వంసకర విధానాలు. ఈ మూడిటిపై ఐక్యంగా పోరాడాలని ఆయన పిలుపునిచ్చారు. కానీ ఈ మూడింటినీ పెంచి పోషిస్తున్నదెవరు? ప్రపంచంలో ఉగ్రవాదానికి బీజాలు వేసింది అమెరికా విస్తరణవాద విధానాలు కాదా? అఫ్ఘనిస్తాన్‌లో సోవియట్ ప్రాబల్యాన్ని ఎదుర్కొనే నెపంతో వచ్చి మతోన్మాద తాలిబన్లను పెంచి పోషించింది అమెరికా కాదా? ఎక్కడో సౌదీలో వ్యాపారం చేసుకుంటున్న అల్ ఖైదా నాయకుడు బిన్ లాడెన్‌ను ప్రోత్సహించి, పెంచి పోషించింది అమెరికా కాదా? ఒకప్పుడు ఆధునికతవైపు ఒడివడిగా అడుగులు వేస్తున్న అఫ్ఘనిస్తాన్ నేడు తాలిబాన్ల కేంద్రంగా మారడానికి అమెరికా సామ్రాజ్యవాద విస్తరణవాదం కారణం కాదా?

ఇరాక్, సిరియాలలో ఐఎస్ఐ ఉగ్రవాదం పుట్టి, పెరిగి, విస్తరించడానికి కారణం ఎవరు? మధ్య ప్రాచ్యంలో ఒకనాడు ఇరాక్, సిరాయా, లిబియాలు సెక్యులర్ భావాలకు నిలయాలుగా ఉండేవి. అమెరికా ఆధిపత్య కాంక్షతో ఆ దేశాలపై దాడిచేసి అక్కడి జాతుల మధ్య, ముస్లింలను షియా, సున్నీలుగా విడదీసి చిచ్చుపెట్టడమే నేడు ఆ దేశాలు ఉగ్రవాద ఉత్పత్తి కేంద్రాలుగా మారిపోవడానికి అమెరికా కారణం కాదా? అటువంటి అమెరికా విధానాలపై పోరాడకుండా ఉగ్రవాదంపై పోరాడడం ఎలా సాధ్యం? ఒకవైపు అమెరికాతో స్నేహాన్ని మరింత పెంచుకుంటూ, ఆసియాలో దాని విస్తరణవాద వ్యూహంలో జూనియర్ భాగస్వామిగా మారుతూ మరోవైపు ఉగ్రవాదంపై పోరాటం చేస్తామంటే నమ్మేంత అమాయకులు ఎవరు లేరు. ఎటువంటి శషభిషలు లేకుండా అమెరికాకు దగ్గరవుతున్న మోడీ నోట ఈ మాటలు వెలువడడం ఆశ్చర్యకరంగా కనిపించవచ్చు. కానీ వివిధ సామ్రాజ్యవాద యజమానుల మధ్య బేరాలు సాగిస్తూ లబ్ధి పొందే దళారీ పెట్టుబడిదారీ వర్గం ప్రతినిధులకు ఇదేమీ కొత్తకాదని గ్రహించాలి.

పర్యావరణ విధ్వంసం నుండి ప్రపంచాన్ని కాపాడాలని ప్రధాని బాగానే పిలుపునిచ్చారు. కానీ నేడు పర్యావరణాన్ని నాశనం చేస్తున్నది ఎవరు? ప్రపంచ పర్యావరణ చర్చలకు మోకాలడ్డుతున్న దెవరు? ప్రపంచ జనాభాలో 5 శాతం గలిగిన అమెరికా ప్రపంచ వనరుల్లో 25 శాతం ఉపయోగిస్తున్నది. వాతావరణ కాలుష్యంలో 25 శాతం వాటా దానిదే. కానీ మూడు శాతం వాటా కూడా లేని చైనా, భారత్‌పై నెపాన్ని నెట్టేస్తూ, అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ ప్యారిస్ వాతావరణ చర్చల నుండి వైదొలిగాడు. దాంతో ఆ చర్చల ప్రక్రియే కుప్ప కూలిపోయింది. ఒకవైపు భూగోళం కాలుష్యం వల్ల తీవ్రమైన ప్రమాదం ఎదుర్కొంటుంటే మరోవైపు ట్రంప్ అటువంటి ప్రమాదాన్ని మరింత పెంచే చర్యలు చేపట్టారు. అటువంటి ట్రంప్ చర్యలను ఖండించి ఆయన విధానాలకు వ్యతిరేకంగా పోరాడకపోగా, ఆయనతో గాఢాలింగనం చేసుకుంటూ మరోవైపు పర్యావరణ విధ్వంసకులపై పోరాడతామని మోడీ ప్రసంగించడం ఎవరిని మోసగించడానికి?

ప్రధాని ఏ దేశం పేరెత్తకుండానే, సంపన్నదేశాల ఆర్థిక ధోరణులను తప్పు పట్టారు. స్వేచ్ఛాయుత వ్యాపారాన్ని సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక సిద్ధాంతంగా ప్రపంచంపై విధించిన దేశాలే ఇవాళ స్వప్రయోజనాలు చూసుకుంటూ స్వీయ రక్షణాత్మక (ప్రొటెక్షనిజం) విధానాల్లోకి మరలడాన్ని ఆయన ప్రశ్నించారు. అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ స్వీయ రక్షణాత్మకత విధానాల వల్ల 'ప్రపంచీకరణ కుదించుకుపోతున్నది. అటువంటి ధోరణి టెర్రరిజం, వాతావరణ మార్పు ప్రమాదాల కన్నా తక్కువేమీ కాదని' వ్యాఖ్యానించారు. అమెరికా బహుళజాతి కంపెనీలు ప్రపంచ దేశాలను కబళిస్తుంటే మరోవైపు తమ దేశంలో నిరుద్యోగానికి స్వేచ్ఛా వాణిజ్యమే కారణమంటూ ట్రంప్ వర్ధమాన దేశాలకు వ్యతిరేకంగా అనేక చర్యలు తీసుకుంటున్నారు. ఈ విధానాల వల్ల పెద్దగా నష్టపోతున్న దేశాల్లో భారత్ ఒకటి. భారతీయ సాఫ్ట్‌వేర్ పరిశ్రమలపైనా ఉద్యోగులపైనా కక్ష కట్టినట్లు ట్రంప్ తీసుకుంటున్న చర్యలను మౌనంగా చూస్తున్న మోడీ అంతర్జాతీయంగా అమెరికాతో భాగస్వామ్యమే తన విదేశాంగ విధానంగా వ్యవహరించడం విడ్డూరం కదూ!

ప్రపంచ ఆర్థిక సదస్సును మోడీ ప్రారంభించడం దేశానికి దక్కిన అరుదైన గౌరవమని కొందరు బిజెపి నేతలు గొప్పలకు పోతున్నారు. వాస్తవానికి ప్రపంచీకరణ భవిష్యత్తుపై నీలినీడలు అలముకున్నాయి. ఈ నేపథ్యంలో బడా పారిశ్రామికవేత్తల కన్ను భారతీయ మార్కెట్‌పై పడడం సహజం. ప్రపంచంలోనే చైనా తర్వాత రెండో అతిపెద్ద మార్కెట్ మనదే. ఏయే దేశాల మార్కెట్లు, వనరులు తమకు కావాలో ఆయా దేశాల నేతలను మునగ చెట్టు ఎక్కించడం కార్పొరేట్లకు బాగా తెలుసు. అందువల్లనే వారిని ఆహ్వానించి, దళారులుగా మార్చడానికి అంతర్జాతీయ రాబందులు ఆ దేశాల మీద వాలడానికి ఎత్తులు వేస్తారు. ఇంత పెద్ద జనాభా ఉన్న దేశాన్ని ఏ వాణిజ్యవేత్త వద్దనుకోగలడు? అందుకే అంతర్జాతీయ వాణిజ్యంలో మన దేశాన్ని లక్ష్యంగా చేసుకోవడం,

దావోస్‌లో మోడీని గౌరవించడం వంటి తంతు కొనసాగింది. ప్రపంచ ఆర్థిక సదస్సు ప్రారంభోత్సవ గౌరవం దక్కడం మనకు ఇది తొలిసారి కాదు. రెండు దశాబ్దాల కిందటనే అప్పటి ప్రధాని దేవెగౌడకు మొదటగా ఈ గౌరవం దక్కింది. అంతర్జాతీయ వాణిజ్యవేత్తలకు కావల్సింది ప్రధాని ఎవరన్నది కాదు... కేవలం మార్కెట్ మాత్రమే. ఈ వేదిక మీదనుంచి ప్రధాని మోడీ 'లైసెన్స్, పర్మిట్ రాజ్‌ను పూర్తిగా తొలగించాలని మేం నిర్ణయించాం. ఇప్పుడు రెడ్‌టేప్ (బ్యూరోక్రటిక్ అవరోధాలు) స్థానంలో రెడ్ కార్పెట్ పరుస్తున్నాం'. అంటూ విదేశీ పెట్టుబడులకు ద్వారాలు బార్లా తెరచిన వైనాన్ని ప్రధాని వివరించారు.

'బహుళత్వమే భారత్ బలం, ప్రజాస్వామ్యం , వైవిధ్యం కలిగి ఉన్న భారత్ మాకు ఎంతో గర్వకారణం' అని మోడీ అదే ప్రసంగంలో చెప్పారు. కానీ ఆయన పరివారం మాత్రం దేశంలో బహుళత్వాన్ని ధ్వంసం చేయడానికీ, ప్రజాస్వామ్యాన్ని నాశనం చేయడానికీ చేయని దుర్మార్గం లేదు. ఆయన ప్రసంగిస్తున్న సమయంలోనే ఆర్ఎస్ఎస్ మద్దతుతో కర్ణిసేన మూకలు బిజెపి పాలిత రాష్ట్రాల్లో పద్మావత్ సినిమాకు వ్యతిరేకంగా థియేటర్లను ధ్వంసం చేశాయి. నగరాలు, పట్టణాల్లో విధ్వంసం సృష్టిస్తున్నాయి. భావ ప్రకటనా స్వేచ్ఛపై దాడులకు దిగుతున్నాయి. మోడీ ప్రసంగానికి గొప్ప కితాబులిస్తున్న కార్పొరేట్ మీడియా ఆయన ప్రభుత్వమూ, పార్టీ చేస్తున్న నిర్వాకాలను కప్పిపుచ్చాలనుకుంటున్నా ప్రజలు గ్రహిస్తున్నారు. ఈ గోముఖ వ్యాఘ్ర విధానాలను తిప్పి కొడతారు. ఎవరినైనా గంభీరమైన ఉపన్యాసాలతో కాక ఆచరణ చూసి అంచనా కట్టాలి. ఈ విషయంలో మోడీ వ్యవహారం చెప్పేదొకటి, చేసేదొకటిగానే మొదటినుండీ ఉంటోంది. ఇంటా బయటా ఆయన వ్యవహారశైలి అదే.

భావోద్వేగ ప్రసంగాలతో పెట్టుబడులు రావన్న వాస్తవం ఆయనకు తెలియందేమీ కాదు... వాస్తవానికి ప్రపంచీకరణతో లబ్ధిపొందిన దేశాల కంటే నష్టపోయిన దేశాలే ఎక్కువ. కొన్ని దశాబ్దాల పాటు ప్రపంచీకరణను ముందుండి నడిపించిన అమెరికానే దీనివల్ల ఎక్కువ లబ్ధి పొందింది. కేవలం ద్రవ్య పెట్టుబడి కుప్పలు తెప్పలుగా వచ్చిపడుతున్న కారణంగా భారత్ వంటి వర్ధమాన దేశాలు ప్రపంచీకరణను స్వాగతించాయి. ఫలితంగా మేలు కంటే కీడే ఎక్కువ జరిగింది. రక్షణ అవసరమైన దేశీయ చిన్న, మధ్యతరహా పరిశ్రమలు దెబ్బతిన్నాయి. మార్కెట్లను బార్లా తెరవడం ద్వారా పర్యవసానాలేమిటో భారత్‌కు అనుభవపూర్వకంగానే తెలిసివచ్చింది. లక్షల సంఖ్యలో ఉద్యోగాలు ఊడిపోయాయి. ఆర్థిక అంతరాలు అసాధారణంగా పెరిగిపోయాయి. ఆదాయంలో వ్యత్యాసాలు తీవ్రంగా ఉన్నాయి. దేశ సంపద 80 శాతం కేవలం ఒక శాతం జనాభా చేతుల్లోనే కేంద్రీకృతమైంది.

అంతర్జాతీయ పెట్టుబడులు, దేశీయంగా బ్యాంకులు సమకూర్చుతున్న పెట్టుబడులూ దేశంలోని ఒక అతిచిన్న వర్గాన్ని అంతర్జాతీయ కుబేరుల జాబితాల్లోకి ఎక్కించడానికి మాత్రమే దోహద పడుతున్నాయి. ఒక్క ఏడాదిలో వీరి ఆదాయం రు. 5 లక్షల కోట్లు పెరిగింది. వీరి మొత్తం సంపద 20.5 లక్షల కోట్లు. మనదేశంలోని 67 కోట్ల ప్రజల ఆదాయం కేవలం ఒక్కశాతం పెరిగిందన్న విషయం ఆక్స్‌ఫామ్ అధ్యయనంలో తేలింది. విద్య, వైద్యరంగాలు ప్రైవేటు శక్తుల చేతుల్లోకి వెళ్లిపోయి భిన్న సామాజిక వర్గాల మధ్య అసమానతలను మరింతగా పెంచుతున్నాయి. ప్రజాస్వామ్యం అనే పదానికి అర్థాన్నే మార్చేస్తూ మోడీ పాలన సాగుతున్నది. ప్రజలు రక్షిత విధానాలను అనురిస్తున్న దశలో బిజెపి సర్కారు మాత్రం ప్రపంచీకరణ కోసం వెంపర్లాడుతున్నది. సంపద కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతం అవుతున్నప్పుడు ప్రజల జీవన ప్రమాణాలు ఎలా పెరుగుతాయి. ఈ ఆర్థిక అసమానతలే నేటి ప్రపంచ పెట్టుబడిదారీ సంక్షోభానికి కారణం.

మోడీ అధికారంలోకి వచ్చిన తర్వాత పెట్టుబడులను ఆకర్షించేందుకు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైన మాట వాస్తవం. మేక్ ఇన్ ఇండియా, స్కిల్ ఇండియా, ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్, కార్మిక సంస్కరణలు... ఇలా ఏ చర్యలు చేపట్టినా మోడీ సర్కారు పెట్టుబడులను ఆకర్షించలేకపోయింది. ఉపాధి అవకాశాలు పెరగలేదు. అనేక వాణిజ్య ఒప్పందాలు నిలిచిపోయాయి. పెట్టుబడులు అనేకరంగాల్లో తగ్గుతున్నాయి. నిజంగా ఇది అభివృద్ధా లేక సమాజ పతనం ఆరంభమా? అంటే దావోస్ సదస్సు ఒకరోజు ముందు వెలువరించిన ఆక్స్‌ఫామ్ నివేదికే ప్రత్యక్ష నిదర్శనం. అయినా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అభివృద్ధి నమూనానే పట్టుకొని వెంపర్లాట ఎందుకు అనే ప్రశ్న సామాన్యులకు కలుగుతున్నది. తాము సమ్మిళిత అభివృద్ధి పంథా అనుసరిస్తున్నామని మోడీ ఈ వేదిక మీదగా చెప్పడం పచ్చి అబద్ధాన్ని వల్లించడమే తప్ప వేరేమీ కాదు.

దేశంలోని బాలలు, మహిళలకూ పౌష్టికాహారం లోపించిందని కేంద్ర ప్రభుత్వ ఆర్థిక గణాంక శాఖ తాజాగా ప్రకటించిన గణాంకాలు తేల్చి చెప్పాయి. ప్రధాని మరోమాట కూడా అన్నారు... ఆధునిక సమాజంలో షేరింగ్ తప్ప కేరింగ్ లేదని. నిజమే.. ఆయనకు హిందూత్వ భావజాలన్నీ, బిజెపికి అధికారాన్ని షేరింగ్ చేయడం తప్ప ప్రజలు ముఖ్యంగా పేదల గురించిన కేరింగ్ లేదన్నది ఈ మూడున్నరేళ్ల పాలన స్పష్టం చేస్తున్నది. వాస్తవానికి మోడీకి, దావోస్ సదస్సులో పాల్గొంటున్న పారిశ్రామిక వేత్తలకు, పెట్టుబడిదారీ దేశాలకు కావాల్సింది భారతదేశంలోని సామాన్య మనిషి కాదు, మధ్యతరగతి వర్గాల మార్కెట్టే! అందుకే ప్రపంచ ఆర్థిక వేదికలో, మోడీ చేసిన ప్రసంగంలో ఎక్కడా సగటు మనిషికి స్థానం లేకుండా పోయింది. ఆయన ఈ సదస్సులో ఎన్ని అంశాలు లేవనెత్తినా, ఎంత ఉద్వేగంతో ప్రసంగించినా.. పెట్టుబడిదారుల గురించే తప్ప, పెరుగుతున్న అంతరాలను తగ్గించడానికీ, ఆదాయంలో అసమానతలు తొలగించడానికి మాత్రం ఉపయోగపడదన్నది నిర్వివాదాంశం.

"వరల్డ్ ఎకనమిక్ ఫోరం అంటే ప్రపంచ పాలకవర్గాల, శిష్టవర్గాల ఇచ్చిపుచ్చుకునే వ్యవహారాలు నడిపే వేదిక. బ్యాంకర్లు, పారిశ్రామికవేత్తలు, పెత్తందారీ గుత్త వ్యాపార సంస్థలు, సాంకేతిక నిపుణులు, రాజకీయవేత్తలు కలగలిసిన దళారులు, దోపిడీవేత్తలు ఒకరికొకరు పరిచయం చేసుకునే వేదిక అది. వాళ్లు ఉమ్మడి అభిప్రాయాలను గౌరవించుకుంటారు. ఉమ్మడి ప్రయోజనాలను నెరవేర్చుకుంటారు. కాకపోతే అవి వారి ఉమ్మడి వాణిజ్య ప్రయోజనాలు మాత్రమే" అని నెదర్లాండ్స్‌లోని ఆమ్‌స్టర్‌డామ్‌కు చెందిన ప్రపంచీకరణ విశ్లేషణ సంస్థ ట్రాన్స్ నేషనల్ ఇన్‌స్టిట్యూట్ వ్యాఖ్యానించింది. వరల్డ్ ఎకనమిక్ ఫోరమ్ విధానాలకూ, చర్చలకూ, పనితీరుకూ సామాజిక ప్రభావం ఏమిటో అధ్యయనం చేసిన జర్నల్ ఆఫ్ కన్స్యూమర్ రిసర్చ్, ఈ వరల్డ్ ఎకనమిక్ ఫోరమ్ దారిద్ర్యం, గ్లోబల్ వార్మింగ్, అనారోగ్యం, రుణభారం నిరుద్యోగం వంటి ప్రధాన సమస్యలలో ఏ ఒక్కదాన్నీ పరిష్కరించలేదని, పరిష్కరించజాలదని నిర్ధారించింది. ప్రజల దైనందిన సమస్యలను మసిపూసి మారేడుకాయ చేయడం తప్ప సమస్యలను పరిష్కరించడం కాదు. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# ఇరాన్‌లో ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలు

***ఇరాన్ ప్రజలు నిరంకుశ, దళారీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తీవ్ర పోరాటం చేస్తున్నారనీ, మతమౌఢ్యాన్ని నిలువరించే శక్తులు మరింత దృఢంగా నిలబడితే ప్రపంచ ప్రగతిశీల రాజకీయ శక్తులకు ఉత్సాహాన్ని ఇస్తుందని అంటున్నారు** **బైరెడ్డి సతీష్***

**2017**, డిసెంబర్ చివరి రోజుల్లో ఇరాన్ రెండవ అతిపెద్ద నగరమైన మషాద్‌లో ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలు ప్రారంభం అయినాయి. ఇరాన్ సుప్రీం లీడర్ అయిన అయోతుల్లా ఖొమైనీ స్వంత నగరం కూడా మషాదే! గుడ్ల ధరలు పెరగడం ఈ నిరసన ప్రదర్శనలకు తక్షణ కారణంగా కన్పించినా అంతకంటె లోతైన, విస్తృతమైన ప్రజా జీవితపు అంశాలు అనేకం కలగలసి ప్రజల్ని అనివార్యంగా వీథుల్లోకి నెట్టాయి. మషాద్‌తో మొదలైన ప్రదర్శనలు దేశంలోని చిన్న పెద్ద పట్టణాలకు వేగంగా వ్యాపించి ప్రపంచ దృష్టిని ఆకర్షించినవి. అసలే అసమ్మతిని, నిరసనను సహించని ఇరాన్ ప్రభుత్వం ఈ వ్యతిరేకతను అణచివేసే చర్యలను చేపట్టడంతో 23 మందికి పైగా ప్రదర్శనకారులు ప్రాణాలు కోల్పోయారు. వందలాది మందిని అరెస్ట్ చేసింది ప్రభుత్వం. దాదాపు దశాబ్ద కాలం క్రితం 2009లో అరబ్బు ప్రపంచంలో వెల్లువెత్తిన తిరుగుబాట్ల నేపథ్యం, అతివాదిగా ముద్రపడిన అహ్మద్ నెజాద్ రెండవ సారి ఇరాన్ అధ్యక్షుడిగా ఎన్నికైన సందర్భంలో కూడా ఆయన ఎన్నికను వ్యతిరేకిస్తూ ఇటువంటి ప్రదర్శనలే చోటు చేసుకున్నాయి. ఆనాడు అవి పూర్తిగా పాశ్చాత్య దేశాల ప్రోత్బలంతో, ప్రోత్సాహంతో ఎగువ మధ్య తరగతి వర్గాల భాగస్వామ్యంలో 'ప్రభుత్వాల మార్పు' (రెజీమ్ చేంజ్ పాలసీ) విధానంలో భాగంగానే గ్రీన్ రెవల్యూషన్‌గా పిలువబడిన 'తిరుగుబాటు' జరిగింది. నాటి నేటి ప్రజా తిరుగుబాట్ల మధ్య మౌళికమైన వ్యత్యాసం ఉన్నది. నాడు అధ్యక్ష ఎన్నికను వ్యతిరేకించే ముసుగులో పాశ్చాత్య ఎజెండా అయిన ప్రభుత్వ మార్పు ప్రధాన అంశంగా ఉంటే, నేడది మొత్తంగా వ్యవస్థనే ప్రశ్నించే స్వభావంతో కూడుకొని ఉన్నది. పెరుగుతున్న నిరుద్యోగం, ఉద్యోగాల కుదింపు, వేతనాలు చెల్లించక పోవడం, ప్రభుత్వ రంగ సంస్థల ప్రైవేటీకరణ ఫలితంగా కార్మికులు ఉద్యోగాలు కోల్పోవడం, లక్షలాది ఇరానియనులు కష్టపడి సంపాధించిన సొమ్మును దాచుకున్న ఎటువంటి ప్రభుత్వ నియంత్రణ లేనటువంటి ఆర్థిక సంస్థలు కొల్లగొట్టడం, మెడికల్ ఇన్సూరెన్స్ బిల్లులు కూడా చెల్లించకపోవడం, ఆయిల్ కార్మికుల, ట్రక్ డ్రైవర్ల వేతనాల చెల్లింపులో విపరీత జాప్యం, బోనస్‌లు చెల్లించకపోవడం లాంటి అనేక కారణాలు కార్మిక లోకం కదం తొక్కడానికి దోహదపడినవి. వీటికి తోడు తాజా బడ్జెట్ ప్రతిపాదనల్లో పొదుపు చర్యలు, ధరల పెరుగుదల, విదేశీ పెట్టుబడుల ఆకర్షణ కోసం ప్రపంచ బ్యాంక్, ఐఎమ్ఎఫ్ సలహాల మేరకు వారికి తాయిలాలు ప్రకటించి, సామాజిక పథకాల కెటాయింపుల పైన కోత విధించడం, వివిధ నిత్యావసర, ఆహార పథకాలకింద కింది వర్గాలకు నగదు రూపంలో అందాల్సిన సబ్సిడీలు అందకపోవడం వంటివన్నీ ప్రజాగ్రహాన్ని మరింతగా పెంచి ప్రభుత్వ వ్యతిరేకత దేశమంతా వ్యాపించేలా, తీవ్రమయ్యేలా దోహదపడ్డాయి. 2009 నాటి అధ్యక్ష వ్యతిరేక తిరుగుబాటులో ఎగువ మధ్య తరగతిది కీలక పాత్ర అయితే నేడది ఉన్నత విద్యావంతులైన యువత, కార్మిక వర్గం పాటు కింది వర్గాలు ప్రధానంగా ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలు జరిగినవి.

నిర్మాణాత్మక దృష్టితో, నిర్దిష్టమైన భావజాలంతో, స్పష్టమైన లక్ష్యంతో ఈ ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలు జరగకపోయినప్పటికీ ఇరాన్ సమాజంలో వ్యవస్థీకృతమైన ఆధిపత్యానికి, సామాజిక అసమానతలకు వ్యతిరేకంగా ఒక స్పష్టమైన సంకేతం మాత్రం వెలువడింది. ఈ ప్రదర్శనలకు ప్రజల్ని సన్నద్ధం చేయడంలో సామాజిక మాధ్యమాలది అత్యంత కీలక పాత్ర. ఈ మాధ్యమాల వేదికగా తీవ్రమైన చర్చలు, విస్తృతమైన ప్రచారం, అత్యంత వేగంగా సమాచారం చేరిపోవడం, ప్రభుత్వ నియంత్రణ ఈ మాధ్యమాలపై పూర్తి స్థాయిలో లేకపోవడంతో ప్రజలు సంఘటిత పడడానికి, ప్రదర్శనల్లో భాగస్వామ్యం పొందడానికి వీలయింది. మొత్తం 81 మిలియన్‌ల ఇరాన్ జనాభాలో 60 శాతం మంది 30 ఏళ్ల లోపు వారే! 40 శాతం పైగా నిరుద్యోగం ప్రబలింది. ది వరల్డ్ వెల్త్ అండ్ ఇన్కమ్ డేటాబేస్ వారి అంచనా ప్రకారం 1 శాతం ఇరానీ ఉన్నత వర్గం మొత్తం దేశం సంపదలో 16.3 శాతం ఇంకా 10 శాతం ఉన్నత వర్గం 48.5 శాతం సంపదని తమ చేతుల్లోకి తెచ్చుకుందని తేల్చింది. ఇస్లామిక్ రాజ్యానికి నేటి తరానికి మధ్య ఎడబాటు పెరుగుతూ వచ్చింది. పట్టణీకరణ పెరగడం, ఉన్నత విద్య విస్తరించడం విశ్వవిద్యాలయాల్లో ఉన్నత చదువు చదివిన వారి సంఖ్య పెరగడం సాటిలైట్ టీవీ, ఇంటర్నెట్ అందుబాటులోకి రావడం ద్వారా వివిధ రకాల భావజాలాల పరిచయం కావడం , ప్రపంచ దేశాల పరిణామాల గ్రహింపు మాత్రమే కాకుండా ప్రభావితం కూడా అవుతున్నారు. అలా అని విశ్వవిద్యాలయాల్లో చదివిన యువ వర్గమంతా తిరుగుబాటు స్వభావాన్ని ఏమి కల్గిలేదు. ఉన్నత వర్గాల నుండి వచ్చిన యువత పాశ్చాత్య ప్రభావంతో 'ప్రభుత్వాల మార్పు' ఎజెండాను ముందుకు తీసుకెళ్లే ప్రయత్నం చేస్తుంటే, అట్టడుగు వర్గాల నుండి కార్మిక వర్గాల నుండి వచ్చిన యువత స్పష్టమైన భావజాలం లేకపోయినా వ్యవస్థను ప్రశ్నిస్తూ సామాజికంగా, రాజకీయంగా వ్యవస్థీకృతమైన ఆధిపత్య విలువల్ని ధిక్కరిస్తూ సమూలంగా మార్పును కోరుతున్నది.

ఇరాన్ అణు సంబంధ కార్యక్రమాల బూచి చూపెట్టి అమెరికా ఒత్తిడితో ఐరాస ఆంక్షల నేపథ్యం, చమురు ధరలు పడిపోవడం, ప్రపంచ ఆర్థిక మాంద్యం ప్రభావంతో ఇరాన్ ఆర్థిక వ్యవస్థ కూడా దెబ్బతిన్నది. 2015లో ఒబామా అద్యక్షుడుగా ఉన్న కాలంలో అమెరికాతో చేసుకున్న అణు ఒప్పందం మూలంగా ఆంక్షలు తొలగిపోయి, చమురు ధరలు పెరుగుతున్న దశలో పరిస్థితి మెరుగు పడుతుందని ఆ దేశ పాలక వర్గాలు భావిస్తున్న తరుణంలోనే ట్రంప్ అధికారంలోకి రావడం ఆ

ఒప్పందాన్ని గుర్తించ నిరాకరించడంతో పరిస్థితి మొదటికొచ్చింది. అంతకుముందు ఏర్పడిన సాధారణ పరిస్థితిని అందిపుచ్చుకుని లాభపడింది ఇరాన్ ఉన్నత వర్గాలే. మళ్లీ దిగజారిపోతున్న ఆర్థిక వ్యవస్థను గాడిన పెట్టాలని చేసే ప్రయత్నాలు కూడా ప్రజల్ని అసంతృప్తికి గురి చేస్తున్నాయి. ఓ వైపు పొదుపు చర్యల వల్ల డబ్బు చేతికి రాకపోవడం, దాచుకున్న సొమ్మును ఏ నియంత్రణా లేని విత్తసంస్థల పాలవడం, నిత్యావసర వస్తువుల ధరలు పెరగడంతో ప్రజలకు తిరుగుబాటు తప్ప గత్యంతరం లేకపోయింది. పుండు మీద కారం చల్లినట్టుగా మత సంస్థలకి, మత అధికారులకి మరిన్ని వనరులు పెంచడం ప్రజలకు మరింత ఆగ్రహాన్ని తెప్పించింది. ఈ ప్రజాగ్రహ ప్రదర్శనల పట్ల రౌహాని ప్రభుత్వం కాస్త ప్రజాస్వామికంగానే స్పందించి ప్రజల నిరసన హక్కును గుర్తిస్తూ వారి న్యాయబద్ధ డిమాండ్లను అర్థం చేసుకుంటున్నట్టు ప్రకటించింది. కాని సుప్రీం కమాండర్ అయిన ఖొమైనీ మాత్రం ఈ 'అల్లర్ల'న్ని పాశ్చాత్య దేశాల ప్రేరేపితం అని ఇరాన్‌ను విచ్ఛిన్నం చేయాలని కుట్ర పన్నారని ప్రకటించడంలో వాస్తవం ఎంత అనేది పక్కకు పెడితే అది కొన్ని వర్గాలను సమ్మతింపచేసింది. దాని ఫలితం ప్రభుత్వ బల ప్రదర్శనగా దేశంలో సమాంతరంగా అనేక ప్రదర్శనలు చోటుచేసుకున్నాయి. జాతీయ బూర్జువా వర్గం ఈ ప్రదర్శనలకు నేతృత్వం వహించింది. మొత్తంగా మధ్య ప్రాచ్యంలో నెలకొన్న భౌగోళిక ఉద్రిక్తతల వల్ల ఖొమైనీ ఆరోపణలు కొట్టి పడేసేవి కాదన్నట్టుగా ఉన్నాయి!

మధ్య ప్రాచ్యంలో చారిత్రికంగా నెలకొని ఉన్న అనేక పరిణామాలు సున్నీ ప్రాబల్య సౌదీ అరేబియాకు, షియా దేశమైన ఇరాన్‌కు మధ్య వైరాన్ని పెంచి ఒకరికొకరు శత్రు దేశాలుగా మారిపోయినవి. ఇజ్రాయిల్ అమెరికాతో అంటకాగుతూ ఇరాన్‌ను బలహీన పరిచి ప్రాంతీయ ఆధిపత్యాన్ని చెలాయించాలని సౌదీ రాజ కుటుంబం ఎప్పటి నుండో బలంగా ప్రయత్నిస్తున్నది. అదే సమయంలో పెద్దన్న పాత్రలో లెబనాన్‌లో హిజ్బుల్లాకు మద్దతిస్తూ, పాలస్తీనాను సమర్ధిస్తూ, యెమెన్‌లో సౌదీ సంకీర్ణ సేనలకు వ్యతిరేకంగా పోరాటం చేస్తున్న హుతి తిరుగుబాటుదారు లకు సంపూర్ణ మద్దతు ప్రకటించింది ఇరాన్. సిరియాలోను పరోక్ష పాత్రను పోషిస్తున్నది. గతంలో వైరి దేశమైన ఇరాక్‌లోనూ ప్రాబల్యాన్ని సంపాదించింది.

ఇజ్రాయిల్‌కు సౌదీ అరేబియాకు శత్రు దేశమైన ఇరాన్‌ను నిర్వీర్య పరిచి మధ్య ప్రాచ్య భౌగోళిక రాజకీయాలను తన చెప్పు చేతుల్లో పెట్టుకోవాలనుకుంటున్న అమెరికాకు ఇరాన్‌తో 1979 ఇస్లామిక్ రెవల్యూషన్ కాలం నుండి ఆ దేశం అంటే కంటగింపుగానే ఉంది. దీంట్లో భాగంగానే దూకుడుగా వ్యవహరిస్తున్న సౌదీ యువరాజు మహమ్మద్ బిన్ సాల్మన్ యుద్ధాన్ని సౌదీలో కాకుండా ఇరాన్ ముంగిట్లోకి తీసుకెళ్లుతామని ప్రకటించడం, అమెరికా సిఐఏలో ఇరాన్ ఆపరేషన్స్ పర్యవేక్షించే 'డార్క్ ప్రిన్స్'గా పేరుపొందిన మిఖాయిల్ డీ ఆండ్రి ది కూడా సౌదీ యువరాజుకు దగ్గరైన పథకమే! ఇజ్రాయిల్ అమెరికా ఎలాగూ ఇరాన్‌లో 'ప్రభుత్వ మార్పు'ను కోరుకుంటున్నాయి. సరిగ్గా ఈ నేపథ్యంలోంచి చూసినపుడు ఖొమైనీ ప్రకటన ఇరాన్‌లోనే కాకుండా ప్రపంచ వ్యాప్తంగా విశ్వసనీయతను పొందింది. ఇరాన్ వివిధ దేశాల్లో పొందిన ప్రాబల్యాన్ని బలహీనపరచాలంటే ఆ దేశ దృష్టిని మళ్లించే పన్నాగాలను అమలు పరచాలి. బహుశా ఆ పన్నాగాల్లో భాగంగానే ఇరాన్‌లో అంతర్గత చిచ్చును సృష్టించి సిరియాలాగ అంతర్యుద్ధంలోకి నెట్టివేయాలని ఆ మూడు దేశాలు చూస్తున్నాయనే వాదన నమ్మశక్యంగానే ఉంటుంది.

ఇటువంటి ప్రయత్నాలు జరుగుతున్నాయనేది పూర్తిగా వాస్తవమే. అయితే ఈ దఫా జరిగిన ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనల్లో తొలి అడుగు పడింది పాలకవర్గాల మధ్య ఉన్న వైరుధ్యాల మూలంగానే. 2009 నాటి తిరుగుబాటు అంతా బయటి శక్తుల ప్రోద్బలంతో, ప్రోత్సాహంతో జరిగినవే. తొలిఅడుగు పాలకవర్గాల వైరుధ్యాల ఫలితమే అయినా దాన్ని అందిపుచ్చుకుని తిరుగుబాటును తీవ్రతరం చేసింది యువతరం, కార్మిక వర్గాలు, సమాజపు అట్టడుగు వర్గాల ప్రజలు. అలా ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలు వర్గపోరాట స్వభావాన్ని కూడా కల్గి ఉన్నవి.

నిజానికి 39 ఏళ్ల క్రితం కార్మిక వర్గం ఉధృతంగా ఉద్యమించి అమెరికా ఆట బొమ్మ అయిన షా పాలనను అంతమొందించిన క్రమంలో జాతీయ బూర్జువా అయిన ఖొమైనీ షియా పూజారి వర్గం అధికారాన్ని చేజిక్కించుకుని కార్మికవర్గాన్ని అణగదొక్కి పెట్టుబడి పాలననే సుస్థిర పరిచింది. ఇరాన్ రాజకీయ వ్యవస్థను శాసిస్తూ వస్తున్నది సనాతన, సంస్కరణవాద శక్తులే. ప్రతి పదేళ్లకు ఒకసారి అన్నట్టుగా జరుగుతున్న ఈ తిరుగుబాట్లు కేవలం కార్మికవర్గానికి మెరుగైన పరిస్థితులు, జీతభత్యాల కోసం అన్నట్టు కాకుండా మొత్తంగా వ్యవస్థనే పునాదుల్లోంచి మార్చాలనే స్వభావంతో కూడినవిగా, మత గుప్పిట్లోంచి బయట పడేందుకు జరిగే పెను పెనుగులాటగా కన్పిస్తాయి.

ఎన్నికైన ప్రభుత్వాలకు రూపంలోనే అధికారం తప్ప సారంలో సుప్రీం నాయకుడైన అయోతుల్ల ఖొమైనీవే సర్వాధికారాలు. ఆంతరంగిక భద్రత, విదేశాంగ విధానం, మిలటరీ, ఇంటిలీజెన్స్ అధికారాలన్ని ఆయనవే. ఈ క్రమంలోనే ఎదిగి వచ్చిన నూతన తరం నామమాత్రపు ప్రభుత్వానికి వ్యతిరేకంగా కాకుండా అసలు అధికార కేంద్రాన్ని గురి చూసే ఉద్యమాలు చేస్తున్నది. 'డెత్ టు ది డిక్టేటర్' అనే నినాదాలు ఈ ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనల్లో మారుమోగినవి. క్రమం తప్పకుండా జరుగుతున్న ఈ తిరుగుబాట్లతో సుప్రీం కమాండర్ ప్రాబల్యం, అధికార స్థాన న్యాయబద్ధత కూడా చెదురుతున్నట్టే! అయితే అమెరికా ఆధిపత్యం, ఇజ్రాయిల్, సౌదీ పన్నగాలు కలగలసి ఇరాన్ బలహీన పరచి విచ్ఛిన్నం చేస్తాయనే భయమూ ఇరానీయుల మెదళ్లలో లేకపోలేదు. అదే ఇవాళ ఖొమైనీ కుర్చీని ఇంకా నిలబెడుతున్నది. విదేశీయుల జోక్యం బలంగానే ఉన్నది. అయితే 2009లో లాగా కాకుండా నిరుద్యోగ యువతరం, కార్మిక వర్గం, క్రింది వర్గాల పాత్ర, పట్టు ఇప్పటి ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనల్లో నిర్ణయాత్మకం కావడంతో ఎగువ మధ్య తరగతి మొదట కన్పించినా క్రమంగా కనుమరుగైంది. తమకు అనుకూలమైన ప్రభుత్వాల కోసం ఆ మూడు శక్తులు (అమెరికా, ఇజ్రాయిల్, సౌదీ అరేబియా ) ప్రయత్నం చేస్తుంటే వ్యవస్థనే ప్రశ్నించేతరం తిరుగుబాటులో భాగస్వామ్యం అవుతుంటే మధ్యతరగతి వెనుకంజ వేసింది. మొదటికే మోసం వస్తుందన్నట్లు బయటి శక్తులూ ప్రత్యక్ష పాత్రను పోషించలేకపోయినవి. కొద్దిమేరకు సంస్కరణలవాదుల పాత్ర కన్పించినా వారి భవిష్యత్ ప్రయోజనాలకు అనుగుణంగా లేదని గ్రహించడంతో పాటు దేశం సంక్షోభంలోకి పడి విచ్ఛిన్నమవుతుందనే 'దేశ భక్తి'తో కూడిన భయం వారిని ఉద్యమంలోంచి ఉపసంహరించుకునేలా చేసింది.

ఏది ఏమైనా ప్రజాగ్రహ వెల్లువను పూర్తిస్థాయిలో నిర్మాణాత్మకంగా సంఘటితపరిచే పురోగమన భావజాల చోదకశక్తుల కొరత స్పష్టంగా కన్పిస్తుంది. అటు బయటి ఆధిపత్యాన్ని, అంతర్గత ఆధిపత్యాన్ని అంతమొందించే, మత మౌఢ్యాన్ని నిలువరించే శక్తులు మరింత దృఢంగా నిలబడితే ఇరాన్ సమాజానికే కాక ప్రపంచ ప్రగతిశీల రాజకీయాలకు ఊపునూ, ఉత్సాహాన్నీ ఇస్తాయి.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

చర్చ

# సోవియట్ రష్యాలో ఏం జరిగింది?

***ప్రపంచంలోనే తొలి సోషలిస్టు సమాజ నిర్మాణ ప్రయత్నం మీద కొందరు అవాకులూ చవాకులూ పేలుతున్న సందర్భంలో ఒక రష్యన్ మేధావి స్పందన తెలియజేస్తున్నారు* మిఖయిల్ వి. పోపోవ్**

(రంగనాయకమ్మ, ఇటీవల 'సోవియట్ రష్యాలో ఏం జరిగింది?' అన్న పుస్తకం ప్రచురించింది. ఇంతవరకూ ఏ పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేకీ చెయ్యని విధంగా రంగనాయకమ్మ, సోవియట్ సోషలిస్టు వ్యవస్థ మీద దుర్మార్గమైన దాడి చేసింది. 'స్టాలినిజం' అనేది ఒక దోపిడీ సిద్ధాంతమనీ, 'పాత బానిసత్వాన్నీ, అమలులో ఉన్న పెట్టుబడిదారీ విధానాన్నీ, రెంటినీ కలేసే, కొత్త దోపిడీ విధానంగా తలెత్తిందనీ' అంటూ రంగనాయకమ్మ, స్టాలిన్ యుగం నాటి సోషలిస్టు వ్యవస్థను ఒక బానిస వ్యవస్థగా చిత్రించింది. స్టాలిన్, కిరోవ్ ను హత్య చేశాడనీ, తనను ప్రశ్నించినందుకు బుఖారిన్ ను హత్య చేశాడనీ, ట్రాట్స్కీని హత్య చేశాడనీ, స్టాలిన్ భార్య ఆత్మహత్య చేసుకుని ఉండకపోవచ్చునీ అది హత్యే కావచ్చుననీ, లెనిన్ జీవించి ఉండి స్టాలిన్‌ను వ్యతిరేకిస్తే, కిరోవ్‌కి పట్టినగతే లెనిన్‌కు కూడా పట్టేదనీ అంటూ రంగనాయకమ్మ, ఆనాటి ప్రపంచాన్ని ఉత్తేజపరచిన సోషలిస్టు సోవియట్ యూనియన్ చరిత్రను, రామ్‌గోపాల్‌వర్మ 'రక్త చరిత్ర' లా చిత్రించింది. రాబర్ట్ కాంక్వెస్ట్, సోల్జెన్‌త్సీన్ లాంటి పెట్టుబడి ఏజెంట్ల స్థాయికి దిగజారిపోయి, ఈ తరహా పుకార్లను చారిత్రక వాస్తవాలుగా చెప్పింది.

నిజానికి ఈ రకమైన ప్రచారం కొత్తదేమీ కాదు. గత తొమ్మిది దశాబ్దాలుగా పెట్టుబడిదారీ ప్రపంచం చేస్తున్నదే. ఇరినా మాలెంకో, యూరీ ఝుకోవ్, గ్రోవర్ ఫర్, ఆర్చ్. గెట్టీ లాంటి రచయితలూ, చారిత్రక పరిశోధకులూ, తమ అనుభవాల మీదా, ఇప్పుడు వెలుగులోకి వస్తున్న చారిత్రక పత్రాల మీదా ఆధారపడి, వాస్తవంగా సోవియట్ యూనియన్ లో ఏం జరిగినదీ వివరిస్తూ ఈ విష ప్రచారాన్ని ఎదుర్కొంటుంటే, చారిత్రక వాస్తవాలకూ కట్టుకథలకూ తేడా గ్రహించలేని రంగనాయకమ్మ కలం, తొమ్మిది దశాబ్దాలుగా జరుగుతున్న ఆ ప్రచారాన్ని ఇక్కడ, ఇప్పుడు అందుకుని, సోషలిస్టు వ్యవస్థ మీద విషం కక్కుతోంది. స్టాలిన్‌ను ఒకప్పుడు విప్లవకారుడిగా గుర్తించిన రంగనాయకమ్మ, 'ఇప్పుడు నేను స్టాలినిస్టుగా చెప్పుకోవడానికి సిగ్గుపడతాను' అంటోంది. రంగనాయకమ్మ తనను మార్క్సిస్టుగా చెప్పుకుంటున్నందుకూ, కొంతమంది ఈ కుహనా మార్క్సిస్టును మార్క్సిస్టుగా ఇంకా గుర్తిస్తున్నందుకూ, మనమందరం సిగ్గుపడాలి.)

సోవియట్ రష్యాలో ఏం జరిగింది? అన్న ప్రశ్నకు మైఖేల్ పోపోవ్ వ్యాసం సమాధానమివ్వడానికి ప్రయత్నిస్తుంది.

సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు వ్యవస్థ ఏర్పడిన తర్వాత వర్గ పోరాటం ఆగిపోలేదు. ఈ వర్గ పోరాటం అనేక రూపాలలో, అనేక స్థాయిలలో, మొదటినుంచి తుది దాకా జరుగుతూనే ఉంది. స్టాలిన్ మరణం వరకూ సోవియట్ యూనియన్‌లో రాజ్యం కార్మిక వర్గం చేతుల్లో ఉంది. ఈ కార్మిక రాజ్యం, ఉత్పత్తి సాధనాలను ప్రజలందరి ప్రయోజనం కోసం వినియోగించింది. స్టాలిన్ మరణానంతరం పరిస్థితిలో మార్పు వచ్చింది. 1961లో జరిగిన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 22వ కాంగ్రెస్ కార్మిక వర్గ నియంతృత్వాన్ని అంతం చెయ్యడంతో, రాజ్యం బూర్జువా చేతుల్లోకి పోయిందంటాడు పోపోవ్. 1961లో కార్మిక వర్గ నియంతృత్వం అంతమై, బూర్జువా నియంతృత్వం ప్రారంభమైంది. మొదట సోవియట్ యూనియన్‌లోని ఉత్పత్తి సాధనాలన్నీ ఈ నయా బూర్జువా ఉమ్మడి వ్యక్తిగత ఆస్థిగా ఉండేవి. 1991 తర్వాత ఈ ఉమ్మడి ఆస్థి, వ్యక్తిగత ఆస్థిగా మారి, మాఫియా కేపిటలిజం ఉనికిలోకి వచ్చింది. పోపోవ్ వ్యాసం ఈ పరిణామం గురించి వివరిస్తుంది.

1961లో ఈ మార్పు స్పష్టంగా కనుపించినా ఇంకా ముందే, 1956లోనే ప్రారంభమైందని, పోపోవ్ చెబుతారు. ఈ నయా బూర్జువా వర్గం ఎక్కడ నుంచి వచ్చింది? స్టాలిన్ యుగంలో కూడా, ఒక వర్గంగా కాక పోయినా, పార్టీలో, ప్రభుత్వంలో, సమాజంలో, అన్ని రంగాలలోనూ, సోషలిస్టు వ్యతిరేక శక్తులుంటూనే ఉన్నాయి. ఈ దిగజారుడు శక్తులనుంచి క్రమంగా ఈ నయా బూర్జువా వర్గం జన్మించింది. 1952లో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 19వ మహాసభకు, పార్టీ కేంద్ర కమిటీ సమర్పించిన నివేదికలో, కొన్ని పార్టీ సంస్థలలో, అవినీతి, దిగజారుడుతనం కనిపిస్తున్నాయని స్పష్టం చేసింది. ఈ సంస్థల నాయకులు, సంస్థలను తమ మనుషులతో నింపివేసి, పార్టీ, రాజ్య ప్రయోజనాల కంటే, ముఠా ప్రయోజనాలకే ప్రాధాన్యత ఇస్తున్నారంది. ప్రభుత్వ పరిశ్రమల అధికారులు, తమ చేతుల్లో ఉన్నవి ప్రభుత్వ సంస్థలన్న విషయం మరచిపోయి, వాటిని తమ స్వంత సంస్థలుగా మార్చడానికి ప్రయత్నిస్తున్నారని విమర్శించింది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో సమిష్టి సంపదను కాపాడడానికి బదులు, కొంతమంది పార్టీ కార్యకర్తలూ, ప్రభుత్వ ఉద్యోగులూ, సమిష్టి వ్యవసాయ క్షేత్ర సంపదను పిండుకుంటున్నారని ఆరోపించింది. కళా, సాంస్కృతిక, శాస్త్ర రంగాలలో కూడా సోషలిస్టు వ్యవస్థ మీద దాడి చేసే, బురద జల్లే, ధోరణులు తలెత్తాయంది.

ఈ దిగజారుడు శక్తుల వలన సోషలిస్టు వ్యవస్థకు ఏర్పడుతున్న ప్రమాదాన్ని గుర్తించి, స్టాలిన్ మరో ప్రక్షాళన కార్యక్రమంలో ఈ ముఠాను పార్టీనుంచి తొలగించే ప్రయత్నంలో ఉన్నట్లూ. దానితో ఈ ముఠా భయభ్రాంతమై స్టాలిన్ ను హత్య చేసినట్లూ కనుపిస్తుంది. 18వ పార్టీ కాంగ్రెసు వరకూ కాంగ్రెస్ రికార్డులు బహిరంగమైనా, ఈ 19వ కాంగ్రెసు రికార్డులు ఇంతవరకూ బహిరంగం కాలేదు. స్టాలిన్ తదనంతర రివిజనిస్టు నాయకత్వం కాని, ప్రస్తుత కేపిటలిస్టు నాయకత్వం కాని, బహిరంగం చెయ్యడానికి ఇష్టపడని సంఘటనలు ఏవో ఆ కాంగ్రెస్ లో సంభవించి ఉండవచ్చు. స్టాలిన్ వ్యక్తిగత నియంతృత్వం అంటూ కృశ్చేవ్ చేసిన దాడి, ఈ దిగజారుడు శక్తుల ప్రయోజనాలను కాపాడడం కోసం, కార్మిక

వర్గ నియంతృత్వం మీద చేసిన దాడి. కమ్యూనిస్టులు ఈ దాడిని సవ్యంగా ఎదుర్కోలేకపోయారు. సోవియట్ వ్యవస్థలోనే ఉన్న ఈ దిగజారుడు శక్తులకూ, నిబద్ధులైన కమ్యూనిస్టులకూ జరుగుతున్న వర్గ పోరాటంలో కమ్యూనిస్టులు ఓడిపోయారు. క్రమంగా దిగజారుడు శక్తులది పై చేయి అయి, ఈ శక్తులు ఒక నయా బూర్జువా వర్గంగా చైతన్యం పొంది, సోషలిస్టు సోవియట్ యూనియన్‌ను పెట్టుబడిదారీ విధానం వైపు మళ్ళించాయి. పోపోవ్ వ్యాసం, తన పరిధిలో, ఈ విషయాన్ని వివరించడానికి ప్రయత్నిస్తుంది. – అనువాదకులు).

**సోవియట్ యూనియన్‌లో ప్రతీఘాత విప్లవం – మైఖేల్ వి. పోపోవ్**

సోవియట్ యూనియన్‌లో ఒక ప్రతీఘాత విప్లవం జరిగిందని ఇప్పుడు దాదాపు అందరికీ అర్థమైంది. ఇది అర్థం చేసుకోవడం చాలా తేలికే. ఎందుకంటే, అప్పటివరకూ సోవియట్ యూనియన్ లో. కమ్యూనిజంలో తొలి దశ అయిన సోషలిజం ఉండ్మి ఇప్పుడు రష్యాలో పూర్తిగా పాతుకుపోయిన కేపిటలిజం ఉంది. సోవియట్ యూనియన్ లో కేవలం ఒక ప్రతీఘాత విప్లవం మాత్రమే జరుగలేదు, ఒక పునరుద్ధరణ కూడా జరిగింది – బూర్జువా సంస్థలన్నీ పునరుద్ధరించబడ్డాయి. ఇప్పుడు, బూర్జువా నియంతృత్వం ఒక రూపంగా బూర్జువా ప్రజాస్వామ్యం నెలకొన్న పూర్తి స్థాయి బూర్జువా రాజ్యం ఒకటి ఉంది.

**ఈ మార్పు ఎప్పుడు జరిగింది?**

మొదట కొంతమంది, ఈ మార్పు 1990 చివరనా, 1991 ప్రారంభం లోనూ, జరిగిందని భావించారు. కాని లోతైన విశ్లేషణ అలా జరగలేదని మనకు వెల్లడిస్తుంది. మహత్తర సంఘటనలు అలా జరగవు. చరిత్రలో, ఒక వ్యవస్థ నుంచి మరొక వ్యవస్థకు పరివర్తనలు క్షణాల్లో జరగవు. కొన్ని ఉదాహరణలు చూద్దాం. రష్యాలోనూ, సోవియట్ యూనియన్ లోనూ, కేపిటలిజం నుంచి సోషలిజానికి పరివర్తన 18 సంవత్సరాలు తీసుకుంది (1917 నుండి 1935 వరకూ). సోషలిజం నుంచి తిరిగి కేపిటలిజానికి పరివర్తనకు ఎంత కాలం పట్టింది? ఈ విషయాన్ని మనం చర్చించాలి.

ఒక రాజ్యం సోషలిస్టు రాజ్యం ఎప్పుడు అవుతుంది? రాజ్యంలో అధికారం కార్మిక వర్గం చేతుల్లో ఉంటే, ఆ రాజ్యం సోషలిస్టు రాజ్యం అవుతుంది. కార్మిక వర్గం చేతుల్లో అధికారం ఎప్పుడు ఉంటుంది? కార్మిక వర్గ నియంతృత్వం అమలు జరుగుతున్నప్పుడు మాత్రమే కార్మిక వర్గం చేతుల్లో అధికారం ఉంటుంది.

కార్మిక వర్గ నియంతృత్వం అంటే ఏమిటి? లెనిన్, తన వ్యాసం 'మహత్తర ప్రారంభం'లో, కార్మిక వర్గ నియంతృత్వానికి ఒక శాస్త్రీయ నిర్వచనాన్ని ఇచ్చారు. ఆ నిర్వచనం ప్రకారం, ఒక నిర్దిష్ట సామాజిక వర్గం మాత్రమే – అంటే పట్టణాలలో ఫాక్టరీలలో ఉండే పారిశ్రామిక కార్మిక వర్గం మాత్రమే – వర్గాలను పూర్తిగా నిర్మూలించే పోరాటంలో, మొత్తం శ్రమ జీవులకూ దోపిడీకి గురవుతున్న ప్రజలకూ నాయకత్వం వహించగలదు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, 'వర్గాల రద్దు' అంటే దోపిడీ వర్గాలను నిర్మూలించడం మాత్రమే కాదు; గ్రామానికీ పట్టణానికీ మధ్యా, శారీరక మానసిక శ్రమల మధ్యా ఉండే అంతరాలను నిర్మూలించడం. సోవియట్ యూనియన్ లో ప్రతీఘాత విప్లవం గురించి చర్చించేటప్పుడు కార్మిక వర్గ నియంతృత్వం గురించి మరొక నిర్వచనం మనకు చాలా ఉపయోగకరం గా ఉంటుంది. ఈ రెండో నిర్వచనం, లెనిన్ పుస్తకం, 'అతివాద కమ్యూనిజం – ఒక బాలారిష్టం'లో ఇవ్వబడింది: 'కార్మిక వర్గ నియంతృత్వం అంటే, రక్తపాతంతోనూ, రక్తపాత రహితంగానూ్మ్మ హింసాత్మకంగానూ, శాంతియుతంగానూ్మ్మ సైనికంగానూ, ఆర్థికంగానూ, బోధనాత్మకంగానూ, పరిపాలనాపరంగానూ్మ్మ పాత సమాజ సంప్రదాయా లకూ, శక్తులకూ వ్యతిరేకంగా ఒక నిరంతర పోరాటం'.

**ఇప్పుడు మనం ఈ ప్రశ్నలు వేసుకుందాం.**

సోషలిజంలో పాత సమాజపు సంప్రదాయాలూ, శక్తులూ, అదృశ్యమైపోతున్నాయా?

సోషలిజంలో, పెట్టీ బూర్జువా మనస్తత్వానికీ, ధోరణులకూ వ్యతిరేకంగా వర్గ పోరాటం జరగడం లేదా?

సోషలిజంలో కార్మిక వర్గం తన కర్తవ్యాన్ని పూర్తిగా నిర్వహించిందా? పెట్టీ బూర్జువా మనస్తత్వానికీ, ధోరణలకూ వ్యతిరేకంగా వర్గ పోరాటం ముగిసింది అని చెప్పగలిగే విధంగా, అన్ని సామాజిక వర్గాలూ పూర్తిగా నిర్మూలించబడ్డాయా?

**దీనికి సమాధానం ఇలా ఉంటుంది:**

సోషలిస్టు సమాజంలో, కార్మిక వర్గ ప్రయోజనాలతో సంఘర్షించే పెట్టీ బూర్జువా మనస్తత్వం, ధోరణులూ ఉంటాయి. సోషలిజంలో, పెట్టీ బూర్జువా మనస్తత్వానికీ, ధోరణులకూ వ్యతిరేకంగా వర్గ పోరాటం జరుగుతోందే కాని ముగియలేదు. మనం ఈ శక్తులతో, ధోరణులతో పోరాడకపోతే, ఈ శక్తులూ, ధోరణులూ మనతో పోరాడుతాయి.

మనం ప్రశ్నలు ఆ విధంగా వేసుకున్నట్లయితే, సోవియట్ యూనియన్‌లో ఎప్పుడు ప్రతీఘాత విప్లవం జరిగిందో మనకు స్పష్టమవుతుంది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, మార్క్సిజానికి ప్రాణ ప్రదమైన కార్మిక వర్గ నియంతృత్వాన్ని తన కార్యక్రమం నుంచి తొలగిస్తూ పార్టీ కాంగ్రెస్ లో ఓటు చేసినప్పుడు, ఈ ప్రతీఘాత విప్లవం జరిగింది. ఇది 1961లో, 22వ కాంగ్రెస్‌లో, జరిగింది. దీనర్థం ఏమిటంటే, సమాజానికి నాయకత్వం వహిస్తున్న ఒక శక్తిగా కాని, ఒక పార్టీ గా కాని – అంటే తన చేతుల్లో రాజ్యాధికారాన్ని ఉంచుకున్న ఒక రాజకీయ పార్టీగా– సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, పాత సమాజపు సంప్రదాయాలూ, శక్తులకూ వ్యతిరేకంగా నిరంతర పోరాటం సాగించాలని ఇంకెంత మాత్రం భావించడం లేదు. పర్యవసానం ఏమిటంటే, 22వ కాంగ్రెసు నిర్ణయంతో, రాజ్య స్వభావం వెంటనే మారింది. ఒకప్పుడు కార్మిక వర్గ నియంతృత్వంగా ఉన్న రాజ్యం, ఇప్పుడు దానికి వ్యతిరేకంగా మారింది.

దీనర్థం ఏమిటి? వ్యతిరేక స్వభావం గల రాజ్యం అంటే ఏమిటి? అంటే, బూర్జువా రాజ్యం. సోషలిజంలో బూర్జువా ఉండదని భావిస్తూ, కొంతమంది అడుగుతారు: 'కాని బూర్జువా ఎక్కడున్నాడు?' ఇది నిజమే. ఆ నిర్ణయం తీసుకున్న సమయంలో, ఆ క్షణం వరకూ, బూర్జువా లేదు. కాని నిర్ణయం తీసుకున్న వెంటనే, మొత్తం ఆర్థిక, రాజకీయ జీవితాన్ని నిర్వహిస్తున్న రాజ్య యంత్రాంగానికి ఏం జరిగింది? వాస్తవంలో, ఉత్పత్తి సాధనాలను తమ గుప్పెట్లో పెట్టుకున్న వ్యక్తులతో కూడిన రాజ్య యంత్రాంగమైంది. ఇంతకు ముందు ఈ వ్యక్తులు, మొత్తం సమాజ అవసరాలను తీర్చడం కోసమూ, శ్రమ జీవులందరి ప్రయోజనాలను వ్యక్తం చేసే కార్మిక వర్గ ప్రయోజనాల కోసమూ, ఈ ఉత్పత్తి సాధనాలను నిర్వహించవలసి వచ్చేది. ఈ మార్పు తర్వాత ఈ వ్యక్తులు, ఉత్పత్తి సాధనాలను తమ స్వప్రయోజనాల కోసం వినియోగించ సాగారు. నిజానికి ఇది వారి కర్తవ్యమైంది. ఆ విధంగా, ఉత్పత్తి సాధనాలను

స్వప్రయోజనాలకోసం వినియోగించే ఒక 'కులం' ఏర్పడింది.

ప్రభుత్వ యాజమాన్యం, సమాజ యాజమాన్యం – రెండూ ఒకటి కావు. రాజ్యం కార్మిక వర్గ రాజ్యమైనప్పుడు మాత్రమే, రాజ్యం కార్మిక వర్గ ప్రయోజనాల కోసం పని చేస్తున్నప్పుడు మాత్రమే, ప్రభుత్వ యాజమాన్యం, సమాజ యాజమాన్యం ఒక రూపమవుతుంది. అందువలన, కార్మిక వర్గ ప్రయోజనాల కోసం రాజ్యం పని చెయ్యడం ఆగిపోయిన తక్షణమే ప్రభుత్వ ఆస్థి, సమాజంలో ఒక భాగం ఆస్థి అవుతుంది. సమాజంలో ఒక భాగం ఆస్థి, వ్యక్తిగత ఆస్థి అవుతుంది. ఆ విధంగా, 1961తో ప్రారంభమై, సోవియట్ యూనియన్ లో, ప్రభుత్వంలో ఉన్నత స్థానాలలో ఉన్న వారి వ్యక్తిగత ఆస్థి ప్రత్యక్షమైంది. ఈ వ్యక్తిగత ఆస్థి, మరే ఇతర జాయింటు స్టాక్ కంపెనీలో ఉంటున్నట్లుగానే, ఉమ్మడి ఆస్థిగా ఉంది. ఏ కార్పోరేషన్ లో నైనా వ్యక్తిగత ఆస్థి వ్యక్తుల చేతుల్లో ఉండదు, వాటా దారులందరి ఆస్థిగా ఉంటుంది. రష్యాలో, తొలి దశలో, స్వతంత్ర వాటాదారుల చేతుల్లో ఈ ఆస్థి ముక్క చెక్కలై లేదు. ఉన్నత స్థానాలలో ఉన్న వారందరూ ఒక ముఠాగా, ఉమ్మడిగా, ఆస్థిని స్వాధీనం చేసుకున్నారు. ఇక్కడ మనం గమనించాల్సిన విషయం ఏమిటంటే, అధికారంలో ఈ స్థాయిలో, కార్మిక వర్గంలో ఉండే వ్యక్తులు చాలా అరుదుగా ఉండేవారు. మిగిలిన వారంతా, ఇంకే మాత్రం సమాజ ఆస్థి కాని ఈ ఉమ్మడి, ప్రభుత్వ ఆస్థిని దోచుకునే అవకాశం కనుపించగానే, ఆ అవకాశం అందుకోడానికి చేతులు చాచేవారు.

ఈ పరిస్థితికి ఉత్తమమైన పరిష్కారాన్ని బెలారస్‌లో మనం చూడవచ్చు. ఈ ఉమ్మడి వ్యక్తిగత ఆస్థిని అక్కడ ముక్కలు చెక్కలు చెయ్యలేదు. అందువలన అక్కడ ప్రభుత్వ ఆస్థి, భారీ స్థాయి వ్యక్తిగత ఆస్తిగా, కొనసాగింది. కాని మిగిలిన సోవియట్ యూనియన్‌లో, చుబైస్, గెదార్ తదితర సిద్ధాంత వేత్తలూ; నెమ్ త్సోవ్, లావ్లిన్స్కీ, బోల్దిరేవ్ తదితర (సామ్రాజ్యవాద దశకూ, ప్రభుత్వ గుత్త కేపిటలిజం దశకూ కూడా చేరని) ఉదారవాద కేపిటలిజం గురువులూ, ఈ ప్రభుత్వ ఆస్థిని ముక్క చెక్కలు చెయ్యడానికి ఒక నిర్ణయం తీసుకోవడం జరిగింది.

ఈ ప్రభుత్వ ఆస్తిని ఇలా పంచుకోవడం ఒక్క రోజులో జరగలేదు. మొట్టమొదట శత్రువు, అంటే కార్మిక వర్గం, మెడలు వంచాల్సిన అవసరం ఉంది – 1962లో, నోవోఛెర్కాస్క్ లో కృశ్చేవ్, కార్మికులనూ, వారి బిడ్డలనూ కాల్చి చంపుతూ పరిష్కరించడానికి ప్రయత్నించిన సమస్యను, పరిష్కరించాల్సిన అవసరం ఉంది. ప్రభుత్వాధినేత ఆదేశాలతో కార్మికుల మీద కాల్పులు జరుగుతున్నప్పుడు, ఈ చారిత్రక వాస్తవాన్ని గమనించిన ఏ వ్యక్తి అయినా, ఆ రాజ్యం కార్మిక వర్గ రాజ్యం కాదు, అని ఒక నిర్ణయానికి రావాల్సి వస్తుంది. ఆ కార్మికుల కోరికలు ఏమిటి? ధరలు పెరగకూడదని మాత్రమే వాళ్ళు కోరారు. ప్రపంచ వ్యాపితంగా కార్మికులు ఇదే డిమాండు చేస్తుంటారు. ఈ డిమాండు చేసినందుకు ప్రపంచంలో ఎవరూ, బూర్జువా ప్రపంచంలో కూడా, కార్మికుల మీద కాల్పులు జరుపరు. ఈ విషయంలో కృశ్చేవ్, ఇతర దేశాలలో బూర్జువా నియంతృత్వాన్ని అమలు జరుపుతున్న వారిని తలదన్నాడు. ఆ కారణం వలన, 1961తో ప్రారంభించి, సోషలిజం నుండి కేపిటలిజానికి పరివర్తన ప్రారంభమైందనీ, 1961లో 22వ కాంగ్రెస్ లో ఒక రాజకీయ విప్లవం జరిగిందనీ చెప్పవచ్చు.

ఆ విధంగా, 'విప్లవం' అన్న పదాన్ని మనం ఒక ఆర్థిక వ్యవస్థనుంచి మరొక ఆర్థిక వ్యవస్థకు పరివర్తన అన్న అర్థంలో ప్రయోగిస్తే, అప్పుడు ఆ ప్రక్రియ చాలా కాలం తీసుకునే ప్రక్రియ అవుతుంది. ఈ ప్రక్రియ 1961 నుంచి 1991 వరకూ – 30 సంవత్సరాలు – తీసుకుంది. (మొట్ట మొదట రష్యాలోనూ, తరువాత మొత్తం సోవియట్ యూనియన్ లోనూ, పెట్టుబడిదారీ విధానం నుంచి సోషలిజానికి పరివర్తనకు పట్టిన 18 సంవత్సరాల కంటే ఇది చాలా ఎక్కువ).

సోవియట్ యూనియన్ (తనంతట తాను) ముక్కలైపోయింది అనే భావనకు విరుద్ధమైన భావన ఇది. లేదు, సోవియట్ యూనియన్ ముక్కలైపోలేదు. వెలుపల నుంచీ, లోపలనుంచీ, సోవియట్ యూనియన్ కు వ్యతిరేకంగా పోరాటం జరిగింది. అగ్ర నాయకత్వంలో ఉన్న సోషలిస్టు ద్రోహులూ, కమ్యూనిస్టు పార్టీ ద్రోహులూ, కార్మిక వర్గ ద్రోహులూ ఒక వైపు నుండీ, ఎల్సిన్ సంవత్సరాలలో, ప్రతీ దాన్నీ పెట్టుబడిదారీ విధాన ఆర్థిక వ్యవస్థగా మార్చడానికీ, ఈ ఆర్థిక వ్యవస్థను (రష్యన్ బూర్జువాకి కూడా కాదు) విదేశీ బూర్జువా ప్రయోజనాలకు, ముఖ్యంగా అమెరికన్ బూర్జువా ప్రయోజనాలకు, అనుగుణంగా మార్చడానికీ, అన్ని మంత్రాలయాలలోకి ఆహ్వానించబడ్డ విదేశీ సలహాదారులు మరొక వైపునుండీ, సోషలిజంతో పోరాడారు. ఇదంతా సుదీర్ఘ కాలం జరిగింది. సోవియట్ యూనియన్ ఒక్క రోజులో ముక్క చెక్కలైపోలేదు.

సోవియట్ యూనియన్ ఈ శక్తులను చాలాకాలం ప్రతిఘటించింది. అలా ప్రతిఘటించిన శక్తులున్నాయని మనకు తెలుసు. 1989లో శ్రమ జీవుల ఐక్య సంఘటన ఒకటి ఏర్పడింది. అందులో, కామ్రేడ్స్ పిర్యోవ్, క్రసావిన్ లతో పాటు, నేనూ, సోవియట్ యూనియన్ ప్రజా ప్రతినిధుల స్థానాలకు కేండిడేట్లుగా లెనిన్ గ్రాడ్ ప్రాంతం నుంచి పాల్గొన్నాం. శ్రమ జీవుల ఐక్య సంఘటన లెనిన్ గ్రాడ్ విభాగంగా మేము ఉన్నాం. మాస్కోలో కూడా అటువంటి విభాగం ఒకటి ఏర్పడింది. చివరకు, మా ట్రేడ్ యూనియన్ల, కొన్ని పార్టీ సంస్థల, కొంతమంది పార్టీ కార్యకర్తల మద్దతుతో, రష్యన్ శ్రమ జీవుల ఐక్య సంఘటన ఒకటి ఏర్పడింది.

ఈ శ్రమ జీవుల ఐక్య సంఘటన, జనరల్ మకషోవ్ ను అధ్యక్ష పదవికీ, డా. సెర్గుయేవ్ (ఎకనమిక్స్)ను ఉపాధ్యక్ష పదవికీ నామినేట్ చేసింది. నేను జనరల్ మకషోవ్ సలహాదారుడిగా ఉన్నాను. ఆ కారణంగా ఎవ్వరూ ప్రతిఘటించలేదని చెప్పడం సరి కాదు. నిజానికి మేము చాలా ప్రతిఘటించాం. రష్యన్ కమ్యూనిస్టుల కాంగ్రెసులను నిర్వహించాం. ఐక్య సంఘటనలో ఉన్న పార్టీ సభ్యులంతా గోర్బచేవ్ కు వ్యతిరేకంగా నిలిచారు, ఒక కార్యక్రమాన్ని తయారు చేశారు. ఈ కార్యక్రమంలో ఇలా రాశాము: 'ప్రజా వ్యతిరేక విధానాలను అనుసరిస్తున్న గోర్బచేవ్ కమ్యూనిస్టు వ్యతిరేక ముఠాను పార్టీ నుంచి వెళ్ళగొట్టండి.'

లెనిన్ గ్రాడ్ ప్రాంతీయ కమిటీ సభ్యుడి హోదాలో నేను, ఈ ప్రతిపాదన పై లెనిన్ గ్రాడ్ ప్రాంతీయ కమిటీ ప్లీనరీ సమావేశంలో ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టాను. కాని 17 మంది సభ్యులు మాత్రమే ఈ తీర్మానికి అనుకూలంగా ఓటు చేశారు. కమ్యూనిజం గురించి చాలా మాట్లాడే బిలోవ్ లాంటి వారు నా తీర్మానానికి మద్దతునివ్వలేదు. వాళ్ళు గోర్బచేవ్ కు వ్యతిరేకంగా ఓటు చెయ్యడానికి ఇష్టపడ లేదు. మేము – దోల్గోవ్, జెల్మివ్, నేనూ –ఈ డిమాండు తరఫున గట్టిగా మాట్లాడాం. మేము పార్టీ సంస్థల నిర్ణయాలు సేకరించాం. ఆర్.యస్.యఫ్.యస్.ఆర్ కమ్యూనిస్టు పార్టీని స్థాపించాం, ఆ పార్టీ కార్యక్రమం తయారు చెయ్యడంలో పాల్గొన్నాం. ఈ కార్యక్రమంలో రివిజనిజం లేదు. అందుకని, చేతిలో ఎర్ర జెండాతో కేపిటలిజం నిర్మించే వారితో మేము కూడా చేతులు కలవాలని ఆశించిన వారు, సోవియట్ కమ్యూనిస్టు పార్టీని, ఆర్.ఎస్.ఎఫ్.ఎస్.ఆర్ కమ్యూనిస్టు పార్టీని నిషేధించారు. ఇది ఎల్సిన్ అధికార ముఠా బాహాటంగా తీసుకున్న విప్లవ ప్రతీఘాత చర్య. ఈ పోరాటం ఎప్పుడూ ఆగలేదు. రష్యన్ కమ్యూనిస్టు కార్మికుల పార్టీ,

# డార్విన్ - ఆర్.ఎస్.ఎస్. దోపిడీ

***బిజెపి ప్రభుత్వం విద్యారంగంలో కూడా హిందుత్వ భావజాలాన్ని చొప్పించ చూస్తోందనీ, ఇందుకు డార్విన్ పరిణామవాద పాఠ్యాంశాలను తొలగించాలనుకోవడమే నిదర్శనమనీ అంటున్నారు డా. కత్తి పద్మారావు***

మానవ వనరుల మంత్రిత్వ శాఖను కేంద్రంలో నిర్వహిస్తున్న సత్యపాల్‌సింగ్ 2018, జనవరి 20న మన పాఠశాలల్లో, కళాశాలల్లో బోధిస్తున్న డార్విన్ పరిణామవాద పాఠ్యాంశాలను తొలగించాలని ప్రకటన చేశారు. ఈయన ఆర్.ఎస్.ఎస్. కార్యకర్తగా ఎదిగినవాడు. ఆర్.ఎస్.ఎస్. వాళ్లు భారతదేశానికి చేసిన విద్రోహం చరిత్రలో చెరిగిపోనిది. భారతదేశంలో విస్తరిస్తున్న శాస్త్రజ్ఞానానికి అవరోధంగా మతోన్మాద కార్యక్రమాలు నిర్వహించడం ఆర్ఎస్ఎస్ దినచర్య. ప్రపంచం మొత్తంగా సైన్స్ దినదినం అభివృద్ధి చెందుతూనే ఉంటుంది. ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్కరు నూతన సిద్ధాంతాన్ని ప్రపంచానికి వెలుగు దివ్వెగా అందిస్తారు. డార్విన్ ఈ శాస్త్రీయ సత్యాన్ని కనుగొనడం కోసం ఎంతో శ్రమించారు. పరిణామవాదం అనే సిద్ధాంతాన్ని చార్లెస్ డార్విన్ ప్రమాణ బద్ధంగా ప్రపంచం ముందుకు తెచ్చారు. ఇందులో పరిశోధనా దృష్టి ఉంది. శాస్త్రీయ దృక్పథం ఉంది. నిరంతర అధ్యయనం ఉంది. ఆయన దీన్ని శాస్త్రబద్ధంగా నిరూపించారు. ఈ సిద్ధాంతాన్ని స్వీకరించక పోవడం వల్ల ఆర్.ఎస్.ఎస్. మరింత జ్ఞాన వ్యతిరేక శక్తిగా మారే ప్రమాదం ఉంది. ఈ సిద్ధాంతాలు గాని విద్యార్థులకు తెలియక పోతే వారు పుక్కిట పురాణాలు చదివే అందులుగా తయారవుతారు. బ్రిటన్‌లో ఎడిన్‌బర్గ్ మెడికల్ అధ్యయనానికి మంచి స్థలం. డార్విన్ ఇక్కడ మెడిసన్ చదివాడు. కేంబ్రిడ్జి, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయాల కంటే కూడా ఇక్కడ విద్యలో స్వేచ్ఛ ఉంది. డార్విన్‌నే కాదు ఎందరో మేథావుల్ని ఎడిన్‌బర్గ్ తయారు చేసింది. ఏ మనిషైన పరిశోధకుడైనా కేవలం పాఠ్య గ్రంథాలు బట్టీ పెట్టడం వలన ఏమి సాధించలేరు.

**డార్విన్ కృషి**

డార్విన్ కొత్తగా ఆలోచించేవాడు. ఆయనది పరిశోధనాత్మకమైన మేథస్సు. మెడిసన్‌కు వెళ్లకముందు ఆయన కేంబ్రిడ్జిలో స్టడీ ఆఫ్ డివినిటీని అధ్యయనం చేయడానికి వెళ్లినపుడు కూడా, ఆయన అందులో కుదురుకోలేదు. ఆయన వివిధ రకాలైన తుమ్మెదలను సేకరించి వాటిలోని మార్పులను, వైవిధ్యాన్ని గూర్చి పరిశోధించాడు. అంతే కాదు బైబిల్‌లో ఉన్న దైవత్వాన్ని ఆయన నమ్మలేదు. మానవులు జీవుల పరిణామం నుండి ఆవిర్భవించారని ఆయన కనుగొనగలిగాడు. రాబర్ట్ ఇంగర్‌సాల్ దేవుణ్ని మానవుడే సృష్టించాడు. తన రూపంలో తన స్వభావాలతో, తన కంటే కూడా శక్తివంతుడిగా దేవుణ్ణి తయారు చేసుకొన్నాడు. మానవుడు గొప్ప శిల్పి, గొప్ప నిర్మాణకర్త అని రాబర్ట్ ఇంగర్‌సాల్ విశ్లేషించాడు. చార్లెస్ డార్విన్ అభిప్రాయం కూడా అదే అందుకు ఆయన 'బీగల్' నావలో 5 ఖండాలు 5 సంవత్సరాలు ప్రయాణం చేశాడు. ఎచ్.ఎం.ఎస్.బీగల్ అనే నావే ఆయనకు 5 సంవత్సరాలు ఒక ఇల్లు ఆయన ప్రయాణంలో 'సీసిక్‌నెస్'కు గురయ్యాడు. అంతే కాదు ఆ అనారోగ్యం ఆయన్ని జీవితాంతం వేధించింది కూడా. ఆయన ఆయా జాతులను పరిశోధించడమే కాదు. ఒక శాస్త్రీయ సత్యాన్ని కనుగొనడం

---

దాని తర్వాత రష్యా కార్మికుల పార్టీ, ఏర్పడ్డాయి. దీనర్థం ఏమిటంటే, ప్రతీఘాత విప్లవాన్ని వ్యతిరేకించే శక్తులు పని చేస్తున్నాయి, పని చేస్తూనే ఉంటాయి.

ఈ వ్యాసాన్ని ముగించే ముందు, 'సోవియట్ యూనియన్‌లో ప్రతీఘాత విప్లవం ప్రారంభమైనప్పుడు అది ఏ మార్గంలో నడిచింది? ఈ ప్రతీఘాత విప్లవంలో ఏ శక్తులున్నాయి?' వంటి ప్రశ్నలకు మొదటి నుంచీ సమాధానం ఇవ్వాలి. ఈ ప్రశ్నలకు సమాధానం ఇది:

సోవియట్ యూనియన్‌లో ప్రతీఘాత విప్లవం 1961లో జరిగింది. కాని దీనికి సన్నాహాలు మాత్రం 1956లోనూ, అంతకు ముందూ, ప్రారంభమయ్యాయి. సోషలిజం కోసం పోరాడిన మహనీయుడు కామ్రేడ్ స్టాలిన్ పట్ల అతని సహచరుల వైఖరి, కేంద్ర కమిటీలో కూడా ఒక విప్లవ ప్రతీఘాత, కమ్యూనిస్టు వ్యతిరేక ముఠా ఏర్పడిందని సూచిస్తుంది. కాంగ్రెస్‌లో వారు ఓటు చేసిన విధానాన్ని గమనిస్తే, కార్మిక వర్గ నియంతృత్వానికి వ్యతిరేకంగా ఏకగ్రీవంగా వారు ఎలా ఓటు చేశారో గమనిస్తే, కాంగ్రెస్ ప్రతినిధులను ఎలా ఎన్నుకున్నారో స్పష్టమవుతుంది. అంటే కృశ్చేవ్ ముఠా యాదృచ్ఛికంగా ఏర్పడినది కాదు. ఈ ముఠా బెరియాను హత్య చెయ్యడం ద్వారా పార్టీ అధికారులను బెదిరించింది. ఇది ఒక చీకటి కోణం. అప్పుడు బెరియా ఇంగ్లీషు గూఢచారి అని చెప్పడం జరిగింది. ఈ ఆరోపణ హాస్యాస్పదమైనది. ఎందుకంటే, బెరియా సోవియట్ యూనియన్ అణు కార్యక్రమాన్నీ, మిస్సైలు కార్యక్రమాన్నీ పర్యవేక్షించాడు. అదే సమయంలో మాస్కో స్టేట్ యూనివర్సిటీని నిర్మించాడు. నిన్న మొన్నటి వరకు స్టాలిన్‌ను ఆకాశానికెత్తిన వ్యక్తులు, స్టాలిన్ మీద దాడి జరుగుతుంటే, స్టాలిన్‌ను సమర్థిస్తూ ఒక్క మాట కూడా మాట్లాడని విషయాన్ని గమనించినప్పుడు, స్టాలిన్ గురించి సరియైన అవగాహన చాలా కాలం తర్వాత మాత్రమే ఎందుకు ప్రారంభమైందో స్పష్టమవుతుంది. ఇప్పుడు స్టాలిన్ గురించి ఈ సరియైన అవగాహన చాలా బలంగా వ్యాపిస్తోంది. సోవియట్ యూనియన్ లో ప్రతీఘాత విప్లవం గురించి క్లుప్తంగా మనం చెప్పగలిగేది ఇది.

*(ఇన్ డిఫెన్స్ ఆఫ్ కమ్యూనిజం, 2017 ఏప్రిల్ 10న అచ్చయిన వ్యాసానికి అనువాదం: తోలేటి జగన్మోహనరావు)*

*(మిఖయిల్ వి. పోపోవ్ రష్యాలోని సేంట్ పీటర్స్‌బర్గ్ స్టేట్ యూనివర్సిటీలో డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఎకనమిక్స్ అండ్ లా ప్రొఫెసర్)* వీ

కోసం ఇంత ప్రయాణం చేసిన వ్యక్తిని, అందునా 5 ఖండాలు 5 సంవత్సరాల్లో తిరిగిన వ్యక్తిని ప్రపంచంలో మరొకరిని చూడలేము. అసలు ప్రపంచం డార్విన్ అనే శాస్త్రవేత్తను గుర్తించడమే నిజమైన వెలుగు. ఎందరో తత్వవేత్తలు అనేక వ్యయప్రయాసాలకు ఓర్చి ఎన్నో తాత్వికమైన, శాస్త్రీయమైన, చారిత్రాత్మకమైన కొత్త అంశాలు కనుగొంటారు. అవి వెలుగులోకి రావడం చాలా కష్టం. అయితే అనేక వైరుధ్యాల మధ్య డార్విన్ వాటిని బయటకు తెచ్చాడు. డార్విన్ ముందు కూడా జీవశాస్త్ర పరిణామం గురించి కొంత పరిశోధన జరిగింది. ఆ పునాదులను కూడా డార్విన్ పరిశోధించాడు. 1707-1778 మధ్య జీవించిన జీవశాస్త్రజ్ఞుడు లినేనియన్ స్వీడన్ దేశస్థుడు. ఆయన సిద్ధాంతాలు శాస్త్రజ్ఞానంతో ప్రపంచానికి వెలుగునిచ్చాయి. ప్రపంచంలో శాస్త్రవేత్త అనేవాడు ఏ దేశంలోనైనా ఉండవచ్చు. ఆ శాస్త్ర జ్ఞానాన్ని మనమందరం అందుకోవడం మన జ్ఞాన విస్తృతికి మూలం అవుతుంది.

**శాస్త్రం మానవాభ్యుదయానికి నిచ్చెన**

శాస్త్రం అనేది మానవాభ్యుదాయానికి నిచ్చెన వంటిది. ఈనాడు మానవుని ప్రతి అడుగులో అభ్యుదయం శాస్త్రజ్ఞానం వల్లే జరుగుతుంది. సంఘపరివార శక్తులు భారతదేశంలో ఉన్న విద్యా వ్యవస్థకు గొడ్డలి పెట్టుగా ఉన్నారు. చరిత్రలో, అర్థశాస్త్రంలో, పర్యావరణ శాస్త్రంలో, భౌగోళిక శాస్త్రంలో అభూత కల్పనలు జూపించి సత్య నిష్టవైపు, శాస్త్ర జ్ఞానార్జనవైపు విద్యార్థులు పయనించకుండా పుక్కిట పురాణాలకు బానిసలు అయ్యేటట్లు చేస్తున్నారు. డార్విన్ అధ్యయనం చేయడం వల్ల ఒక శాస్త్ర సత్యాన్ని కనుగొనాలంటే ఎంత సుదీర్ఘమైన ప్రయాణాలు చేయాలి, ఎన్ని ప్రమాదాలను ఎదుర్కోవాలి, ఎంత త్యాగపూరితమైన జీవితాన్ని జీవించాలనే విషయాన్ని అర్థం చేసుకోవాలని మన పరిశోధకులకు అర్థం అవుతుంది. మోడీ రాజ్యంలో మత ఛాందసులుగా ఉన్న మంత్రులు చాలా మంది ఉన్నారు. వాళ్లు జ్ఞాన విదూరులు, మానవతా రహితులు, మేథో సంపన్న విధ్వంసుకులు. నిజానికి హేతువాద భావజాలానికి, మతానికి చాలా వైరుధ్యం ఉంది. శాస్త్రజ్ఞానం అనేది మనుషుల బుర్రలకెక్కాలంటే, విశ్వాసాలకు అతీతంగా ఆలోచించ గలగాల్సి ఉంది. ఏగతి రచియించినా, ఏగతి జీవించినా సమకాలం వారలు తత్వవేత్తలకు శాస్త్రవేత్తలకు మెచ్చరనేది ఒక సత్యం. తత్వవేత్తలను, శాస్త్రవేత్తకు సమన్వయం సాధించడంలో అద్వితీయమైన పాత్రను బెట్రాండ్ రస్సెల్ సాధించాడు. డార్విన్‌లో కాని, కారల్‌మార్క్స్‌లో కాని మరి ఏ తాత్వికునిలోను శాస్త్రవేత్తలోను ఉన్న శాస్త్రీయ భావజాల విస్తృతిని రస్సెల్ మన ముందుకు తెచ్చాడు. ప్రతి తత్వవేత్తకు, శాస్త్రవేత్తకు జ్ఞానానికి పరిమితులు ఉంటాయి. రాబోయే కాలం వారు వాటిలో కొన్నింటిని ఖండించవచ్చు. కొన్నింటిని పూరించవచ్చు. ఇదొక సత్యాన్వేషణాక్రమం. ప్రతి పౌరుడు, విద్యార్థి, పరిశోధకుడు శాస్త్రవేత్తల జీవితాలను అధ్యయనం చేయడం వలన, స్ఫూర్తి పొందవచ్చు. అంతేకాదు, వారి నుండి అధ్యయన క్రమాన్ని పరిశోధనా క్రమాన్ని మనం అనుసరించవచ్చు. చార్లెస్ డార్విన్ గొప్ప పరిశోధకుడే కాదు, గొప్ప అధ్యయన పరుడు. ఆయనది శాస్త్రపరమైన రచన. ఆయన జీవితంలోని ఆటుపోటులను ఆయన ధైర్యంగా ఎదుర్కొన్నాడు.

**6వ తరగతి నుండే పాఠ్యాంశం కావాలి**

డార్విన్ పరిణామ వాదాన్ని 6వ తరగతి నుండే పిల్లలకు అభ్యసనం చేయించ గలిగితే శాస్త్రం ఆవశ్యకత, మానవుని పుట్టుక మూలాలు విద్యార్థులకు ప్రాథమిక దశలోనే అర్థమౌతాయి. భూమి దేవత, పాల సముద్రం, శేషశాయి తల్పాలు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టి పెంపులయ కారుకులనే భ్రమలు తొలుగుతాయి. జ్యోతిష్య శాస్త్రం పచ్చి బూటకం, ఖగోళ శాస్త్రాన్ని అధ్యయనం చేయాలని తెలుస్తుంది. పరిణామ వాదం బుద్ధికి పదును పెడుతుంది. భూమి గుండ్రంగా ఉంది అన్నందుకు కొపర్నికస్‌ను జైల్లో బంధించారు. బ్రూనోను మంటల్లో తగలబెట్టారు. డార్విన్ పరిణామ వాదం కనిపెట్టక ముందు కూడా ప్రపంచ వ్యాప్తంగా పదార్థవాద చర్చ విస్తృతంగానే జరిగింది. డార్విన్ పరిణామ వాదం ఒక శాస్త్రంగా విద్యా వ్యవస్థను సుసంపన్నం చేసి మానవుని ఆవిర్భావం మీద ఒక స్పష్టతను తీసుకొచ్చి మనుషుల్లో ఆత్మస్థైర్యాన్ని కలుగ జేస్తుంది. ఈ రోజున భారతదేశమే కాదు ప్రపంచం మొత్తం కూడా డార్విన్ పరిణామవాదం వైపు నడుస్తుంది. ఆర్.ఎస్.ఎస్. వాళ్లు శాస్త్ర జ్ఞాన ఫలితాలు అనుభవిస్తున్నారు. మనిషి పుట్టుక తెలిస్తేనే వ్యక్తిత్వ వికాసము కలుగుతుంది. వ్యక్తి ఏ అతీత శక్తులకో బానిసై తనను తాను నియంత్రించుకోలేక అదుపుతప్పి ఉన్మాదై, హంతకుడై, అణచివేత దారుడై, ఆత్మన్యూనతాపరుడై తనను తాను ధ్వంసం చేసుకొనే పరిస్థితి నుండి డార్విన్ పరిణామ వాదం తానంటే ఏమిటో తెలుపుతుంది. సైన్స్ బోధించే ఉపాధ్యాయులే రాళ్లకు మొక్కుతుంటారు. పిల్లలకివ్వాల్సిన పాలను రాళ్లపై పోస్తారు. భారతదేశంలో గుడులున్నన్ని లైబ్రరీలు లేవు. ఆశ్రమాలున్నన్ని ల్యాబ్‌లు లేవు. దేవుళ్లు, దేవతల పేర్లను పిల్లలకు బట్టీపట్టిస్తారు. శాస్త్రవేత్తల పేర్లు రావు. రాముడు, కృష్ణుడు ఎవర్ని చంపారో నేర్పుతారు. ఏ వస్తువు ఎవరు కనుగొన్నారో చెప్పరు. దీని వల్ల విద్య మూఢ విశ్వాసాల మధ్యలో నలిగిపోతుంది. మరోపక్క భారతదేశంలో పండితులు ద్వైదీకృత జీవన విధానంలో జీవిస్తారు. ఫిజిక్స్, కెమిస్ట్రీ, జాగ్రఫీ, జువాలజీ బోధిస్తారు. వెంకటేశ్వర స్వామి బొమ్మవున్న ఉంగరాలు ధరిస్తారు. 'నాకు దేవుని దయ వల్ల పిల్లలు పుట్టారు అంటారు.

**సైన్సు టీచర్ ఇంట్లో సైన్స్ పరికరాలేవి?**

నాకు తెలిసిన సైన్స్ టీచర్ ఇంటిని చూశాను. ఆమె ఫిజిక్స్ బోధిస్తుంది. ఆమె ఇంటిలో సైన్స్ పరికరం ఒక్కటి లేదు. ఆమె సూర్యుణ్ని గురించి విద్యుత్తు గురించి బోధిస్తుంది. తన పిల్లల్ని 10 గంటల వరకు నిదుర లేపరు. భౌతిక దిన చర్యకు సంబంధించిన ఒక్క కార్యక్రమం ఆమె నిర్వహించదు అలాగే జువాలజీ, బాటనీ బోధించే ఉపాధ్యాయులను నేను చూశాను. వారికి పశువులు దేవతలు మనుష్యులు అంటరానివారు పశువులకు గడ్డివేయరు, కుడితి పెట్టరు, హిందూ ఉపాధ్యాయులకు గాని క్రైస్తవ ఉపాధ్యాయులు గాని సైన్స్‌ను సరిగా అధ్యయనం చేస్తే తప్పక దేవుణ్ణి మానవుడే సృష్టించాడని వారికి అర్థమవుతుంది. వారి ఇళ్లల్లో ల్యాబ్‌లు పెట్టుకొనేవారు. నేను ఆశ్చర్యపోతాను సైన్స్ ద్వారా లక్షల ధనం తీసుకొంటారు వంటి మీద జందెంతెంచరు, తండ్రి చచ్చిపోతే రసాయన శాస్త్రంలో భౌతిక శాస్త్రంలో డాక్టరేట్ పొందినవాడు పిండాలు కాకులకు పెట్టడం అంటే ఆశ్చర్యమే, విశ్వం గురించి బోధిస్తాడే కాని, విశ్వాన్ని అర్థం చేసుకోరు. భారతదేశంలో ఈ మతవాదం వల్ల సైన్స్‌కు బోసే డబ్బులో చాలా వ్యర్థం అవుతుంది. సైన్స్‌ను విద్యార్థులకు బోధించే సమయంలో ఉపాధ్యాయులు, లెక్చరర్లు సైన్స్‌ను వారు నిజంగా నమ్మినప్పుడే విద్యార్థులకు ఎక్కించగలుగుతారు. ఒక భౌతిక శాస్త్ర ఆచార్యుని ఇల్లు చూశాను. డజను మంది దేవుళ్ల ఫోటోలు పెట్టి

వుంచాడు. శాస్త్రవేత్త ఫోటోలు లేవు. కనీసం ఐన్‌స్టీన్, డార్విన్ వంటి వారి ఫోటోలు కూడా లేవు. ఆయన హెచ్.ఓ.డి.స్థాయిలో ఉన్నాడు. ఆయన విద్యార్థులకు ఏమి నేర్పుతాడో మనకు అర్థం కాదు. ముఖ్యంగా బ్రాహ్మణ ఉపాధ్యాయులు ఆర్.ఎస్.ఎస్. సంబంధమున్న వాళ్లు శాస్త్రజ్ఞానానికి బద్ధులు కాలేక పోతున్నారు. ఆర్.ఎస్.ఎస్. వారు విశ్వహిందూ పరిషత్ వారు నిర్వహించే బాలమందిరాలు చిన్న పిల్లలప్పుడే పిల్లల మేథస్సులు ఎదగకుండా చేస్తున్నాయి. బాలకృష్ణుడు పూతన అనే రాక్షసిని చంపాడని చనుబాలు తాగుతూ చన్నులను కొరికాడని బోధించడం వల్ల చిన్న పిల్లల్లోనే క్రౌర్య భావన శత్రు భావన పెంపొందుతున్నాయి. 'కృష్ణుడు ఎనిమిది భార్యలను చేసుకొన్నాడు 16 వేల మంది గోపికలతో ప్రణయకలాపాలు సాగించాడు' వంటి బోధనలు పిల్లల వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేస్తున్నాయి. చిన్నప్పుడు చదువుకోవడం కాదు ఆకతాయిగా తిరగడం వల్లే గొప్ప వాళ్లవుతారనే భావనలు గులుగుతున్నాయి. నాకు చాలా మంది సైన్స్ అధ్యాపకులతో స్నేహం వుంది. కేంద్రీయ విశ్వవిద్యాలయంలో అధ్యాపకులుగా ఉన్న వారు కూడా నాకు మిత్రులున్నారు. వీరంతా సైన్స్ గురించి పెద్ద పెద్ద సెమినార్లు జరుపుతారు. కాని వందకు వంద వారు సైన్స్‌ను నమ్మరు. వారు దేవుణ్నే నమ్ముతారు. దేవుడి వల్లే ఈ సృష్టి క్రమం జరిగిందని నమ్ముతారు. అందుకే ఆ సెమినార్లలో ఏమి కొత్త సిద్ధాంతాలు పుట్టవు. ఆ శాస్త్రజ్ఞానానికి ఉన్న సత్య సంధతను దెబ్బతీస్తారు. చాలా మంది వ్యక్తిత్వ శూన్యులవ్వడానికి కారణం శాస్త్ర జ్ఞానం లేకపోవడం వల్లనే. అధ్యయనానికి పుస్తకాలు ఎంత అవసరమో శాస్త్రజ్ఞానానికి పరికరాలు అవసరం.

**శాస్త్రజ్ఞానం వైజ్ఞానిక విప్లవ సంకేతం**

శాస్త్రం ఓ వైజ్ఞానిక విప్లవ సంకేతం. జీవితం సంఘం ప్రకృతి అంతస్సంబంధం కలిగినట్టివి. నేను సంస్కృత కళాశాలల్లో వైస్ ప్రిన్సిపల్‌గా పనిచేశాను. అక్కడ మా కొలీగ్స్ చేసే కొన్ని పనులు వింతగొలిపేవి. చాలా మంది దినపత్రిక చదవరు, లోకజ్ఞానాన్ని గూర్చి తెలుసుకోరు, వారు ఏ శాస్త్రంలో నిష్ణాతులో ఆ శాస్త్రాన్నే పదే పదే వల్లిస్తారు. అందులో ఉన్న లోతులు కూడా తెలుసుకోరు. భాషను ధారణ చేస్తారు. కాని దాని భావం జోలికి పోరు. తను చదివే శాస్త్రమే గొప్పదనుకొంటారు. వేరే శాస్త్రం జోలికి పోరు. ఈ కన్జర్వేటీజం వల్ల వారు చాలా నష్టపోయారు. వారందరూ బ్రాహ్మణులు వారందరితో నేను స్నేహంగా ఉండే వాణ్ణి కాని వారు ఒకరితో ఒకరు మాట్లాడుకోరు. వైదికులంటే నియోగులకు పడదు. నియోగులంటే వైదికులకు పడదు. ఒకరినొకరు నిందించుకొంటూ ఉండేవాళ్లు. నేను ఆశ్చర్యపడేవాణ్ణి. ఒక్క శాస్త్రవేత్త గురించి తెలుసుకోకుండా వీరు ఏదో ఒక చిన్న గుహను నిర్మించుకొని అందులో బతుకుతూ ఉంటారు ఏమిటి? అని బాధపడేవాణ్ణి. అంతేకాదు భారతీయ తత్వశాస్త్రంలో ఎంతో సైన్స్ ఉంది. ముఖ్యంగా కణాదిని వైశేషిక దర్శనం, కపిలుని న్యాయదర్శనం పదార్థవాదాన్ని నిక్కచ్చిగా విశ్లేషించాయి. వాటికి కూడా దేవుణ్ణి చేర్చారు. అదే నాకు ఆశ్చర్యం. దేవుణ్ణి మానవుడు ఆయా కాలంను అనుసరించి సృష్టించుకొన్నాడు. తాను తినే ఆహారమే తన దేవుడికీ పెట్టాడు. తాను నగ్నంగా ఉన్నప్పుడు తన దేవుణ్ణి నగ్నంగా ఉంచాడు. తాను వస్త్రాలు ఆభరణాలు ధరిస్తే తన దేవునికి అవి ధరింప జేశాడు. తన మీద ఓ అదుపుగా అతని పెట్టుకొన్నాడు. బహురూపులుగా దేవుణ్ణి చిత్రించుకొన్నాడు. అయితే విశ్వపరిణామం తనకు అర్థమయ్యాక కూడ మానవ ఆవిర్భావాన్ని గూర్చి అతనికి తెలిసినప్పటికి కూడా ఆ దేవుణ్ణి ఆ స్థానం నుంచి తొలిగించలేదు. నాకు తెలిసిన పండితులకు, పురోహితులకు, బోధకులకు దేవుడు లేడని తెలుసు అయితే దేవుని వలన చాలా పనులు జరుగుతున్నాయి అందుకే వారు దేవుణ్ణి ఆ స్థానం నుండి తొలగించడం లేదు. మొదట్లో పుట్టుకకు, పెరగడానికి మరణానికి కారకునిగా ఒకే దేవుణ్ణి సృష్టించుకొన్నారు. ఆ తరువాత రాను రాను ఒక్కొక్క కార్యానికి ఒక్కొక్కరిని పెంచుకొంటూ వెళ్లారు. 'దేవుడు' అనేది ఒక భావం. 'దేవత' అనేది కూడా ఒక భావమే. అలాగే 'దయ్యం' 'భూతం' 'పిశాచి' అనేవి ఒక భావాలే గాక భయాలు కూడా. వీటిని ప్రజల్లో కలిగిస్తున్నారు. కొంత మంది ఈ 'దేవుడు' భావం లేక రూపం వల్లే బతుకుతున్నారు. వారికి ఆహారం ఆ దేవుని వల్లే లభిస్తుంది. అందువల్ల ఆ దేవుణ్ణి పది మందికి బోధిస్తారు. 'దేవుడ'నే భ్రమ వారికి ఆహారం. పదిమంది దగ్గర దేవుని పేరు మీద దక్షిణలు పొందుతారు. ఇది వారికి కలిగే లాభం. అందువల్ల వారు 'దేవుడు' అనే వాడికి దెబ్బతగలకుండా చూసుకొంటారు. డార్విన్ పరిణామ వాదం ఈ దేవుడు అనే భావాన్ని దెబ్బతీసింది. దేవుడి పునాదిని కూల్చివేసింది. మనిషి ఆవిర్భావం మానవ పరిణామం నుండే జరిగిందని నిర్ధారించింది. మరి ఈ పాఠాన్ని ఆర్.ఎస్.ఎస్. నుండి వెళ్లిన ప్రొఫెసర్లు కూడా బోధించవలసిన పరిస్థితి వారు జీర్ణించుకోలేక పోతున్నారు.

డార్విన్ పరిణామ వాదం శాస్త్రీయ సత్యం. మరి వీరి రామాయణాలు, భారతాలు, భాగవతాల పరిస్థితి ఏమిటి? అవన్ని కల్పిత కథలు ఆ దేవుళ్లను వీళ్లే వీళ్ల అవసరాల కోసం సృష్టించారు. ఒక్క హిందూ మతంలోనే కాదు క్రైస్తవ, ఇస్లాం ఇలా ఎన్నో మతాల్లో దేవుణ్ణి శాస్త్రీయ భావాలకు భిన్నంగా పూజిస్తున్నారు. వీరంతా సైన్స్ సృష్టించిన పరికరాలన్ని వాడుకొంటున్నారు. ఒకనాడు ఆముదపు దీపాలు దేవుళ్ల దగ్గర వెలిగించేవారు. ఇప్పుడు విద్యుద్దీపాలతో దగదగలాడిస్తున్నారు. లక్షల మందిని పోగుచేసి దేవుని నామాలు జపింప చేస్తున్నారు. భారతదేశంలో ఎన్నో గుడిసెల్లో దీపాలు వెలగడం లేదు. కాని దేవుని గుళ్లలో విద్యుత్తు ఎంతో ఖర్చు అవుతుంది. చాలా మంది స్త్రీలకు చిన్న బంగారం లేదు కాని దేవుళ్లు దేవతలు బంగారు ఆభరణాలతో వెలిగిపోతున్నారు. ఇదంతా అనాలోచితంగానే జరుగుతోంది. దైవ భావన పేరుతో పేదలకు చేరాల్సిన సంపద ఎంతో బుగ్గిపాలవుతుంది. ప్రకృతి సంబంధ దేవుళ్లకు, దేవతలకు చేర్చడానికి బ్రాహ్మణులే అర్హులు ఎందుకు? వారు యజ్ఞోపతలీతాన్ని ధరిస్తారు.

**యజ్ఞోపవీతం-యాగం అంటే ఏమిటి?**

యజ్ఞోపవీతం అంటే ఏమిటో ఇలా చెప్పారు. యజ్ఞోపవీతం అంటే జందెం. వైదిక కర్మాచరణకు అర్హత కలిగిస్తుంది కనుక యజ్ఞ సూత్రం. వేదాధ్యయనయోగ్యత కలిగిస్తుంది గనుక బ్రహ్మసూత్రం. ఉపనయన సమయంలో అది బ్రహ్మ సూత్రం. ఎడమ భుజము మీది నుంచి ఒక వైపు ఉదర భాగాన్ని, మరొక వైపు వీపును తగులుతూ కుడిచేతి కింద వేలాడుతున్నప్పుడు అది ఉపవీతం. యజ్ఞసూత్రం ఇలా ఉన్నప్పుడు దేవతాకార్యాలన్నీ చేయవచ్చు. యజ్ఞ సూత్రం మెడలో హారంవలె వేలాడుతున్నప్పుడు అది నివీతం. ఋషితర్పణం, మలమూత్ర విసర్జ నాదులలో యజ్ఞోపవీతం నివీతంగా ఉండాలని అంటారు. యజ్ఞాంగం అంటే మేడి చెట్టు, సోమలత. యజ్ఞీయం అంటే యజ్ఞకర్మకు తగినది.

యజ్ఞాయజ్ఞీయం అంటే ఒక సామమంత్రం. యజ్ఞేశ్వరుడు అంటే ఇంద్రుడు అని చెప్పారు. యాగం అంటే దేవతలను ఆరాధించే శ్రౌతకర్మ అంటే, దేవతలకు చెందాలని కోరుతూ హోమ గుండలో హవిస్సులు వేయడం. యాగంలో ఐదు ముఖ్యాంశాలు ఉన్నాయి. 1.అశ్రావయ 2. అస్తు శ్వౌషట్ 3. యజ 4. యే యజామహే 5. వషట్. ఇవి యాగ శరీరాన్ని రూపొందించే ప్రధాన మంత్రాలు. వీటికి ముందు వెనుక చేసే పనులు, కల్పించే హంగులు అన్నీ వస్త్రాలంకారాల వంటివి. ఇందులో అశ్రావయ ప్రారంభరూపం. చివరిది వషట్కారం. తైత్తిరీయ సంహితలో యాగాన్ని కామధేనువుతో పోల్చి, ఈ ఐదు అంశాలను వివరించారు. యజ్ఞవాక్కులు కామ ధేనురూపం ధరిస్తున్నాయి. యజ్ఞ వాక్కులను సూనృతవాక్కులన్నారు. యజ్ఞం చేసే యజమాని అశ్రావయ అనే మంత్ర పాఠం చేత యజ్ఞరూప సూనృత వాక్ దేనువును ఆహ్వానిస్తాడు. అది ప్రారంభం. (ప్రాయణమ్) కామధేనువు పాలు చేపడానికి దూడను దగ్గరకు పిలవడం రెండవ అంశం. దీనికి ఉపయోగపడేది 'అస్తు శ్రౌషట్" మంత్రం. పాలు పిండుకోవడానికి పాత్రను సిద్ధం చేయడం మూడవ అంశం. ఇందుకు సంబంధించిన మంత్రం 'అజ', దోగ్ధ, అంటే పాలు పిండుకొనే యజమాని 'యే యజామహే' మంత్రంతో ధేనువు వద్దకు వెళతాడు. యజ్ఞం ద్వారా సాధించుకొన దలచుకొన్న కోర్కెను సాధించడం చివరి అంశం. 'వషట్' అనే మంత్రంతో ఇది పూర్తవుతుందని శ్రుతివచనం. ఈ ఐదు మంత్రాలలో మొత్తం పదిహేడు (సప్తదశ) అక్షరాలు ఉన్నాయి. యాగాలు అంటే యాగాలలో ప్రసిద్ధమైనవి కొన్ని ఇవి. అగ్న్యాధానం, దర్శపూర్ణ మాసాలు, పిండ, పితృయజ్ఞాలు, ఆగ్రయణం, చాతుర్మాస్యం, నిరూఢ పశుబంధం, సౌత్రామణి, ఔపాసనం, వైశ్వదేవం, స్థాలీపాకం, సర్పబలి, సత్రయాగం, ఈశాన బలి, అష్టకాన్వష్టక సోమయాగం, అగ్నిష్టోమం, అత్యగ్ని ష్టోమం, ఉక్థ్య, షోడశి, వాజపేయం, అతిరాత్రం, ఆప్తూర్యామం, సర్వతోముఖం, రాజసూయం, పౌండరీకం, అభిజిత్త, విశ్వజిత్త, అశ్వమేధం, బృహస్పతి సవం, అంగిరసం అన్నారు. ఈ యజ్ఞయాగాల మీద బ్రాహ్మణుల మీద ఒక్కరికే ఆదిపత్యం ఇచ్చి ఈ దేశ సంపదను మొత్తం వాళ్లే దోచుకొనే మార్గాన్ని ఏర్పాటు చేశారు. నిజానికి యజ్ఞంలో జరిగేదంతా వ్యర్ధ ప్రక్రియ దానివల్ల ఏ విధమైన ఫలితాలు రావు. బ్రాహ్మణులకు ఆయాచితంగా సంపద వస్తుంది అంతే. అయితే స్త్రీలకు మాత్రమే యాగ ఫలాన్ని పొందే యోగ్యతను తీసేశారు. దీనికి తోడు శైవం లింగాలను ప్రవేశపెట్టారు.

**శైవ క్షేత్రాలు దోపిడీ కేంద్రాలు**

పారమార్థిక పదకోశంలో లింగాల గురించి ఇలా వివరించింది. లింగాలన్నీ ఒకే రూపంలో ఉండవు. సాధారణంగా శివాలయంలో కనిపించేది నల్లరాతితో చేసిన శివలింగం. కళ్ళు, ముక్కు, చెవులు కలిగిన ముఖాలు ఉండవు. స్ఫటికంతో తయారు చేసిన లింగాలు, పాదరసంతో తయారు చేసిన లింగాలు కూడా ఉన్నాయి. లింగాల పరిణామానికి ప్రమాణ మేదీ లేదు. శ్రీశైలంలో చాలాచిన్న లింగం ఉన్నది. వేములవాడ లో ఎక్కువ కైవారం కలిగిన లింగం ఉన్నది. కొన్ని లింగాలకు ఒకటి నుంచి ఐదువరకు ముఖాలు ఉంటాయి. ఖాట్మండు (నేపాల్ రాజధాని) లోని పశు పతినాథుడి ఆలయంలో ఉన్న శివ లింగానికి ఐదు ముఖాలు ఉన్నాయి. అందులో ఒకటి ఊర్ధ్వ ముఖం. ఒకే శివలంగంపై చిన్న చిన్న లింగాకృతులు వెయ్యి వరకు ఉన్న పెద్ద శివలింగాలు అక్కడక్కడ ఉన్నాయి. పరమ శివుడి పంచముఖాలు, ఈశాన, తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాతాలు. వెయ్యిన్నొక్క ముఖాలు కలిగిన శివలింగా కృతిని ఆట్య లింగం అన్నారు. నూట ఎనిమిది ముఖాలు ఉండేలింగాన్ని అష్టోత్తర లింగమనీ, సారోద్య లింగమనీ అన్నారు. ముఖాలు లేకుండా మనకు సాధారణంగా శివాలయాలలో కనిపించే లింగాన్ని అకాట్యలింగం అన్నారు. లింగాలు –1 (ద్వాదశ జ్యోతిర్లింగాలు) 1. సౌరాష్ట్రలో (గుజరాత్) సోమనాథం. 2. శ్రీశైలంలో (ఆంధ్రప్రదేశ్) మల్లికార్జున మహాలింగం. 3. ఉజ్జయినిలో (మధ్యప్రదేశ్) మహాకాళం. (ఉజ్జయనికే ఒకప్పుడు అవంతి అనే పేరు ఉండేది) 4. మధ్యప్రదేశ్‌లోని ఖాండ్వా వద్ద నర్మదా నదీ తీరంలో మాంధాతృపురం అనే కొండ మీద వెలసిన జ్యోతిర్లంగం ఓంకారేశ్వరం/అమలేశ్వరం. 5. పూర్వోత్తర ప్రాంతంలో (బీహార్) వైద్యనాథం 6. దారుకావనంలో (గుజరాత్‌లో ద్వారకకు సమీపంలో) నాగనాథం (నాగేశ్వరం) 7. హిమాలయ పర్వతశ్రేణులలో మందాకినీ నదీతీరంలోని కేదారనాథం 8. మహారాష్ట్రలో సహ్యాద్రి శీర్షంలో గోదావరీ తీరాన, నాసిక్ వద్ద త్ర్యంబకం. 9. తమిళనాడులోని సేతు సమీపంలో తామ్రపర్ణి తీరాన రామేశ్వరం 10. మహా రాష్ట్రంలో భీమశంకరం అనే చోట వెలసిన భీమేశ్వరం. అస్సాంలో గువాహతి/ గౌహతి సమీపంలో భీమశంకరం అనేచోట వెలసిన లింగాన్నే భీమేశ్వరం అని కొందరు అంటారు గానీ అది సరికాదు. జ్యోతిర్లింగాలను గురించిన స్తోత్రంలో యం డాకినీ శాకిని సమాజై నిషేవ్యమాణం పిశి తాశ నైశ్చ.." అంటూ ఒక వర్ణన ఉంది. మహారాష్ట్రలోని సహ్యాద్రి పర్వతశ్రేణులలో భీమశంకర లింగం ఉన్న కొండను డాకినీ శిఖరం అంటారు. ఈ ఆధారాం చాలు మహారాష్ట్రలోనిదే భీమశంకరం అని నిర్ధారించడానికి. 11. కాశీలో (వారణాసి) గంగాతీరాన వెలసిన విశ్వేశ్వరం/విశ్వనాథం. 12. మహారాష్ట్రలో ఇళాపురం (దౌలతాబాద్, ఎల్లోరా గుహల సమీపం) వద్ద ఘృష్ణేశ్వరం ఏర్పడ్డాయి. వైష్ణవక్షత్రాలైనవనీ దోపిడి కేంద్రాలు, ఈ క్షేత్రాల్లోనే ఆర్.ఎస్.ఎస్. క్యాడర్ అభివృద్ధి అవుతుంది. ఇది మనం గుర్తించాలి.

భారతదేశంలో దేవాలయాలు అభివృద్ధి అవుతున్నాయి కానీ ల్యాబ్‌లు, విజ్ఞాన కేంద్రాలు, లైబ్రరీలు అభివృద్ధి కావడం లేదు. తల్లిదండ్రులు పిల్లలను మత క్షేత్రాలకు తీసుకెళ్లుతున్నారు. కానీ ల్యాబ్‌లకు, లైబ్రరీలకు, పుస్తకాల షాపులకు తీసుకెళ్లడం లేదు. ఇంట్లో శాస్త్రవేత్తల ఫోటోలు అలంకరించడం లేదు. ఇంట్లో గ్రంథాలయాలు రూపొందించుకోవడం లేదు. అందువల్ల లౌకికవాదులు ఈ ప్రత్యామ్నాయ సంస్కృతీ వికాసానికి కృషి చేయాలి. సైన్స్‌ను విద్యార్థులకు బోధించే సమయంలో శాస్త్రం మీద నమ్మకంతో చెప్పాలి. ప్రకృతికి తనకు ఉండే అంతస్సంబంధాలను తెలుపుతుంది. అందువల్ల విద్య, జ్ఞానం, సమన్వయం అవుతాయి. సమాజిక ప్రగతికి అవి మార్గాన్ని నిర్దేశిస్తాయి. ఇప్పుడు సంఘ పరివార శక్తుల్ని దాని పునాది మీద ఉన్న రాజ్యాన్ని దించడమే లౌకికవాదుల ముందున్న కర్తవ్యం. అందుకు ఐక్యంగా, సమన్వయంగా, సముజ్వలంగా, సముత్తేజంగా, వైజ్ఞానిక విప్లవాన్ని ముందుకు తీసుకెళ్లాలి. రాజకీయ అధికారాన్ని కూడా లౌకిక వాదులు చేపట్టినప్పుడే ఆర్.ఎస్.ఎస్.వారి వైజ్ఞానిక వ్యతిరేక వాదాలకు చరమగీతం పాడగలుగుతుంది. ఇది వైజ్ఞానిక విప్లవ యుగం. ఈ యుగ పరిణామాన్ని ఎవరూ ఆపలేరు. ఈ యుగం డార్విన్, బుద్ధుడు, అంబేద్కర్, బెట్రాండ్ రస్సెల్, రాబర్ట్ ఇంగర్‌సాల్ భావజాలానిది దేవుడు నిజం కాదు. ప్రకృతి, మనిషి, సమాజం, పరిణామాలే నిజం. ఇది చారిత్రక సత్యం. ఆ దిశగా పయనిద్దాం..

*(సామాజిక తత్వవేత్త, వ్యవస్థాపక అధ్యక్షుడు, నవ్యాంధ్రపార్టీ)* వీ

# బస్తర్‌లో భూసంబంధాలు - పరిశీలన

- లంకా పాపిరెడ్డి

నవంబర్ నెల వీక్షణంలో విశ్వం గారు రాసిన 'బస్తర్లో భూ సంబంధాలు' వ్యాసం ఎన్నో ప్రశ్నలను లేవనెత్తుతుంది. ఇప్పటి వరకు చెప్పబడుతున్న జనతన సర్కార్ల సహకార ఉద్యమం పైన కూడా అనుమానాలు కలుగుతాయి. వాస్తవాలతో పోల్చి చూసుకోకుండా కేవలం ప్రభుత్వ అధికారిక అరకొర సమాచారంతో ఒక సమాజాన్ని అంచనా వేయాలని చూస్తే తప్పుడు నిర్ధారణలకే రాకతప్పదు ఎవరికైనా. అరకొర సమాచారం ఎందుకు అంటున్నానంటే, బస్తర్లో ఎన్ని ఎకరాలలో వ్యవసాయం జరుగుతున్నది అనే లెక్క ప్రభుత్వం దగ్గర లేదు. మార్కెట్‌లో ఎంత ధాన్యం అమ్మ బడుతున్నది అనే లెక్క కూడా, ప్రభుత్వ సహకార సంఘాలు చెప్పిన లెక్క మాత్రమే. ప్రైవేట్ వ్యాపారస్తులు కొన్న లెక్క చెప్ప లేదు. బస్తర్లో 60 శాతం అడవి ఉన్నదనేది కూడా అనుమానమే. ఎవరైనా గూగుల్ మ్యాప్లో చూడవచ్చు. కొండలు, కొండల చుట్టూతా కొంత మాత్రమే అడవి మిగిలి ఉంది.

అయితే నేను ప్రధానంగా విశ్వం గారు చేసిన కొన్ని నిర్ధారణల గురించి చర్చించాలనుకుంటున్నాను. 'బస్తర్లో ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగాల్లో విప్లవాత్మకమైన మార్పులు జరిగి ఒక సామాజిక పరివర్తనగా ఫ్యూడలిజం ఉనికిలోకి రాలేదు.' అని రాశారు వ్యాసంలో. బస్తర్లో ఫ్యూడలిజం లేదని విశ్వంగారు రాశారు కాని, ఉన్న సామాజిక వ్యవస్థ ఏమిటి అనేది మాత్రం రాయలేదు. బస్తర్‌లో ఉన్న సామాజిక వ్యవస్థ ఏమిటో తేల్చుకోకుండా, శత్రువులు ఎవరో మిత్రులు ఎవరో తెలుసుకోవడం సాధ్యం కాదు. అక్కడ విప్లవానికి శత్రువులు ఎవరూ లేరనే విషయాన్ని పూర్తిగా ఆర్థిక కోణం నుండి ఈ వ్యాసం వివరిస్తున్నది. ఇక్కడ రాజకీయాలను వదిలివేయడం జరిగింది. గ్రామ పెద్దలకు కాని, ఇతర పెద్ద రైతులకు కాని, ప్రభుత్వంతో ఎలాంటి సంబంధాలు ఉన్నాయి? ప్రజలతో వారికి ఎలాంటి సంబంధాలు ఉన్నాయి? అనే విషయాలను కూడా చూడాల్సి ఉంటుంది. ఇక విప్లవాత్మక మార్పులు కూడా జరగలేదన్నారు. కాని అవి ఏమిటో? ఏమి జరగాల్సి ఉండిందో చెప్పలేదు. తరువాత 'ఏ సామాజిక వ్యవస్థకైనా దాని ఉత్పత్తి విధానమే పునాదిగా అనుకున్నప్పుడు, ఆదివాసులు ప్రాథమిక వ్యవసాయాన్ని చేస్తున్నంత మాత్రాన్నే వారు భూస్వామ్య సమాజంలోకి అడుగు పెట్టినట్లుగా పరిగణించలేం.' అని రాశారు.

ఇందులో రచయిత ప్రాథమిక వ్యవసాయం అని చెప్పారు. కాని అది ఏమిటో వివరణ లేదు. మిగతా వ్యాసాన్ని బట్టి దాని అర్థం తక్కువ ఉత్పాదకత అని అనుకోవచ్చు. కాని ఉత్పాదకత ఎక్కువ తక్కువలను బట్టి ఒక సామాజిక వ్యవస్థను నిర్ధారించడం జరగదు. పెట్టుబడిదారీ వ్యవస్థలో కూడా వ్యవసాయంలో ఒక్కో ప్రాంతంలో ఉత్పాదకత ఒక్కో విధంగా ఉంటుంది. దానితో ఉత్పాదకత తక్కువ ఉన్న ప్రాంతం పెట్టుబడిదారీ వ్యవస్థ కాకుండా పోదు. ఒక సమాజపు ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాల (ఉత్పత్తి విధానం) గురించి వివరించినప్పుడే అది ఏ సమాజమో అర్థం అవుతుంది. ఇక్కడ రచయిత వాటి గురించి వివరంగా విశ్లేషించలేదు. కాని భూమి లాంటి ఉత్పత్తి సాధనాల పైన వ్యక్తిగత స్వామిత్వమే ఉందని చెప్పాడు. ఉత్పత్తి సాధనాలు వ్యక్తిగత ఆస్తులుగా ఉన్నాయంటే, ఆ ఆదివాసి సమాజం సొంత ఆస్తి లేని, వర్గాలు లేని ఆదిమ కాలం నాటి ఆదిమ సమాజం కాదు అనేది స్పష్టం. నిస్సందేహంగా అది వర్గ సమాజమే.

దీని తరువాత 'కాసిన్ని తిండి గింజలు పండించే వ్యవసాయంతో పాటు అటవి ఉత్పత్తులపై ఆధారపడి ఉండడం ఆదివాసులకున్న ప్రత్యేకత' అని రాశారు. ఇక్కడ కూడా అటవీ ఉత్పత్తులపైన ఆధారపడడం అంటే ఏమిటో స్పష్టంగా వివరించ లేదు. అటవీ ఉత్పత్తులపైన ఆధారపడడం అంటే అడవిలో దొరికే ఇప్ప పూవు, ఇప్ప కాయ (గొరపర్క), లక్క, చింతపండు, జిగురు, లాంటివి సేకరించి, వాటిని సంతలలో అమ్ముకోవడం ద్వారా జీవితావసరాలను పొందడం అని అర్థమా? లేకపోతే కందమూలాలు, ఆకులు, కాయలు, పండ్లు, గింజలు లాంటివి సేకరించి ఆహారంగా ఉపయోగించడమని అర్థమా? అంటే ఆదిమ సమాజపు ఆహార సేకరణ దశ అని అర్థమా? బయటి వారిని చాలా మందిని గందరగోళపరిచే విషయం ఇది. అటవీ ఉత్పత్తుల సేకరణను, ఆహార సేకరణగా పొరబడుతుంటారు.

బస్తర్లో వ్యవసాయంతో పాటు, మార్కెట్ కొరకు అటవీ ఉత్పత్తులను సేకరించడమే ప్రధానం. ఇది ఏమి తెలియ చేస్తున్నది? ఆదివాసులు విస్తృతంగా మార్కెట్ సంబంధాలలోకి వచ్చారని చెప్పడం లేదా? విశ్వం గారి ప్రకారమే బస్తర్లో వెనకబడిన ప్రాంతాల నుండి కూడా వేల టన్నుల ధాన్యం (అదీ సహకార సంఘాల ద్వారా సేకరించిన లెక్కల ప్రకారం మాత్రమే. ఇంకా ప్రైవేట్ వ్యాపారులు కొన్న లెక్క చెప్ప లేదు రచయిత) మార్కెట్‌కు వస్తున్నదంటేనే ఆదివాసులు మార్కెట్‌కు లంకె వేయబడ్డారని అర్థం కావడం లేదా? ఒక్క చింతపండు వ్యాపారమే బస్తర్లో సంవత్సరానికి వెయ్యి కోట్ల రూపాయలు ఉంటుందని ఎప్పుడో కృష్ణ అనే కలెక్టర్ ప్రకటించాడు. అయితే బస్తర్లో పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు ఉన్నాయని నేను చెప్పడం లేదు. కాని ఆదివాసులు మార్కెట్ వ్యవస్థలోకి లాగబడిన తరువాత కూడా ఇంకా ఫ్యూడలిజానికి ముందటిది ఏదో సమాజం ఉన్నట్లు చెప్పడం తప్పు.

ఇక్కడ ఒక సమాజం తరువాత మరో సమాజం లెక్క ప్రకారం ఉనికిలోకి వచ్చిన తరువాతనే, సమాజం ముందుకు పోతుందనే అవగాహన కనిపిస్తున్నది. అయితే మనం ఏ ఆదివాసి సమాజం గురించి చెపుతున్నామో ఆ ఆదివాసి సమాజం చుట్టూ ఉన్న 'నాగరిక' సమాజంలోనే భూస్వామ్య విధానం దాని సాంప్రదాయ రూపంలో లేదు. ఆదివాసి సమాజం చుట్టూ ఉన్న భూస్వామ్య విధానం ఎలాంటిదో, అటువంటి భూస్వామ్య విధానమే ఆదివాసి సమాజంలో కూడా కాపీ చేయబడుతుంది. అంతేకాని మన ఆదివాసి సమాజాలలో సాంప్రదాయ ఫ్యూడలిజం ఎప్పుడూ ఉద్భవించదు. భారతదేశంలో ఆదివాసి సమాజాలు మిగతా సమాజానితో (అర్ధ వలస – అర్ధ భూస్వామ్య) సంబంధాలు లేకుండా, ప్రత్యేక దీవులలో మనుగడ సాగించడం లేదు. లేకపోతే ఆదివాసి సమాజం ఒక ప్రత్యేక దేశంగానూ లేదు. కనీసం స్వయం ప్రతిపత్తి కూడా లేదు. భారత దేశపు అర్ధ వలస – అర్ధ భూస్వామ్య సమాజం మధ్యలోనే, దానితో సంబంధంలోనే ఆదివాసులు ఉంటున్నారు. ఇంకా చెప్పాలంటే చుట్టూ ఉన్న అర్ధ వలస – అర్ధ భూస్వామ్య సమాజపు ఆధిపత్యంలో ఆదివాసి సమాజం మనుగడ సాగిస్తున్నది. ఇటువంటి పరిస్థితులలో ఆదివాసి సమాజాలలో కూడా ఎంత నెమ్మదిగా జరిగినా, వేగంగా జరిగినా, అర్ధ వలస – అర్ధ భూస్వామ్య సంబంధాలే రూపుదిద్దు కుంటాయి. కాని, సాంప్రదాయ ఫ్యూడలిజం ఉద్భవించడం జరగదు. నిజానికి ఇప్పటికే ఆదివాసి సమాజాలలో, అర్ధ వలస – అర్ధ భూస్వామ్య సమాజానికి అనుకూలమైన విభజనలు కూడికలు జరిగాయి, జరుగుతున్నాయి.

దీని తరువాత 'వేలాది సంవత్సరాలుగా ఆదివాసి సమాజాలకు పక్క పక్కనే ఇతరత్రా సామాజిక వ్యవస్థలు కొనసాగుతూ వచ్చినప్పటికీ, బ్రిటిష్ వాడు భారతదేశంలో అడుగు పెట్టేంత వరకు కూడా వారు తమదైన ఆర్థిక, రాజకీయ, సామాజిక, వ్యవస్థలను కాపాడుకుంటూ వచ్చారు. అవి నేటికి పూర్తిగా కనుమరుగవలేదు' అని రాశారు. ఈ నిర్ధారణ కూడా వాస్తవం

కాదు. బస్తర్లో కాకతీయుల కంటే ముందు కూడా వివిధ రాజులు పాలించారు. రాజుల పాలనలో బస్తర్లో ఎటువంటి మార్పులు జరగలేదనడం పరిశీలన లోపమే తప్ప నిజంకాదు.

రాజులు ఆదివాసి సమాజంలోని ప్రజాస్వామిక సంస్థలను, పద్ధతులను దెబ్బతీశారు. రాజులు ఆదివాసి సమాజంపైన ఆధిపత్యం కొరకు, వారి నిర్మాణాలను రాజరికానికి అనుకూలంగా మార్చినారు. గ్రామపెద్ద పటేల్ లాంటి పదవులను వంశపారంపర్య పదవులుగా మార్చినారు. కుదురు పెద్దలు కూడా రాజులకు అనుకూలంగా ఉంటూ ఆదివాసి సమాజంలో రాజుల అధికారానికి స్థంభాలుగా మారినారు. వీరంతా ప్రజలకు జవాబుదారీగా ఉండడం మాని రాజులకు జవాబుదారీగా ఉండడం మొదలైంది. వీరి అధికారానికి మూలం ప్రజలు అయినప్పుడు, ప్రజలకు జవాబుదారీగా ఉన్నారు. కాని ఎప్పుడైతే వీరి అధికారానికి, రాజు అధికారం మూలం అయ్యిందో అప్పుడు వీరి జవాబుదారి తనం కూడా సహజంగానే బదిలీ అయ్యింది. రాజులు ఆదివాసి సమాజం దగ్గరి నుండి క్రిమినల్, సివిల్ కేసులను పరిష్కరించే అధికారాలను తీసుకున్నారు. కుదురు పెద్దలకు ఆచార, సంప్రదాయాలకు చెందిన సమస్యలను పరిష్కరించే అధికారాన్ని మాత్రమే ఇచ్చారు. పైకి ఆదివాసి సమాజం రూపం ఏమి మారినట్లు కనిపించక పోయినా, దాని సారాంశం మారిపోయింది. దాని రాజకీయ స్వభావం మారిపోయింది. దాని నాయకులు రాచరికపు నియంతృత్వపు అధికార యంత్రాంగంలో భాగమైపోయారు తప్ప, ఏమి మారలేదనడం నిజం కాదు.

బ్రిటిష్ వాళ్లు వచ్చిన తరువాత, ఆదివాసి సమాజాలలో ఇంకా ఎక్కువ మార్పులు జరిగాయి. బ్రిటిష్ వాళ్ల ఆదివాసి సమాజపు నిర్మాణాలను వాడు కోవడమే కాకుండా ఆదివాసి సమాజపు నిర్మాణాల పైన తమదైన మాంజీ వ్యవస్థను నెలకొల్పారు. ఆదివాసులపై ఆంక్షలు విధిస్తూ రిజర్వ్, అన్ రిజర్వ్డ్ అడవిగా విభజించారు. కొత్త అటవీ చట్టాలు తెచ్చారు. రాజుల కంటే పటిష్టంగా పన్నులు వసూలు చేసే వ్యవస్థను నెలకొల్పారు. ఆంగ్లేయుల పన్నులకు వ్యతిరేకంగా బస్తర్ ఆదివాసులు తిరుగుబాట్లు కూడా చేశారు. మొత్తంగా ఆదివాసులు అడవి మీద అధికారం కోల్పోయారు. వెట్టిచాకిరీల పాలయ్యారు. ఆంగ్లేయులు ఆదివాసుల సహజసిద్ధ అభివృద్ధి క్రమాన్నే మార్చివేసినారు.

చివరిలో మరోసారి.... 'బస్తర్లో అక్కడక్కడ విసిరేసినట్లుగా దినేష్ కశ్యప్, మహేంద్ర కర్మాల్, పొదియ పటేల్ లాంటి భూస్వాములు ఉన్నా అది జనరలైజు కాదు' అని చెప్పారు విశ్వం గారు. నిజానికి విశ్వం గారు పరిశీలించిన మూడు గ్రామాలు, ఏడు గూడాలు (పారలు) జనరలైజ్ కాదు. ప్రధానంగా అభూజ్మాడ్ చుట్టూతా దగ్గరలో ఉన్నా లోతట్టు గ్రామాలను తీసుకుని మొత్తం బస్తర్‌ను సాధారణీకరించడం తప్పు. కొత్తగా వలస వస్తున్న వారితో మారిపోతున్న గ్రామాలను, కొత్త గ్రామాలను పట్టుకుని మొత్తం బస్తర్‌ను జనరలైజ్ చేయడం తప్పు. బస్తర్ దక్షిణ ప్రాంతంలోని, దంతేవాడ, బీజాపూర్, సుక్మా, కుంటా ప్రాంతాలలో కాని, ఉత్తర ప్రాంతంలోని కాంకేర్, అంతాగడ్, కొండాగావ్, జగ్దల్పూర్, ప్రాంతాలలో కాని కావలిసినంత మంది భూస్వాములు ఉన్నారు. జనసాంద్రత ఎక్కువగా ఉన్న, పెద్ద గ్రామాలు ఉన్న ప్రాంతాలను వదిలివేసి, జనసాంద్రత తక్కువ ఉన్న ప్రాంతాలను గ్రామాలను ఎంచుకుని చేసే పరిశోధన, పరిశీలన మొత్తం బస్తర్‌ను గురించిన సాధారణ చిత్రాన్ని ఇవ్వదు. అసలు దక్షిణ బస్తర్లో భూస్వాముల భూములు పంచడం వల్లనే ఉద్యమానికి బలమైన పునాదులు నిర్మాణం అయ్యాయి. ఉద్యమం విస్తరించింది. విశ్వం గారు బస్తర్ ఉద్యమ చరిత్ర పైన దృష్టి సారించలేదు.

చివరిగా బస్తర్ చరిత్ర కొద్దిగా చెప్పి ముగిస్తాను. ఎందుకంటే విశ్వం గారు 34 సంవత్సరాల క్రితం నాటి పాత చర్చనే మళ్లీ ఒకసారి ముందుకు తెచ్చారు. విశ్వం గారి ప్రకారం, 1) బస్తర్లో భూస్వాములు లేరు, భూస్వామ్యం లేదు. 2) అసలు వర్గాలే ప్రాథమిక స్థాయిలో (అంటే ఏమిటో) ఉన్నాయి. 3) భూమి అంతా భూస్వాముల చేతుల్లో కాక సామ్రాజ్యవాద దన్ను కలిగిన బడా బూర్జువా - బడా భూస్వామ్య రాజ్యం చేతుల్లో ఉంది. 4) అడవిని ఆదివాసులకు కాకుండా చేసి అడవిలోని వనరులను, ఖనిజాలను దోచుకుపోవడమే ఆదివాసుల సమస్యలకు ప్రధాన కారణం.

విశ్వం గారు చెప్పిన దాని ప్రకారం, ఆదివాసులకు, ప్రభుత్వానికి మధ్యనే ప్రధాన వైరుధ్యం ఉంటున్నది. సరిగ్గా ఇటువంటి వాదననే ఇంకా మంచి రూపంలో 1983లో బస్తర్ బాధ్యుడిగా ఉన్న రాష్ట్ర కమిటీ సభ్యుడు లేవనెత్తాడు. ఆ రాష్ట్ర కమిటీ సభ్యుని ప్రకారం....1) బస్తర్లో వర్గాలు లేవు, ఆదివాసులంతా ఒకటే వర్గం, వారి మధ్య వర్గ పోరాటం లేదు. 2) మొత్తం ఆదివాసులకు ప్రభుత్వానికి మధ్య ఉన్నదే ప్రధాన వైరుధ్యం. 3) భూస్వామ్య విధానాన్ని కూలదోసే విప్లవాన్ని, నూతన ప్రజాస్వామిక విప్లవం అంటున్నాం. కాని ఇక్కడ భూస్వామ్య విధానంతో పోరాటమే లేదు. కావున నూతన ప్రజాస్వామిక విప్లవం అనకూడదు. ఏమనాలో ఆలోచించాలి. 4) ఆదివాసుల్లో వర్గాలు లేవు కావున మనం సంఘాలు పెట్టవద్దు. సంఘాలు పెడితే ఆదివాసులు చీలిపోతారు. ఆదివాసుల్లో ఇప్పటికే ఉన్న, వారి నిర్మాణాలనే వాడుకోవాలి. ఇవీ ఆ రాష్ట్ర కమిటీ సభ్యుని అభిప్రాయాలు. అప్పుడు కొండపల్లి సీతారామయ్య జైలులో ఉన్నారు. కార్యదర్శిగా ఉన్న కె.జి. సత్యమూర్తి గారు ఒక్క విషయాన్ని మాత్రం ఖండించారు. ఆదివాసులు ఏ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడు తున్నారో ఆ ప్రభుత్వం బడా భూస్వామ్య - బడా బూర్జువా ప్రభుత్వమే కావున నూతన ప్రజాస్వామిక విప్లవమే అనాలి అన్నాడు. కాని వర్గాలు ఉన్నాయా లేవా, భూస్వాములు ఉన్నారా లేరా అనే విషయాల గురించి ఏమి చెప్పలేదు.

1983 నుండే రాష్ట్ర కమిటీ సభ్యుని వాదనలతో విభేదించే వారు, తమ వాదనలను ఈ విధంగా ముందు పెట్టారు.. 1) తెలంగాణతో, ఇతర మైదాన ప్రాంతాలతో పోల్చుకుని ఇక్కడి వర్గాలను పరిశీలించ వద్దు. ఇక్కడి సమాజాన్ని ఇక్కడి పరిస్థితులలోనే నిర్దిష్టంగా పరిశీలించాలి. 2) ఆదివాసి సమాజంలో వర్గాలు ఉండడమే కాదు, ఆదివాసుల్లోని పెత్తందార్లు, భూస్వాములు ప్రభుత్వ ప్రతినిధులుగా పనిచేస్తున్నారు. వీళ్లు ఆదివాసి సమాజంలో ప్రభుత్వం యొక్క స్థంభాలు. వీళ్లు లేకపోతే ఆదివాసి ప్రాంతాలలో అసలు ప్రభుత్వమనేదే ఉండదు. 3) పెత్తం దార్లు, భూస్వాములు, ఆదివాసి సమాజానికి, ప్రభుత్వానికి మధ్య దళారులుగా పనిచేస్తూ ఆదివాసి సమాజాన్ని ప్రభుత్వానికి లొంగి ఉండేలా చేస్తున్నారు. 4) పెత్తందారులతో, భూస్వాములతో పోరాడుతూ, ఆదివాసులను సంఘాలలో సంఘటిత పరిచినప్పుడే ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం సాధ్యం అవుతుంది. ఆదివాసుల ప్రయోజనాలు నెరవేరుతాయి... (బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడాలనుకుంటే, ముందు ఆదివాసుల లోని వారి తొత్తులకు వ్యతిరేకంగా పోరాటం చేయకుండా సాధ్యం కాదని 1910 లోనే, గుండాదుర్ గుర్తించాడు. అందుకే గుండాదుర్, తిరుగుబాటును బ్రిటిష్ వారి తొత్తు అయిన సోను మాంజి పైన దాడితోనే మొదలు పెట్టాడు.) 1983 నుండి దాదాపు 4 సంవత్సరాలు చర్చోప చర్చలు జరిగినాయి. చివరికి అప్పటి ఫారెస్ట్ కమిటీ, బస్తర్లో వర్గాలు ఉన్నాయి, మైదాన ప్రాంతాలతో పోల్చితే దోపిడి ప్రిమిటివ్ దశలో ఉంది. ఇక్కడ కూడా నూతన ప్రజాస్వామిక విప్లవ కార్యక్రమమే అమలు అవుతుందని తీర్మానం చేసింది. దీనితో బస్తర్లో వర్గాలు ఉన్నాయా లేవా అనే చర్చకు తెర పడింది.

ఈ తీర్మానం తరువాతనే రెండు సంవత్సరాలలో బస్తర్లో ఉద్యమం ఊపందుకున్నది, విస్తరించింది. బస్తర్ ఉద్యమ చరిత్రను పరిశీలిస్తే చాలు బస్తర్లో వర్గాలున్నాయా లేవా, వర్గపోరాటం నడిచిందా లేదా తెలుస్తుంది. బస్తర్ ఉద్యమ చరిత్ర అంతా స్థానిక పెత్తందార్లు, భూస్వాములు, ప్రభుత్వం ఒకవైపున, మిగతా ఆదివాసులంతా ఒక వైపున నిలిచిన చరిత్రే. పాక్షిక అధ్యయనంతో, అరకొర సమాచారంతో, ఉద్యమ చరిత్రను పట్టించు కోకుండా పరిశోధన చేస్తే తప్పుడు నిర్ధారణలకే వస్తారు ఎవరైనా. వీ

*(రచయిత సామాజిక కార్యకర్త)*

### ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర బంద్

కేంద్ర బడ్జెట్‌లో ఆంధ్రప్రదేశ్‌కు నిధుల కేటాయింపులో అన్యాయం జరిగిందని దీనికి నిరసనగా ఫిబ్రవరి 6న వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ, జనసేన, కాంగ్రెస్, ఇతర ప్రజా సంఘాలన్నీ బంద్‌కు పిలుపునిచ్చాయి. ఈ కారణంతో పలుచోట్ల ఆయా పార్టీల నాయకులను, జర్నలిస్టులను పోలీసులు అరెస్ట్ చేశారు. బంద్‌లో వామపక్ష పార్టీలు, మహిళా సంఘాలు, జర్నలిస్టు యూనియన్‌లు, విద్యార్థి సంఘాలు ,ప్రజలు పాల్గొని రాష్ట్ర వ్యాప్తంగా బంద్ పాటించారు. దీంతో విద్యా సంస్థలు మూసివేశారు. బస్ స్టేషన్‌ల నుంచి బస్‌లు కదలక ప్రయాణికులు ఇబ్బందిపడ్డారు.

### మరో ప్రపంచం కోసం కలలు కనండి : గూగి

'యుద్ధ కాలంలో స్వప్నాలు' అనే పుస్తకావిష్కరణ మలుపు ప్రచురణ సంస్థ ఆధ్వర్యంలో హైదరాబాద్‌లోని తెలుగు విశ్వవిద్యాలయం ఆడిటోరియంలో ఫిబ్రవరి 18న నిర్వహించింది. ఈ కార్యక్రమానికి ఎన్. వేణుగోపాల్ అధ్యక్షత వహించారు. గూగి వా థియోంగో ఆంగ్లంలో రాసిన పుస్తకాన్ని ప్రొ. జి.ఎన్. సాయిబాబా తెలుగులో అనువదించారు. ఈ పుస్తకాన్ని ప్రొఫెసర్ సుజీతారు ఆవిష్కరించారు. ఈ సందర్భంగా గూగి ప్రతి ఒక్కరు కలలు కనాలని పట్టుదల ఉంటే కలలు సాకారం అవుతాయన్నారు. ఏ పాలకులైనా తాము చేస్తున్నదే అభివృద్ధిగా చెపుతారని, ఎక్కడైతే అణచివేత, నిర్బంధం ఉంటుందో అక్కడే అసలైన అభివృద్ధికి బీజాలు పడతాయన్నారు. ఈ కార్యక్రమంలో ఎ.కె. ప్రభాకర్, కె. శ్రీనివాస్, వరలక్ష్మి, ప్రచురణ సంస్థ నిర్వాహకులు కె. బాల్‌రెడ్డి అట్లాగే తెలుగు రాష్ట్రాల్లోని అభిమానులు పాల్గొన్నారు.

### ఎన్‌కౌంటర్‌లో పాల్గొన్న పోలీసులపై కేసు నమోదు

సిపిఐ మావోయిస్టు కేంద్రకమిటీ సభ్యుడు ఆజాద్, జర్నలిస్టు హేమచంద్ర పాండేల ఎన్‌కౌంటర్ కేసులో ఆరోపణలు ఎదుర్కొంటున్న 29 మంది పోలీసులపై కేసు నమోదు చేసి, వారిని కోర్టులో హాజరుపర్చాలని ఆదిలాబాద్ జిల్లా ఎస్‌సి, ఎస్‌టి ప్రత్యేక కోర్టు ఫిబ్రవరి 15న ఆదేశించింది. ఆదిలాబాద్ జిల్లాలోని అటవీ ప్రాంతంలో 2010 జూలై 1న జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఆజాద్ సహా జర్నలిస్ట్ హేమచంద్రపాండే చనిపోయినట్టు పోలీసులు ప్రకటించారు. అయితే వారిని నాగ్‌పూర్‌లో పట్టుకొని హత్య చేసి ఆదిలాబాద్ అడువుల్లో పడేశారని ఆరోపించిన ఆజాద్ భార్య పద్మ ఇందులో పాల్గొన్న 29 మంది పోలీసులపై విచారణ చేపట్టాలని 2013 జూలై 2న కోర్టులో ప్రొటెక్ట్ పిటిషన్ వేశారు. రెండేళ్ల అనంతరం పోలీసులను విచారించడం వీలుకాదంటూ పిటిషన్‌ను స్థానిక కోర్టు తిరస్కరించింది. దీంతో ఆమె జిల్లా కోర్టును ఆశ్రయించారు. ఈ న్యాయస్థానం ఇచ్చిన తీర్పు పట్ల ఆమె ఇది ప్రజల, ప్రజాస్వామిక వాదుల విజయంగా అభివర్ణించారు.

### తెలంగాణ ఎన్నికల ప్రధాన అధికారిగా రజత్‌కుమార్

తెలంగాణ రాష్ట్ర తొలి ఎన్నికల ప్రధాన అధికారిగా రజత్‌కుమార్‌ను నియమిస్తూ కేంద్ర ఎన్నికల సంఘం ఫిబ్రవరి 19న ఉత్తర్వులు జారీచేసింది. 1991 ఐఏఎస్ బ్యాచ్‌కు చెందిన ఈయన రాష్ట్ర అటవీ, పర్యావరణ శాఖ ముఖ్య కార్యదర్శిగా పనిచేస్తున్నారు. తెలుగు రాష్ట్రాలకు సిఇఓగా పనిచేసిన భన్వర్‌లాల్ అనంతరం ఆంధ్రప్రదేశ్ సిఇఓగా సిసోడియా, తెలంగాణ ఇన్‌చార్జ్ సిఇఓగా అనూప్‌సింగ్‌ను కేంద్ర ఎన్నికల సంఘం నియమించింది. తెలంగాణ రాష్ట్ర ఎన్నికల ప్రధాన అధికారిగా రజత్‌కుమార్‌ను నియమిస్తూ కేంద్ర ఎన్నికల సంఘం కార్యదర్శి బి.సి. పాత్ర ఆదేశాలు జారీచేశారు.

### పంటలకు మద్దతు ధర కోసం రైతుల ఆందోళన

పండించిన పంటలకు గిట్టుబాటు ధర ఇవ్వాలంటూ తెలంగాణ వ్యాప్తంగా రైతులు ఫిబ్రవరి 23న వివిధ జిల్లాల్లో ఆందోళనలు నిర్వహించారు. వరి, మక్కజొన్న, పసుపు పంటలకు మద్దతు ధర పెంచాలని డిమాండ్ చేస్తూ జగిత్యాల జిల్లా కేంద్రంలోని కలెక్టర్ కార్యాలయం గేట్ ఎక్కి లోనికి వెళ్లే ప్రయత్నం చేశారు. మహబూబ్‌నగర్ మార్కెట్ యార్డులో రైతులు అదే రోజు ఆందోళన నిర్వహించారు. కొందరు రైతులు మార్కెట్ కార్యాలయం లోకి చొచ్చుకెళ్లి ఫర్నీచర్‌ను ధ్వంసం చేశారు. అనంతరం మార్కెట్ బయట, రైల్వేగేట్ ముందు ధర్నా చేశారు. నిర్మల్ జిల్లా బైంసా మార్కెట్ యార్డులో తమ కొనుగోళ్ల లక్ష్యం పూర్తయిందంటూ వ్యాపారులు కొనుగోలు కేంద్రాలను మూసివేయడంతో కంది రైతులు నిరసగా భారీ ర్యాలీగా వెళ్లి బస్టాండ్ వద్ద ధర్నా నిర్వహించారు. జామాయిల్, సుబాబుల్‌కు గిట్టుబాటు ధర కోసం ఖమ్మం జిల్లా రైతులు రోడెక్కి మహాధర్నా నిర్వహించారు.

### సీనియర్ జర్నలిస్టు జి. రమేష్‌బాబు మృతి

సీనియర్ పాత్రికేయులు, న్యూస్‌టుడే పూర్వ మేనేజింగ్ డైరెక్టర్ గుత్తికొండ రమేష్‌బాబు (69) మృతిచెందారు. గత కొంత కాలంగా అనారోగ్యంతో బాధపడుతున్న ఆయన హైదరాబాద్‌లోని ఎర్రగడ్డలోని తన స్వగృహంలో ఫిబ్రవరి 24న మరణించారు. ప్రకాశం జిల్లా దుద్దుకూరులో 1949లో జన్మించిన ఆయన ఆంధ్రజ్యోతిలో తన కెరీర్‌ను ప్రారంభించారు. ఆ తరువాత న్యూస్‌టుడేలో చేరి మేనేజింగ్ డైరెక్టర్ స్థాయికి ఎదిగారు.

### సాహితీవేత్త మునిపల్లె రాజు మృతి

సాహితీవేత్త రచయిత మునిపల్లె రాజు (93) మృతి చెందారు. ఆయన గత కొంతకాలంగా అనారోగ్యంతో బాధపడుతూ ఫిబ్రవరి 24న హైదరాబాద్ సైనిక్‌పురిలో తన నివాసంలో కన్నుమూశారు. ఆయన 1925, మార్చ్ 16న గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా గరికపాడులో జన్మించారు. ఆయన 1949లో రక్షణ రంగంలో ఇంజనీర్‌గా చేరి 1983లో హైదరాబాద్‌లో ఉద్యోగ విరమణ చేశారు. ఆయన రాసిన 'అస్తిత్వనదం ఆవలి తీరాన' రచనకు 2006లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. గత శతాబ్ది గొప్ప కథలలో ఒకటిగా చెప్పుకుంటున్న రాయలసీమ కరువు సమస్యల గాథ 'వీర కుంకుమ' కూడా ఇందులో ఉంది. ఆయన రష్యన్ సాహిత్యం వల్ల అన్ని వాదాల కంటే మానవత్వమే గొప్పదనే నిర్ణయానికి వచ్చారు. ఆయన రచనల్లోనూ అది కనిపిస్తుంది. ఆయన రెండు పద్య సంకలనాలు, నాలుగు కథా సంకలనాలు, పలు వ్యాసాలు రాశారు.

### ఆంధ్రప్రదేశ్‌లో భాగస్వామ్య సదస్సు

ఆంధ్రప్రదేశ్ పార్ట్‌నర్‌షిప్ సమ్మిట్ విశాఖపట్నంలో ఫిబ్రవరి 24 నుంచి 26 వరకు సిఐఐ భాగస్వామ్యంతో ముఖ్యమంత్రి చంద్రబాబు అధ్యక్షతన ఈ పారిశ్రామిక భాగస్వామ్య సదస్సు జరిగింది. ఈ సదస్సుకు ఉప రాష్ట్రపతి వెంకయ్యానాయుడు, కేంద్ర వాణిజ్యశాఖ మంత్రి సురేష్ ప్రభుతో పాటు 15 దేశాలకు చెందిన వాణిజ్య శాఖల మంత్రులు, అధికారులు హాజరయ్యారు. ఈ సదస్సులో రు. 4.3 లక్షల కోట్ల పెట్టుబడులకు వీలు కల్పించే 734 అవగాహన ఒప్పందాల (ఎంఓయు)పై సంతకాలు జరిగినట్లుగా చంద్రబాబు వెల్లడించారు. ఈ పెట్టుబడులతో 11 లక్షల మందికి ఉపాధి అవకాశాలు లభిస్తాయన్నారు. వీ

### కేంద్ర బడ్జెట్ 2018-19

కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ 2018-19 కేంద్ర బడ్జెట్‌ను, రైల్వే బడ్జెట్‌ను ఫిబ్రవరి 1న ఆయన లోక్‌సభలో ప్రవేశపెట్టారు. వచ్చే ఏడాది ఎన్నికల నేపథ్యంలో ఎన్‌డిఏ ప్రవేశపెట్టే ఆఖరి పూర్తి బడ్జెట్ ఇది. ఈ ఏడాది బడ్జెట్ మొత్తం రు. 24,42,213 కోట్లు. ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని గ్రామీణ, వ్యవసాయ రంగాలకు పెద్దపీట వేశారు. ఈ రంగాల అభివృద్ధికి 63 వేల కోట్ల రూపాయలు కేటాయించారు. రక్షణ రంగానికి 2.95 లక్షల కోట్లు కేటాయించారు.

### కశ్మీర్‌లో పెరిగిపోతున్న ఎన్‌కౌంటర్ మరణాలు

లష్కరే తాయిబాకి చెందిన మిలిటెంట్ నవీద్‌ను శ్రీనగర్‌లోని మహారాజా హరిసింగ్ ఆసుపత్రికి పోలీసులు ఫిబ్రవరి 6న ఎస్కార్ట్‌తో తీసుకురాగా అక్కడే ఉన్న లష్కరే తాయిబా మిలిటెంట్లు ఎస్కార్ట్ పోలీసులపై కాల్పులు జరపడంతో ఇద్దరు పోలీసులు మరణించారు. నవీద్‌ను మిలిటెంట్లు పోలీసుల నుంచి విడిపించుకుపోయారు. జమ్మూకశ్మీర్‌లోని షోపియాన్ జిల్లాలోని గోవాంపురా ప్రాంతంలో భద్రతా బలగాల వాహన శ్రేణిపై ఫిబ్రవరి 8న నిరసనకారులు రాళ్లు రువ్వారు. నిరసన కారులపై సైన్యం కాల్పులు జరపడంతో ఇద్దరు పౌరులు ప్రాణాలు కోల్పోయారు. ఈ ఘటనను నిరసిస్తూ కశ్మీర్ ప్రత్యేక ప్రతిపత్తిని కోరుకుంటున్న సంస్థలు ఫిబ్రవరి 9న బంద్‌కు పిలుపునిచ్చాయి. దీంతో పలు ప్రాంతాల్లో కర్ఫ్యూ విధించారు. జమ్మూ పట్టణ శివారులోని సుంజవాన్ ఆర్మీ క్యాంపుపై ఫిబ్రవరి 10న మిలిటెంట్లు కాల్పులు జరపడంతో ఇద్దరు భద్రతా అధికారులు, ఇద్దరు మహిళలు, ఒక బాలికతోపాటు ఆరుగురికి గాయాలయ్యాయి. అదేరోజు సాయంత్రం ముగ్గురు మిలిటెంట్లను జవాన్లు కాల్చిచంపారు. శ్రీనగర్‌లోని కారానగర్ 23 బెటాలియన్ క్యాంప్ పై ఫిబ్రవరి 12న మిలిటెంట్లు దాడిచేయడంతో ఒక జవాను మృతిచెందారు.

### గుజరాత్‌లో దళిత సంఘాల ఆందోళన

దళితులకు భూమి ఇవ్వాలంటూ భానూబాయ్ వంకార్ అనే దళిత నేత ఫిబ్రవరి 16న పఠాన్‌లోని కలెక్టర్ కార్యాలయం వద్ద ఆత్మహత్య చేసుకున్నారు. ఈ విషయం పై గుజరాత్ వ్యాప్తంగా దళిత సంఘాలు ఓ దళిత నేత ఆత్మహత్యను పోలీసులు ఆపలేకపోయాయంటూ ఆందోళన చేపట్టాయి. గుజరాత్ రాజధాని గాంధీనగర్ సహా..అహ్మదాబాద్, మెహసనాలోని పఠాన్, సరస్‌పూర్‌లో రహదారులపై బైఠాయించి వాహనాలను అడ్డుకున్నారు. సరస్‌పూర్ వద్ద గుజరాత్ స్వతంత్ర ఎంఎల్ఏ జిగ్నేష్ మేవానితో పాటు వేర్వేరు ప్రాంతాలలో 70 మంది ఆందోళనకారుల్ని అరెస్టు చేసినట్లు సీనియర్ పోలీసు అధికారి జె.కె. భట్ తెలిపారు.

### గౌరీ లంకేశ్ హత్యకేసులో హిందూ జాగరణ నేత అరెస్టు

సీనియర్ జర్నలిస్టు గౌరీ లంకేశ్ హత్యకు సంబంధించిన ప్రాథమిక ఆధారాలను సేకరించిన తరువాత, ఈ హత్య వెనుక హిందూ జాగరణ నేత కె.టి. నవీన్ అలియాస్ హొట్టమంజ ప్రమేయమున్నట్లు గుర్తించారు. నవీన్ ఇచ్చిన సమాచారంతో మరో ముగ్గురిని అదుపులోకి తీసుకున్నారు. ఫిబ్రవరి 18న పిస్టల్‌తో మెజిస్టిక్ ప్రాంతానికి వచ్చినట్లు సిసిబి ఇన్‌స్పెక్టర్‌కు సమాచారం ఉండడంతో అరెస్ట్ చేసినట్లు తెలిపారు. అతని వద్ద నుంచి నాట్ పిస్టల్‌తో పాటు పాయింట్ 32 రివాల్వర్, ఐదు తూటాలను స్వాధీనం చేసుకున్నారు.

### ఛత్తీస్‌గఢ్, ఝార్ఖండ్‌ల ఎన్‌కౌంటర్ మృతులు

ఛత్తీస్‌గఢ్‌లోని సుక్మా జిల్లా టోక్నపల్లి అటవీ ప్రాంతంలో ఫిబ్రవరి 16న జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఇద్దరు మావోయిస్టులు మృతిచెందినట్లు పోలీసు అధికారులు తెలిపారు. టోక్నపల్లి అటవీ ప్రాంతంలో డిఆర్‌జి, ఎస్‌టిఎఫ్ బలగాలు మావోయిస్టులకోసం గాలింపు జరుపుతుండగా మావోయిస్టులు తారసపడడంతో ఇరు పక్షాల మధ్య జరిగిన కాల్పుల్లో మావోయిస్టు పార్టీకి చెందిన మాధవీ నందా(30), కుంజమ్ లఖే(24)లు మరణించినట్లు పోలీసు అధికారులు తెలిపారు. ఒడిశాలోని కలిదిండి గ్రామ పరిసర పజిబహలి అటవీ ప్రాంతంలో పోలీసు ఇన్‌ఫార్మర్ అన్న కారణంతో కాంట్రాక్టర్ దాస్‌తున దాస్(45)ను మావోయిస్టులు చంపారు. అట్లాగే సుక్మా జిల్లా చింతకుప్ప-బెర్జి మధ్య అడవీ ప్రాంతంలో ఫిబ్రవరి 18న రోడ్డు నిర్మాణ పనులను ఆపివేయాలని అక్కడున్న 12 వాహనాలకు మావోయిస్టులు నిప్పుపెట్టారు. అనంతరం కాంట్రాక్టర్‌ను చంపారు. దీంతో అక్కడికి చేరుకున్న సిఆర్‌పిఎఫ్ బలగాలతో కాల్పులు జరగడంతో ఇద్దరు జవాన్లు మృతిచెందగా మరో ఆరుగురు జవాన్లు గాయపడ్డారు. ఝార్ఖండ్‌లోని పలాము జిల్లాలో ఫిబ్రవరి 26న జరిగిన ఎన్‌కౌంటర్‌లో నలుగురు మావోయిస్టులు మృతిచెందగా అందులో ఇద్దరు మహిళలున్నట్లు పోలీసు అధికారులు తెలిపారు.

### ఢిల్లీలో రైతుల ఆందోళన

రైతు పండించిన పంటకు మద్దతు ధర, రుణ మాఫీ, సాగు భద్రత కల్పించాలని డిమాండ్ చేస్తూ 62 రైతు సంఘాలు ఫిబ్రవరి 23 'ఘెరావ్ ఢిల్లీ' కార్యక్రమానికి ఇచ్చిన పిలుపుతో వేలాది మంది రైతులు కదిలివచ్చారు. దేశ రాజధానికి దారితీసే జాతీయ రహదారులను దిగ్బంధించారు. పంటలకు ప్రొఫెసర్ స్వామినాథన్ కమిషన్ చేసిన సూచనలను వెంటనే అమలు చేయాలంటూ.. హరియానా, పంజాబ్, రాజస్థాన్, ఉత్తరాఖండ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలకు చెందిన రైతులు పెద్ద ఎత్తున కదిలి హరియానాలోని జింద్ జిల్లా మీదుగా ఢిల్లీ సరిహద్దులోని ఫరీదాబాద్ దాకా భారీ ప్రదర్శన నిర్వహించారు. రాజస్థాన్‌లో రైతులు తమకు పూర్తిస్థాయి రుణ మాఫీ చేయాలని కోరుతూ ఫిబ్రవరి 22న అసెంబ్లీ వద్ద ఘెరావ్‌కు దిగడంతో పోలీసులు వారిని అదుపులోకి తీసుకునే ప్రయత్నంచేయగా అక్కడి రహదారిని దిగ్బంధించి కొన్ని గంటల పాటు రాకపోకలను అడ్డుకున్నారు.

### నేషనల్ హెరాల్డ్ ఎడిటర్ ఇన్ చీఫ్ నీలబ్ మిశ్రా మృతి

సీనియర్ జర్నలిస్టు, నేషనల్ హెరాల్డ్ పత్రిక ఎడిటర్-ఇన్-చీఫ్ నీలబ్ మిశ్రా (57) మృతిచెందారు. కాలేయ సంబంధ సమస్యతో బాధపడుతున్న ఆయన చెన్నైలోని అపోలో ఆస్పత్రిలో చికిత్స పొందుతూ ఫిబ్రవరి 24న మరణించారు. మూడు దశాబ్దాలకు పైగా ఆయన పాత్రికేయ రంగంలో పలు సంస్థల్లో వివిధ హోదాల్లో పనిచేశారు.

### సినీనటి శ్రీదేవి మృతి

ప్రముఖ సినీనటి శ్రీదేవి (54) దుబాయ్‌లో ఫిబ్రవరి 24న మృతి చెందారు. బాత్‌టబ్‌లో కుప్పకూలి మునిగిపోవడం వల్ల ఆమె మృతి చెందినట్లు దుబాయి పబ్లిక్ ప్రాసిక్యూషన్ కార్యాలయం ఫిబ్రవరి 27న ప్రకటించింది. ఫోరెన్సిక్ అధికారులు పోస్టుమార్టమ్ పూర్తయిన తరువాత ధృవీకరించారు. ఫిబ్రవరి 28న ముంబైలో ప్రభుత్వ అధికార లాంఛనాలతో అంత్యక్రియలు జరిపారు. వీ

### యెమెన్‌లో అంతర్యుద్ధం

యెమెన్‌లో ఇరాన్ అనుకూల హౌతీ తిరుగుబాటుదారులకు, సౌదీ మిత్రపక్షాలకు మధ్య జరుగుతున్న అంతర్యుద్ధంలో సామాన్య పౌరులు అధిక సంఖ్యలో మరణిస్తున్నారు. దక్షిణ యెమెన్‌లో జనవరి 29న జరిగిన దాడిలో పది మంది మరణించగా, 80 మంది తీవ్రంగా గాయపడ్డారు. యెమెన్ ప్రధాని అహ్మద్ దగర్ అవినీతి కార్యకలాపాలకు పాల్పడుతున్నాడని, పక్షపాతంతో వ్యవహరిస్తున్నాడని ఆరోపిస్తూ వెంటనే ప్రభుత్వాన్ని రద్దు చేయాలని పెద్ద ఎత్తున నిరసనలు వెల్లువెత్తుతున్నాయి.

### జర్మనీలో కార్మికుల సమ్మె

జర్మనీ రాజధాని బెర్లిన్‌లో తమ వేతనాలు పెంచాలనీ కోరుతూ కార్మికులు సమ్మె చేశారు. ఫిబ్రవరి 1న జరిగిన ఈ సమ్మెలో దాదాపు ఐదు లక్షల మంది పాల్గొన్నారు. 97 కంపెనీల్లోని మూడు లక్షల మందికి పైగా కార్మికులు విధులకు హాజరు కాలేదని ఐజి మెటల్ కార్మిక సంఘం తెలిపింది. బవేరియా, బాడెన్ వుటెంబర్గ్‌ల్లో ఆటో పరిశ్రమల్లోని కార్మికులు, హాంబర్గ్, బ్రెమెన్, లోయర్ సాక్సోనీల్లోని షిప్‌యార్డుల్లో, ఎయిర్ బస్ ప్లాంట్లలోని కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు.

### మాల్దీవుల్లో రాజకీయ సంక్షోభం

మాల్దీవు మాజీ అధ్యక్షుడు మొహమ్మద్ నషీద్ సహా పలువురు రాజకీయ నాయకులను విడుదల చేయాలని ఫిబ్రవరి మొదటి వారంలో సుప్రీంకోర్టు ఆదేశాలు జారీ చేసింది. అయితే మాల్దీవుల అధ్యక్షుడు అబ్దుల్లా యామీన్ సుప్రీంకోర్టు ఆదేశాలను పాటించకుండా రాజకీయ ఖైదీల విడుదల చేసేందుకు నిరాకరించాడు. దీంతో పెద్ద ఎత్తున నిరసన ప్రదర్శనలు చేలరేగి రాజకీయ సంక్షోభం ఏర్పడింది. ఫిబ్రవరి 5 నుంచి పదిహేను రోజుల పాటు దేశంలో అత్యవసర పరిస్థితి విధించాడు. అలాగే సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి అబ్దుల్లా సయీద్, మరో న్యాయమూర్తి అలీ హమీద్‌తో పాటు మాజీ అధ్యక్షుడు మౌమున్ అబ్దుల్ గయూమ్‌ను ప్రత్యేక బృందాలు అరెస్టు చేశాయి.

### రష్యాలో విమాన ప్రమాదం

రష్యా రాజధాని మాస్కోలో విమాన ప్రమాదం జరిగింది. ఫిబ్రవరి 11న మాస్కోలోని డుమోడెడ్వో అంతర్జాతీయ విమానాశ్రయం నుంచి ఉరల్స్‌లోని ఓర్స్క్యూ నగరానికి బయలుదేరిన సరటోవ్ ఎయిర్‌లైన్స్ విమానం టేకాఫ్ అయిన కొద్దిసేపటికే ప్రమాదానికి గురైంది. ఆ సమయంలో విపరీతంగా మంచు కారణంగా ప్రమాదం జరిగిందని అధికారులు తెలిపారు. ఈ ప్రమాదంలో విమానంలో ప్రయాణిస్తున్న అరవై మంది ప్రయాణికులు, ఆరుగురు విమాన సిబ్బంది అందరూ మరణించారు.

### దక్షిణ ఆఫ్రికాలో సంక్షోభం

దక్షిణాఫ్రికా అధ్యక్షుడు జాకబ్ జుమాపై తీవ్రమైన అవినీతి ఆరోపణల నేపథ్యంలో స్వపక్షం ఆఫ్రికా నేషనల్ కాంగ్రెస్ (ఎఎన్‌సి) నుంచి రాజీనామా చేయాలంటూ ఆందోళనలు చెలరేగాయి. ఈ నేపథ్యంలో ఫిబ్రవరి 14న జాకబ్ జుమా అధ్యక్ష పదవికి రాజీనామా చేశారు. 2014 మేలో వరుసగా రెండోసారి ఆయన అధ్యక్ష పదవిని చేపట్టారు. ఆయన పదవీ కాలం 2019 జూన్ వరకు ఉంది. అయితే దక్షిణాఫ్రికా ఆర్థిక వ్యవస్థ దెబ్బతింటుండడం, అవినీతి ఆరోపణల కారణంగా, వచ్చే ఏడాది ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని ఎఎన్‌సి ఆయనను పదవి నుంచి తప్పించింది. ఫిబ్రవరి 15న నూతన అధ్యక్షుడిగా సిరిల్ రమఫోసాను ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

### ఇరాన్‌లో విమాన ప్రమాదం

ఇరాన్‌లో ఫిబ్రవరి 18న విమాన ప్రమాదం జరిగింది. రాజధాని టెహ్రాన్ నుంచి యసూట్ పట్టణానికి బయలుదేరిన ఏస్‌మ్యాన్ ఎయిర్‌లైన్స్‌కు చెందిన విమానం టేకాఫ్ అయిన కొద్దిసేపటికే దగ్గరలోని పర్వత ప్రాంతంలో కుప్పకూలిపోయింది. ఈ దుర్ఘటనలో విమానంలో ప్రయాణిస్తున్న అరవై మంది ప్రయాణికులు, ఆరుగురు విమాన సిబ్బంది మరణించారు. విమానంలో తలెత్తిన సాంకేతిక సమస్య వల్లే ప్రమాదం జరిగిందని అధికారులు ప్రకటించారు.

### అఫ్ఘనిస్తాన్‌లో ఆత్మాహుతి దాడులు

అఫ్ఘనిస్తాన్‌లో ఆత్మాహుతి దాడులు కొనసాగుతూనే ఉన్నాయి. జనవరి 29న రాజధాని కాబూల్‌లో మార్షల్ ఫహీమ్ సైనిక స్థావరంపై దాడి జరిగింది. ఈ దాడిలో పదకొండు మంది సైనికులు మరణించారు. మరో 16 మంది తీవ్రంగా గాయపడ్డారు. ఫిబ్రవరి 24న వాయువ్య ఫారా ప్రావిన్స్‌లో, రాజధాని కాబూల్‌కు సమీపంలో జరిగిన ఆత్మాహుతి దాడుల్లో ఇరవై మంది మరణించారు. మృతుల్లో అత్యధికులు సైనికులే ఉన్నారు. సైనిక స్థావరాలను లక్ష్యంగా చేసుకుని తాలిబాన్ దళాలు ఆత్మాహుతి దాడులకు పాల్పడుతున్నాయి. ముందుగా అమెరికా దౌత్య కార్యాలయం సమీపంలో దాడికి పాల్పడగా ఇందులో ముగ్గురు మరణించారు. మరో దాడి ఫారా ప్రావిన్స్‌లోని బాలా బౌక్ జిల్లాలోని సైనిక చెక్‌పోస్టు వద్ద జరిగింది. ఈ దాడిలో ఇరవై మందికి పైగా మరణించారు.

### సిరియాలో మారణహోమం

సిరియాలో భీకరమైన యుద్ధ వాతావరణం నెలకొంది. సైన్యానికి, తిరుగుబాటుదారులకు మధ్య తీవ్రమైన పోరు సాగుతోంది. ఇరువర్గాలు రాకెట్ లాంచర్ దాడులు, వైమానిక దాడులకు పాల్పడుతున్నాయి. ఈ దాడిలో వేలాదిగా సామాన్య ప్రజలు ప్రాణాలు కోల్పోతున్నారు. గౌటా, డమాస్కస్, డౌమా ఇతర నగరాలలో ఫిబ్రవరి 20 నుంచి ఇరు వర్గాల మధ్య జరిగిన పోరులో 700 మందికి పైగా మరణించారు. ఇందులో 150 మందికిపైగా చిన్న పిల్లలు ఉన్నారు. ఈ దాడుల వల్ల సిరియా పౌరుల జీవనం దుర్భమై పోయింది.

### జిన్‌పింగ్ చైనా శాశ్వత అధ్యక్షుడు

చైనా అధ్యక్షుడు జిన్‌పింగ్‌ను శాశ్వత అధ్యక్షుడిగా ఉండేలా చైనా కమ్యూనిస్టు పార్టీ (సిపిసి) నిర్ణయించింది. మావో తరువాత చైనాలో అత్యంత ప్రజాదరణ పొందిన వ్యక్తిగా జిన్‌పింగ్ పేరు పొందారు. సిపిసి పార్టీ సిద్ధాంతాల ప్రకారం ఒక వ్యక్తి రెండు పర్యాయలు మాత్రమే దేశాధ్యక్షుడిగా కొనసాగుతారు. దేశంలో స్థిరమైన, దృఢమైన నాయకత్వాన్ని నెలకొల్పేందుకు ఈ నిబంధనను తొలగించాలని సిపిసి సెంట్రల్ కమిటీ నిర్ణయించింది. ప్రస్తుత నిబంధనల ప్రకారం జిన్‌పింగ్ 2023 వరకు అధ్యక్షుడిగా ఉంటారు.

### ఇజ్రాయిల్‌లో నిరసనలు

ఇజ్రాయిల్‌లో ప్రధాని నెతన్యాహూ తన పదవికి రాజీనామా చేయాలంటూ పెద్ద ఎత్తున నిరసన ప్రదర్శనలు జరిగాయి. అవినీతి, అధికార దుర్వినియోగం, విదేశాల నుండి ముడుపులు స్వీకరించిన ఆరోపణలు నెతన్యాహూ ఎదుర్కొంటున్నారు. ఈ నేపథ్యంలో ప్రధాని వెంటనే రాజీనామా చేయాలంటూ ఆందోళనకారులు డిమాండ్ చేశారు. రాజధాని టెల్ అవీవ్‌లో వేలాదిగా ప్రజలు ప్రధానికి వ్యతిరేకంగా ప్లకార్డులు, బ్యానర్లు చేతపట్టి వీథుల్లో భారీ ప్రదర్శనలు చేశారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(జనవరి 1 నుండి జనవరి 31, 2018 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (801), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (724) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1525)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 2 | 2 | – | 26 | 30 | 5 | 4 | 8 | 2 | 4 | 3 | 6 | 1 | 1 | 28 | 31 | – | – | – | 4 | – |
| హైదరాబాద్ | – | – | – | 10 | 9 | 5 | 5 | – | 2 | 1 | 6 | 5 | 2 | 1 | 13 | 11 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 4 | – | 4 | 12 | 2 | 2 | 3 | – | – | – | 2 | – | 1 | 18 | 6 | – | – | – | – | – |
| ఖమ్మం | – | 1 | – | 4 | 12 | 3 | 3 | 3 | 1 | 2 | 2 | 3 | – | 7 | 28 | 7 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | – | – | 4 | 6 | 5 | 6 | 5 | 3 | 5 | 4 | 3 | 3 | 8 | 34 | 4 | – | – | – | – | – |
| మెదక్ | – | 12 | – | 2 | 3 | 5 | 3 | 1 | – | – | 3 | 1 | 12 | 20 | 10 | 12 | – | – | – | 3 | 1 |
| నల్గొండ | – | 4 | – | 2 | 6 | 2 | 1 | – | 1 | 3 | 2 | 3 | – | 2 | 22 | 10 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | 2 | – | 3 | 1 | 4 | 5 | 1 | – | – | – | – | – | 1 | 13 | 9 | – | – | – | – | – |
| వరంగల్ | 1 | 3 | 5 | 4 | 3 | 10 | 9 | 1 | 2 | 2 | 3 | 2 | 20 | 25 | 32 | 12 | – | – | – | 2 | 1 |
| వికారాబాద్ | – | 1 | – | 2 | 3 | 1 | 2 | – | 1 | – | 1 | – | – | 3 | 15 | 3 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **3** | **29** | **5** | **61** | **85** | **42** | **40** | **22** | **12** | **17** | **24** | **25** | **38** | **69** | **213** | **105** | **-** | **-** | **-** | **9** | **2** |
| అనంతపురం | – | 3 | – | 12 | 15 | 1 | 1 | – | 3 | 5 | 1 | 2 | 7 | 4 | 29 | – | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 5 | 4 | 6 | 9 | – | – | 2 | 3 | 3 | 5 | 1 | 18 | 3 | – | – | – | – | – |
| కడప | – | – | 1 | 1 | 6 | – | – | – | 1 | 2 | – | 1 | – | 1 | 13 | 6 | – | – | – | – | – |
| గుంటూరు | – | – | – | 6 | 6 | 3 | 2 | 1 | 1 | 2 | – | 2 | 1 | 4 | 14 | 5 | – | – | – | – | – |
| కృష్ణా | – | – | – | 3 | 2 | – | 1 | – | – | 1 | 2 | – | – | – | 15 | 7 | – | – | – | – | – |
| కర్నూలు | – | 1 | – | 4 | 4 | – | 2 | – | 1 | 1 | – | 2 | – | 3 | 23 | 8 | – | – | – | – | – |
| తూర్పు గోదావరి | – | – | – | 2 | 2 | – | 1 | 3 | – | 7 | – | – | – | 2 | 30 | 15 | 1 | – | – | 2 | – |
| ప్రకాశం | – | 3 | – | 2 | 7 | 1 | 2 | – | 1 | 1 | 3 | 1 | 2 | 4 | 24 | 11 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 2 | 5 | 4 | 12 | 3 | – | 1 | – | 1 | 6 | 2 | 29 | 8 | – | – | – | 1 | – |
| పశ్చిమ గోదావరి | – | 1 | – | 5 | 1 | 2 | 4 | – | – | 3 | 2 | 2 | – | 1 | 25 | 14 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 3 | 7 | 1 | 2 | 2 | – | 1 | 1 | 2 | 1 | 2 | 28 | 16 | – | – | – | – | 2 |
| విజయనగరం | – | – | – | 2 | 2 | 1 | 5 | – | – | 1 | – | 4 | 3 | 1 | 11 | 7 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 7 | 7 | 2 | 1 | – | – | 3 | 2 | 6 | – | 5 | 12 | 7 | – | – | – | 5 | – |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **8** | **1** | **54** | **68** | **21** | **42** | **9** | **7** | **30** | **14** | **26** | **25** | **30** | **271** | **107** | **1** | **-** | **-** | **8** | **2** |

# వీక్షణం విడిప్రతి కొనుగోలు కోసం

## మీ సమీపంలోని ఈ కింది న్యూస్‌స్టాల్‌లో వీక్షణం విడిప్రతి కొనుక్కోవచ్చు

| | | |
|---|---|---|
| రైజింగ్ సన్ న్యూస్ ఏజెన్సీ (సోల్ డిస్ట్రిబ్యూటర్) | ఆబిడ్స్, హైదరాబాద్ | 96666 80857 |
| నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ | హైదరాబాద్ | 90004 13413 |
| సహచర బుక్‌మార్క్ | బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | 98483 48173 |
| బాల రాజేశ్వర బుక్ డిపో | నల్లకుంట బస్ స్టాప్ | 9705055738 |
| వెంకటేశ్వర బుక్ స్టాల్, స్టేషనరీ | నల్లకుంట, శంకర్‌మఠ్ | 040-66131071 |
| పస్ట్ లక్కీ పాన్ షాప్ | విద్యానగర్ సిగ్నల్స్ | 9848672831 |
| సుధాకర్ బుక్ స్టాల్ | సన్‌మాన్ హోటల్ పక్కన, తార్నాక | 9949337605 |
| వెంకటేశ్వర బుక్ స్టాల్ | రామ్‌నగర్ గుండు | 9502964995 |
| భవాని బుక్ స్టాల్ | శివం రోడ్ | 9849836996 |
| శ్రీభవాని బుక్ స్టాల్ | శివం రోడ్ (ఇండియన్ బ్యాంక్ దగ్గర) | 9640712555 |
| ఓరియన్ బుక్ స్టాల్ | అంబర్‌పేట్ (శ్రీరమణ టాకీస్ దగ్గర) | 7702535137 |
| అరవింద్ బుక్ స్టాల్ | రామంతాపూర్ (టివి స్టూడియో ఎదురుగా) | 8977995537 |
| రెడ్డి బుక్‌స్టాల్ | అశోక్‌నగర్, హైదరాబాద్ | |
| నేషనల్ బుక్‌హౌస్ | అబిడ్స్, హైదరాబాద్ | 9394495189 |
| దుర్గా భవన్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9030656640 |
| డైమాండ్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9885127491 |
| రాజు రామ్‌దాస్ బుక్‌స్టాల్ | మెహిదీపట్నం, హైదరాబాద్ | 7799244409 |
| రిలెబుల్ బుక్ సెంటర్ | నానల్‌గూడ, హైదరాబాద్ | 040-23512447 |
| ఇస్పెక్ట్రం బుక్‌హౌస్ | లంగర్‌హౌజ్, హైదరాబాద్ | 98486 68354 |
| శ్రీలక్ష్మి బుక్‌స్టాల్ | హైదర్‌గూడ, హైదరాబాద్ | 98855 81249 |
| లక్ష్మణ్ | చిక్కడపల్లి, హైదరాబాద్ | 93910 12051 |
| మల్లిఖార్జున్ బుక్‌స్టాల్ | దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ | 90594 40756 |
| సుధీర్ బుక్‌స్టాల్ | తార్మాక, హైదరాబాద్ | 95426 04166 |
| లడ్డు బుక్‌స్టాల్ | పంజగుట్ట, హైదరాబాద్ | 99492 15135 |
| వినోద్ బుక్‌స్టాల్ | సరూర్‌నగర్, హైదరాబాద్ | 95536 03603 |
| రాజ్ బుక్స్ స్టేషనరీ | ఓల్డ్ బస్‌స్టాండ్ దగ్గర, మెదక్ రోడ్, సిద్దిపేట్ | 87905 60097 |
| బాల్‌రెడ్డి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మహబూబ్‌నగర్ | 98660 18829 |
| శ్రీ స్వయం రాజరాజేశ్వర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుస్నాబాద్ | 90592 85948 |
| భాస్కర్ పాన్ షాప్ & జనరల్ స్టోర్ | కోహెడ | 95021 82545 |
| భండారి కిష్టయ్య బుక్‌స్టాల్ | ఫైర్‌స్టేషన్ దగ్గర, గోదావరిఖని | 98497 93836 |
| గణేష్ బుక్‌స్టాల్ | కళాభారతి ఎదురుగా, కరీంనగర్ | 97019 99007 |
| సాయిగణేష్ బుక్‌స్టాల్ | టు టౌన్ పోలీస్ స్టేషన్ దగ్గర, కరీంనగర్ | 93979 94268 |
| మహాలక్ష్మి బుక్‌స్టాల్ | సిటీ బస్‌స్టాండ్, హన్మకొండ చౌరస్తా, వరంగల్ | 99893 30297 |
| వినయ్ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మంచిర్యాల | 94407 57503 |
| పాండు బుక్ స్టాల్, కూల్ డ్రింక్స్ | ఆర్‌టిసి కాంప్లెక్స్, మిర్యాలగూడ | 98857 38144 |
| శరత్ బుక్ స్టాల్ | షాప్ నం. 3, ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుజూరాబాద్ | 98662 73720 |
| సత్యసాయి బుక్‌స్టాల్ | ఖమ్మం | |
| మహాకవి శ్రీశ్రీ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, పార్వతీపురం | 73825 60366 |
| మణి బుక్‌స్టాల్ | సండేమార్కెట్, నెల్లూరు | 73862 23538 |
| సురేష్ బుక్ స్టాల్ | శివాలయం వీధి, ప్రొద్దటూరు | 81210 02112 |
| పద్మావతి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, అనంతపూర్ | 73965 09767 |
| అనేక బుక్‌స్టాల్ | ఏలూరు రోడ్డు, విజయవాడ | 92472 53884 |
| మైత్రీ బుక్‌హౌస్ | మజీద్ వీధి, అరండల్‌పేట, విజయవాడ | 98486 31604 |
| రాజేశ్ బుక్ సర్వీస్ | ఆర్‌టిసి బస్‌స్టేషన్ కాంప్లెక్స్, విశాఖపట్నం | 99483 19842 |
| వి. భాస్కర్ న్యూస్‌పేపర్ ఏజెన్సీ | డాబా గార్డెన్, విశాఖపట్నం | 99482 90318 |
| రాఘవేంద్ర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, ఒంగోల్ | 90595 23091 |
| శ్రీసత్యసాయి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి కాంప్లెక్స్, రాజమండ్రి | 73860 66226, 94419 07321 |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 200 - March 2018 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/2/2018 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2017-19

Date of Posting : 29th, 30th



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao